సో ద రా !

నెత్తివానివలె చూడకు.

వెనుకంజ వేయకు.

ఆశ్రిత కల్పవృక్ష మిది.

అప్రతిమానము.

ఆనందదాయకము.

సో ద రీ !

ఇది నాకెందు కనకు,

ఇదియే నీజీవితమునకు రక్ష.

ఇదియే నీసౌభాగ్యమును

పెంపొందించును.

నమ్మినవారి కనంత ఫలదాయకము.

ఓమ్

అవ్యయానంద గ్రంథమాలా — పంచమ రత్నము

# శ్రీమదాంధ్ర తులసీరామాయణము

## ప్రథమ సోపానము

## (బాలకాండము)





శ్రీ స్వామీ అవ్యయానంద

విరచితము.

సర్వాధికారములు,
గ్రంథకర్తవి.

వెల. 6/-



## —: కృతి సమర్పణము :—

క. కృతి నొసంగితి దీనిన్ మ
త్పతికిన్ శ్రీపతికి భక్తపాలన రతికిన్
శ్రుతి కన్యాతత మానస
హృత రమ్యాకృతికి హరి కహీనద్యుతికిన్

తే. ఇది సమర్పించితి మదీయహృదయమగుట
నవనిజాపతి కఖిలాంతరాత్మునకును
రామచంద్రునకున్ విశ్వరక్షకునకు
నాకు మత్పతి కవ్యయానందునకును

క. దీనిని నిత్యముఁ జదివెడి
మానినులుం బురుషు లనుపమాన సుఖములం
గానంగల రిహపరముల
శ్రీనాథునికరుణ సకలసిద్ధిద మగుటన్



అవ్యయానంద.



శ్రీ స్వామి అవ్యయానంద.
గ్రంథకర్త.



ఈ గ్రంథముద్రణకు రూ 100 లు విరాళమిచ్చినారు.

శ్రీ ప్రయాగ సుబ్బారావుపంతులుగారు

వారి ధర్మపత్ని మహాలక్ష్మమ్మగారు

పెనుగొల్లు.

శ్రీః

# తొలి పలుకు

రామాయణము హిందువులకు పూజ్యగ్రంథము. శ్రీరామ చంద్రుడు ఆదర్శపురుషుడు. సంస్కృతభాషలో వాల్మీకిరామాయణ మునకునూ, తమిళమున కంబరామాయణమునకునూ గల గౌరవప్రతిష్ఠలు హిందీభాషలో తులసీరామాయణమునకు గలవనుట నిర్వివాదాంశము. శ్రీరామప్రభువుయొక్క దివ్యదర్శనభాగ్యమునంది నిరంతర తారకమంత్రోపాసనముచేసిన భక్తిమార్గనిష్ణాతుండగు తులసీదాసు "రామచరిత్ర మానసము" నకు గ్రంథకర్తయగుట శ్లాఘనీయము. రాజహంస సరోవరమునందుండు చందంబున ఈ రామాయణము మహేశ్వరుని హృదయసరోవరమున ఉండుటచేత దీనినామము రామ చరిత మానసమునాబరంగె. శ్రీరామతత్త్వమును కూలంకషముగా నిరూపించిన తులసీదాసు ధన్యుడు.

"ఆనంద కాననేభాతి - తులసీజంగమస్తరుః
కవితామంజరీయస్య - రామభ్రమరశోభితా

భక్తావతంసుండగు తులసీదాసు తనరామాయణమున కోదండ రాముని సాక్షాత్పరమాత్మస్వరూపునిగా వర్ణించెను. శ్రోతల హృదయములలో కరుడుగట్టిన యజ్ఞానమును పారదోలునట్టి ప్రగాఢభక్తి నోతప్రోతముగానింపెను. పైగా శ్రీరామచంద్రుని సామాన్య మానవునిగా దలంచిన మహాపాతకము గల్గునని గూడ వర్ణించెను. రామాయణమునందలి ఒక్క అక్షరమును చదివినను, చదివించినను, వినినను, వినిపించినను మహత్తరపుణ్యము గలుగునని గూడ తులసీదాసు భక్తులకు త్తేజమును కల్గించెను. రామచరితమానస పారాయణమాత్రమున సమస్తశుభములు చేకూరును. అశుభంబులు దరికిరావు. ఖద్యోతుని సన్నిధినున్న వారికి చీకటియుండనట్లు శ్రీరామధ్యానముచేయువారికి అజ్ఞానముగాని, దుఃఖములుగాని, వ్యధలుగాని యుండవు.

హిందీభాషలోనుండు రామాయణము నందరును పఠించలేరు. భాగవతోత్తములును, సదాచారసంపన్నులును, నిరాడంబరజీవులగు పూజ్య శ్రీఅవ్యయానంద కవీశ్వరులు ధన్యులు. శ్రీవారు పద్యరూపముగా రచించిన శ్రీమదాంధ్ర తులసీరామాయణము మూలమునకు సరియైన అనువాదమనుట యతిశయోక్తిగాదు. సుబోధకముగాను, మధుర మంజులముగాను, ఆనందోత్సాహముగాను రచింపబడిన యీ రామాయణమునుచదువు మహద్భాగ్యముకల్గి దీనికి తొలిపలుకువ్రాయుటచేత నేను ధన్యుడనైతి ననుకొనుచున్నాను. ప్రతీవారింట నుండవలసిన గ్రంథరాజమిదియని నాయభిమతము. ఆంధ్రావని కట్టిమహత్తరసేవ చేసి రామతత్త్వమును సులభశైలిలో ప్రజానీకమున కందజేసిన అనువాదకులు శ్రీరామచంద్రుని కృపాపాత్రులై తరించెదరుగాత! ఇట్టి భాషాసేనచేసిన గ్రంథానువాదకులకు నేననేక కృతజ్ఞతాపూర్వక వందనముల( జేయుచున్నాను.

ఇట్లు,

బుధజన విధేయుడు

" అభినవ తులసీదాస "

పసుమర్తి శ్రీరామమూర్తి, బి. ఎ.

దేవాలయం వీధి,

కా కి నా డ.

(తూర్పు గోదావరి)

# పండితాభిప్రాయములు

ఆర్షవిద్యాభూషణ
శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు,
కాకినాడ.

శ్రీ స్వామి అవ్యయానందుల వారి తులసీరామాయణాంధ్ర పద్యానువాదమును వారు వినిపింపగ కర్ణరసాయనముగా వింటిని. ఇట్టి పవిత్రగ్రంథము ననువదించుటకు పేరకముగానుండదగిన భక్తితత్త్వము గల్గినవారగుటచే వీరి రచనయందు తన్మయత్వము పారమార్థికలక్ష్యము పుష్కలముగా గోచరించుచున్నవి. పద్యములు సరళములై ధారాశుద్ధి గలవై, మధురపదగుంఫితములై చేతము నలరించుచున్నవి. విన్నకొలది యింకను వినవలయు ననిపించుచున్నవి. ఒకజగత్ప్రసిద్ధగ్రంథము నీరీతిగా మనల కందించుచున్న యీ మహనీయులు అభినందనీయులే కాక అభివంద నీయులుకూడనని నాయభిప్రాయము.

ఆర్షవిద్యాభూషణ
జటావల్లభుల పురుషోత్తము,
కాకినాడ.
14-3-65

---

శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు
తెలుఁగు జాతీయబహుమానగ్రహీత,
రిటైర్డు ఐ. ఇ. యస్.
కాకినాడ.

శ్రీ మద్రామాయణము భారతదేశమున కెన్నడు చెడని అమృత భాండము. వాల్మీకిదీనిని మనజాతికిచ్చి నేటివఱకేయితరసజాతీయుఁడు చేయలేని శాశ్వతమైన మహోపకారము చేసినాఁడు. రామాయణము

గలజాతిలోఁ బుట్టుకయే ధన్యమైనది. తులసీదాసు శ్రీరామామృతమును హిందీభాషలో వియద్గంగాస్రవంతివలె దేశమంతటఁ బ్రవహింపఁజేసినాఁడు. గాంధీమహాత్ముఁడు తులసీరామాయణము తనకు రామనామము నిచ్చి రక్షించినదని ప్రశంసించెను.

సంస్కృతవాల్మీకమున కనువాదములు తెలుఁగులో ననేకములు గద్యపద్యకావ్యములుగా రచింపబడియున్నటులే తులసీరామాయణమునకును గలవు. భగవంతుని చరిత్రమున కతివ్యాప్తిదోష మెన్నఁడునుండదు రాముని మహిమ అట్టిది. రామనామ మహిమ అమోఘము. అందుచే నెందరో రామచరితమును వ్రాసిరి. వ్రాయుచున్నారు; వ్రాయుదురు. ఇదియే దేశమును సర్వవిధక్షోభములనుండి కాపాడఁగలదివ్యశక్తి.

శ్రీపతి జగన్నాథశర్మగారు మాడుగుల వాస్తవ్యులు; కొలఁది కాలమునుండి కాకినాడలోనుండి సత్కాలక్షేపము చేయుచున్నారు. నిరాడంబరులు. ప్రతిఫలాపేక్షలేని నిష్కామభక్తులు. చిన్ననాటి నుండియుఁ దమతండ్రిగారియొద్ద విద్యాకవితావ్యాసంగముచేసి. తులసీరామాయణము నాంధ్రకావ్యముగా రచించి ధన్యులైరి. వీరు పవిత్రజీవనులై రామచరిత్రను రచించుటచేఁ దమలేఖినిని తమజన్మమును ధన్యమొనర్చికొనిన పూతాత్ములు.

వీరి కవిత అనన్యసారళ్యమాధుర్యములుఁగలిగి ప్రసన్నశైలితోఁ బూర్వాంధ్రరామాయణకవుల వాసికేమాత్రమును దీసిపోవనిదై వెలయుచున్నది. వీరీరామాయణకావ్యమురచించి ఉత్తమాంధ్రకవులసరస నొకస్థిరస్థానము నార్జించుకొనిరి. వీరికృషి సర్వజనాదరణపాత్రమైనది. వీరితోధిక సారస్వతసేవచేయుటకు దీర్ఘాయురారోగ్యభాగ్యము లిచ్చి భగవంతుఁడైన శ్రీరామచంద్రప్రభు వనుగ్రహించుగాక.

బుధ విధేయుఁడు,
బులుసు వేంకటేశ్వర్లు,
తెలుఁగు జాతీయబహుమానగ్రహీత,
రిటైర్డు ఏ. ఇ. యస్.
కాకినాడ, 16-3-65.

# శ్రీగాయత్రీ పీఠమ్

## బ్రహ్మైవసత్యమ్

జగద్గురు శ్రీమదాదిశంకరభగవత్పూజ్యపాదప్రతిష్ఠాపిత దక్షిణామ్నాయసంజ్ఞిక శ్రీశృంగగిరిపీఠాధిష్ఠిత శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర భారతీ పూజ్యపాదైః తత్కరకమలసంజాత శ్రీశ్రీశ్రీ మదభినవ విద్యాతీర్థపూజ్యపాదైశ్చ సదయాభ్యనుజ్ఞాత శ్రీ గాయత్రీ పీఠాధిపత్యవిరాజమానైః, తైశ్చపూజ్యపాదైరనుగృహీత తురీయాశ్రమయోగపట్టైః పరమహంసపరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ విద్యాశంకరభారతీస్వామిభిః.

శ్రీ 'అవ్యయానంద' పతి జగన్నాథకవి విరచిత ఆంధ్ర తులసీ రామాయణవిషయే కవీనాం శ్రీయోభివృద్ధయే నారాయణస్మరణ పూర్వకం విరచితా ఽశిషః సముల్లసంతుతరామ్.

శ్రీగాయత్రీ పీఠాధిపతులగు శ్రీశ్రీశ్రీ విద్యాశంకరభారతీస్వామివారి ఆశీః పూర్వక ప్రశంస.

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి జాతేదశరథాత్మజే।
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥

అనుప్రమాణమునుబట్టి వేదవేద్యుడే రామచంద్రుడుగా అవతరించగా వేదము రామాయణముగా రూపొందినదిఅని విశదమగుచున్నది. రాముడుఅనగా ధర్మమే మూర్తీభవించినవ్యక్తి. అట్టిరామచంద్రుని చరిత్రను వాల్మీకిమహర్షి రామాయణముగారచించి ధన్యుడైనాడు. తరువాత తులసీదాసు రామచరిత్రను హిందీలో అద్భుతమైనభక్తిభావములతో మృదుమధురశైలిలో రచించి అఖండమైన యశస్సునుగాంచినాడు. ఉత్తరహిందూస్థానములో తులసీరామాయణములేని ఇల్లు లేదనిన అతిశయోక్తి కానేరదు. అట్టిఅద్భుతమైన తులసీరామాయణము హిందీభాషలో నున్నందున హిందీభాష తెలియని ఆంధ్రులకు ఆరామాయణములోని విలక్షణమైన భక్తిభావములు తెలిసి ఆనందించు

టకు వీలులేకున్నది. శ్రీస్వామి అప్పయ్యానంద - పతి జగన్నాథకవి గారు ఆతులసీరామాయణమును ఆంధ్రభాషలో మృదుమధుర శైలిలో అందరికి తెలియులాగున పద్యకావ్యముగారచించి ఆలోటునుతీర్చినారు. తులసీరామాయణములోని అద్భుతమైన భక్తిభావములు చరిత్రలోని విశేషములు అన్నియు ఈగ్రంథములో చక్కగ విశదీకరింపబడినవి. ఆంధ్ర సాహిత్యప్రపంచమున ఈగ్రంథము ఉన్నతస్థానమును అలంకరించగలదని విశ్వసించుచున్నాను. ఇట్టి అమూల్యసేవను గావించిన కవిగారికి సకలశ్రేయస్సులు కలుగుగాక అని మానారాయణ స్మరణపూర్వక ఆశీస్సులు.

శ్రీ.

---

(శ్రీ) చేంబోలు వేంకటయోగిగారు

అ న కా ప ల్లి

హరిః ఓం

అద్వైత పరబ్రహ్మమునకు జగత్కారణ భూతత్వమేలకలైనను ప్రశ్న కాత్మవిదులు బహుధాసమాధానమిచ్చిరి. అయినను ఈ రహస్యము స్ఫుటబోధముగాకున్నది. ఈ సందేహమును భక్తకోటుల నుండి పైదొలగజేయుటకు మున్ను ప్రయత్నములు జరుగకపోలేదు. ఆదికవికృతి కనుసారిగా నధ్యాత్మరామాయణము వ్రాయబడియుంట యిందులకే. "రామోనగచ్ఛతి నతిష్ఠతి.........నైవకరోతి కించిత్ ......తస్యసన్నిధిమాత్రేణ సృజామీదమతంద్రితా" అను సీతాముఖ కమలోద్భూత వాగ్రసాయనమును సిద్ధాంతరూపేణ ప్రతిపాదించి మిగిలిన గ్రంథమున నద్దానిని ధృవీకరించె నా యధ్యాత్మరామాయణ కారుడు. ఆయుద్గ్రంథమునకు స్వేచ్ఛానువాదమోయన నలరారెడు గోస్వామి తులసీదాస్ మహాశయుని "రామచరితమానస్" హిందీభాష ప్రాచీన రూపమైన "అవధీ" భాషయందున్నది. ఈయనగూడ "ఏక

అనీహాఅరూప అనామా అజసచ్చిదానంద పరధామా, వ్యాపక విశ్వ రూప భగవానా, తెహిధరిదేహా చరితకృతనానా......సోకేవలభగ తనహితవాగీ, పరమకృపాళు ప్రణతఅనురాగీ" అను సిద్ధాంతమును వాకొచ్చి దానినుపపాదించుటకు "ఏకరామ అవధేశకుమారా...... యహసాయిరామకి అపరకొావు" అను ప్రశ్నను జగజ్జనని పార్వతినోట నడిగించి భవునిచేత నేతద్గ్రంథరూపకమగు సమాధానమిప్పించెను. అట్టులనే యీకథాకథాక్రమమున భారద్వాజ యాజ్ఞవల్క్య సంవాదము, కాకభుశుండీ గరుడసంవాదముననుమిమచే తిరిగితిరిగి ఈప్రశ్న యే వేయించి దానికి సమాధానము ప్రత్యక్షముగను అప్రత్యక్షముగను గూడ నిప్పించెను. ఈశ్వరావతార హేతువులగూర్చి యీమనీషి 'రామజన్మకై హేతు అనేకా పరమవిచిత్ర ఏకతేయేకా' అని వాకొాన్నాడు. జయవిజయులశాపము, నారదశాపమును శతరూపాతపము జలంధర సతిశాపము మున్నగు కారణములను పేర్కొని యీకథానికల ద్వారా రమ్యాతిరమ్యముగ నిర్గుణబ్రహ్మమునకు సగుణరూపము కలుగుటకునుగల కారణములను చెప్పకచెప్పెను. ఇంకను సందేహవిమోచనము కాదేమోనను శంకచేబోలును "సోతెహి తాహితోహి నహి భేదా......వారిబీచి ఇవగావఇవేదా" అని "జీవో బ్రహ్మైవ కేవలః" అను మహావాక్యమును తుది నిర్ణయముగ లోమశునిచే పలికించినాడు.

ఇట్టి యుద్గ్రంథమునకు లక్ష్యార్థ వ్యంగ్యార్థ గూఢార్థములు చెడకుండ మఱియొక భాషలోనికి సంతరించుట తిరిగి యపరోక్షానుభూతి పొందిన తులసీదాస్ గారికి మాత్రమే శక్యము. యేతన్మాత్రిన కవగతమగు విషయమాయిది! ఆత్మవిశ్వాసముతో లోకసంగ్రహేచ్ఛచే నట్టి మహత్కార్యమునకు పూనుకొని విఘ్నపరంపరలచే త్రాసము జెందక ప్రోత్సాహభావమును సరకుగొనక రామచరితమానసమునకు యథార్థమగు నాంధ్రానువాదము నాంధ్రలోకపుకల్పతరువన వెలయించిన శ్రీ అన్వయానందస్వామిగారెంతయు ధన్యులు. యావదంధ్రలోకము వీరికి కృతజ్ఞత తెలుపవలసియున్నది.

తెలుగుభాషయందును "అవధి" భాషయందును తుల్యాధికార సంపన్నులగు వీరుమూలగ్రంథములోని భావగరిమ చెడకుండ కొండొక

పట్టుల మూలమునకే వన్నె తెచ్చుమాదిరిగ తెనిగించిరి. నేటిసరికిఇట్టి సర్వాంగ సుందరమగు ప్రయత్న మీవిషయమునగానరాదు. వీరి శ్రీముఖతః భాషాంతరీకృత గ్రంథమును విను సౌభాగ్యము నాకబ్బినది. వీరి గ్రంథము మూలమున కనువాదమై తదంతర్గతోపనిషదర్థములకు వ్యాఖ్యానమై గ్రంథమెల్లెడలనోతప్రోతమైయుండి ధర్మసూక్ష్మములకు భాష్యమై యొప్పుచున్నది.

దీనిని శ్రద్ధగ పఠించినవారికి తప్పక జడచేతనగ్రంథి విమోచనము గలుగును. ఆంధ్రముముక్షువులు దీనినియథార్థముగ గౌరవించి ఆత్మోపకారమును గ్రంథకర్తకు ప్రత్యుపకారమును చేయుదురుగాక!

అనకాపల్లి
20 డిశంబరు 1963

చెంబోలు వేంకటయోగి

---

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ,
ఆంధ్రవ్యాస, అభినవ శ్రీనాథ, వేదవిద్యావిశారద.
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు
రాజమహేంద్రవరము

బ్రహ్మశ్రీ అవ్యయానంద పతిజగన్నాథకవిగారు "తులసీరామాయణము" తెనుఁగునఁ బద్యకావ్యముగా రచించియున్నారు. నాయొద్ద నాగ్రంథము చాలభాగముచదివి వినిపించినారు. పూర్వకవుల పోకడలు గలిగి కవనమమృతరసప్రవాహమువలెనున్నది.

రాజమహేంద్రవరము
26--[illegible]--1946

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

---

శ్రీమారేపల్లి రామచంద్రశాస్త్రిగారు విశాఖపట్టణము

"శ్రీమదాంధ్ర తులసీరామాయణము" ఇది శ్రీయుత అవ్యయానందస్వామి పతి జగన్నాథకవిగారిచే రచియింపఁబడినది. యిందలి ప్రథమసోపానము బాలకాండము స్థాలీపులాక న్యాయముగఁ జూచితిని. ఇందలి కవితాధారమంచిది. కథ లోకవిదితము. భక్తులకానందదాయకము. యిక్కాలమున నీకవి రామాయణమును కష్టపడి వ్రాయుట మిగులఁ బ్రశంసనీయము.

ది 23-4-1946 మారేపల్లి రామచంద్ర శాస్త్రి
విశాఖపట్టణము

---

ఆంధ్ర ప్రభ

1951 నవంబరు 23 ఆదివారము

శ్రీమదాంధ్ర తులసీరామాయణము,
రచయిత:—శ్రీపతి జగన్నాథకవి. అవ్యయానంద గ్రంథమాల
మాడుగుల, విశాఖజిల్లా. వెల రూపాయి

ఇది తులసీరామాయణానికి ఆంధ్రానువాదం 1631 సంవత్సర ప్రాంతంలో శ్రీగోస్వామి తులసీదాసు పాడుకోడానికి అనువుగా హిందీ భాషలో రామాయణాన్ని రచించారు. దానిని శ్రీ జగన్నాథకవిగారు తెలుగులోకి తెచ్చారు. ఇంతకుముందు స్వేచ్ఛానువాదాలు వున్నప్పటికీ క్రమబద్ధమై మూలాన్ని అనుసరించడమే ఈరచనలో ప్రత్యేకత. రచన వివిధవృత్తాల్లో చేయబడింది. సుందరకాండం మాత్రమే ముందుగా ముద్రించబడింది. రచన చక్కగావుంది, ముద్రణ అందంగావుంది.

భీమన్న.

---

ఓమ్

శ్రీరామచంద్రాయనమః

శ్రీవిఘ్నేశ్వరాయనమః    శుభమస్తు    శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

శ్రీమాన్ కవిబ్రహ్మావ్యయానంద విద్వత్కవితిలకో బ్రహ్మశ్రీపతి జగన్నాథకవిప్రణీత శ్రీమదాంధ్ర తులసీరామాయణకథాకాలక్షేపసమయేనైవ తద్గ్రంథకర్తృణాం సన్మానసమయే భక్తకవి విద్వద్బృంద సమర్పిత

కృతాంజలిః

క. శ్రీసుభగ సిద్ధిదంబుగ
కౌసల్యాసుతు చరిత్ర కౌశలమెసఁగన్
వ్రాసిన ధన్య చరిత్రా
భాసురమతి మిమ్ముఁబొగడ వశమేమాకున్

గీ. తాముగా కవితావని తాదు లవియె
సరసగతినుండువచ్చిన సత్కవీంద్ర
మహిత తులసీకవీంద్రు రామాయణంబు
చెలువుగా తేట తెనుగున సృష్టిచేసి

గీ. అవ్యయానందలహరి నోలాడఁజేయ
నవ్యయానందునకె తగు నమలకవిత
తనివితీరంగ కని జన్మధన్యమయ్యె
భవ్యసుకవీంద్ర గుణసాంద్ర దివ్యచరిత

క. కడులచ్చి గలుగనేరమి
నుడుగరలేమియు లేము ఉజ్జ్వలరీతిన్
విడెమొక్కటి మాభక్తికి
నిడెదము సాంకేతమచుర నీవిధిమాకున్

శ్లో. కవిర్బ్రహ్మ కవిర్విష్ణుః కవిర్దేవో మహేశ్వరః
కవిస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీకవయే నమః
రామభక్తసంఘాధ్యక్షః — పంతుల వెంకటరామారావు

పండిత పరిషదధ్యక్షః
రచయిత—శ్రీ పంతుల వెంకటరామారావు

ఓమ్

ఈకావ్యముద్రణార్థము ధనసహాయ మొనర్చినవారు.

| | | రూ. |
|---|---|---|
| 1. | శ్రీ పేరిచర్ల పెద్దిరాజుగారికుమాళ్లు లక్ష్మీనృపతి రాజుగారు, గుడివాడ | 100-00 |
| 2. | ,, ప్రయాగ సుబ్బారావుపంతులుగారు, పెనుగొల్లు | 100-00 |
| 3. | ,, నిష్ఠల రామమూర్తిపంతులుగారు, లకవరపుకోట | 30-00 |
| 4. | ,, వేలూరి భగవాన్లుపంతులుగారు ,, | 30-00 |
| 5. | ,, శారదా పిప్పలిమోడికంపెనీవారు, మాడుగుల | 25-00 |
| 6. | ,, గెడ్డం కన్నయ్యమ్మగారు, గుంటపల్లి | 25-00 |
| 7. | ,, రంగారాయపురం అగ్రహారమువారు | 20-00 |
| 8. | ,, తీగెల పాపారావుసన్సు, సోంపురము | 20-00 |
| 9. | ,, శ్రీనాధు గంగన్న శ్రేష్ఠిగారు, లకవరపుకోట | 20-00 |
| 10. | ,, మోటూరి నారాయణరావుగారు ,, | 10-00 |
| 11. | ,, చిక్కాల వీధివారు | 10-00 |
| 12. | ,, గౌడు జోగమాంబగారు, శ్రీరాధాకృష్ణభవనము యలమంచిలి | 10-00 |
| 13. | ,, చింతలపాటి వెంకటసూర్యనారాయణరాజుగారు (సన్యాసిబాబుగారు) ఏటికొప్పాక | 10-00 |
| 14. | ,, తోట చలపతిరావుగారు, గుంటపల్లి | 10-00 |
| 15. | ,, తోట అచ్యుతరావుగారు ,, | 10-00 |
| 16. | ,, దేవవరపు బుల్లిదొరగారు, మంగవరము | 10-00 |
| 17. | ,, పుట్టా వెంకటరమణగారు, మాడుగుల | 5-00 |
| 18. | ,, నూతిగట్టు వెంకటరమణగారు ,, | 5-00 |
| 19. | ,, సంగం అప్పలస్వామిదొరగారు లకవరపుకోట | 5-00 |
| 20. | ,, కొట్టేడ అప్పలనరసయ్యగారు ,, | 5-00 |
| 21. | ,, పుట్టా పరదేశిగారు ,, | 5-00 |
| 22. | ,, కొట్టేడ వెంకటాప్రిగారు ,, | 5-00 |
| 23. | ,, మెల్లూరి అప్పారావుగారు ,, | 5-00 |

24. శ్రీ సంగం సంజీవరావుగారు లకవరపుకోట 5–00
25. ,, ఆకొండి జోశ్యుల వెంకటేశ్వర్లుగారు, లకవరపుకోట 5–00
26. ,, చేకుమళ్ళ సూర్యనారాయణమూర్తిగారు, లకవరపుకోట 5–00
27. ,, పంతిన వరహానరసింహారావుగారు, లకవరపుకోట 5–00
28. ,, మూలవీసాల జగన్నాధరావుగారు, మార్లావల్లి 5–00
29. ,, వై. సర్వేశ్వరరావుగారు, ఏటికొప్పాక 5–00
30. ,, ఆర్. పి. శర్మగారు, యలమంచిలి 5–00
31. ,, రామయోగిసీభక్తసమాజమువారు, నక్కపల్లి 5–00
32. ,, పప్రియాగ వెంకటరావుగారు, దార్లపూడి 5–00
33. ,, గొట్టుముక్కల అన్నమాచార్యులుగారు. కొరుప్రోలు 5–00
34. ,, పాలపర్తి బుల్లిరాజుగారు, నామవరము 5–00
35. ,, కానుకొల్లు భాస్కరరామమూర్తిగారు, నామవరము 5–00
36. ,, తోట కొండలరావుగారు, గుంటపల్లి 5–00
37. ,, తోట వెంకటరావుగారు ,, 5–00
38. ,, తోట భాస్కరరావుగారు ,, 5–00
39. ,, తోట గంగారావుగారు ,, 5–00
40. ,, దేవవరపు వెంకటరావుగారు, మంగవరము 5–00
41. ,, మావూరు కన్నయ్యగారు, అప్పలరాజపురము 5–00
42. ,, నుతాపల్లి సత్యనారాయణమూర్తిగారు, దిబ్బిడి 5–00
43. ,, గణపతిరాజు సన్యాసిరాజుగారు, బుచ్చయ్యపేట 5–00
44. ,, విజ్జపు సోమేశ్వరరావుగారు, చోడవరము 5–00

రూ 5 లోపు ఇచ్చినవారు చాలమందికలరు.

ఓమ్

# విజ్ఞప్తి

సోదర సోదరీమణులారా !

శ్రీతులసీరామాయణము కలియుగప్రజలపాలిటి కల్పవృక్షము. ఈగ్రంథరత్నముపేరు విన్నంతనే యథార్థముగా మానవత్వము కల వారికి శరీరములు పులకరించును. కన్నులనుండి ఆనందాశ్రువులు వెడలును. భక్తిపరవశులై హస్తములు ముకుళించి శిరమునఁ జేర్చుకొందురు.

త్రికరణశుద్ధిగ భక్తిశ్రద్ధలతో దీనిని పఠించినను, వినినను జనులకుఁ బొందని రాలాభము లెవ్వియు లేవు. ఇయ్యది ధర్మవిరుద్ధములు గాని సమస్తకార్యములనొసంగును. విద్య, బలము, ఆయువు, ఆరోగ్యము, ధనము ధైర్యము కీర్తి, తేజము, నిత్యశుభము, జ్ఞానము, శాంతము ఆనందము, ఆర్జవము, అఖండసుఖము, శౌచము, శీలము, సౌభాగ్యము మున్నగు సమస్తకల్యాణగుణములఁగలిఁగించును. ఎంతటి మహాపాపములనైన నశింపఁజేయును. సకలవిధ మానసికరోగముల నిర్మూలించును. దీనిమహిమమింతయని వర్ణించుటకలవిగాదు.

నిత్యమును స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు నిమ్మహాగ్రంథమును జదువుటగాని, వినుటగాని చేయుచు జన్మములసార్థకములుగ జేసికొనుఁడు. తులసీరామాయణమునం దాదరవిశ్వాసములు సహజముగ నెవరికిజనింపవో యట్టిజనులు దురదృష్టవంతులు.

జన్మములన్నిఁటిలో నగ్రగణ్యమగుమానవజన్మ మొందియు నిరంతర శ్రీరామకథాపఠనశ్రవణము లొనర్పనివారిజన్మములు నిరర్థకములు. కావున స్వానుభవమున నేవచించుపలుకులయందు విశ్వాసముంపుఁడు. ఈ వాక్యములు ముమ్మాటికిని సత్యములు సత్యములు సత్యములని ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

నిత్యమును రామనామమును జపింపుఁడు. తులసీరామాయణమును బఠింపుఁడు. లేక వినుఁడు. మీకు నెరవేరని యభీష్టములుండవు.

భారతదేశమునఁ బ్రతిగృహమునను శ్రీతులసీరామాయణపారాయణము జరుగుచుండుట దేశసౌభాగ్యదాయకము. ప్రతిదినము సీరామాయణములోఁ గొంతభాగమైనను, అథమముకొన్ని పద్యములైనను జదువుటగాని, వినుటగాని చేయకయే భుజింపమనియు, నిద్రింపమనియు నియమముచేసికొనుఁడు. నిత్యమును సంసారసాగరతరంగములనుండి స్వల్పకాలమైనను బైటఁబడి యొకగడియసేపైనను శ్రీతులసీరామాయణపఠనశ్రవణములఁగావించి ధన్యులుగండు. వ్యర్థముగ జననరుజాజరామరణప్రవాహ సంసారతరంగిణింబడి మునిఁగిపోవకుఁడు. శ్రీతులసీరామాయణము నాశ్రయించి నిత్యకల్యాణములనొందుఁడు.

హిందీ గ్రంథములలో శిరోరత్నమన వెలయు శ్రీరామచరితమానస్ అనుమహాకావ్యము పరమభక్తాగ్రగణ్యుఁడగు శ్రీతులసీదాసకవివరేణ్యునిచే 1631 వ సంవత్సరమున రచియింపఁబడినది.

అద్దాని నాంధ్రపద్యకావముగరచించిన నాంధ్రవాఙ్మయమునకొక యమూల్యాభరణముగాఁగలదనియెంచి నాకుఁగల కొలఁదిశక్తిననుసరించి రచించితిని. ఇయ్యాంధ్రీకరణము 1940 వ సంవత్సరముననే విక్రమ చైత్రశుద్ధ శ్రీరామనవమీదినమునఁ బ్రారంభింపఁబడి 1945 వ సంవత్సరమునకు తారణ పౌష బహుళచతుర్దశి మకరసంక్రాంతినాటికి ముగింపఁబడినది.

ఇమ్మహాకావ్యముద్రణమునకుఁ దగినంత సజ్జనసహాయ మలవడమిచే నిందుగల సప్తసోపానములలో ప్రథమసోపానమగు బాలకాండమునుమాత్రము ప్రస్తుతము పాఠకమహాశయుల కందఁజేయగలిగితిమి. పంచమసోపానమగు సుందరకాండమిదివఱకే వెలువడి పెక్కుమంది విద్వద్వతంసులయొక్కయు, కవిశిరోరత్నములయొక్కయు, భక్తాగ్రేసరులయొక్కయు, యోగినీమణులయొక్కయు, యోగిశిఖామణులయొక్కయు, బ్రహ్మవిద్వరేణ్యులయొక్కయు ప్రశంసలనొందుచు విహా

రించుచున్నది. మిగిలిన సోపానములుగూడ శ్రీరామచంద్రానుగ్రహ మున త్వరలో క్రమముగ వెలువడఁగలవు.

ఇందు తొలిపలుకు మొదలు తమతమయభిప్రాయముల వ్రాసిన విద్వద్వరేణ్యులందఱికిని కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఇట్లు,
సర్వజన శ్రేయోభిలాషి,
అవ్యయానంద

# విషయసూచిక




| | | | పుట సంఖ్య |
|---|---|---|---|
| 1 | కథామహిమాభివర్ణనము | ... | 35 |
| 2 | రామాయణ కథాసంగ్రహవర్ణనము | ... | 43 |
| 3 | భరద్వాజ యాజ్ఞవల్క్యసంవాదము | ... | 51 |
| 4 | సతీచరిత్రము | ... | 55 |
| 5 | సతీదేవి హిమవంతునికిఁ బుత్త్రికయై జన్మించుట | ... | 71 |
| 6 | నారదుఁడు హిమవంతునింటికి వచ్చుట | ... | 72 |
| 7 | మేనక పార్వతి వివాహముంగూర్చి హిమవంతునితో నాలోచించుట | ... | 76 |
| 8 | పార్వతీదేవి శివుని భర్తగాఁ గోరి తపంబాచరింపనేగుట | | 77 |
| 9 | శివునకు శ్రీరామచంద్రుఁడు ప్రత్యక్షమై సంభాషించుట | | 80 |
| 10 | సప్తమహర్షులు పార్వతిం బరీక్షింపనేగుట | ... | 82 |
| 11 | దేవతలు శివునికడకు మన్మథునిఁబంపుట | ... | 85 |
| 12 | బ్రహ్మ విష్ణుసమేతులై దేవతలు శంకరుని దర్శింపనేగుట | | 92 |
| 13 | పార్వతీకల్యాణము | ... | 95 |
| 14 | హిమవంతుఁడు పరివారసమేతముగ పెండ్లివారి నెదుర్కొనుట | | 99 |
| 15 | మేనక తనసుతకుఁ దగినవరుఁడు లభింపలేదని దుఃఖించుట | | 100 |
| 16 | పార్వతీ పరమేశ్వరుల పాణిగ్రహణ మహోత్సవము | | 104 |
| 17 | శివుఁడు పార్వతీసమేతుఁడై కైలాసమున కేగుట | ... | 103 |
| 18 | ఉమాశంభు సంవాదము | ... | 111 |
| 19 | శంకరుని భూమిక | ... | 116 |
| 20 | శ్రీరామావతార కారణము | ... | 124 |
| 21 | నారదుని మోహము | ... | 128 |
| 22 | నారదుఁడు విష్ణుదర్శనమున కేగుట | ... | 131 |
| 23 | హరిమాయచే నారదునకు శీలనిధియనురాజుపట్టణము గానవచ్చుట | ... | 132 |
| 24 | రాజకన్య నారదునిమాని శ్రీహరిని వరించుట | ... | 136 |

25 నారదుఁడు రుద్రగణముల శపించుట ... 137
26 నారదుఁడు విష్ణుదేవుని శపించుట ... 139
27 మనూపాఖ్యానము ... 143
28 ప్రతాపభానుని చరిత్రము ... 153
29 ప్రతాపభానుఁడు వేటకేగుట ... 156
30 ప్రతాపభానుఁ డరణ్యమున మాయామున్యాశ్రమముంజేరుట 157
31 కాలకేతుఁ డనురాక్షసుఁడు మాయామునియొద్దకువచ్చుట 167
32 బ్రాహ్మణులు ప్రతాపభానుని శపించుట ... 169
33 రావణాదుల జననము ... 172
34 రావణ కుంభకర్ణ విభీషణులు బ్రహ్మచేవరములొందుట 173
35 రావణుఁడు సపరివారుఁడై లంకాపట్టణమున నివసించుట 175
36 రావణుఁడు దిగ్విజయార్థమేగుట ... 178
37 గోరూపధారిణియగు భూమియు, సురలును, బ్రహ్మయు
విష్ణుని శరణువేఁడుట ... 181
38 దేవతలు వానరులై జనియించుట ... 185
39 శ్రీరామావతార చరిత్రము ... 186
40 దశరథుని పుత్రకామేష్టి ... 187
41 కౌసల్యకు శ్రీరామచంద్రుఁ డుదయించుట ... 189
42 కౌసల్య శ్రీరామచంద్రుని స్తుతించుట ... 191
43 దశరథుఁడు పుత్రజననవార్త నాలించి యంతిపురమున కేగుట 193
44 కైకేయీ సుమిత్రలకు భరత లక్ష్మణ శత్రుఘ్ను
లుదయించుట ... 194
45 బాలచరిత్రము ... 196
46 కౌసల్య శ్రీరామచంద్రునిమహిమంగని యాశ్చర్యమొందుట 201
47 విశ్వామిత్రాగమనము ... 206
48 దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రునివెంటఁ బంపుట 209
49 శ్రీరాముఁడు తాటకను వధించుట ... 210
50 విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు విద్యలనొసంగుట 210
51 విశ్వామిత్ర యాగరక్షణము ... 211
52 అహల్యా శాపవిమోచనము ... 212

53 విశ్వామిత్రుఁడు రామలక్ష్మణ సమేతుఁడై మిథిలా నగరమున కేగుట ... 214
54 జనకుఁడు రామలక్ష్మణసమేతుఁడగు విశ్వామిత్రుని నగరమునకుఁ గొనియేగుట ... 217
55 రామలక్ష్మణులు జనకునిపురముం జూడనేగుట ... 220
56 జనకు నుద్యానవనమున సీతారాము లన్యోన్య సందర్శనము సేయుట ... 228
57 విశ్వామిత్రుఁడును మునిబృందమును రామలక్ష్మణులును స్వయంవరరంగమున కేగుట ... 240
58 జానకీ స్వయంవరమహోత్సవము ... 247
59 పరశురాముఁడు సీతాస్వయంవర రంగమునకువచ్చుట 268
60 పరశురామ లక్ష్మణుల సంవాదము ... 272
61 శ్రీరఘురామ భృగురామసంవాదము ... 277
62 పరశురాముఁడు శ్రీరాముని జగన్నాథునిగ నెఱింగి స్తుతించుట ... 285
63 జనకుఁడు శ్రీజానకీకల్యాణసన్నాహ మాచరించుట 287
64 జనకుఁ డయోధ్యకు దూతం బంపుట 288
65 జనకునిదూత యయోధ్య కేగి దశరథుని సందర్శించుట 292
66 దశరథుఁడు సపరివారముగ మిథిలానగరమున కేగుట 301
67 జనకుని పరివారజనులు పెండ్లివారి నెదుర్కొనుట 309
68 రామలక్ష్మణులు దశరథ వసిష్ఠాదుల సందర్శించుట 312
69 సీతా కల్యాణ మహోత్సవము 318
70 జనకుం డూర్మిళా మాండవీశ్రుతకీర్తుల లక్ష్మణ భరత శత్రుఘ్నులకిచ్చి వివాహములు సేయుట ... 340
71 రామ లక్ష్మణ భరత శత్రుఘ్ను లత్తలసెలవొంద జనకు నంతఃపురమున కేగుట ... 354
72 దశరథుఁడు స్నుషాతనూజసహితముగ సపరివారుండై యయోధ్య కేగుట ... 361
73 దశరథుఁడు స్నుషాతనూజ పరివారయుతముగఁ బురప్రవేశమగుట ... 367

ఓమ్

# శ్రీమదాంధ్ర తులసీరామాయణము

## ప్రథమసోపానము

## (బాలకాండము)

శ్రీ సీతాప్రియునార్తరక్షణుని రాజీవాక్షునాద్యున్ మహో
ల్లాసున్ భాసురవేషునీశునజు లీలామాత్రసృష్టిస్థితి
వ్యాసంగుంబరునప్రమేయుఁ గరుణావాసున్ మహామాని,హృ
ద్వాసున్ మద్ధృదయాధినాథు నమలుం భావింతు నశ్రాంతమున్.

మ. గణనాథుండయి వాణియై నలువయై కాత్యాయనీశర్వులై
ఫణిరాట్స్వామియులక్ష్మియై శచియునై పాకారియై విశ్వర
క్షణ లీలాపరతంత్రతన్ మెలఁగుచున్ సన్మౌనిబృందంబుచేఁ
బ్రణుతింపంబడు నిర్వికారుఁ బ్రభు శ్రీరామున్ సదా గొల్చెదన్.

క. సగుణుఁడయి జగము లేలుచు
నగుణుండయి సాక్షియగుచు నఖిలముఁ దానై
నిగమాంతవేద్యుఁడగు ప
న్నగశాయిన్ రామచంద్రనాథు భజింతున్ 3

క. తులసీదాసకృతంబగు
నలఘుతరంబైన కావ్య మాంధ్రింబున నే
నెలమి రచింపఁదలంచితిఁ
గలిదోషాపహము రామగాథామృతమున్ 4

మ. కవితాచాతురిగల్గియున్ మనము దుర్గాధాప్రపంచంబునం
దవులం గ్రంథములన్ రచింపనగునే దానన్ శుభం బంబికా
ధవసంస్తుత్యము మంగళాకరము సీతారామచారిత్రముం
భవదుఃఖార్ణవతారణప్లవము నే భాషింతుఁ గావ్యంబుగన్ 5

ఆ. రామచంద్రుచరిత రచియింపఁగల్గె నా
పూర్వభవసుకృత పుణ్యవశతఁ
జ్ఞాన హానినాసి కైవల్యసామ్రాజ్య
పదవిఁగాంతు రామభద్రుకరుణ

ఆ. పారరహిత రామభద్రకథంబల్క
నల్పమతిని నాకు నలవియగునె
యని తలంకనేల హరి విశ్వమయుఁడు మ
న్ముఖతఁ బల్కుఁగా నమోఘముగను

చ. అనికృతనిశ్చయుండనయి యద్రిసుతాపరికీర్తనీయముం
ఘనతరపాపసంహరణ కారణ పావన రామనామమున్
మననము సేయుచున్ విమల మానసపద్ముఁడనై మదీయమా
జననము ధన్యమయ్యెనని సంతసమంది నిరస్తతంద్రతన్

శా. ప్రారంభింతు సమస్తకిల్బిషచయ ప్రాలేయమార్తాండమున్
గౌరీశంకర నిత్యసంస్మరితముం గైవల్యసంధానముం
దూరీభూతమనోవిషాదమును సాధువ్రాతసంస్తుత్యమున్
సారంబౌ తులసీసుధీకృత మహాసద్గ్రంథ మాంధ్రంబునన్

శా. శ్రీవాణీ గణనాథులం గొలుతు సంప్రీతైకచిత్తంబునం
ధీవర్ణార్థసమూహ సద్రసలసద్విద్యాగణచ్ఛందస
ప్రావీణ్యంబు నొసంగుదైవముల శుంభన్మంగళా కారులం
భావాతీతచరిత్రులన్ సకలసౌభాగ్య ప్రదోత్తేజులన్

క. సిద్ధజను లంతరాత్ముఁ బ్రి
బుద్ధతనె వివేకకాంచి పొందఁగలేరో
బద్ధాంజలిఁ గొలిచెద నా
శ్రద్ధావిశ్వాసరూప చండీశ్వరులన్

క. జ్ఞానమయున్ శంకరగురు
నే నారాధింతు భక్తి నిత్యముఁ గుటిలుం
డైన విధుండే విభుని య
నూనాశ్రయ గరిమచేఁ గనున్ వందనముల్ 12

మ. దివిజస్తోత్రపవిత్రరమ్యగుణ వైదేహీరఘూత్తంసకీ
ర్తివితానామరపాదపోల్లసిత విస్తీర్ణాటవీమధ్య ని
త్యవిహారానుపమాన మానితవిశుద్ధజ్ఞానభవ్యాత్ములం
గవినాథుం గపినాథుఁ గొల్చెద మహాకౌతూహలస్వాంతతన్ 13

క. జననస్థితి లయకారిణిఁ
దనుతాపక్లేశచయ విదారిణిఁ ద్రిజగ
జ్జననిన్ శ్రేయోదాయిని
నినకులపతి రాణి సీత నే భజియింతున్ 14

ఉ. ఎవ్వని మాయకున్ వశత నెల్ల జగంబు లజాది నిర్జరుల్
క్రొవ్వున దుష్టమౌ నసురకోటియునుండు నొరజ్జుసర్పమున్
నివ్వెఱఁగొల్పు భ్రాంతిక్రియ నిక్కముగా భువనంబుదోఁచునో
యవ్విభురాము నచ్యుతు భవార్ణవతారణ పాదుఁగొల్చెదన్ 15

క. నిగమాగమ సమ్మతమై
తగు రామాయణగదిత కథం జేకొని యిం
పగు భాష రచించెను సొం
పుగఁ దులసీదాస సుకవిపుంగవుఁ డెలమిన్ 16

క. ఎవ్వని స్మరియించినచో
దవ్వగు విఘ్నములు గామ్యతతి సిద్ధించున్
మవ్వపు ధీనిధి గణపతి
నవ్వారణముఖుని శుభఁ గుణాకరుఁ దలఁతున్ 17

తే. ఏ దయాళుని కరుణచే నెట్టిమూగ
యైన వాచాలుఁ డగునో మహాద్రులెక్కఁ
గుంటివానికి వశమౌనో ఘోరకలియు
గాఘ దహనుఁడతఁడు కృపనరయుఁగాత

క. కోమల నీల సరోజ
శ్యాముఁడు వికచారుణాబ్జ చక్షుర్యుగళో
ద్దాముఁడు మద్హృదయాంబుజ
ధాముఁడగుత క్షీరవార్ధి తల్పుఁడు సతమున్

క. కుందేందు సదృశ దేహుఁడు
సుందరగిరిజా హృదబ్జసూర్యుఁడు కరుణా
మందిరుఁడు దీనవత్సలుఁ
డిందుధరుఁడు మదనదమనుఁ డిచ్చుతశుభముల్

క. నరరూప హరిని మామక
గురుని మహామోహతిమిరకులరవికిరణో
త్కరవచనుం గరుణానిధిఁ
జరణాంబుజయుగళమంటిసంభావింతున్

క. సరస సుగంధిత గురుపద
సరసిజరజ మమృతరుచిరసారోపేతం
బురుసంసార రుజాపరి
హారణము ననురాగజనక మాదలఁదాల్తున్

క. గురుపాదపరాగము శం
కరదేహ విలిప్త భస్మకల్ప పవిత్రం
బురుశుభదము భక్తాత్మము
కుర మలినహరమును వశ్యగుణతిలకమగున్

క. గురుపద నఖమణిదీపిక
స్మరియించినమాత్ర దివ్యచక్షుః ప్రదమౌ
గరమ జ్ఞానధ్వాంతో
త్కరహరణ మహాప్రకాశకరమగు మఱియున్ 24

తే. జ్ఞాననేత్ర వికాసంబు సలుపఁగలదు
ఘోర సంసార దుఃఖ నివారకంబు
రామగాథా రుచిర రత్నరాశి వెలయు
ఖనిని బ్రత్యక్షముగఁ జూపఁగలుఁగు వెలుఁగు. 25

ఆ. సిద్ధుఁ డంజనంబుచే నిధానముఁ గాంచు
కరణి రామచరితఁ గని రచింతు
గురుపదాబ్జ రేణు కోమలాంజనముచే
జ్ఞాననేత్ర మలినచయ మడంచి 26

క. జ్ఞాన విహీనతఁ దోఁచెడు
నానా సందేహసమితి నాశము సేయం
గా నిపుణుల బ్రాహ్మణుల న
నూన గుణాకరుల సజ్జనుల సేవింతున్. 27

మ. తనకష్టంబు సహించియైన నితరత్రాణైకదీక్షం జగ
జ్జనసేవ్యంబగు ప్రత్తికై వడిని నిస్సారంబునై యుజ్జ్వల
ద్గుణతన్ మించెడి తత్ఫలంబుక్రియ విస్తారంపుసత్కీర్తి సా
ధనమై సాధుచరిత్ర మొప్పును జగత్కల్యాణసంధానమై. 28

తే. హర్ష శుభకర సాధుచయంబు పుడమి
జంగమంబగు తీర్థరాజము ప్రయాగ
రామభక్తియె గంగా ఝురంబగు సర
స్వతియె బ్రహ్మవిచార ప్రచార మవని 29

ఆ. విధినిషేధకర్మ విపుల కథామయ
కలి కలుష నివారకంబు యమున
హర్ష మంగళ పవిత్రామల కేశవ
హరకథా వితానమా త్రివేణి 30

ఆ. ఆత్మధర్మమందె యచల విశ్వాసమ
క్షయవటము సుకర్మజాల మెల్లఁ
దీర్థరాజి సతము దివ్యంబు సులభంబు
సేవకులకు మిగుల శ్రేయ మొసఁగు 31

తే. దోషనాశకమైన సాధుప్రయాగ
తీర్థ మహిమోపదేశంబుఁ దృప్తి నెవ్వఁ
డాదరంబున వినునో వాఁడందఁగలఁడు
నాల్గుపురుషార్థముల నీజననము నందె 32

తే. అమల సత్సంగమను తీర్థమందు స్నాన
మాచరించినఁగాక మేయగుఁ బికంబు
బకము హంసంబుగా మారు భవ్యమహిమ
నబ్బురముఁ జెందనేల యథార్థమిదియ 33

తే. నారదాగస్త్య వాల్మీకి నైజ జన్మ
కథలఁ బలుకరె యాత్మముఖముల వారె
గగన భూజల చర భూతగణము కీర్తి
ముఖఫలములొందు సత్సంగముననె కాదె 34

క. తొలిచదువుల లోకంబునఁ
గలదె యుపాయాంతరంబు గతియున్ మతియున్
విలసిత కీర్త్యైశ్వర్యా
దులు సత్సంగమునఁగాదె దొరకు జనులకున్ 35

మత్తకోకిల:-సాధుసంగము లేక జ్ఞానము సంభవింపదు జానకీ
నాథు సత్కృప లేక రాదభినంద్య సజ్జన సంగమున్
వ్యాధిహీన సుఖ ప్రశోభన పాదపంపు సుమంబనన్
సాధనంబగు సిద్ధినొందుట సత్ఫలంబనఁగాఁ దగున్. 36

ఆ. పరుసవేది సోక బంగారమగు నిను
మావిధమున శుద్ధులగుదు రెట్టి
కుత్సితాత్ములైన సత్సంగ మొనరించి
నందువలన మిగుల నద్భుతముగ 37

క. సుజనుఁడు దైవవశంబున
కుజనుల సాంగత్యపరతఁ గ్రుమ్మరె నేనిన్
నిజగుణముల విడనాడఁడు
భుజగశిరః కలితమణినిబోలి ప్రదీప్తిన్ 38

ఉ. శాకములమ్మువాడు మణిసంచయమూల్య మెఱింగి యెంతయో
వాకొనలేనిమాడ్కి శుభవర్ధన సజ్జనసంగలాభమున్
నాకువశంబె వర్ణనమొనర్పఁగ భారతియున్ విధాతయున్
సోకులమూఁక గొంగయును శూలియుఁ జాలరు పండితుల్ కవుల్ 39

ఉ. అంజలినున్న పుష్పతతి హస్తయుగంబునకున్ సమంబుగా
మంజులగంధమిచ్చుగతి మానసమందరి మిత్రభేదముల్
సంజనియింపనీక ప్రజసర్వసమానముగాఁగఁజూచు నా
రంజితచిత్తులన్ సుజనరాజులనేఁ జెయిమోడ్చి మ్రొక్కెదన్ 40

తే. లోకహితకర సజ్జనలోక మస్మ
దీయబాలక సమనతుల్ దృప్తిఁగొనుచు
జానకీనాథ పాదాంబుజ ద్వయమున
దృఢతరప్రీతి నొసఁగ సర్గిలి భజింతు 41

తే. కారణము లేకయే పరకార్యములకు
హాని మేలును సమకూర్చువానియందు
హానికిన్ సంతసించి మేలుండ వగచు
దుష్టమండలికే మ్రొక్కెదును సతంబు 42

సీ. విష్ణుశంకరకథా విధుమండలమునకు
రాహు స్వరూపులౌ రౌద్రముఖులు
పరకార్య విధ్వంస పరత సహస్రబా
హు సమానయోధులై యొప్పువారు
ఇతరుల దోషంబులెంచి కాంచెడుచో స
హస్రాక్షులై తిరుగాడువారు
పరహితరూప శుంభద్ఘృతంబునకీగ
వంటి మానసమున వఱలువారు

తే. తేజమున నగ్నికల్పులై తీవ్రమైన
రోషమున మహిషాసుర రూపులగుటఁ
గుంభకర్ణవిధంబునఁ గూర్కుమేలు
లోకనమునకా ఖలులకుఁ గేల్మోడ్చువాఁడ 43

సీ. పాపావగుణ మహైశ్వర్యధుర్యతఁగుబే
రోపముల్ వీరన నొప్పువారు
లోకంబునకుఁ జాల శోకంబు నొనగూర్పఁ
గేతూదయంబను రీతివారు
వడగండ్లు సస్యంబుఁ జెడఁగొట్టి చెడురీతిఁ
జానైనఁ బరహాని సలుపువారు
శేషాహిగతిఁ గ్రోధచిత్తత వేనోళ్ళఁ
బరదోష వర్ణనం బరఁగువారు

తే. పృథునృపాలునిగతిఁ బదివేల చెవులఁ
బరులపాపంబు లాలించువారు వేయి
కనులఁ బరదోషములఁజూచు ఖలులునైన
దుష్టజనులకు నేమ్రొక్కెదను సతంబు 44

తే. సర్వకాల సురానీక సక్తులగుచు
నెవరు చరియించు చుందుదు రింద్రుమాడ్కి
వజ్రిసమకర్కశోద్ధుర వచనరక్త
దుష్టజనులకు నే మొక్కెదను సతంబు 45

క. మిత్రులు దాసీనమతుల్
శత్రులనక సకలజనులసౌఖ్యముఁగను చో
నాత్రమున నుడుకు నిందా
పాత్ర దురాత్ముల కొనర్తు బద్ధాంజలులన్ 46

క. చేకొని పెంచిన నైనం
గాకము తినకున్నె మాంసఖండంబుల నే
నేకరణి మ్రొక్కు లిడినన్
లోకంబున దౌష్ట్యముడిగి లొంగరు దుష్టుల్ 47

తే. దుఃఖ మొనగూర్తు రుత్తముల్ దుష్టమతులు
నిరు తెగలయందు భేద మొక్కింత కలదు
సజ్జన వియోగమున దుష్టసంగమునను
వనటగలుఁగు నుభయులకు వందనములు 48

చ. జలజ జలూకముల్ సలిలజాతములైన గుణంబు వేఱగుం
జలధి సుధాసురాయుగము జన్మమునొందదె యూవిధంబుగా
ఖలులును సజ్జనుల్ జగదగాధ సముద్రమునందుఁ బుట్టినం
గలదు విభేద మియ్యుభయకక్షలకుం బరికించి చూడఁగన్ 49

తే. ఉత్తములు దుష్టజనులు యథోచితంపు
ఫలములంగాంతురాత్మీయవర్తనములఁ
జంద్రగంగామృతోపముల్ సాధుజనులు
దుష్టు లగ్ని విషకలుషధుని సదృశులు 50

తే. సజ్జనులు సుజనతనే ప్రశస్తిఁగంద్రు
ఖలులు దుష్కార్యముల నీచకతనుగాంతు
రమృత మమరత్వమును మెచ్చు ననవరతము
విషము పంచతనే తృప్తి వెలయ మెచ్చు 51

క. సుజనులు గుణముగ్రహింతురు
కుజనులు దోషంబు నేరికొనియెదరుభయం
బుజలధిరీతినపారము
త్యజియింప గ్రహింపవశమె దానినెఱుఁగమిన్ 52

ఉ. కాన నొకింత యిందుఁ బలుకంబడె సద్గుణ దుర్గుణాళి వా
గ్జాని సృజించె లోకమును సద్గుణదుర్గుణ రూపరాశిగా
నానిగమాగమంబుల వినంబడు వేదము తద్గుణద్వయిం
బూని గణించెఁ బెక్కులగు పోకల జోకల వేలువేలుగన్ 53

మ. దినరాత్రంబులుఁ బాపపుణ్యగతులుం దేవాసురుల్ సాధు దు
ర్జనులున్ సౌఖ్యము దుఃఖ మున్నతము నీచంబున్ సుదుర్జాతుల
త్యనురాగంబు విరాగమున్ విపులమాయాబ్రహ్మజీవేశ్వరుల్
ధనదారిద్ర్యములున్ సుధావిషములుం ధాత్రీధవుల్ పేదలున్ 54

క. మొదలగు ద్వంద్వంబులు ప్రా
జదువుల విభజింపఁబడియె సజ్జనహంసల్
వదలుదురవగుణజలముల
ముదమున గ్రహియింత్రు పాలపోల్కిగుణములన్ 55

చ. కమలజుఁ డట్టిజ్ఞానమిడఁగానగు దుర్గుణముల్ త్యజింపఁగా
విమలగుణాళిఁ గైకొనఁగ విశ్వమునందు స్వభావకర్మ పా
శముల నవిద్యఁ జిక్కువడి సజ్జనుఁడున్ మఱిపొందు నుత్తమో
త్తమమగు మార్గముం బ్రబలదర్పితమోహపరీతచిత్తుఁడై 56

ఆ. అట్టి మఱపుదీఱి హరిభక్తులైన వా
రెట్లు దోషనివహమెల్ల విడిచి
యశమునొందఁగలరొ యారీతి దుష్టులు
సుజనసంగ మొసరుచుటను జేసి 57

క. మేలగు పనులొనరింపం
జాలిన మలినస్వభావ చర్యల నెల్లం
దొలంగఁ జాల రెన్నఁడు
బాలసునకు సహజగుణము వాయునె తలపన్ 58

తే. సజ్జనులరీతి లోకవంచకులు వేష
ధారణంబునఁ గాంతురు గౌరవంబు
వేషమునఁ బూజితులుగారె దోషులైన
రాహువుం గాలనేమియు రావణుఁడును 59

క. వేషంబునఁ గొఱవడినం
భూషితులగుచుండ్రు సాధుపురుషులు ధిషణా
భూషణుఁడు జాంబవంతుఁడు
దోషాచరణైరి హనుమస్తుతిఁగనదె భువిన్ 60

ఆ. వేషధారి దుష్టవితతి కపటమెల్ల
బయలువడును గౌరవంబు చెడును
దుష్టసాధుసంగతులఁ గీడు మేలులు
సంభవించుననుట జగమెఱుఁగదె 61

తే. భూరజము వాయుసంగతిఁబోవు దివికి
నంబుసంగతి బురదయై యడుగుఁబట్టు
శారికాకీరములు రామచంద్రుఁబలుకు
సజ్జనునియింట ఖలునింట జగడమాడు 62

క. పొగవ్యర్థపు మషియగు నది
నిగమంబులు వ్రాయ మృదుల నీలపదార్థం
బగునని లానలసంగతి
జగదాధారమగు జలము జలదముగాదే 63

తే. ఓషధీ జల వస్త్ర వాయుగ్రహములు
దుష్ట సత్సంగ వశతఁజెందును జగమున
హీనతయు నుత్తమత దీనిమానసములఁ
జతురమతు లూహఁజేసి కాంచంగఁగలరు 64

ఉ. మాసమునం గణింపఁగ సమాన సితాసితపక్షయుగ్మముం
జేసె విధాత యందొకటఁజెందు సుధాంశుఁడు వృద్ధిక్షీణతన్
వాసిచెడున్ మఱొంట జనవారము తోరముగుల్కు శుద్ధముల్
మాసిన కృష్ణపక్షమును మంచిది చెడ్డది యందురెందునన్ 65

క. సుర గరుడ యక్ష రాక్షస
నరచారణ సిద్ధ భూత నాగ విహగ కి
న్నర గంధర్వ ఖచర వా
నరులం బరమాత్మఁగాఁగ నమ్మి భజింతుల్ 66

చ. సకల చరాచరోద్భవనజాలము రామమయంబుగాన నే
ముకుళిత హస్తతన్ సలిలభూచర ఖేచరవాయుసంచర
ప్రకరము భక్తిమీఱ సతతంబుస్మరించి నమస్కరింతు మ
త్సుకృతవశంబునం గరుణతో హరి నాకుఁబ్రసన్నుఁడయ్యెడుల్ 67

శా. వాతాంబు క్షితిసంచర త్సకలజీవశ్రేణిలో మర్త్యులన్
నాతుల్ క్లీబులుఁ బూరుషుల్ క్రిములు నానారూప సంకీర్ణమా
భూతవ్రాతసమేత విశ్వమును సంపూర్ణానురాగంబునన్
సీతారామమయంబుగాఁ దలఁచి నేఁజేమోడ్చి ధ్యానించెదన్ 68

ఆ. అస్మదీయబుద్ధి యన నెంత బ్రహ్మాండ
మయుని రామవిభుని మహితకరుణ
నొంది సంతతంబు నుత్సాహ చిత్తుండ
నై చరింతు నతని యంద తవిలి 69

క. కించిజ్జ్ఞుఁడ నేనైనఁ ద
లంచితి శ్రీరామలీలలన్ వ్రాయఁగఁ జే
యించెడు హరి యేకలఁ డిలఁ
గొంచెపు జీవుల పనులనుగొను మనుజక్రియన్ 70

మ. మతియల్పంబు ప్రయత్నమా ఘనము శ్రీమద్రామచారిత్ర సా
మృతపానం బొనరించి భక్తజనతాబృందంబుఁ బ్రావింపఁగో
రితి నాసాహసమున్ సహించి ననుసంప్రీతిం గటాక్షింప వేఁ
డితి హస్తద్వయి మోడ్చి సజ్జనులఁ దండ్రీ వేఁడుచందంబునన్ 71

క. పరగూషకులుం గుటిలులుఁ
బరిహాసముసేయ సత్స్వభావులు శిశుభా
సుర శుక మద్వచనములకుఁ
బరితోషించెదరు మాతభంగిఁ బితగతిన్ 72

క. ఇతరుల కృతులంగని స
న్మతి సంతోషంబునొందు మాన్యులరుదు మ
త్కృతి రసవంతమయినఁ ద
ద్వ్యతిరేకంబైన మెచ్చు వారుండరొకో 73

ఆ. నదిని సరసిఁ బోలు నరులు పెక్కురుగల
రాత్మలాభవృద్ధిఁ నలరువారు
పూర్ణచంద్రుఁగాంచి పొంగు వనధిరీతి
నొరులవృద్ధి సుజను లుబ్బుచుంద్రు 74

ఆ. గుణములేకయున్నఁ గోవిదుల్ మెచ్చరు
గుణముగలిగియున్నఁ గుటిలమతులు
సూచిసైపలేరు సుందరహంస స్వ
నంబుఁగాంచి కొంగ నవ్వినట్లు 75

క. కవితాప్రియులుగ సీతా
ధవభక్తులుఁ గానివారు దర్పోద్ధతులై
నవుదురవుఁగాక నాదగు
కవనమున కమాయికంపు కల్పనములకున్ 76

తే. ఎవరు శ్రీరామపద భక్తిహీనమతులో
యెవరుగ్రహియింప నసమర్థహృదయులో రఘు
రామచరితంబు వారికి రసవిహీన
మగుచుఁ దోఁచును భక్తుల కమృతసమము 77

తే. సరసకవిఁగాను చతురభాషణుఁడఁగాను
పండితుఁడఁగాను మత్కృతభవ్యచరిత
పుడమి కొమరిత పతిభక్తి పూర్ణమనుచు
సజ్జనులు గాంచి హర్షించి సన్నుతింత్రు 78

శా. ఛందోలంకరణార్థభావరచనా చాతుర్య మాధుర్య వా
క్సందర్భంబులు భాషకుందొడవులౌ సత్కావ్య నిర్మాణపుం
చందంబుం గుణదోషభేదతతి విస్తారం బపారంబు నా
కెందుం జేసుపులేదు లేదనుచు భాషింతున్ యథార్థంబుగా 79

మ. గుణహీనంబు మదీయమౌరచన లోకుల్ దీనిఁగాంక్షింపఁగా
గణియింపందగు హేతు వొండు గలదా కాత్యాయనీ శంకరుల్
ప్రణవార్థంబని ప్రీతి నిత్యము జపింపన్ వేదశాస్త్రంబులుం
బ్రణుతింపందగు రామనామ మెలమిం బల్కంబడెం దీనిలోన్ 80

క. నానాభూషాలంకృత
యైనను బరిధానహీనయగు సతిపగిదిన్
శ్రీనాథనామవిరహిత
మౌనిరుపమ సుకవికృతియు నందముగనునే 81

ఆ. గుణవిహీనమైన కుకవి కావ్యంబైన
రామనామకీర్తిధామమైనఁ
బండితులును దానిఁ బఠియింతురి వినియొక
రలులగతి గ్రహింతు రమలరసము 82

తే. అగురుసంగతి ధూమంబు నాత్మకటువు
గంధమున్ వీడురీతి మద్గ్రంథరచన
సకలకలికలుషాపహ జానకీమ
నోహరకథాభివర్ణనా నూనతఁగను 83

మ. తులసీరామకథారసంబుదివిషచ్ఛ్రోతస్వినీరమ్య ని
ర్మలవారిపూర సమానపావనముగుర్ రామప్రభావాదిగా
థలచే భస్మము చంద్రశేఖరుఁడు మైదాల్పంబవిత్రంబు ని
స్తుల పుణ్యప్రదమైన చందమున సాధువ్రాతమూహాయనన్ 84

తే. మలయగిరి సంగమున నెట్టిమ్రానుగాని
చందనావనిజంబుతో సవతు వచ్చు
నతుల రామయశోదీప్తి నస్మదీయ
కృతియు నుతిఁగాంచి జనులకుఁ బ్రీతిసేయు 85

తే. అసిత గోక్షీర మెల్లరు నాదరమునఁ
జారుభంగిని మత్కృతగ్రంథ మమల
జానకీరామ సత్కీర్తి సాంద్రమగుట
గాన యోగ్యముగాదె సకలజనులకు 86

మ. మణియున్ రత్నము మౌక్తికంబు నతిరమ్యంబై ప్రకాశించునే
ఫణిశీర్షంబున నద్రికూటముపయిం భద్రేభమస్తంబులో
ఘృణితో రాజకిరీటదేశమునఁ బంకేజాక్షిమై దీవపై
గణనాతీత విభాసురంబగుచు సింగారించు చందంబునన్ 87

ఆ. పుట్టుచోటనెల్ల పట్టుల శోభించు
చుండునండ్రు బుధులు సుకవి కవిత
భక్తికారణమున భారతీదేవియు
విధిగృహంబు వడిగ వెడలివచ్చు 88

ఉ. జానగు జానకీరమణ సచ్చరితామృత పూరవాహినిన్
స్నానమొనర్పకున్న యెడ శాంతియడంగునె కోటిభంగులన్
దీని నెఱింగియే కవిసుధీమణు లుల్లము పల్లవింపఁగా
గానముసేయుచుండ్రు కలికల్మషహారి హరిప్రభావమున్ 89

సీ. సాధారణుల గుణజాలంబుఁ బాడుచో
శారదకుందు శీర్షంబు మోది
కవిజనహృదయంబు కంథియంచును బుద్ధి
శుక్తియు స్వాతియజుని సతియని
చతురులై వెలయు ప్రజ్ఞావంతు లాడుదు
రమలమౌ సద్విచారాంబు వృష్టి
వలన నత్యంత పావనకవిత్వంబను
మౌక్తికకోటి సంభవమునొందు

తే. సజ్జనులు దాని శ్రీరామచరిత మనెడు
తంతువునఁ గూర్చి శుద్ధమౌ తమయురములఁ
దాల్తు రత్యంతముదమున ధాళధళ్య
రోచు లొలయంగ సౌందర్యరాశి మెఱయ 90

తే. హంస వేషంబు ధరియించి యాచరణము
నందుఁ గాకముఁబోలు శ్రుత్యర్థ బాహ్య
దోష నిలయులుగాఁగ నుందురు విశేష
ఘోర కలియుగ జాతులౌ కుటిలమతులు 91

ఆ. కపటరామభక్త గణమగు కాంచన
క్రోధ కామదాస కోటియందుఁ
బ్రథమగణ్యుఁడను బ్రపంచంబునందు నే
నపరిమితము లస్మదవగుణములు 92

ఆ. అందుఁగొన్నిమాత్రమిందుఁ జేర్కొంటిని
గ్రంథవిస్తరమగు కారణమునఁ
జతురమతులు తెలియఁజాలక పోవరీ
కొలఁదిమాత్రముననె కలవిధంబు 93

క. పలుభంగుల ననుఁగూఱిచి
తెలుపుటవిని నతులఁగొనుచుఁ దెంపునదోషం
బుల నెంతురె యెవరును నటు
నలిపిన నాకంటెవారు జాల్ములుగారే 94

మ. కవితాచాతురి లేదు నాయెడల సంకల్పానుసారంబుగా
నవనీజాపతి సచ్చరిత్రమును వ్రాయంబూనితిన్ సంస్కృతిం
దవులంబారిన నాదుబుద్ధియెట సీతారామనిష్పార కీ
ర్తి విరాజచ్చరితం బదేడ కనుఁడా ధీరోత్తముల్ సన్మతిన్ 95

ఆ. గాలివలన మేరు ఘనపర్వతము దూలఁ
దూలమనఁగ నెంత తోయజాక్షు
ప్రాభవంబునాత్మ భావించి కథవ్రాయఁ
జిత్తమిపుడు సంకుచించె నాకు 96

ఉ. శారదయున్ విరించియును శర్వుఁడు శేషుఁడు వేదశాస్త్రముల్
ఛాసుపురాణముల్ విభుని సత్ప్రభుతన్ సతతంబునేతి నే
త్యారవముల్ సెలంగఁ గొనియాడుచుఁ బాడుచునుండునట్టి దై
త్యారి భజింపఁ బెక్కుగతులైతగు భక్తులఁదెల్పె వేదముల్ 97

తే. ఏకమై నామరూపవిహీనమై ని
రీహమై యజమై విశ్వదేహమగుచు
సచ్చిదానందమై సర్వసాక్షి విభుఁడు
లీలఁ గావించుఁ దనుధారిలీల జగతి 98

ఉ. కేవలభక్తకోటిఁ బరికింప శరీరములం ధరించు నా
దేవుఁడు సాధుపోషకుఁడు దీనదయాళుఁడు స్నేహభావుఁడై
సేవకజాలమున్ మనుచుఁ జిక్కసిప్రేమరసంబుఁ జిల్కుచుం
బావనమౌ కృపన్ మమతఁబాయఁడు క్రోధము లేదొకప్పుడున్ 99

ఆ. భేదబుద్ధులకును బీదలకత్యంత
సరళచిత్తులకును సబలులకును
స్వామియనుచు రాముసత్కీర్తిఁ బాడుచు
బుధులు వాణిఫలముఁ బొందుచుంద్రు 100

తే. తద్బలంబున నేను సీతాకళత్రు
పాదయుగళంబునకు మ్రొక్కి భక్తిమీఱ
నద్విభుకథాభివర్ణనం బాచరింపఁ
బూనితిన్ మార్గదర్శకుల్ మునులగుటను 101

తే. సుందర విశాలనదులపై క్షోణిపతులు
సేతు నిర్మాణముం జేయఁ జీమవంటి
యల్పజీవులకును ననాయాసముగను
పారముంజేర ననుకూల పడునుగాదె 102

క. ఆవిధమున వ్యాసాదులు
శ్రీవిభుకీర్తి ప్రశంసచేసినతోవన్
నేవెరవున సీతాధవ
పావనచరితంబువ్రాయఁ బ్రారంభింతున్ 103

తే. కలియుగంబున శ్రీరామకథ రచించి
వెలయు సత్కవిపుంగవ వితతికెలమి
హస్తయుగళంబు ముకుళించి యనవరతముఁ
బ్రణుతిఁగావింతు నతుల శుభంబుఁగోరి 104

ఉ. ఖ్యాతిదలిర్ప శ్రీధరునిగాథల నాదరమొప్పఁగా ననం
ఖ్యాతములన్ రచించుచు జగంబు శుభంబులకిమ్ముఁజేయు నా
పూతచరిత్రులం భువనపూజ్యగుణాఢ్యుల వర్తమానపుం
భూతభవిష్య ద్విధకవిపుంగవులం బ్రణుతింతు భక్తితోన్ 105

క. ఈ నారచనము సజ్జన
మానితమగుఁగాక బుధసమాజాదరముం
గానని కృతిచే వ్యర్థం
బైనశ్రమం బాలకవియ యందుచునుండున్ 106

చ. కవితయుఁ గీర్తియున్ సిరియు గంగకిర్యన్ హితమాచరించు నీ
భువనమునందు నెల్లరకు భూమిసుతా విభుకీర్తి సాధుపుం
గవుల కృపావిశేషమునఁ గౌతుకమొంది రచింపనుంటి మ
త్కవనము రామచంద్రగుణగాథలచే యశమొందుఁ గావుతన్ 107

ఆ. అట్టి సరళకవిత నతినిర్మలయశంబు
నాదరింతు్రు విబుధులైనవారు
శత్రుజనులుఁగూడ స్వాభావిక విరోధ
భావముడిగి దానిఁ బ్రస్తుతింతు్రు 108

ఆ. అమలబుద్ధి లేక యట్టి కవిత్వంబు
రాదు బుద్ధిబలము లేదు నాకు
రామకీర్తిగాథ రచియించుచుంటి నన్
గరుణఁజూడ మీకుఁ గైమొగుడ్తు 109

ఆ. విమల రామచరిత విపులమానస సరో
వరమరాళ విబుధవరకవీంద్రు
లస్మదీయ వినతులాదరంబునఁ గొని
కరుణతోడ నన్నుఁ గాంతు్రుగాక 110

క. ఖరదూషణయుతమయ్యును
ఖరదూషణ రహితమగుచుఁ గస్పష్టఁగ భా
సుర రామచరిత్రంబును
విరచించిన పుట్టతపసి వినుతింతు మదిన్ 111

మ. కలలోనైనను భేదమించుకయు లోకశ్రేణికిం జేయకా
జలజాతేక్షణు జానకీరమణు భాస్వత్కీర్తి నానావిధం
బులఁ గీర్తించుచు ఘోరసంసృతి మహాంభోరాశికిన్ నావలా
నలుప్రాబల్కులకే నమస్కృతుల నానందంబునం జేసెదన్ 112

చ. అమృతముఁ గామధేను జలజాదులఁబోలెడు సజ్జనుల్ విషం
బు మదిరఁబోలు దుర్జనుల మూకయుఁగూడిన సృష్టివారిధిం
గొమరమరన్ సృజించిపలుకుం జవరాలికి బాళిఁగూర్చు నా
కమలజు పాదపంకరుహగంధిల రేణుచయంబు మ్రొక్కెదన్ 113

క. దేవ బ్రాహ్మణ గ్రహ గణ
కోవిద పాదాంబుజములకున్ మ్రొక్కెద మ
ద్భావము శుభాభిలాషా
శ్రీవిభవాస్పదముగాఁగఁ జేయుటకొఱకై 114

తే. పలుక విజ్ఞానదములును వారిఁదోఁగఁ
బానమొనరింపఁ బ్రతిహతపాపములగు
పావన సరస్వతీ సురాపగలకమల
భక్తినొనరింతు నేఁబునర్వందనంబు 115

ఉ. తల్లియుఁ దండ్రియుం గురుఁడు దైవమునై యెనలేనిప్రేమ సం
ధిల్లఁగ దీనులన్ మనుచు నీశ్వరునిం గిరిరాజకన్యకం
బ్రోల్లసితాత్మ హృద్వసితభూమిసుతా రఘురామమిత్రులన్
వల్లభులన్ సుసేవకుల భక్తుల మద్ధితులం భజించెదన్ 116

ఆ. లోకహితముఁగోరి శ్రీకంఠుఁ డొనరించె
నర్ధజపవిహీనమైన మంత్రి
మతి ప్రభావవంత మాత్మప్రతాపంబు
వలన నన్నియెడలఁ బ్రకటపడఁగ 117

ఆ. రామచరిత మెలమిరచియింతుఁ బార్వతీ
శంకరులస్మరించి చరితమునకు
మంగళంబు ముదమొసంగు జంపతులని
తత్ప్రసాదమొంది ధన్యమతిని 118

శా. తారావారసుధాంశు దీధితులచేతన్ రాత్రిశోభించున
ట్లారూఢిన్ శివసత్కృపాగరిమచే సన్మత్కృతంబైన యీ
శ్రీరామాయణ మందమూఁ జదివినంబ్రీతిన్ వినన్ సంతత
శ్రీరామప్రభుభక్తులై విమలులై జీవింపరే మానవుల్ 119

తే. స్వప్నమునఁగూడ నామీఁద సత్యముగను
పార్వతీశంకరులకృప పరఁగెనేని
మత్కవిత్వంబు విమలమై మాన్యమై ప్ర
భావవంతంబునై కీర్తిఁ బడయఁగలదు 120

క. కలిత పవిత్రాయోధ్యం
గలికిల్బిషహరవరాపగామణి సరయూ
జ్జ్వల పుణ్యానది నయోధ్యా
విలాసినుల మగలరామప్రియుల భజింతున్ 121

క. సీతానింద నొనర్చిన
పాతకునకుఁగూడ నొసఁగెఁ బరమపదము భూ
జాతానేత దయానిధి
యాతనికెనయైన దేవుఁ డన్యుఁడుగలఁడే 122

ఆ. ప్రాచిసుతుని లోకబాంధవుఁ గనినట్లు
లఖిలలోకనాథుఁడైన సుతునిఁ
గని ప్రశస్తిఁగనిన కౌసల్యఁ బావన
మతి సతంబు నేనమస్కరింతు 123

క. కలశాంబుధిశశివలె నే
కులమున రాముఁడు జనించెఁ గుజనసరోజం
బులకున్ హిమమన నారా
ణుల దశరథుఁ బుణ్యవర్తనుల శుభకరులన్ 124

తే. వాఙ్మనఃకాయముల సదావందనంబు
లాచరించెద నాత్మజునంఘ్రికమల
సేవకుని నన్నుఁ గృపఁగన సృష్టినెవరిఁ
జేసి యజుఁడందెఘనత నాశివునిగుణుల 125

కం. రామ వియోగంబుననే
భూమీపతి తనువుఁ దృణముపోల్కి విడిచె నా
రామపదప్రేమి దశరథు
ధీమంతు నమస్కరింతు దీనదయాళున్ 126

ఆ. యోగభోగ విధులనుంచి గూఢంబుగా
రామచరణభక్తిఁ బ్రకటపఱచె
రామదర్శనమున రాజయోగీంద్రు నా
జనకు బంధుమిత్రసహితుఁ గొలుతు 127

తే. వర్ణనాతీత నియమ సువ్రతుఁడగుచును
వనజరసలుబ్ధ బంభరంబనఁగ రామ
పాదసరసీజయుగళంబుఁ బాయలేని
మదిగలుగు భరతునకే నమస్కరింతు 128

తే. రామకీర్తిపతాకను రమ్యదండ
సదృశ మెవ్వనియశమయ్యె చారుశీత
మగుచు భక్తుల కఖిలసౌఖ్యంబులొసఁగు
లక్ష్మణు పదాంబుజాయుగళంబుఁ గొలుతు 129

ఆ. భువనకారణుండు భోగికులేశుండు
శేషఫణి సహస్రశీర్షుఁ డవని
భరము వాపఁబుట్టి కరుణకిమ్మగు గుణ
శాలి లక్ష్మణుండు ప్రసన్నుఁడగుత 130

తే. సమరవీరుని భరతానుచరుని రాము
పిన్నతమ్ముని శత్రుఘ్ను విమలశీలు
పాదకమలంబులకు మ్రొక్కి ప్రస్తుతింతు
సర్వదా నాకతండు ప్రసన్నుఁడగుత 131

క. పరమజ్ఞానిం బావని
దురితాటవి వీతిహోత్రు దుష్టామిత్రున్
శరచాపధారియగు రఘు
వరునకు నిరతైనహృదయ వనజాలయునిన్ 132

క. అనుపమవీరున్ హరిచే
వినుతింగనినట్టి కీర్తివిస్తారుని ధీ
ఖనిఁగడుఁ బ్రాభవవంతున్
హనుమంతు నమస్కరింతు నతిగుణవంతున్ 133

ఆ. అధమ దేహధారులయ్యును శ్రీరాముఁ
బొందినట్టి తరణిపుత్ర జాంబ
వద్విభీషణులకు వాలినందన ముఖ్య
వనచరులకొనర్తు వందనములు 134

క. ఖగ మృగ దేవ దనుజ నరు
లగణిత నిష్కామభావులై శ్రీరాముం
దగ నెందఱు సేవింతురొ
మిగులఁగ నందఱను నెలమిమీఱ భజింతున్ 135

క. సనక శుక నారదాదిక
ముని జనులకు శిరము పుడమిమోవఁగ నతులే
నొనరింతుఁ గరుణమీఱఁగ
నను దమభక్తునిగఁదలఁచి నడపుటకొఱకై 136

తే. జనకరాజన్యపుత్రి విశ్వజనయిత్రి
రామచంద్రమనోహారి రాజవదన
యకలుషంబగుబుద్ధి నాకమరనొసఁగి
సీత కరుణాసమేత రక్షించుఁగాత 137

క. వనజాతాక్షుని రాముని
ధనురిషుధారిని సుభక్తతాపనివారిం
ఘన సుఖదాయకుని సమ
ర్థునిఁ త్రికరణశుద్ధిగాఁగ మ్రొక్కెద మరలన్ 138

ఆ. అర్థశబ్దములును నంబుతరంగము
లిరుపదములననిన నేకమైన
భంగినొప్పు దీనపాలక జానకీ
రామ పదయుగముల రహిం భజింతు 139

తే. సూర్యచంద్రాగ్ని బీజమై శ్రుతులకెల్ల
బ్రాణమై మూఁడు మూర్తుల పట్టగుచును
నిరుపమాన నిర్గుణ గుణనిధిగఁ బరఁగు
రామనామంబు మ్రొక్కెద నేమముదమున 140

తే. ఏమహామంత్రము జపించు నిందుమౌళి
కాశిలో దేని జనులుపదేశమొంద
ముక్తికిన్ హేతువగు నాదిపూజ్యుఁడయ్యె
నామమహిమం బెఱింగి వినాయకుండు 141

తే. రామనామంబు మున్ను విలోమముగను
జపముఁగావించి వల్మీకజన్ముఁ డనఘుఁ
డయ్యెను సహస్రనామతుల్యమని తెల్ప
నంబిక జపించి విభుని దేహార్థమందె 142

ఆ. దీనిఁజూచి యుమను స్త్రీజనంబులలోన
భూషణంబుగా శివుండు సేసె
నమృత సమఫలంబు నరయ విషంబిడు
నట్టి నామమహిమ నభవుఁ డెఱుఁగు 143

ఆ. వర్షఋతువు రామభక్తి ధాన్యపుఁబైరు
తులసిదాసు రాము నలఘునామ
మందు నక్షరద్వయంబు శ్రావణ భాద్ర
పదముల నెడు నెలలు విదితముగను 144

ఆ. అక్షరద్వయంబు నతిమధురము మనో
హారము వర్ణజనుల కక్షియుగము
స్మరణమాత్ర నెల్లజనులకుసులభమ్ము
జయదముభయలోక సౌఖ్యకరము 145

తే. పలుక స్మరియింప నక్షరద్వయము వినఁగ
మనముహర్షించు రామలక్ష్మణుల భాతిఁ
బ్రీతిచేకూర్చుఁ దులసీకవిప్రవరున
కంగముప్పొంగఁ బరవశంబందఁజేయు 146

తే. వేలువేలుగ నక్షరద్వితయమందుఁ
బ్రీతిపుట్టదు వర్ణింప విశ్వమందుఁ
గాని స్వాభావికముగ నక్షరయుగంబు
నుండు జీవేశ్వరులమాడ్కి నెడవిడక 147

శా. ఈ రెండక్షరముల్ త్రిలోకములఁ బాలింపంగ భక్తావళిం
గారుణ్యంబునఁబ్రోవఁగా నరుఁడనన్ నారాయణుండో యనన్
సారోద్భక్తి సతీమణీశ్రవణ భూషాయుగ్మమో విశ్వసా
ఖ్యారంభం బొనరించి కావనుతురాడాదిత్యులో నాఁదగున్ 148

ఆ. ముక్తియనెడు నమృతమున స్వాదుసంతోష
యుగ్మ మవనిమోయ నురగ కచ్ఛ
పములు భక్తహృదయ పంకజ భృంగముల్
జిహ్వానంద సతికి సిరిహారియు 149

ఆ. సర్వవర్ణములకు జానకీ వరనామ
వర్ణయుగళమందుఁబరఁగ నొకటి
ఛత్రిమగుచు నొకటి సౌందర్యతరమగు
ముకుటరత్నమగుచుఁ బొలుపెసంగు 150

క. స్వామియు సేవకుఁడు ననన్
నామియెడన్ నామమునఁ గనంబడుఁ బ్రీతుల్
ధీమహితుల కథనీయం
బౌమాయఁగ నామరూప యమళమెఱుఁగరే 151

ఆ. నామరూపముల ఘనంబదియననేల
సాధుజనులు వానిసరణిఁ గందు
రరయ నామవశత నలరురూపంబు త
జ్జ్ఞానమొదవు నామసంస్మరణన. 152

క. కరతలగతరూపం బెఱుఁ
గరు నామముఁదెలియకున్నఁ గానని రూప
స్ఫురణంబగుఁ దన్నామ
స్మరణంబునఁబొడము స్నేహసద్భావమెదన్ 153

తే. నామరూపగ్రహణ విధానము సుఖదము
కాని పలుక నశక్యమహా కలితసగుణ
నిర్గుణములకు సాక్షి మానితపదద్వ
యార్థబోధకమగునామమది ధ్రువంబు 154

క. బహిరంతస్తమ మడఁపన్
రహిఁనిల్పుము రామనామ రమ్యజ్యోతిన్
గృహ జిహ్వాద్వారంబున
సహజ ద్యుతులొలయ వెలుఁగు సంతతకాంతిన్ 155

తే. జిహ్వచే నామజపమొనర్చెడు సుయోగి
జనులు జగమందుదాసీన ఘనవిరాగ
పరత ననుపమబ్రహ్మానుభవ సుఖంబు
నామరూపరహిత నిధానంబుగందు 156

తే. ఈశ్వరుని గూఢతత్వంబు నెవ్వరెఱుఁగఁ
గోరుదురో వారుజిహ్వచేఁ గూర్మి నామ
జపమొనర్చియె పరమవిజ్ఞానులగుచు
సిద్ధిగాంచెద రణిమాదిసిద్ధులంది 157

ఉ. సంతత రామనామజపసక్తుఁడు ముక్తసమస్తకష్టుఁడై
సంతసమొందు నిత్యసుఖసంతతిఁగాంచి ప్రపంచమందు ధీ
మంతులు పుణ్యవంతులు శమప్రముఖేద్యగుణాఢ్యు లుర్వీజా
కాంతుని భక్తులుందురు వికారవిహీనులు నాల్గురీతులన్ 158

శా. బోధానందద రామనామము సతంబుందచ్చతుర్మార్గ భ
క్తాధారంబగుఁగాని జ్ఞానియగుభక్తశ్రేష్ఠుఁడాజానకీ
నాధాతిప్రియుఁడౌఁ జతుర్యుగశ్రుతుల్ నామప్రభావంబు స
న్మేధంబాడుగలిం దదన్యమిఁక లేనేలేదుపాయంబిలన్ 159

ఆ. రామచంద్రభక్తిరసమగ్నులా నామ
రససుధాసరోవరమున నాత్మ
హృదయ మీనకోటిముదమున నీదంగ
ననుపమాన సౌఖ్యమందుచుంద్రు 160

తే. సగుణ నిర్గుణరూపక యుగళ మీశ్వ
రున కనాదిగవిలసిల్లు ననుపమయి
సగుణ నిర్గుణములను వశముగఁజేయు
నామమధికంబు పరికింప నామతమున 161

ఉ. దారువునందు నగ్నిక్రియ దానిపయింగల వీతిహోత్రు నా
కారములీల నిర్గుణముగా నగనౌ సగుణంబుఁదోఁచు నీ
తీరున సంతతంబు గడిదేఱిన బ్రహ్మవిదుల్ మనోస్థితిం
గోరి తలంచుచుందురు కూరిమియున్ రుచినాకుదీనిపై 162

క. నామంబున నీరెండును
నామిగులన్ సుగమములుగ నా హేతువుచే
రామ బ్రహ్మలకంటెన్
నామంబుం ఘనముగాఁగ నమ్మి భజింతున్ 163

తే. నాశరహితుం డజుఁడగు నానందరాశి
హృదయములనుండియును బ్రాణులెపుడు దీన
దుఃఖభాజనులగుచునుందురు రమేశు
నామమునఁ గ్లేశరాశి వినాశమొందు 164

క. రతనమువలనన్ మూల్యము
మతిగోచరమగు విధమున మధురిపునామం
బతిరతి జపియించిన నా
కృతియున్ సన్నిహితమగుచుఁ గెలనందోఁచున్ 165

తే. ఈప్రకారంబునన్ నిర్గుణేశుకంటె
నామమహిమం బపారఘనంబు గాఁగ
నామనంబున భావించి రాముకంటెఁ
దన్మధురనామజప పవిత్రిత నుతింతు 166

ఉ. రాముఁడు భక్తకోటికిఁ గరంబు శుభంబొనగూర్పఁ గోమల
శ్యామశరీరధారియయి సంకటముల్ సహించి సాధుబృం
దామిత సౌఖ్యదుండయి విహారమొనర్చెను దత్పవిత్రకృ
న్నామజపంబు భక్తులనునంద శుభాలయులం బొనర్చెడే 167

క. రాముఁ డహల్యం బావన
గా మున్నొనరించె ఘోరకాననమునఁ ద
న్నామముకోటుల కొలఁదిగఁ
బామరదుష్టులకు బుద్ధిఁ బవిమలఁజేసెన్ 168

క. రాముఁడు మునిహితమతియై
కామినిని సపుత్రిఁ దాటకం దునిమెను త
న్నామము నిశరవిగతిఁ జెను
బాముల భక్తులమరాశ భంగమొనర్చున్ 169

క. రాముఁడు శివకోదండముఁ
గోమలపాణిఁగొని విఱచె గురుతరమగు త
న్నామము భవభయ బిసవన
సామజమై శాశ్వతంపు సౌఖ్యమునిడదే 170

క. రాముఁడు దండకవన మ
త్యామోదకరముగఁజేసె నతని మధురస
న్నామంబు భక్తజనహృ
త్తామసము నడంచి విమలతంగావించున్ 171

క. రాముఁడు రాక్షసతతి సం
గ్రామంబున సంహరించె ఘనతరమగు త
న్నామము కలియుగ కలుష
స్తోమంబు నశింపఁజేసి శుభములొసంగున్ 172

క. రాముఁడు శబరి జటాయువుఁ
బామరతం బాపి మోక్షపదమునొసఁగెఁ ద
న్నామ మనేకదురాత్ముల
సేమంబున నుద్ధరించె స్థిరమిడిశ్రుతులన్ 173

క. రాముం డినజ విభీషణ
కామితములొసంగి వారిఁగాచెం గృపఁ ద
న్నామం బగణిత దీనులఁ
బ్రేమమునఁ దరింపఁజేసెఁ బృథుతరకీర్తిన్ 174

క. రాముఁడు భల్లూకేంద్రవ
లీముఖులం గూర్చి జలధి లీలం గట్టెన్
నామము సంసృతివనధి
స్తోమమునింకించుదీని సుజనులెఱుఁగుఁడా. 175

ఉ. రాముఁడు సాప్తమిత్త్రముగ రావణుఁబోరవధించి వేడుకం
భూమిసుతాసమేతుఁడయి పుష్పకమెక్కి యయోధ్యకేగి భ
క్తామర పాదపంబగుచు నందఱనేలె సురాములాపరం
ధాము నపారసద్యశుఁ దన్మయులై కొనియాడిపాడఁగన్ 176

తే. నరులు భక్తి రామనామంబు స్మరియించి
ప్రబలమోహాసేన వ్రాల్పఁగలరు
ప్రేమమగ్నులగుచు నామప్రభావంబు
వలన స్వప్నమునను వనటఁగనరు 177

క. శతకోటి చరిత్రంబుల
వెతకి మహేశుండు రామవిస్ఫుటనామం
బతిభక్తిగ్రహించె సుర
ప్రతతికి నిష్ఠార వివిధవరదంబగుటన్ 178

క. నామప్రభావమున ధృత
సోముం డవినాశియయ్యె శుభకరుఁడయ్యెం
గామరహిత శుక సనక మ
హామునులుంగనిరి శాశ్వతానందంబున్ 179

శా. నామధ్యానపరాయణుండగుటచే నారాయణార్ధేందుజూ
టామోదంబునుబొందె నారదుఁడు పేరందెన్ శిరోరత్నమై
భూమీజావిభు భక్తబృందమున నంభోజాక్ష నామామృత
ప్రేమాస్వాదన తత్పరుండగుచు శౌరింగాంచెఁ బ్రహ్లాదుఁడున్ 180

క. ధ్రువుఁ డవమానమువడి కే
శవనామజపంబొనర్చి శాశ్వతపదముం
దివిజస్తుతముగఁ బడసెం
బవనజుఁడుం దాన రామవశునిగఁ జేసెన్ 181

చ. కరియు నజామిళుండు గణికాముఖు లచ్యుతుదివ్యనామసం
స్మరణమొనర్చి ముక్తిరమసౌధము నెక్కిరి నామమంత్రరా
ట్పరమమహత్త్వమెంతయని పల్కఁగనోపుదు రామచంద్రుఁడే
నిరుపమితాత్మనామ మహనీయగుణంబు గణింపలేఁడనన్ 182

చ. కలియుగమంగళాకరము కల్పమహీజము రామనామ మా
సలలితనామ సంస్మరణసల్పియెభంగు మహీరుహంబునాఁ
బలుకఁగ నప్పుఁడైమిగులఁ బామరుఁడౌ తులసీసమాఖ్యుఁడుం
దులసికుజంబునాఁ బరఁగె నూనముగాదు మదీయభాగ్యమున్ 183

చ. త్రిజగములం ద్రికాలముల ధీయుతులెల్లఁ జతుర్యుగంబులం
భజనమొనర్చి రామపదపంకజసేవ విముక్తశోకులై
వృజినములెల్లఁ బాయుదురు వేదపురాణమునీంద్ర సాధురా
డ్ద్విజము సమస్తపుణ్యఫలరాశిగనెంతురు రామభక్తినే 184

చ. కృతయుగమందు ధ్యానమునఁ ద్రేతను యజ్ఞములాచరించుటం
దతమతిఁ బూజసేయుటను ద్వాపరమందునసీశుఁ డిష్టుఁడౌ
నతికలుషాత్మ మానములకంబుధియౌ కలికాలమందు శ్రీ
పతి వరనామసంస్మరణ భవ్యసుఖంబిడుఁ గల్పవృక్షమై 185

ఉ. కామితదాయకంబుఁ గలికాలమునం బరసౌఖ్యదంబు శ్రీ
రామునిదివ్యనామ మతిరమ్యమిహంబునఁ దల్లిదండ్రులై
నోముసు జ్ఞానకర్మములు మానసముతో కలికాలనేమికిన్
నామజపంబు మారుతియనందగు సజ్జనకల్పభూజమై 186

క. కలియుగ హిరణ్యకశిపుం
బొలియించి స్మరించువాని పుత్రసముల న
ర్మిలిఁబ్రోచు రామనామము
బలయుత నరసింహమూర్తి భాతినభీతిన్ 187

చ. అలసతనైన వైరముననైనను మూర్ఖతనైనఁ బ్రీతిచే
విలసితభక్తినైన నరవిందదళాక్షుని సంస్మరించినం
గలితశుభంబు దిగ్దశముఖంబులఁగల్గుఁ దదీయనామముం
దలఁచి నమస్కరించి హరితత్పరతన్ లిఖయింతుఁగావ్యమున్ 188

క. రాముఁడు నాయీకృతి నభి
రామంబుగఁజేయు నత్వరమ బహువిఘ్న
స్తోమము సెడుఁ దత్కృప నా
స్వామికి నావంటి హీనజడ సేవకుఁడే 189

క. కాని దయానిధి నన్ను న
నూనకృపాదృష్టిఁగని మనోహరతరమౌ
నీనామాక్షరయుగళము
నానాలుకఁ బాయనీక నడపింపఁగదే 190

ఉ. లోకములందు వేదములలో నృపురీతి ప్రసిద్ధమయ్యె నా
లోకిత సర్వమానవకులుండయి వారలనాదరించు సు
శ్లోకులుఁ బండితాతి జడశుద్ధమలీమస నిర్ధనుల్ ధనుల్
కాకవులార్యసత్కవులు గ్రామనివాసులు నాగరుల్ సతుల్ 191

ఉ. రాజుఁ బ్రశంస సేయఁగడుఁ బ్రాభిమఁ బ్రీతి నెఱింగి వారి స్వ
ఖ్యాభిము నాగఁడన్న నృపపుంగవుఁ డీశ్వరసత్కళాంశుఁడై
యీజగతిం జనించును బరేంగితవేది సుశీలుఁ డార్యుఁడుం
భ్రాజితసద్దయాకరుఁడుఁ బ్రాజ్ఞుఁడునై యశమొందుఁ బొందుగన్ 192

ఉ. రాజనఁ గేవలుండె రఘురాముఁడు కోసలచక్రవర్తి భూ
రాజశిరోవతంసమణి రాజితకీర్తి విశుద్ధమూర్తి ని
ర్వ్యాజకృపాకటాక్షమున నాశ్రితవర్గము నేలు ప్రోడనా
నైజగుణంబు నీచమనినన్ గరుణామతిఁ బ్రోవకుండునే 193

క. శిలలం జలమున దేలిచి
వలనుగ గపి భల్లుకముల వరమంత్రులుగా
నలిపిన కరుణానిధి నను
మలినమతిం దుష్టభృత్యు మనుపక యున్నే 194

క. సీతాపతివంటి మహా
ఖ్యాతప్రభు సేవకుఁడనుగా నున్న యప
ఖ్యాతి సహింయించె రాముం
డాతనిదాసునిగ నేను నందఱుఃబలుకన్ 195

ఆ. అస్మదీయ బహుతరాఘరాశిని విని
నరకమును బిగించు నాసికంబు
నదితలంచి నేభయంబందుదును రామ
భద్రుఁ డదితలఁపడు స్వప్నమునను 196

ఆ. సహజముగను రామచంద్రుండు భక్తుల
భక్తి కాత్మ మెచ్చుఁ బరమకృపను
నాదు స్వల్పభక్తి నా దేవుఁ డీక్షించు
ప్రేమభరితదృష్టి వెల్లివిరియ 197

క. ఏపాపమునకు వాలిం
గోపంబున వ్యాధుఁడనఁగఁ గొట్టెను రాముం
డాపాపియె సుగ్రీవుఁడు
లోపముఁ దలఁపఁడు సుభక్తి లోతుగణించున్ 198

తే. అట్టిక్రియనె విభీషణుఁ డాచరించె
గాని కలనైన నెంచెనే దాని విభుఁడు
భరతుఁ గనినయపుడు సభాభవనమందుఁ
గడుఁ బ్రశంసించి మెచ్చె రాక్షసవరేణ్యు 199

క. తరుశాఖల వానరతతి
చరియింపఁగఁ గ్రింద రామచంద్రుండుండెం
బరికించెఁ దనసమంబుగ
ధరఁగలరే శీలమునను దాశరథిసముల్ 200

క. ఓతండ్రి రామచంద్రా
సీతృప్తియె సకలభువన నివహానందం
బీతులసీదాసున కతు
లాతతముద మొదవు నిది యథార్థంబైనన్ 201

ఆ. ఈప్రకారమున వచించి మద్గుణదోష
ములను నెల్లరకును మ్రొక్కులిడుచు
రామచంద్రకీర్తి రహిమీరావర్ణింతుఁ
గలియుగాఘవిటపిఁ గాల్చుశిఖిని 202

—! కథామహిమాభి వర్ణనము :—

ఆ. యాజ్ఞవల్క్యుఁడెలమి నందహాకథ భర
ద్వాజమునికిఁ జెప్పెఁదచ్చరిత్ర
విస్తరించి రామవిభు మ్రొక్కి చెప్పెద
సజ్జనులు వినుండు సంతసమున 203

ఆ. ఆది నతిపవిత్రమైన యీశ్రీరామ
సచ్చరిత్రఁజెప్పి శంభుఁడు మఱఁ
బరమభక్తుఁడనుచుఁ బదఁపడి కాగభు
శుండికొసఁగె దాని శూలపాణి 204

ఆ. యాజ్ఞవల్క్యునకు దయామతినుపదేశ
మిచ్చె నాతఁడాతఁ డెలమిమీఱ
హరి రహస్యవేదియని భరద్వాజున
కానతిచ్చె నుభయులఘునుతులె 205

క. జ్ఞానమునఁ ద్రికాలంబుల
నానియతులుగాంచి కరతలామలకముగన్
మానులితరు లాచరితము
నానందమునన్ వినిరి తదార్యులవలనన్ 206

తే. సూకరక్షేత్రమున నేను శుభకరంపు
రామచరితంబు మద్గురుస్వామివలన
వింటినైనను జ్ఞానంబు నెలయకునికి
బాల్యదశయౌట దాని ప్రభావమెఱుఁగ 207

తే. వక్తయును శ్రోతయును జ్ఞానవనధులగుచు
నుండవలె రామకథ గూఢమూహఁజేయఁ
గలికలుషరాశిఁజిక్కి మూర్ఖత మెలంగు
కష్టజీవిని గ్రహియింపగలనె నేను 208

తే. సారెసారెకు నాచార్యసత్తముండు
బోధయొనరించె మదినాటఁ బుణ్యకథను
దానిఁగవితాస్వరూపంబుగానొనర్తుఁ
బ్రీతియగు రొత్తజ్ఞానంబు విస్తరిల్ల 209

ఆ. నాదుబుద్ధికొలఁది నారాయణ ప్రేర
ణమునఁ జెప్పవాఁడ నాదుభ్రమను
మోహసంశయముల మొదలంటమాపు సం
సృతి సరిత్తరణిని శ్రీశుకథను 210

ఆ. విబుధవరులకెల్ల విశ్రాంతిహేతువు
సకలమనుజులకుఁ బ్రసన్నకరము
కలియుగాఘసర్పగణమునకు భరణి
జ్ఞానవహ్నికరణి చక్రిచరిత 211

ఆ. కలియుగమున రామకథ కామధేనువు
నవనితలమునందు నమృతతటిని
సజ్జనావళికిని సంజీవిమూలిక
భ్రాంతిభేకభుజగి భయహరంబు 212

ఆ. కలితసాధువిబుధ కల్యాణకరగౌరి
నరకదైత్యసైన్య నాశకరము
సజ్జనామృతాబ్ధి సంజాతలక్ష్మి సం
సారభారభరణ శక్తిధరణి 213

ఆ. కాలుదూతలకు ముఖముఁ గప్పుజమున జీ
వన్ముక్తినొసఁగ వారణాశి
రామచంద్రుమనసు రంజించుతులసి శ్రీ
తులసిదాసునకును హులసి మాత 214

ఆ. సకలసిద్ధి సౌఖ్య సంపత్తి ఖని యిందు
ధరుని కిష్ట నర్మదాసమంబు
నదితిసమము శుభగుణామరవరులకు
రామభక్తి ప్రేమరాశిసీమ 215

ఆ. మహిత రామచరిత మందాకినీనది
జానకీయుతముగ సంచరించె
రాముఁ డమలచిత్త రాజిత చిత్రకూ
టాద్రి స్నేహవనమునందు నెలమి 216

ఆ. రామ సుగుణరత్న రాజిజగన్మంగ
ళధన ధర్మమోక్షలాభ దాయ
కంబు రామచరిత కమ్ర చింతామణి
సుజనబుద్ధి సతికి సొంపునింపు 217

తే. జ్ఞానవైరాగ్యయోగద సద్గురుండు
సంసరణ రోగదివిజ భిషగ్వరుండు
జానకీరామకృపఁగన జనని పితయు
రామకథ బీజమగు ధర్మవ్రతతతులకు 218

తే. పాపసంతాప శోకవిధ్వంసకంబు
నిహపరంబులఁ బ్రీతిఁ బాలించు ఱేఁడు
సద్విచారావనీవిభు సచివవరుఁడు
ఘోరలోభార్ణవమునకుఁ గుంభజుండు 219

క. కామక్రోధముఖోన్మద
సామజములు భక్తహృదయ సాంద్రాటవిను
ద్దామగతిఁ దిరుగఁగా శ్రీ
రామునికథ సింగమై త్వరం బరిమార్చున్ 220

క. శ్రీరామచరిత శివునకు
గౌరవపాత్రమగు నతిథి కడుఘోరంబౌ
దారిద్ర్యదావ వహ్నిని
వారిధరంబగుచునార్చు వాంఛాప్రదమై 221

ఆ. విషయసర్పములకు విమలమంత్రము మహా
మణియు నుదిటివ్రాత మాయఁజేయు
మోహతిమిరనికరమున కర్కరుచిభక్త
శాలి సస్యమునకు జలధరంబు 222

ఆ. అభిమతంబులొసఁగు నమరద్రుమములీల
సేవసేయవిష్ణు శివులకరణి
సుఖకరంబు సుకవి సుందరహృచ్ఛర
త్కాల గగన తారకాగణంబు 223

తే. భక్తజనకోటికెల్ల జీవనధనంబు
పుణ్యఫలరూప బహువిధభోగసమితి
సకలశుభకర నిరుపాధి సాధుసమము
హరి పరాత్మమానస సరోవరమరాళి 224

తే. పావనసురాపగాఝరీ భంగమాల
కుటిలపాషండదాంభిక కుపథతర్క
ముఖ సమితికోటిఁ గాల్పఁ రామునివిశుద్ధ
గుణగణంబు ప్రచండాగ్నికణసమంబు 225

ఆ. రామచరితమనెడు రాకేందుకిరణాళి
సకలజనములకును సౌఖ్యకరము
కాని సుజనకుముద గణచకోరవ్రజా
త్యంతలాభసౌఖ్య హర్షదంబు 226

ఆ. ఏప్రకారమున నుమేశు నుమాదేవి
ప్రశ్నచేసె దానిఁ బరమశివ్వుఁడు
విస్తరించి చెప్పె విపులప్రబంధంబు
గానొనర్తు నట్టికథను భక్తి 227

ఆ. ఎవరువిముఖులగుదు రీకథవిన వార
లబ్బురంబుఁజెంద రలఘుతర వి
వేకసంతులిది యలౌకికంబని విని
వెఱఁగుపడరు దీనివిధమెఱింగి 228

ఆ. జ్ఞానులకును మదిని బాలవిశ్వాసంబు
రామచరితపార రహితమనుచు
బహుప్రకార రామభద్రావతార ది
వ్యకథ నూఱుకోట్ల కపరిమితము 229

ఆ. కల్పభేదవిధిని గానంబొనర్చిరి
మునులు హరిచరిత్ర మూలమెఱిఁగి
కాన దీని మదిని గడువిచారించి ని
శ్శంకులగుచు వినఁగఁ జనును ప్రీతి 230

క. రాముఁ డనంతుఁడు సుగుణ
స్తోమంబు ననంతమతని స్తుతచరితముని
స్సీమము విమలవివేకులు
ప్రేమంబున నాలకించి వెఱఁగుపడరెదన్ 231

ఆ. ఈవిధమునఁ బొడము నెల్ల సందేహముల్
దొలఁగ గురునిపాదధూళిశిరము
నందుఁదాల్చి వినతి నందఱఁగోల్తుఁ గా
వ్యంబు దోషరహిత మగుటకొఱకు 232

ఆ. శివునిపదయుగమున శిరముంచి జానకీ
వరుని సత్కథాభివర్ణనంబు
నాచరింతుఁ బదియు నాఱువందలయేండ్ల
పైని ముప్పదొకటవదగు నేట 233

క. తులసీదాసుం డొనరిచె
నెలమిన్ శ్రీరామచరిత హిందీభాషన్
సలలితముగ దెలిఁగింపం
గలవాఁడం దానినే జగన్నాథుండన్ 234

క. పదితొమ్మిదివందల నలు
బదియవ హాయనాబ్దరామ పావన నవమిన్
మొదలిడి యాంధ్రంబున వ్రా
సెదఁ దులసీరామచరిత శ్రీనాథుకృపన్ 235

ఆ. చైత్రశుద్ధనవమి సకలమంగళకర
రామజన్మవిమల ధామవాస
రమున మొదలువెట్టె రహిఁ దులసీదాసు
నేను నట్టిదినము నిర్ణయించి 236

క. వ్రాయందొడఁగితి సజ్జన
గేయంబౌ రామచరిత్రఁ గేశవభక్తిం
బాయని దృఢచిత్తంబున
నాయనుపమభాగ్యమెన్న నాతరమగునే 237

ఆ. చల్లనైన రామజన్మం బయోధ్యలోఁ
బ్రకటమయ్యె భువనపర్వమగుచు
సకలతీర్థములును జనుదెంచెనచటికి
నట్టిదినము నాకు ననువుపడియె 238

క. సుర నర రాక్షస ఫణి ఖగ
వరమునిసిద్ధులునువచ్చి వైదేహీహృ
త్సరసిజమిత్రున్ సేవిం
తురు తద్గుణగానసంస్తుతుల నొనరుచుచున్ 239

క. చతురమతులు జన్మోత్సవ
ఘుతులితవైభవమువిూఁఅ నానందం బు
ప్పతిలంజేయుదు రార్యులు
తతసరయూస్నాన దానతత్పరులగుచున్ 240

క. శ్యామల కోమలదేహుని
రాముం బరిశుద్ధహృదయరాజీవమునన్
నేమమున నిలిపి ధ్యానము
నామజపం బతులమతి నొనర్తురు భక్తిన్ 241

తే. దర్శన స్పర్శన స్నాన తత్పవిత్ర
సలిలపానంబునను బాపచయమడంగు
ననియె వేదపురాణంబులన్న దీని
మాత్మ్యమెన్నంగ వాణికి నలవియగునె 242

తే. రామధామ మయోధ్య శ్రీరామ కిరవు
లోకపావని విష్ణుసాలోక్య మొసఁగు
భువిఁ జతుర్విధజీవు లప్పురమునందుఁ
దనువువిడువఁ బునర్జన్మ నెనయఁబోరు 243

తే. కడుమనోహర మంగళాకర మయోధ్య
సకలసిద్ధిప్రదంబని జానకీ శు
చరిత వ్రాయందొడంగితి శ్రవణమాత్రిఁ
గామ మద దంభ ముఖ్యాళిఁ గడపుదాని 244

తే. రామచరిత మానసమను నామమునఁ బ్ర
సిద్ధమిది విన విశ్రాంతిఁ జెందుఁ జెవులు
దీన విషయానలాటవిఁ దిరుగుహృదయ
కరి సరసిఁ దేలుకరణి సుఖంబునొందు 245

తే. సంయమి ప్రియమగు రామచరిత మాన
సంబు విమలంబు రచియించె శంకరుండు
దుఃఖ దారిద్ర్య పాపసందోహ మడఁచుఁ
గలికలుష సర్వనిర్మూలకము శుభదము 246

ఆ. భవుఁడొనర్చి దీని భద్రంబుగా మాన
సమున నిలిపి తగినసమయ మెఱిఁగి
యుమకుఁ జెప్పె దీనికుచితనామము రామ
చరిత మానసమని శంభుఁ డిడియె 247

తే. దానినే నేను సుందరంబౌన నంత
సుఖమొసంగెడి కథఁ దెల్పుచుంటిఁ గాన
సావధానమనస్కులై సంతసమున
నాలకింపుఁడు సజ్జనులైనవారు 248

—: రామాయణ కథా సంగ్రహ వర్ణనము :—

ఆ. రామచరిత మానసామలయశ మేప్ర
కారమునను నెట్టి కారణమున
విస్తరించె జగతి విశదంబుగా నట్టి
కథ వచింతు శివుని గౌరిఁదలఁచి 249

ఆ. శివకటాక్షమునను జెంది సబుద్ధిచే
రామచరిత సుందరముగఁ జెప్పెఁ
దుష్టిఁ జిత్తమలరఁ దులసీమహాకవి
చిత్తగింపుఁ డెలమి శిష్టజనులు 250

తే. రామ యశమను శుభద వర్షంబుగురియు
బుద్ధియను సుందరంబగు పుడమిమీఁద
మదియగాధంబు వేదాగమములు వనధి
సాధుగణము ప్రావృట్కాల జలదసమితి 251

తే. సగుణ లీలాభివర్ణన సదమలంబు
నాచరించు జలస్వచ్ఛమనఁగఁదగును
వర్ణనాతీత ప్రేమయు భక్తియునగు
జీవనంబున మధురత శీతలతయు 252

తే. ఈజలము పుణ్యగణ సస్యహితకరంబు
జీవనము రామపదభక్త శ్రేణి కెపుడు
బుద్ధియను ధరఁబడి శ్రవస్స్ఫుటపథమున
నరిగి మానసమను ఘనసరసినింపు 253

ఆ. అచట మిగులస్వచ్ఛమై సుందరంబయి
రుచియనంగఁ గడునిరూఢి మెఱయు
రమ్యమైన వరశరత్కాలమందున
సౌఖ్యదాయియై ప్రశస్తిఁగాంచు 254

ఆ. చారుబుద్ధిఁ గడువిచారంబు గావించి
పార్వతికి శివుండు పలికినట్టి
సంయమీంద్ర చతురసంవాద మంబుజా
కరమునందు నాల్గుఘట్టములగు 255

ఆ. తత్సరోవరమున ధరణీసుతానాథు
మహిమ మతిగభీర మధురజలము
చరితమందు వెలయు సప్తకాండములు సో
పానపంక్తి తోఁచు జ్ఞానదృష్టి 256

తే. ధాత్రిజా రామకీర్తిసుధయె జలంబు
మానసోల్లాస రమ్యోపమంబు లలలు
పద్యపాదంబు లంబుజవల్లి కావ
సంబు యుక్తులు శుక్తులు నాఁజెలంగు 257

ఆ. చంపకోత్పలాది సద్వృత్తజాతులు
వివిధ వర్ణకలిత బిసరుహంబు
లనుపమార్థ భావహారిభావలు పరా
గంబు మధురసంబు గంధమగును 258

తే. పుణ్యపుంజంబు భ్రమర సమూహమగును
జ్ఞాన వైరాగ్యయోచనల్ చారుహంస
లక్రమోక్తులు ధ్వనులు నిత్యాది కవితఁ
బరఁగు గుణజాతులొప్పు నంభశ్చరములు 259

క. నిర్మల విచారమంగళ
కర్మ జప తపోనుయోగగతి నవరస స
ద్ధర్మార్థ కామమోక్షము
లూర్ములుఁగల సరసిఁదిరుగు నురుజలచరముల్ 260

ఆ. సాధు పుణ్యనామ సద్గుణగానముల్
జల విహంగతతి సుజన సభాళి
నాల్గుదెసలఁబరఁగు నవరసాలవనాళి
శ్రద్ధయనునదే వసంతఋతువు 261

తే. వివిధ భక్తినిరూపణ విధము క్షమయు
దయయు వృక్షలతాదులై తనరుచుండు
శమ నియమ యమములు పూలు జ్ఞానఫలము
రసము హరిపదప్రియమనేఁ బ్రాఁజదువులు 262

క. మధురకథాన్యోన్య శ్రిత
సుధాతులితమగు ప్రసంగ శుక పికముఖముల్
మధుమాస వాసరంబులఁ
బథికుల కానంద మొసఁగుఁ బాదపములపై 263

ఆ. కథను వినుటవలనఁ గలుగు రోమాంచము
లచటి పుష్పవాటికాంకురములు
సుఖము విహగకేళి సుందరాశ్రుజలంబు
సేచనంబు సేయుఁ జిత్తమాలి 264

తే. ఎవ్వరీకథఁ బాడుదు రింపుమీఱ
వారు రక్షకు లీసరోవరమునకును
సంతతముఁ బ్రీతివినియెడిసతులుఁ బురుషు
లర్హ్వసురలీ మనోవారిజాకరమున 265

తే. విషయలోలురు దుష్టులీవిమలసరసి
వలనునకుఁ బోఁదగని బకవాయసములు
నత్తలుం గప్పలును నాచు నాఁగఁబరఁగు
విషయ బహురసకథలిందు వెదుకలేవు 266

ఆ. కాన విషయలోల కాక బకోపముల్
కొలనుజేర భీతిఁగొందురెదను
రామచంద్రు కరుణరాక కాసారంబు
దరియుటనఁగఁ గష్టతమముగాదె 267

తే. ఘోరదుస్సంగమే పెడదారియగును
వారిపలుకులు సింహ దుర్వ్యాఘ్ర సర్ప
సమము లిలుదీర్చుశ్రమలు దుర్గమగిరులు మ
దమును మోహంబటవికుతర్కములు నదులు 268

తే. ఎవరికడ శ్రద్ధయనెడి పాథేయముండ
దెవరు సజ్జనసంగతి నెనయఁబోవ
రెవరు రామాప్రియులు వారికీశుచరిత
మానస సరోవరం బగమ్యంబుగాదె 269

క. ఒకవేళ నెవ్వఁడేనియు
సకలక్లేశముల సైచి సరసి దరిసెఁన్
వికలత శీతజ్వరమొం
ది కడుం జలిస్నానమందు దిగులున మానున్ 270

క. నిద్రయె శీతజ్వరమా
క్షుద్రనరుఁ మూర్ఖతయె మిగులఁ గఠినంబౌ
హృద్రోగతుల్యశీతము
ముద్రితనేత్రుఁడయి మునుఁగఁబోవఁడు సరసిన్ 271

తే. స్నానముం జేయ కందలి జలముఁ గ్రోల
కరుగు బింబిర దురభిమానాత్ముఁడగుచు
నేలమానితివని యెవ్వరేని యడుగ
నీరజాకరమును గడునిందసేయు 272

తే. ఎవని రాముఁడు గనుఁ గటాక్షేక్షణముల
వానికే విఘ్నములు రావు వారిఁ దోఁగ
నాదరంబున స్నానంబు నాచరించి
కఠిన తాపత్రయాగ్నిచేఁ గ్రాఁగఁబోఁడు 273

తే. ఎవరు శ్రీరామచరణ సేవేచ్ఛనుందు
రానరులు వాయరెపు డాజలాశయంబు
స్నానమొనరించు నాతఁడే సాధుజనుల
పొందుఁ గావించు నిజమనఃపూర్వకముగ 274

తే. ఏసరసిఁ గ్రుంకఁ గవి బుద్ధి యొసఁగె విమల
మగుచు నుత్సాహ మానంద మతిశయిల్లె
నమలమైన ప్రియప్రవాహంబు పొంగె
దానిఁ గనుఁగొన జ్ఞాననేత్రంబు వలయు 275

తే. ఉజ్జ్వలంబగు రామయశోదకమునఁ
బూర్ణమగు సరయూనామ పుణ్యతటిని
రీతిఁ బ్రవహించు కవితారఘుకీర్తితటములు
లోకవేదమతమ్ములై వెలుంగుచుండు 276

తే. రామచరిత మానసమను రమ్యతటిని
పావనానందదాయకంబై వెలుంగుఁ
గలియుగమహాఘరూప వృక్షముల నెల్ల
వ్రేళ్లతోడనె పెకలించి వెడలనడఁచు 277

తే. త్రివిధమగుశ్రోతలా నదీతీరమందు
వెలయు పుర నగర గ్రామ వితతియనఁగ
నుందు రతిసాధుసభయగునం దయోధ్య
యనుపమ శుభాలవాలమై యలరుచుండు 278

ఆ. రామభక్తియను సురస్రవంతిని లోనఁ
గీర్తి సరయు వేగి కెరలి కలిసె
ననుజసహిత రఘువరాహవ యశమను
శోణనదియుఁ గలిసె సొంపుమీఱ 279

ఆ భక్తిరూపగంగ పావనవైరాగ్య
వరవిచారసహిత భాసురమయి
త్రివిధపాపములను త్రినదీముఖంబుల
నడఁచి రాముఁడనెడి యబ్ధిఁగలియు 280

క. క్షమ సరయూమూలము శ
స్త్రము రామచరిత్ర మానసంబయ్యది పూ
తముఁ జేయు శ్రోతృమనము న
ద్రుమ చిత్రవిభాగములు తటులఁగల వనముల్ 281

ఆ. పార్వతీ శివుల వివాహమహోత్సవం
బగణితాంబుచర కులావళియగు
రామచంద్రు జన్మరమ్యోత్సవము బంభ
రములుఁ జారుతర తరంగములును 282

తే. బాలచరితంబు బహువర్ణపద్మరాజి
పుణ్యరాజన్య దశరథముఖ్యులును ద
దీయభార్యలుఁ జక్కని తేటిగములు
నందమైయొప్పు సలిలవిహంగతతులు 283

క. సీతా స్వయంవరంబను
ఖ్యాతంబౌ కథయెవరికి నందంబొసఁగుం
జాతుర్యప్రశ్నంబులు
నాతటి నుత్తరములోడలా నావికులా 284

తే. ఆలకించి పరస్పరం బాడుకొనెడు
వార్తలే యాత్రికులగుంపు పరశురాము
నాగ్రహము తీవ్రమగుప్రవాహంబు రాము
నమృతమయ వాక్కులే ఘట్టమైతనర్చు 285

క. సానుజరామ వివాహం
బానదిఁగల తరఁగలందు నవగాహనముం
బూని యొనరింతు రదివిని
మేనుల రోమాంచమొసఁగ మెచ్చెడివారల్ 286

ఆ. రామరాజ్యతిలక రమ్యసన్నాహహోత్స
వంబు పర్వతీర్థవాస సమితి
కైకదుష్టబుద్ధి కడువిపత్తునుగూర్చు
మెట్లు జాఱనర్చు మీఁదినాచు 287

క. సకల మహోత్పాతంబుల
వికలత నొందించు భరతవీరుని భక్తిం
బకలుష యజ్ఞ జపంబులు
బక శాకము లఘుము దుష్టపాపగుణములున్ 288

ఆ. ఆఱుఋతువులందు నందమై పూతమై
కర్తి నదిచెలంగు గిరిసుతా మ
హేశ పరిణయంబు హేమంతఋతువు శ్రీ
రామజన్మ భాసురము శిశిరము 289

తే. జానకీరామ కల్యాణచరిత మంగ
ళాకరంబగు ఋతురాజమౌ వసంత
మినకులోత్తంసు వనయాత్రయే మహోగ్ర
మైన గ్రీష్మంబు వడగాడ్పులచటికథలు 290

తే. సురలనేడి సస్యములకతి సుఖదమైన
రామ రాక్షసరణమె వర్షర్తువగును
జల్లనగు రామరాజ్యమే శరదృతువగు
జానకీ సద్గుణాళియే జలవిమలత 291

తే. భరతు నమలస్వభావమే వర్ణనమున
కలవికానట్టి సలిల శీతలతయగును
జతురసౌభ్రాత్రమా చతుష్టయమునందుఁ
గలదదియె జలమధురిమగంధమునగు 292

క. నానమ్రదీన వినయము
లానీరముసంపు లలితమగులాఘవమా
దానిన్ వినిన సుఖంబగు
మానసదురాశాపిపాస మదివిమలమగున్ 293

క. కలిదోషదుఃఖముల నీ
జల మడఁచున్ రామభక్తి సాంద్రిమొనర్చున్
బలుసంసార క్లేశం
బుల నెడి రోగములఁ బాపు ముదముం బెంచున్ 294

క. కామక్రోధ మదాదుల
నామమడఁచు వరవివేక నవవైరాగ్య
శ్రీ మీఱఁ జేయుఁ ద్రావిన
నేమమున మునిఁగినఁ బాపనివహముఁ బాపున్ 295

తే. ఈజలంబున నెవ్వఁడు హృదయమలిన
ధావనం బొనరింపఁ డాతఁడు గలియుగ
కలుషసంతతిఁ జెడునుమృగంబు తృష్ణ
నెండమావులఁబడురీతి నెపుడుఁగుందు 296

ఆ. అస్మదీయ బుద్ధిననుసరించి తదీయ
సలిలగుణ మెఱింగి సమ్మదమున
మనమునందు స్నానమొనరింపఁగాఁ జేసి
గౌరి శివుఁ దలంచి కథనచింతు 297

ఆ. జానకీశుపాద జలజాత యుగ మాత్మఁ
జక్క నిలిపి తత్ప్రసాదమొంది
సంయమీంద్రియుగళ సంవాదరూపక
థాభి వర్ణనంబు నాచరింతు 298

—: భరద్వాజ యాజ్ఞవల్క్య సంవాదము :—

మ. దమసౌశీల్య దయాశమాది పరమార్థ జ్ఞానియై శ్రీరఘూ
త్తమపాదాంబుజ భక్తి యుక్తుఁడు భరద్వాజుండు రాజత్తపో
విమల స్వాంతుఁడు ధీసమేతుఁడయి సంప్రీతిన్ వసించుం బ్రయా
గ మహాక్షేత్రమునన్ సతంబు వనజాక్షధ్యానచిత్తంబునన్ 299

ఆ. మకరరాశి నినసమాగమంబగు పుణ్య
వేళ దనుజ మనుజవిబుధముఖ్యు
లాదరమున స్నానమాచరింతురు త్రివే
ణిని ప్రయాగకరిగి నియతమతిని 300

క. శ్రీజలజాక్ష పదాంబుజ
పూజన మక్షయ వటంబు ముట్టుటయును వి
భ్రాజితమతిఁ జేసి భర
ద్వాజుని యాశ్రమము హర్ష దాయకమనుచున్ 301

ఆ. అచటికేగి గుంపులై సభఁగావింతు
రఖిల తీర్థవాసులైన ఋషులు
నుదయముననె స్నానము త్సాహమునఁజేసి
శ్రీశుకథలగోష్ఠి నెలమిఁజేయఁ 302

తే. రూఢిమై వారు బ్రహ్మనిరూపణంబుఁ
దత్త్వపరిశీలనంబును ధర్మవిధియు
జ్ఞానవైరాగ్యసహితమా జలజనాభు
భక్తిఁగూర్చియుఁ గావింతురు భాషణములు 303

క. ప్రతిమాఘంబున ఋషులీ
గతి మకరస్నానములను గావించుచు శ్రీ
పతిఁదలఁచుచుఁ జనెదరు స
మ్మతి నాశ్రమములకు మాఘమాసాంతమునన్ 304

క. ఒకపరి స్నాన జపాదిక
సకలక్రియల్ దీర్చి ఋషులు సనుచుండఁగ ను
త్సుకత భరద్వాజుఁడు ముని
నికరమణిన్ యాజ్ఞవల్క్యు నిలిపె వినీతిన్ 305

ఆ. ఆదరమున నతని యంఘ్రిపద్మంబులఁ
గడిగి యాసనోపగతుని జేసి
పూజనంబొనర్చి భూషించి శక్తిఁ గీర్తి
నెంచి మధురసూక్తు లెనయ ననియె 306

తే. దేవ నాయెదఁగలదు సందేహమొండు
వేదశాస్త్రార్థవేదివై వెలయుదీవు
సందియముఁదెల్ప భయము లజ్జయును బొడముఁ
గాని తెలుపకయుంట యకార్యమగును 307

తే. సాధుగణముఁ బురాణశాస్త్రములు శ్రుతులుఁ
బలుకుచుండును గురువరుపట్ల దాచ
నిర్మలజ్ఞానమెదఁగల్గ నేరదనుచుఁ
గాన నోనాథ విను సావధానముగను 308

క. ఓమునివర నను భక్తునిఁ
బ్రేమంబునఁగాంచి భ్రాంతివిడఁజేయుము శ్రీ
రామునినామ మపారము
గా మునులుఁ బురాణశ్రుతిశిఖలుఁ గొనియాడుర్ 309

ఉ. జీవులుపాపముక్తి నిడుక్షేత్రవరంబగు కాశికేశుఁడౌ
దేవుఁడు శాశ్వతుండు నియతిన్ సతముం జపియించుచుండు నా
పావనరామనామము శుభంకరుఁడుం జగదీశుఁడయ్యు న
ద్భావముతోడ రామునిప్రభావము బోధయొనర్చు గౌరికిన్ 310

ఉ. రాముఁడనంగ నెవ్వఁడు నిరంతరమాయుడు రాజశేఖరుం
డా మహనీయునామము మహాదరమొప్పజపింపఁ గారణం
బేమి తదీయమామహిమ మెట్టిదదెల్ల సవిస్తరంబుగా
నోమునిరాజశేఖర కృపోన్నతి నాకెఱుఁగంగఁజెప్పవే

తే. ఒక్కరాముఁ డయోధ్యాప్రభూత్తమునకుఁ
బుత్త్రుఁడై పత్నిఁగోల్పోయి పొగిలెననుచుఁ
గ్రోధియై రావణుని ననిఁగొట్టెననుచు
విశ్వమందుఁ బ్రసిద్ధమై వెలయుచుండు 312

ఆ. సత్యమూర్తివీవు సర్వజ్ఞుఁడవుగాన
జ్ఞానదృష్టినరసి దీని నాకు
నెఱుఁగఁజెప్పు మభవుఁడెల్లప్పు జపియించు
నతఁడితండొ లేక యన్యుఁడొకఁడొ 313

తే. ఏవిధంబున నాభ్రమయెల్లఁదొలఁగు
నావిధంబునఁ గథను నాకానతీయ
వలయునని వేఁడు నాభరద్వాజుఁగాంచి
యాజ్ఞవల్క్యుండనియె దరహాస మెసఁగ 314

తే. చతురమతివయ్యు శ్రీరామచంద్రమహిమ
మెఱుఁగనట్టుల నన్నుఁ బ్రశ్నించుచుంటి
వనఘ త్రికరణముల రామునంఘ్రికమల
భక్తుఁడవు నీయుపాయంబు ప్రకటమయ్యె 315

ఉ. రాముని గూఢతత్త్వముఁ గరంబెఱుఁగన్ మదినూహసేసి నీ
వీమహితంపు ప్రశ్నమొనరించితివెంతయు మేలు రామగా
థామృతమెన్న మోహమహిషాసురుపాలిటికాళి దానిశ్ర
ద్ధామతి నాలకింపుము ముదంబున నేవివరించిచెప్పెదన్ 316

తే సాధుబృంద చకోర సంచయమునకును
జంద్రకిరణాళి శ్రీరామచంద్రుగాథ
పార్వతియు మున్ను శివునిట్లు ప్రశ్నచేసె
సమ్మహాదేవుఁడును గృపనానతిచ్చె 317

ఆ. ఏమి కారణమున నేకాలమున గౌరి
సంబికామహేశు లాడికొనిరొ
రామచంద్రుఁగూర్చి నామతిచొప్పున
దాని దుఃఖహారకథను బలికెద 318

—: సతీ చరిత్రము :—

క. త్రేతాయుగమున నొకపరి
భూతేశుఁడు శివుఁడు సకలభువనాంబ సతీ
ఖ్యాతంగూడి కలశజుం
జాతుండౌ మౌనిఁజూడఁజనిన నతండున్ 319

క. జగదీశ్వరుఁడని మనమున
నగణితమగుభక్తి నభవు నంబాసహితున్
మిగులం బూజించుచు శ్రీ
భగవద్భక్తి విధిఁగూర్చి ప్రశ్నించుటయున్ 320

క. విన నధికారిగ నాతనిఁ
గని ఫణిభూషణుఁడు దెల్పెఁ గౌసల్యానం
దన ఘనతరచరితంబును
మునివర్ణనసేయ శివుఁడు ముదమున వినియెన్ 321

క. తనివంద రామకథలన్
విని వినిపించుచును బ్రీతివిహ్వలమతియై
దినములు కొన్నిగడపి ముని
యనుమతి దక్షజనుగూడి యభవుండరిగెన్ 322

ఉ. ఆతఱి భూభరంబుడుపనవ్యయుఁడౌ హరిరామచంద్రుఁడై
భూతలమందుఁబుట్టి మునిముఖ్యులఁబ్రోవఁగఁ దండ్రిమాటపై
సీతయు లక్ష్మణుండుఁ దనుజేరిప్రయాణమునల్ప దండకా
ఖ్యాతవనంబునందిరిగె సర్వసురాజ్యవిరక్తచిత్తతన్ 323

ఆ. శంభుఁ డావిధమున జనుచాత్మగతమున
గూఢరూపమున వికుంఠనాథుఁ
డవతరించి రాముఁడై యందఱెఱుఁగంగ
నతన్గాంచ నెట్టులగునొయనుచు 324

ఆ. అంబికాధినాథుఁ డాందోళనమునొందెఁ
గనుల రాముఁగాంచుకాంక్ష మిగుల
నాత్రిమొదవె భయము నాత్మజనించెను
దాని నెఱుఁగదాయె దక్షకన్య 325

ఆ. రావణుండు తనమరణము మానవుచేతఁ
గోరె బ్రహ్మమాట శౌరినిలుప
నెంచె జరుగఁబోవు నెట్టులో తెలియదు
కొంతజరిగెఁ గొంతకొదువయుండె 326

క. అని చింతించుచు శర్వుఁడు
ననుసమయంబుననె దుష్టచరరావణుఁడుం
దనమును మారీచుఁడు నవ
కనకమృగంబగుచు నడువఁగా వనిఁజొచ్చెన్ 327

ఆ. మూఢరావణుండు మోసంబునన్ సీత
నపహరించెఁ దెలియకతులమైన
రాముమహిమ నొకశరంబున హరిణంబుఁ
గూల్చి రాముఁ డనుజుఁగూడివచ్చి 328

తే. సీతఁగానక యశ్రుసమేతనయనుఁ
డగుచు మనుజునివిధమున నడలఁజొచ్చె
ననుజయుతముగ సాంద్రవనాంతరమున
దేవివెదకుచుఁ బలుచోట్లఁ దిరుగఁజొచ్చె 329

ఆ. ఏవిభునకునుండ దెన్నండు యోగ వి
యోగయుగళ మాపరిభూత్తముండు
జానకీ వియోగ సంతాపమందుట
ప్రకటమగుచుఁ గానబడియెనపుడు 330

ఆ. చిత్రమై చెలంగు శ్రీరామచరితంబుఁ
జతురమతులె తెలియఁజాలువారు
హీనమోహమతుల కెఱుగంగ నశమానె
హీనమగుచు మదికి నెపుడుఁదోఁచు 331

ఆ. ఆసమయమునందె హరుఁడు శ్రీరాముని
ననుపమాన సుందరాంగుఁ గనుల
నిండఁగాంచి హర్షనిర్భర హృదయుఁడై
యదనుగాదు కలియననుచు మానె 332

క. మంగళకర రూప జితా
నంగా జయవరద సచ్చిదానంద యటం
చంగము పులకించుచు ను
ప్పొంగ హరుండరిగె దక్షపుత్రికతోడన్ 333

మ. జగదీశుండగు శర్వునప్పటిస్థితిన్ శర్వాణివీక్షించి యా
త్మగతంబై ఘనసంశయంబువొడమన్ మౌనుల్ సురల్ మానవుల్
నిగమాంతంబులు నెల్లలోకములుఁ దన్నిత్యంబు మ్రొక్కంగ నీ
జగతీనాథకు మారుమ్రొక్కె నితడాశ్చర్యంబు వాటిల్లగన్ 334

తే. సచ్చిదానంద కైవల్యసౌఖ్యధామ
లోకపావనయని తనలోన నుబ్బి
మేనుపులకింప నీశుండు దానెయయ్యో
రాకుమారునిఁ గాంచి విరాళినొందె 335

తే. అతులసౌందర్యధుర్యుఁడౌ నతనిఁగాంచి
యాత్మ ననివార్యమగు ప్రేమయంకురింప
ననుపమానంద సౌఖ్యంబు ననుభవించు
నితనిస్థితిఁజూడ నాశ్చర్యమొద జనించె 336

ఆ. బ్రహ్మ వ్యాపకుండ భవ్యుఁడు మాయాహీనుఁ
డకళ్యుఁడును నిరీహుఁడగుచు భేద
రహితుఁడగుచుఁ దెలియరాఁడు వేదములకు
నతఁడు దేహధారియగునె భువిని 337

తే. విబుధకల్యాణమునకునై విష్ణుదేవుఁ
డంగ ధారియయ్యైన నీహరునికరణి
నధికవిజ్ఞాని సర్వజ్ఞుఁడగునుగాని
యిందిరేశుండు సతిరోయు చేద్చునొక్కొ 338

తే. శంభుఁడాడినదెట్టు లసత్యమగును
శర్వు సర్వజ్ఞునిగనెల్ల జగము లెఱుఁగు
ననుచు బహువిధమగు సందియములు మదిని
శాంకరికిఁ దోఁప లేకుండె జ్ఞానరశ్మి 339

క. ఉమ తనమదిఁగల సందే
హముఁ బ్రకటముసేయకున్న నంతర్యామి
త్వముగల శివుఁడెఱిఁగి చెలీ
భ్రమనొందితి వబలవగుట వదలుముశంకన్ 340

ఆ. కుంభజుండె వానిగుణచరిత్రము వాడె
దెవనిభక్తిఁగూర్చి యేనునతని
కెఱుఁగఁజెప్పినాఁడ నిష్టదైవము నాక
తండు గొల్తురెపుడుఁ దపసులతని 341

సీ. ధీరులౌ మునులు సిద్ధిం గన్న యోగులె
        విభుని ధ్యానింతురు విమలమతుల
వేదపురాణ శాస్త్రాదులెవ్వని నేతి
        యని కీర్తిపాడుచు నభినుతించు
నట్టి వ్యాపకుఁడు బ్రహ్మంబు జగన్నాథుఁ
        డలఘు మాయానేతయైనవాఁడు
తనభక్తకోటికెంతయు హితంబొనఁగూర్ప
        నవతారమొందె నీయవనియందు

ఆ. రామచంద్రుఁడనఁగ రఘువంశరత్నమై
సకలభువన సుజనసౌఖ్యకరుఁడు
జలదనిభతనుండు సచ్చిదానందుండ
టంచుఁ దెలిపె భర్గుఁడంబికకును 342

ఆ. ఉమకుఁ బెక్కుసారు లుపదేశ మొనరింప
జ్ఞానముదయమగుట కానఁబడమి
శివుఁడు దనమనమున శ్రీరామ మాయాబ
లముఁదలంచి సవ్విరమణి కనియె 343

క. నీమనమున సందేహం
బేమాత్రముఁ బాయకున్న నిపుడే చని యా
రాముని బరీక్ష సేయుము
నేమఱ్ఱిదరినె వసింతు నీరాకకునై 344

ఆ. విపులమైన నీదువిభ్రాంతి వాయ వి
వేకమైన వెరవు వెదకవలయు
ననిన శివుని యాజ్ఞ నంబిక వెడలి క
ర్తవ్యమెద్దియనుచుఁ దలఁపఁ దొడఁగె 345

ఆ. అభవుఁడిచట నాత్మ ననుమానపడఁజొచ్చె
దక్షజకు శుభంబుదప్పె ననుచు
నేను దెలుపఁదొలఁగ నేరదాయెను సంది
యంబు దైవమడ్డనగునె మేలు 346

తే. ఎటుల రాముండు ఘటియించెనటుల జరుగుఁ
గాక తర్కింపఁగా నేమి కార్యమనుచు
జపముఁ గావింపఁగా సాగె శౌరినామ
మపుడు సతి రాము సుఖధాము నరయనేగె 347

తే. సారెసారెకుఁ దలపోసి సతి ధరిత్రి
జాకృతిం దాల్చి శ్రీరాముఁడరుగు మార్గ
మందు ముందేగి తిరుగాడు నవసరమున
ననుజ సహితంబుగా రాముఁడటకు వచ్చె 348

ఆ. చకితుఁడగుచు భ్రాంతి స్వాంతమందుదయింపఁ
గాంచె లక్ష్మణుండు గౌరివేష
మతిగభీరధీరుఁడగుట శ్రీరామ ప్ర
భావఁ మెఱిగియుంటఁ బలుకకుండె 349

తే. స్మరణమాత్ర నజ్ఞానంబు సమయఁజేయఁ
జాలు సర్వజ్ఞ శ్రీరామచంద్రమూర్తి
సర్వదర్శిసురానీక చక్రవర్తి
యంబ కపటంబెఱింగె సర్వాత్ముఁడగుట 350

తే. నామొహన్ మర్మమీయుమ సేయఁగోరె
స్త్రీస్వభావ ప్రభావంబు సెప్పఁదరమె
యనుచుఁ దనమాయఁగలశక్తి నరసినవ్వె
రామచంద్రుండు మధురవాగ్రచన మెఱయ 351

తే. హస్తయుగళంబు ముకుళించి యంబికకుఁ బ్రి
ణామ మొనరించుచుఁ దదీయనామమును స
జనకముగఁ బల్కి యెచట నృపధ్వజుండ
రణ్యమున నొంటిదిరుగఁ గారణమదేమి 352

క. అని తనుబ్రశ్నించెడు రా
ముని గూఢమృదూక్తులకును భువనేశ్వరికిం
ఘనసంకోచమ్ము భయమును
జనియింపఁగ మరల శివునిసరసకు వగతోఁ 353

ఆ. విశ్వపతి వచింప విశ్వసింపక రామ
చంద్రునకును నాదుజ్ఞానహీన
చేష్ట కానఁబడఁగఁ జేసితి విభున కే
మని వచింతుననుచు నడలఁ దొడఁగె 354

తే. రాజశేఖరి దుఃఖంబు రాముఁడెఱిఁగి
తన ప్రభావం బొకించుక గనఁగఁ జేసె
నంబ యరుగుచు నొకకౌతుకంబుఁ గాంచె
జానకీ రామలక్ష్మణుల్ చనుట నెదుట 355

ఆ. వెనుకఁదిరిగిచూడ విశ్వేశ్వరికిఁ దోఁచె
ననుజ జానకీసహాయుఁడైన
రామచంద్రుఁడెచట నామహేశ్వరిచూడ
నచటఁ దోఁచె మునిసురాళికొలువ 356

మ. శివకాంచెన్ శివులన్ సరోజభవులన్ శ్రీవిష్ణులన్ లోచనో
త్సవసంధాయకులౌచు నొండొరులమించంజాల్ ప్రభావాఢ్యులన్
వివిధాకారములన్ రఘుప్రవరునిన్ సేవించి కేల్మోడ్చునా
దివిజశ్రేష్ఠులఁ బారహీనుల మహోత్తేజార్కులం బల్వురన్ 357

తే. ఎందఱెందఱు బ్రహ్మభవేంద్రేశ
ముఖ్యులుండిరొ యందఱే ముద్దియలును
భారతులు లక్ష్ములును సతీభామలన్య
దేవతాస్త్రీలు నచ్చోటఁ దేజరిలిరి 358

ఆ. ఎల్లచోట్ల రాములెందఱు తోఁచిరో
సురలు నందఱన్నిచోట్లను నిజ
శక్తియుక్తులగుచు సతికిఁదోఁచిరి చరా
చర సమేత భువనచయముఁదోఁచె 359

ఆ. బహుళరూపములను బ్రభుసేవఁ గావించు
విబుధులందు రామవిభుఁడె తోఁచె
జానకీసమేత జలజాక్షుఁ డొక్కఁడే
బహువిధాకృతులను భ్రమయఁజేసె 360

ఉ. రాముఁడతండె సీతయదె రామునితమ్ముఁడతండె లక్ష్మణుం
డేమి మహాద్భుతంబాయని యీశ్వరురాణి భవానిభీతయై
కోమలదేహవల్లరినిగూడను విస్మృతిఁజెంది కంప మొం
త్రో మదినుద్భవింపఁ గనుదోయి మొగిడ్చి పథోపవిష్టయై 361

ఉ. దక్షజయక్షులం దెఱిచి తత్క్షణమచ్చటఁ గానకేమియున్
మోక్షసుఖాలవాలమగు మూర్తిని నార్తిహరున్ రఘూత్తమున్
సక్షితిజానుజున్ మదినిసన్నుతిచేసి నమస్కరించి ఫా
లాక్షుని చెంతకప్పుడు రయమ్మున నయ్యుమ చేర నేగినన్ 362

ఆ. దరికి నేగుదెంచు దాక్షాయణిం గాంచి
సేమమడిగి యిందుశేఖరుఁడనె
నేప్రకారమునఁ బరీక్షించితివి రాము
నిక్కమును వచింపు నీలవేణి 363

క. అనుటయు రాముపరిభావముఁ
దనమున నమ్మనఁదలఁచి భీతిఁ దడఁబడి దేవా
వినతిం జేసితి నీవతె
ననుమాత్ర పరీక్షచేయ నైతిని రాముఁడ్ 364

క. భవదీయనిగదితము మృష
యవునే నమ్మకముదోఁచె నాత్మదృఢముగా
మివులనిడియనిశివుఁడుం
భవానికృతమొల్లఁదనపరిభావమునఁ గనెన్ 365

క. కని యుమచే మృషలాడిం
చిన రాముని మాయకెఱఁగి చెల్లరె భగవం
తుని యిచ్ఛభావివిధియును
ననుపమబలయుతములనుచు నాత్మఁదలంచెన్ 366

తే. సీతరూపంబుదాల్చిన చెలువ నుమను
బ్రీతిచేసినభక్తిమార్గేతరమయి
సకలుషంబైన యవినీతి సంభవించు
ననుచుమనమున భర్గుండు వనటనొందె 367

తే. ఆర్యపైఁగల యత్యంతమైనప్రేమ
విడువఁగారాదు విడువమి వృజినమొదవు
ననుచుఁ బ్రకటంబుగాఁజెప్ప కాత్మయందె
పొందుచుండెను బరితాప మిందుధరుఁడు 368

ఆ. రామచంద్రచరణ రాజీవములకు మ
స్తకమునంచి మ్రొక్కి సంస్మరించి
నిశ్చయంబొనర్చె నెలఁతనీతనువునఁ
గలియరాదటంచుఁ గాలగళుఁడు 369

తే. శర్వుఁ డీరీతిఁ జింతించి చనియె నిజ ని
వాసమునకును శ్రీరామభద్రు నాత్మఁ
గడు స్మరించుచునంత నాకాశవాణి
భక్తి దృఢమయ్యె జయమగు భవ్యున కనియె 370

క. నీకన్న నన్యులెవ్వరు
నీకరణిం బ్రతినసేయ నీశ్వరకలశే
నీకడుసామర్ధ్యంబును
శ్రీకాంతుని భక్తియును బ్రసిద్ధములుగదా 371

క. అనినభమాడినమాటల
విని దక్షజ మదిఁదలంచి వెఱఁగందుచుదా
నిని దెలియక సంకోచం
బునఁ దఃవిభుఁగాంచి వినయమున నిట్లనియెన్ 372

తే. సత్యభామ కృపాకరచంద్రజూట
దేవ జగదీశ్వరేశ్వరదీనపాల
యీవొనర్చిన ప్రతిన యదెట్టిదగునొ
తెలుపుమని యెంతవేడినఁ దెలుపకుండె 373

క. సతియనుమానించెం బశు
పతి సర్వజ్ఞుండు సర్వవర్తనమెఱిఁగెం
బతియెడఁ గపటమునలిపితి
సతులెంత జడాత్మలెంత జ్ఞానరహితలో 374

ఆ. విమలమైనప్రేమ విధమునుగనును తో
యంబు పాలఁగలిపి యాప్రకార
మమ్మఁబడును గపటమునునామ్ల మందులోఁ
గలియ వేఱుపడును దొలఁగురసము 375

ఆ. అంబ తన యకార్య మాత్మలో భావించి
చెప్పదరముగాని చింతనొందె
నతిగభీరుఁడైన యభవుండు నా తప్పుఁ
బ్రకటపఱుపకుండె వరకృపాబ్ధి 376

క. అని వగచి శివుఁడుపేక్షం
గనివిడిచెను ననుఁ బ్రియుండు ఘనమగు నా త
ప్పును దలఁచి యేమిపలుకఁడుఁ
దనువిటికానంబురీతిఁ దాపమునొందెన్ 377

క. సతిచింత నెఱిఁగి శివుఁ డా
వెతనుడిపి సుఖంబొసంగు వింతకథలు స
ద్ధితిహాసములు దెలుపుచు ర
జతశైలముఁ జేరియంత సదమలమతితోన్ 378

ఆ. తనదుప్రతినఁ దలఁచి తరుణేందుజూటుండు
వటకుజంబుక్రింద వారిజాస
నమునఁ గూరుచుండి నైజస్వరూపం బ
ఖండమాసమాధిఁ గాంచుచుండె 379

తే. సతియు కైలాసమందు వాసంబొనర్చి
గాఢచింతాభరంబునఁ గ్రాగుచుండె
ఖేదమేమియుఁగానకా విశ్వజనని
గడపుచుండెను దినము యుగంబుగాఁగ 380

తే. ఉమకు నిత్యంబు నవచింత యురుభరంబు
గాఁగ నీదుఃఖవార్ధి నేకరణిఁగడతు
నెన్నటికి రాము నెడల నేనెగ్గుసలిపి
నమ్మనైతిని మృషయని నాథుమాట 381

తే. తగినఫలితంబొసంగెను ధాతనాకు
నుచితమెయ్యది యదిచేసె నుత్తముండు
కానియో విధినాకు శంకరవిముఖత
కలుగుజీవిత మిదుట మేల్గాదుసుమ్ము 382

తే. శివకుఁగల హృదయగ్లాని చెప్పఁదరమె
చతురమతి యాట నపుడామె జానకీశు
నాత్మస్మరియించె దీనదయాళు నెవని
దుఃఖనాశకుఁడని పాడుఁ దొలిచదువులు 383

తే. అట్టిప్రభుఁగొల్తు హస్తద్వయంబు మొగిచి
నాయపఘసంబుఁ ద్వరపడఁజేయుటకును
వాఙ్మనఃకర్మముల శివపాదభక్తిఁ
దప్పనేనియు వ్రతమిది తథ్యమగుత 384

తే. సర్వదగ్ని ప్రభూత్తంస సత్వరముగ
నాకు సహజంబుగా మరణంబుగలుగ
దుస్సహవిపత్తు దూరంబు దొలఁగునటుల
దగు నుపాయంబొనర్పంగఁదగును దేవ 385

ఆ. దక్షకన్యయిట్లు దారుణాకథనీయ
దుఃఖమొంద శాశ్వతుండు శివుఁడు
నెనుబదేడువేల యేఁడులుగడువ స
మాధివిడిచెఁ గడుప్రబోధియగుచు 386

ఆ. రామనామమపుడు రాజశేఖరుఁడు జ
పింపఁదొడఁగె దానవెఱిఁగి యంబ
మేలుకాంచె జగములేలు ప్రభుండని
మ్రొక్కి నాసనంబు మ్రోలనొసఁగె 387

ఆ. సరసహరికథలఁ బ్రసంగింపవారు త
త్సమయముననె వనజసంభవుండు
దక్షునకునొసంగెఁ దాత్పర్యమునఁ బ్రజా
పతి పతిత్వపదవిఁ పాత్రుఁడనుచు 388

తే. ఎప్పుడధికారమెక్కుడై యొసఁగెనపుడె
దక్షునకు నభిమానమదంబుమీఱెఁ
బ్రభుతఁబొందియు గర్వంబుఁ బడయనట్టి
పురుషుఁ డీభువనంబునఁ బుట్టలేదు 389

తే. మునులనెల్లరఁ బిలిపించి భూరియజ్ఞ
మాచరింపఁదొడంగె భాగార్హులైన
సురలనాదరమొప్ప నామంత్రణంబు
చేసె దక్షుండు యాగసంసిద్ధికొఱకు 390

తే. సిద్ధగంధర్వకిన్నరశ్రేష్ఠనాగ
దేవముఖులేగి రచటికి స్త్రీసమేతు
లై విమానంబులెక్కి బ్రహ్మాచ్యుతాభ
వ త్రిమూర్తులుఁ దక్క సవనమునకును 391

ఉ. వారిదవీథిఁగాంచెను భవాని విమానములెక్కి కామినీ
వారముఁగూడి యేగు సురవర్గముఁ దత్త్రిదశాంగనామణీ
చారుకలస్వనోద్ధురిత సారసుగానము వీనులంబడం
గోరికలుప్పతిల్ల మునికోటుల ధ్యానజపంబులుంజెడన్ 392

తే. కాంచి యదియేమటంచుఁ బ్రశ్నించెనంబ
విభుఁ డెఱింగించెనెల్ల సవిస్తరముగఁ
దండ్రి మఖవార్త వినఁగ సంతసమొకించు
కైనయు హరుఁడంపనేగుదు నీమిషనని 393

క. పతిచే విడువంబడి వనట
మతిఁగలఁపఁగఁ దప్పఁదలఁచి మాటాడక లో
నతిసంకోచ ప్రియ భయ
యుతరస ముట్టిపడఁబలికెను మృదువాణిన్ 394

ఆ. జనకునింటజరుగు సవనోత్సవంబున
కాజ్ఞయైన నేను నరుగుదాన
నుత్సుకతయెలర్ప నో కృపాజలనిధీ
ప్రాణనాథ భక్తపాలయనుఁడు 395

ఆ. నీలకంఠుఁడనియె నీమాట యుచితమే
మదికివచ్చెఁగాని మఖమునకును
దక్షుఁ డెలమి నెల్ల తనయలఁబిలిచి నిన్
బిలచెనే మదీయవిముఖబుద్ధి 396

క. వినుమఱచెం బిలువకయే
చనుటుచితమె బ్రహ్మసభను జరిగినవగ నా
త్మనుదలఁచి యిప్పుడు పరిభవ
మొనరింపఁగ నెంచె దక్షుఁడో శర్వాణీ 397

ఆ. పిలువకుండ నేగఁ బ్రియశీల లజ్జావి
భంగమౌను మిత్రపతి పితృ గురు
గేహములకుఁ బిలువకే చనందగునన
సహితభావుఁ జేరనగునె శుభము 398

ఆ. అనుచు బహువిధముల నభవుండెఱింగింప
భావిహేతువున భవాని కపుడు
బోధకలుగకుండెఁ బురుషోత్తముని మాయఁ
గడువవశమె యెంతఘనులకైన 399

తే. పిలువకే యట కేగుట ప్రియముగాదు
నామనంబునకనియెఁ బినాకపాణి
యెంతబోధించి తెలిపిన నీశ్వరేచ్ఛ
నంబికకుఁజను నాకాంక్షయధికమయ్యె 400

తే. ముఖ్యగణములఁదోడిచ్చి మూఁడుకనుల
వేల్పు దక్షజనపుడంపె వెలఁది కొలఁది
సేపటికిఁ బితృగేహంబుఁ జేరనేరు
నాదరము సేయరైరి దక్షాజ్ఞ వెఱచి 401

తే. తల్లి యెదురేగి యామె కాదరము సేసె
సోదరీమణులామెను జూడసాగి
రాననంబులఁ జిఱునగ వంకురింప
నితరులాయమతోడ భాషింపరైరి 402

ఆ. దక్షుఁ డామె జూచిఁ దల్లి సేమమెయున
కుండె మఱియు నతనికొడలుమండె
నుమయు శర్వభాగయుక్తంబుగాని యా
యాగమరసి విరసమాత్మఁగదుర 403

తే. పతివచించినదంతయు మతిఁదలంచి
భర్తృపరిభవమోర్వక వ్యధను జెందె
నట్టిదుఃఖంబు మున్నెన్నఁడుంద లేదు
సాధ్విపతి కవమానంబు సైపఁగలదె 404

తే. కలవు పెక్కువిధముల దుఃఖములు జగతిఁ
గాని జాత్యవమాన దుఃఖంబుఁబోలు
కఠినతమమైనదుండదు కాన నుమకుఁ
దల్లి బోధించెనైనఁ గ్రోధంబు ప్రబలె 405

తే. శంకరపరాభవము సైపఁజాలమినుమ
హృదయమున సంతసము జనియింపకుండె
నపుడు సభ్యులువినఁగ సయ్యుమ వచించెఁ
గ్రోధ దోధూయమానవాక్కులు సెలంగ 406

తే. ఈసభాసదులెల్ల మునీంద్రులెల్ల
నాలకింపుఁడు శివనింద నాచరించు
వాఁడు నదివినువాఁడు దత్ఫలమునొందు
నచిరముగ దక్షుఁడిది మదినరయుఁగాక 407

తే. విష్ణు శివసాధునిందలు వినెడునెడల
నట్లొనర్చినవారి జిహ్వాలు కఠోర
ఖడ్గమునఁగోయఁదగుఁ జేతఁగానియెడల
శ్రవణములమూసి యటనుండి చనఁగవలయు 408

క. పురవైరి మహేశు జగ
ద్గురునిం జగదాత్మ సర్వదున్ హితకారిం
బరు నిందించెను దక్షుం
డరయక తద్వీర్యజనితమగు నిత్తనువున్ 409

మ. త్యజియింతున్ మదిఁజంద్రమౌళిని జగద్వ్యాసున్ వృషాంకున్ మహా
వృజినోన్మూలిని శూలినిల్పి యనుచున్ వేగంబ యయ్యంబ యో
గజతీవ్రానల దగ్ధఁగానొనరిచెం గాయంబు పాయంబుగా
యజనోర్వీస్థలి నెల్లెడంబొడమె హాహాకార నిస్వానముల్ 410

క. సతిమరణము విని శివగణ
మతిరోషంబునను యజ్ఞమంతయు నానా
గతులం ధ్వంసముసేయఁగఁ
జతురత రక్షించెభృగుఁడు సరభసమడరన్ 411

క. సకల సమాచారంబున
లికలోచనుఁడెఱిఁగి కడునలిగిపంపెఁ గుమా
రకు వీరభద్రు నాతఁడు
వికలతనొందించె యజ్ఞవిధ్వంసకుఁడై 412

ఆ. అఖిలదేవతలకు నర్వాఫలంబు లో
సంగె శివ విరోధజనితఫలము
దక్షుఁడందె నిక్కథన్ లోకమెఱుఁగుటఁ
దెలుప విస్తరించి దీనినేను 413

—: సతీదేవి హిమవంతునికిఁ బుత్రికయై జన్మించుట :—

క. ప్రతిజన్మంబున శివునిం
బతిఁగా వరియించికొల్చు భాగ్యముఁగోరెన్
సతిమనమున దేవుని స
త్కృతమున హిమభూధరేంద్రు కన్యకయయ్యెన్ 414

ఆ. ఎప్పుడు జన్మమొందె నిందుశేఖరి హిమ
భూధరేంద్రునింటఁ బుత్రియగుచు
నప్పుడు సకలసిద్ధు లైశ్వర్యములునిండె
నచట మునులకొదవె నాశ్రమములు 415

ఆ. పర్వతమున సకలఫలపుష్పభరితమై
యెల్లవృక్షచయము నెసఁగుచుండె
బహువిధాతి రమ్యభాసుర రత్నసం
భరితఖనులు నచటఁబ్రకటమయ్యె 416

క. పావన జలభరితములై
వావిరిఁ బ్రవహించె నెల్లవాహినులును ద
ద్గ్రామముపై రాగంబున
జీవులువైరంబుమాని చెందెసుఖంబున్ 417

ఆ. రామభక్తిఁ బడసి రహియించు జనురీతి
సుమజనింప శైలమొందెశోభ
నిత్యనవశుభములు నెగడె నద్రిపునింట
బ్రహ్మముఖులు యశముఁ బ్రస్తుతింప 418

—: నారదుడు హిమవంతు నింటికి వచ్చుట :—

తే. ఈ సమాచారమంతయు నెఱిఁగి నార
దుం డరుగుదేర భూధరేంద్రుం డతనికి
నర్ఘ్యపాద్యాదివిధుల నత్యాదరించి
యుత్తమాసనమొసఁగి కూర్చుండఁజేసి 419

మ. మునిపాదంబులకున్ సతీయుతముగా మూర్ధంబుసోకంగ మ్రొ
క్కిన గాధీశుఁడు తత్పదోదకముచే గేహంబుఁ బూతంబుగా
నొనరంజేయుచు భాగ్యమెన్నుచును భక్త్యాద్రిక్త చిత్తంబునం
దనకన్యామణిఁదెచ్చి పాదములమీఁదంబెట్టి యమ్మౌనితోన్ 420

క. మునివర త్రికాలవేదివి
చనని స్థలం బెచట లేదు సర్వజ్ఞుఁడవౌ
టను వేఁడెద మత్కన్యం
గని గుణదోషములఁ దెలుపఁగా వలె ననుడున్ 421

క. ముని గూఢ మధురవాక్కుల
ననెఁ జిఱునగవంకురింప నంబిక యుమ నీ
తనయ భవాని యనంగం
జనుగుణఖని సహజచతుర సౌశీల్యమునన్ 422

తే. సర్వలక్షణ సంపన్న చారుశీల
ప్రియునకు సతంబు నత్యంతప్రియగ నెసఁగు
నచల సౌభాగ్యగరిమచే యశముఁగూర్చుఁ
దనదుజననీ జనకులకు ద్రగముగను 423

మ. అసమానద్యుతియుక్తమై భువనపూజ్యత్వ ప్రభావంబుతో
లసదుద్భక్తి భజించువారలకు దౌర్లభ్యంబులం బాపుచున్
రసనందద్ఘన నామమంత్రమును జేర్పంగా సుసాధ్వీవ్రతం
బసిధారానియతిన్ లతాంగులకు నీయుంజాలు భూభృద్వరా 424

తే. సకలశుభలక్షణములు యుష్మత్తనూజ
యందుఁగలవైన నొకకొన్ని యవగుణములుఁ
గానుపించుచునుండె నిక్కన్యహస్త
రేఖలంబట్టిచూడ నద్రివర వినుము 425

మ. గుణహీనుండును మానహీనుఁడు నసంకోచాత్ముఁడున్ హేయభూ
షణవేషుండును నగ్నుఁడుం జటిలశీర్షభ్రాజితుండుం బుధా
గ్రణి మాతాపితృహీనుఁడున్ మునియు నిష్కాముండు నీకన్యకా
మణికిన్ నాథుఁడుగాఁగలండనిన నమ్మౌనీంద్రువాక్యంబులన్ 426

మ. విని సత్యంబని కామినీసహితుఁడై పృథ్వీధరేంద్రుండు ద
మ్మనమందున్ నగఁజెంద నంబికయు నాత్మన్ హర్షముంబొందె న
మ్మౌని యాభేదమెఱుంగకుండె నదియేమో యొక్కఁడైనట్టి యా
తని వాక్యార్థములం గ్రహించి రతిభేదంబైన భావంబులన్ 427

ఆ. సఖులుఁ బార్వతియును శైలేంద్రుఁడును మేన
కయును బులకలంగకములఁ బొడమ
బాష్పజలము నేత్రపద్మంబులం గ్రమ్మ
మౌనిమాట కల్లగానిదనుచు 428

క. తలఁచిరి మునివాక్యంబుల
నిలిపెనుమ మనంబునందు నిశ్చలముగ న
న్నెలదారి పదాంభోజం
బులపై స్నేహంబగజకుఁ బొడమందొడఁగెన్ 429

ఆ. కష్టసాధ్యమగును గరళకంఠునిఁ జెందు
టనుచు సంశయించె నగజమదిని
వదనుగాదటంచు నాత్మఁగల్గినప్రేమ
నడఁచి చేరెఁ జేటికాంకమందు 430

ఆ. దేవమౌనినుడులు గావసత్యములని
సనకాదివరులు మిగులనేర్పు
గలుగు సఖులుఁ జింతఁగావించి రాత్మధై
ర్యమువహించి పలికె నగవిభుండు 431

క. మునినాథ యేయుపాయం
బొనరింపఁగవలయు ననుఁడు సురగామరస
న్మ్రని మనుజదనుజులకు గడు
వనుశక్యమె బ్రహ్మ నుదుటవ్రాసిన వ్రాలున్ 432

తే. అయినఁదెల్పెద దైవసహాయమున్న
నగు నుమకు నేను వర్ణించినట్టివరుఁడు
దొరకు సందేహముండ దిందుకు గిరీంద్ర
యట్టిదోషంబు లాశివునందుఁగలవు 433

క. నాయనుమానముచొప్పున
నీ యుమకాచంద్రమౌళియే వరుఁడైనన్
హేయగుణంబులు సుగుణము
లై యెన్నంబడుఁ ద్రిజగములం దెల్లరిచేన్ 434

ఆ. సర్వశాయియైన శౌరిదోషంబుల
నెన్నరేబుధేంద్రులినుఁడునగ్ని
సర్వవిధములగు రసంబులు భక్షింప
హేయగుణములుగాఁగ నెన్నఁబడిరె 435

ఆ. అమల మలినజలస మంచితగంగాస్రి
వంతినిని బవిత్రవంతమనరె
జ్వలనరవిసురాపగలఁబోలె సామర్థ్య
యుతులు దోషచయరహితులుగారె 436

తే. జ్ఞానహీనులు నభిమానులైనజనులు
శంకరసమానులనుటకు సాహసింపఁ
గల్పపర్యంతమును నరకమునఁ బడరె
హీనజీవుండు నీశసమానుఁడగునె 437

క. గంగాజల కృతమగుమది
రంగొందురె సుజనులెందుఁ దాఁవఁబవిత్రం
బుంగను నె గంగఁగలియఁబ
రంగును జీవేశ్వరాంతరంబాభంగిన్ 438

తే. సహజసామర్థ్యయుక్తుండు శంభుఁడతని
పరిణయము సర్వకల్యాణవంతమయ్యె
దోషునారాధనము కడుదుర్లభంబు
తపమునఁ బ్రిసన్నుఁడగు సతిత్వరితముగను 439

తే. కాన భవదీయకన్య శంకరునిఁగూర్చి
తప మొనర్చిన భావిసాధనముదారకు
నెందఱెందఱో నరులుందురెందు నందు
నిందుమౌళియె నీసుత కీశుఁడగును 440

తే. వరదుఁడు కృపాపయోధి సేవకసుహృదయు
రంజనుండును బ్రణతార్తి భంజనుఁడగు
శివుని యారాధనంబు వాంఛితము లొసఁగుఁ
గోటిజపయోగముల వానిఁగొనఁగవశమె 441

తే. అనిపలికి నారదుఁడు మదిహరిస్మరించి
చెందుశుభమని గిరిజ నాశీర్వదించి
సందియము మానుమని హిమశైల నాథుఁ
గాంచి వచియించి బ్రహ్మలోకమున కేగె 442

మేనక పార్వతి వివాహముంగూర్చి హిమవంతునితో నాలోచించుట

తే. వినుము తదనంతరచరిత్ర విభుఁడుఁ దాను
నేకతమయున్నతఱి మేన యిట్టులనియె
నాథ సురమౌనివాక్యముల్ నామనమున
కవగతముగావు వినుము నాయభిమతంబు 443

తే. నిలయ కులరూపశీలము లలరువరుని
నరసి సుతకు వివాహంబు నాచరింపు
మట్లుకాదేని కన్య యేమైవసించు
నంబ మత్ప్రాణకల్ప ప్రియైకపుత్రి 444

ఆ. యోగ్యవరుఁడుగాక యుమకు వేఱొకఁడైన
నచలవిభుఁడు మూర్ఖుఁడండ్రు జనులు
గాన దీనినరసి కావింపఁదగుఁ బెండ్లి
యవల మనకుఁ గ్లేశమంటకుండ 445

ఆ. అని భవానిమాత యంఘ్రిద్వయంబున
శిరము మోవ మ్రొక్కి శిఖరివిభుఁడు
ప్రియముమీఱఁబలికె విధుఁడగ్నియైన స
న్మౌనినుడులు మిథ్యలౌనె తన్వి 446

తే. ప్రేయసీ చింతవిడువుము విశ్వనాథు
స్మరణసేయుము పార్వతిన్ మనకు సుతగ
సృష్టియొనరించె నెవ్వఁడా సృష్టికర్త
పరముఁ డాతఁడె కల్యాణకరుఁడు నగును 447

ఆ. అంత ప్రేమనీకు నాత్మజపైనున్న
విశ్వనాథుఁడామె విభుఁడగుటకుఁ
దపముసేయుమనుము దదితరోపాయంబు
వలనఁ గ్లేశమిపుడు దొలఁగఁబోదు 448

ఆ. సారయుక్తములను గారణసహితముల్
నారదోక్తులా పినాకపాణి
సకలసుగుణనిధియు సౌందర్యధుర్యుండు
శంకవలదు నిక్కశంకరుఁడతఁడు 449

తే. అధిపువచనంబులన్ విని హర్షమొంది
తత్క్షణమె మేనక భవానిదరికి నేగి
కాంచి వారికణంబులు గనులనించి
ప్రేమ నంకంబునం జేర్చెఁ బ్రియతనూజ 450

తే. సారెసారెకు సుతను వక్షమున నదిమి
కంఠగాద్గదికమునఁ బల్కంగ లేని
జనని గనుఁగొని యావిశ్వజనని సుఖద
మృదులవాక్కుల సుధలొల్క నిట్టులనియె 451

—: పార్వతీదేవి శివుని భర్తగాఁగోరి తపంబొనరింప నేగుట :—

తే. అమ్మ కలఁగంటి వినుము బ్రాహ్మణవరుండు
గౌరవర్ణుండు సుందరకాయుఁ డొకఁడు
నాకు నుపదేశమొనరించె నారదోక్తు
లాత్మసత్యంబులని నమ్మి యావిధమున 452

తే. తపమొనర్పుము నీవిమతంబు నీదు
తల్లిదండ్రులకును సమ్మతంబుగానఁ
దపము సుఖమిచ్చు దుఃఖముల్ దలఁగఁజేయు
దోషము లడంచు నోగిరీంద్రుని కుమారి 453

తే. తపము బలమున సృష్టించుధాత జగముఁ
దపము బలమున విష్ణుండు దానిఁగాచుఁ
దపముబలమున రుద్రుండు దానినడఁచుఁ
దపముబలమున శేషుండు ధరణిమోయు 454

తే. తపమె సృష్టికినెల్ల నాధారమగును
దపమొనర్పుము దీనిడెందమున నెఱిఁగి
యనెననిన విని యాశ్చర్యమంది మేన
పతిని బిలిపించి వినిపించె స్వప్నకథను 455

తే. తల్లికిం దండ్రికి బహువిధములఁ దెలిపి
హర్షచిత్తంబునం దపమాచరింప
నుమ వెడల మాటవెడలకయుండి రంతఁ
దల్లిదండ్రులుఁ బరివారమెల్లఁజింత 456

తే. వేదశిరుఁడను మునివచ్చి విశ్వజనని
మహిమ వివరించిబోధింప మానిరెల్ల
చింతలను ధైర్యమొందిరి చిత్తములను
బర్వతేంద్రుండు మేనయుఁ బరిజనులును 457

ఆ. ప్రాణనాథు చరణ పంకేజయుగళంబు
నాత్మనిలిపి సకలమైన భోగ
ములఁద్యజించి యంబ నెలదారిఁగసెంచి
తపమొనర్చెఁ గుసుమతన్వియయ్యు 458

ఆ. నిత్యనూత్నమగుచు నీలకంఠుని పాద
భక్తివృద్ధిఁజెందెఁ బార్వతికిని
తనువుమఱచిచేసెఁ దపమును ఫలమూల
భక్షణమున వేయివత్సరములు 459

తే. పత్రిభక్షణమున నూఱువత్సరములు
జలమరుద్భోజనంబునఁ గొలఁదినాళ్లు
బహుదినంబులు గ్రనోపవాసములను
గడపె నుమరాజశేఖరి ఘనతపమున 460

తే. శుష్కమై వృక్షములనుండి క్షోణిమీఁద
రాలిపడినట్టి బిల్వపత్రములఁ గొన్ని
భక్షణముసేసి త్రిసహస్రవత్సరములు
తపముఁగావించె నుమ యతిదారుణముగ 461

ఆ. పర్ణభక్షణమును బరిహరింపంగ న
పర్ణయనెడిపేరు పరఁగె నుమకు
శుష్కమయ్యె మేనుచూచి గంభీరోడు
పద్మవిధాతృవాణి పలికెనిట్లు 462

ఆ. శైలరాజపుత్రి సఫలమయ్యెను నీ మ
నోరథంబు బహు కఠోరమైన
క్లేశముడుగుమింక నీశుండు త్రిపురారి
భర్తగా లభించుఁ బ్రమదమొదవ 463

క. ధీరజ్ఞానమునీంద్రులు
నీరీతిం దపమొనర్ప నేరరెపుడు గం
భీరమగు బ్రహ్మవాణిం
ధారణసేయుము బవిత్ర తథ్యస్థితిగన్ 464

క. జనకుండుపిలువ నింటికిఁ
జను మడ్డముసెప్పఁబోక సప్తర్షీంద్రుల్
నినుగనవచ్చినయపుడు గ
గనవాణిప్రమాణమెన్నఁగావలెనాత్మన్ 465

ఆ. అనుచు మింటినుండి యావిర్భవించిన
బ్రహ్మవాణివినుచుఁ బరమహర్ష
మంది పులకితాంగియయ్యె నంబిక తన్మ
నోజ్ఞ చరితఁ బ్రీతినుడివినాఁడ 466

-: శివునకు శ్రీరామచంద్రుఁడు ప్రత్యక్షమై సంభాషించుట :-

ఆ. శివునిచారుచరితఁ జెప్పెదనిఁక విను
మెపుడు దక్షపుత్రివపువు దొఱఁగె
నపుడె ఘనవిరాగమంకురింపఁగ రామ
నామజపమునం బినాకపాణి 467

క. గతకామమోహమదుఁడై
మతినిడి లోకాభిరాము మాధవునిమహా
వ్రతియై క్షితిఁదిరిగె సుఖా
యతనుండై శుభదుఁడై చిదానందుండై 468

ఆ. కొన్నిచోట్ల రామగుణవర్ణనముసేయుఁ
గొన్నిచోట్ల మౌనికోటికెలమి
జ్ఞానబోధఁజేయుఁ దాను నిష్కామియై
భక్తవిరహమునకుఁ బరితపించు 469

తే. ఇట్లు బహుకాలమేగె నయ్యీశ్వరునకు
రామచంద్రుని పదభక్తి ప్రబలమయ్యె
నిత్యనూతనమగుచును నేమమునకుఁ
బ్రేమకచలంపుభక్తికిఁ బ్రీతిఁజెంది 470

తే. తనకృతజ్ఞతఁదెలుప మార్తాండకోటి
తేజమెసఁగంగ శ్రీరామదేవుఁడపుడు
లీలఁ బ్రత్యక్షమైతోఁచె శీలమునకు
సకలసౌందర్యములకును స్థానమగుచు 471

ఉ. శంకరుఁ డెక్కురీతులఁ బ్రశంసయొనర్చి వృషాంకనీవకా
కింకరుండు శక్తుఁడగునే వ్రతమీఁగతినిర్వహింప ని
శ్శంకను బొందుమింక గిరిజాతగదక్షజ జన్మమందెన
ప్పంకజనేత్రియే భువనపావనయంచు వచించి వెండియున్ 472

ఉ. రాముఁడు వల్కె నిట్లుడు రాజకళాధర నీకు నావయిం
బ్రేమము గల్గెనేని కృప పెంపున నామనవిం గ్రహించి యా
భూమిధరేంద్రకన్యను బ్రభుత్వ మెలర్పఁగఁ బెండ్లియాడి మ
త్కామితముం ఘటింపుము జగంబులకుం గడు శ్రేయమయ్యెడిన్ 473

క. అనినన్ శంకరుఁ డిట్లనె
నను చితమైనను త్వదీయమగు నాజ్ఞను చే
కొని శిరమున ధరియించెద
ననఘా మత్పరమధర్మమయ్యదియగుటన్ 474

ఆ. తల్లితండ్రిగురువు దైవంబు పలికిన
వచనపద్ధతులు శుభంకరములు
గాన నెల్లగతులఁ గల్యాణకరభవ
దాజ్ఞ నిడితి నుత్తమాంగమందు 475

ఆ. అనిహరుండు వలుకు నతిధర్మభక్తి సు
జ్ఞానవాక్యములకు సంతసించి
రాముఁడనియె నీవు ప్రతిన చెల్లెను గాన
నా నుడువులనిడుము ధ్యానమందు 476

శా. అంతర్ధానమునొందె రాముఁడటులుగాఁ ద్ర్యంబ్రబోధించి లో
కాంతర్యామి శివుండు నిల్పె మదిలో నాప్రస్ఫురన్మూర్తి నా
సంతోషంబగు వేళ నట్టియెడకున్ సప్తర్షులే తేర న
త్యంతంబుం రమణీయవాక్యముల నయ్యర్థేందుజూటుండనెన్ 477

చ. మునివరులార మీరు హిమభూధరకన్యకయొద్దకేగి నె
మ్మనమున నామెకుంగల సమంచితప్రేమ్మపరీక్ష చేసి త
జ్జనకునిచేత నామెను వెసంబిలిపింపఁగఁజేయుఁడింటికా
త్మనుగల సందియంబులను దవ్వొనరింపుఁడటంచుఁబల్కినన్ 478

—: సప్తమహర్షులు పార్వతిం బరీక్షింపనేగుట :—

చ. మునివరులేగి విస్మయముఁబొందిరుదగ్రతపంబు మూర్తిచే
కొనినటులున్నయన్నగపుకూతురినాతఁడెఁగాంచి యేకతం
బున నెపనిందలంచి కడుభూరితపంబొనరించెదెద్దినీ
మనమున నున్న వాంఛితము మాకెఱిఁగింపుము దాపకంబికా 479

చ. అన గిరిజాతపల్కెఁ వినయాతిమనోహరగూఢవాక్కులన్
మునివరులార సందియముపుట్టెను దెల్పఁగమజ్జడత్వమున్
వినిన భవాదృశప్రథితవిజ్ఞులకుం బరిహాసహేతువౌ
నని మది మొద్దువాఱె విననౌనె సుబోధమొకించుకేనియున్ 480

తే. వారిపై గోడఁగట్టఁగాఁ గోరినట్లు
నారదునిమాట దృఢముగా నమ్మి నేను
పక్షహీనంబుగా దివిఁబారనెంచి
శివునిఁ బతిఁగాఁగనాత్మఁ గాంక్షించుచుంటి 481

క. అనుమాటలు వినినవ్వుచు
మునులనిరో శీతశైలపుత్రిక వినుమా
మును నారదు వచనంబుల
విని యెంతటిభాజనులయి వెతలంగనిరో 482

కం. నారదు నుపదేశంబున
గోరిరె యిలుసూడదక్షు కూర్మికొమరులా
తీరునఁ జిత్రకేతుఁడు
హైరణ్యాక్షాగ్రజుండునందరె వెతలన్ 483

ఉ. నారదుబోధలన్ వినిన నారులు పూరుషులుం గృహాది సం
సారములం ద్యజించి కనఁజాలుదు రేచపు భిక్షుకాకృతుల్
తీరగు సాధువేషమును దీపితమౌ కపటంబు నెమ్మదిన్
జేరిచి యాతనిం బలెనె చేయఁగఁ గోరును వాతఁ డెల్లరన్ 484

ఉ. ఆతని మాటనమ్ముచు దిగంబరునిం గుణహీను నిష్కళుం
భూతపరీవృతుం భుజగభూషణ భీషణవేషు నిస్త్రపుం
జేతఁగపాలముం గొని వసింపఁగ గేహము లేక భిక్షుఁడై
కాతరుఁడై చరించు శితికంఠుని భర్తగఁ గోరె దేమదిన్ 485

ఆ. అట్టివరునిఁ బొంద నబ్బుసుఖం బేమి
బేలుపుచ్చె నిన్ను వేల్పుతపసి
సభ్యవాక్యసరణి సతిని వివాహమై
విడిచి చంపఁజేసె వీతకరుణ 486

తే. ఇపుడు నిశ్చింతగాఁగ నమ్మృడుఁడు భిక్ష
మెత్తి మెసవుచు స్వేచ్ఛ నిద్రించుచుండె
సతత మొంటరి యింటవాసంబుసేయ
రమణులకు శక్యమే నగరాజతనయ 487

మ. వరునిన్ నీకొఱ కారసినిన్ విమలుఁడౌ వానిన్ రసజ్ఞున్ మనో
హరరూపోజ్జ్వలమూర్తి నార్తిహరు నత్యానందసౌఖ్యప్రదున్
గరుణాళున్ శ్రుతికీర్తనీయ సుయశః కల్యాణలీలాకరుం
దరుణాంభోరుహనేత్రు శీలగుణవిస్తారున్ సతీమన్మథున్ 488

శా. శ్రీవైకుంఠపురీనివాసు హరి లక్ష్మీనాథునిం గౌస్తుభ
శ్రీవిభ్రాజితవక్షు నక్షయు జగత్సేవ్యున్ మణీకంకణ
గ్రైవేయాంగదభూషు దోషరహితుం గౌశేయవాసుం బరుం
గోవిందుం దగువాని నెన్నితి మనం గొన్నవ్వుతో నిట్లనెన్ 489

క. తెలిపెద నేనావిధమున
సలుపుఁ డుపాయంబు దైవసాహాయ్యమునన్
ఫలియించు దక్షమఖమునఁ
బొలిసిన సతి శీతశైలపుత్రికయయ్యెన్ 502

ఆ. ఆమె శివునిఁ బతిగ నభిలషించి తపంబు
సేయుచుండె హరుఁడు స్థిరసమాధి
నుండె నతివిరక్తి నుభయుల్ఁగలుపంగఁ
గల యుపాయ మొండు దెలుపువాఁడ 503

ఆ. వామదేవుకడకుఁ గామదేవునిఁ బంప
నాతఁడతని మనసు వ్యాకులంబు
నందఁజేయ మనమునందఱ మభవుని
పాదములకు నెఱఁగి ప్రస్తుతించి 504

ఉ. పార్వతినిన్ వివాహమగు వాంఛ మనంబున నంకురింప నా
శర్వునిఁ బ్రోత్సహింప దివిషద్గితమున్ శుభమొంఘుటిల్లు నా
సర్వసురల్ స్తుతించిరిది సమ్మతమంచు ఝషాంకుఁడు మ్మొదల్
హార్విగలట్టివిల్లుగాని మారుఁడుదోఁచెఁ బ్రసన్నుఁడైయటన్ 505

క. సురలు తమసంకటస్థితి
మరున కెఱింగింప నతఁడు మదినెంచుచు సుం
దరముగ నవ్వుచు ననియెన్
హరుతో వైరంబు నాకు నశుభలమైనన్ 506

క, మీ పని యొనరించెదను బ
రోపకృతియె పరమధర్మయుతమనియె శ్రుతుల్
మేపరహితమునఁ దొఱఁగిన
నేపుగస్తుతియించుఁ త్రి సాధులెల్లప్పుడతనిన్ 507

చ. అని వచియించి యొల్లరకు నా దలవంచి నమస్కరించి చే
తను ననవిల్లు పట్టిచని దర్పకుఁ డధ్వమునన్ మనంబులోఁ
త్రినయనుతోడి వైరమున మృత్యువుదప్పదటంచు నెంచుచుం
దనపరివారమెల్లఁ బ్రమదంబున వెంటఁ జెలంగరంగుగన్ 508

ఆ. అపుడు కామదేవుఁ డాత్మప్రభావంబు
వ్యాప్తినందఁజేసి యఖిలజగముఁ
దనవశంబొనర్చె దర్పకుండలిగినఁ
దప్పె వేదగదిత ధర్మమెల్ల 509

మ. యమ ధర్మంబులు బ్రహ్మచర్యము జపస్వాధ్యాయ విజ్ఞాన యో
గములుం ధైర్యవివేకసువ్రత వినిష్కర్మల్ విరాగంబులున్
విమలాచార ముఖాఖిలోత్తమ చమూవిస్తారముల్ భీతిఁజెం
ది మనోవేగమునొంది పాఱెనిలువంధీరత్వముం దక్కుచున్ 510

తే. కామదేవుని సేనాని కదఃభూమి
నిలిచినంతనె జ్ఞానంబు నిజచమూస
మేతముగఁ బాఱె నుత్తమంబై తనర్చు
గ్రంథములుడాగెఁ బర్వతగహ్వరముల 511

ఆ. అఖిలజగములందు నాందోళన ధ్వను
లడరె దైవమా యటంచు నింక
నేమి జరుగఁగలదొ యెవరురక్షకులౌదు
రేల క్రోధియయ్యె నీతఁడనుచు 512

చ. భువనములం జరాచరసమూహమునన్ మగువల్ మగల్ మనో
భవవశులై సమస్తగుణ వర్జితులై మరియాదవీడి రే
బవలును లీలలందగిలి వాంఛలఁజిక్కి మెలంగుచుండి రా
పువు విలుకాని కైవసపుబొమ్మలు నాగవిచిత్రభంగులన్ 513

ఆ. ఎల్ల మనములంగ జేచ్ఛాన్వితములయ్యె
వలమికొనియెఁ దీవలవనిజములఁ
బాతెఁ బొంగినదులు పాథోధిఁగలియంగ
సతసులొందసాగె సంగమములు 514

క. జడజీవులస్థితిఁ దెలుపన్
సత్త్వంగలవాని వర్ణనంబిఁక నేలా
పుడమిఁ జదల నీటం దిరి
గెడు ప్రాణులుగామవశతఁ గ్రీడించె రహిన్ 515

క. ఋతుధర్మంబుల మఱచి స
తతమున్ మన్మథవశంవదంబయి తిర్య
గ్గతతి చరియించెఁ గామాం
ధత. లోకములెల్ల మిగులఁ దత్తరపడియెన్ 516

తే. జక్కవలు రేబవళ్ల విచక్షణంబు
మాని విహరించె నిర్జర మనుజ యక్ష
రాక్షస పిశాచభూతాదిప్రాణి నివహ
కామతంత్రిగ వర్ణింపగా వశంబె 517

తే. సిద్ధులును యోగివరులుఁ బ్రసిద్ధమునులుఁ
గామవశులైరి జ్ఞానయోగములు సెడియె
నట్టియెడ నీచజనుల వృత్తాంతములను
దెలుపఁబని యేమి మరుబలం బలఁతియగునె 518

చ. ఎవరు చరాచరంబులను నీశమయంబుగఁ గాంచుచుండిరా
పరివిమలచిత్తులౌ మునులు భావనచేసిరి స్త్రీమయంబుగా
భువనము లంగనామయతఁ బూరుషకోటికిఁ బుంమయంబుగా
యువతులకుంగనంబడె స్మరోత్సుకతం ఘటికాద్వయంబునన్ 519

ఆ. అంగజుఁడు హరించె నందఱిమనసుల
ధైర్యమెల్లరకును దలఁగిపోయె
రక్షణంబుఁగనిరి రామచంద్ర కృపామృ
తాభిషేచనమున నలరువారు 520

ఆ. హరునికడకు మారుఁడరుగుపర్యంతంబుఁ
గౌతుకంబుఁగనె జగంబులిట్లు
శివునిఁగాంచి మరుఁడు సెందె భయంబు లో
కములు పూర్వమున్నకరణినొప్పె 521

ఉ. ఈగతిఁ బ్రాణులెల్లసుఖియించె మదంబుడుగన్ సుఖించు కల్
ద్రాగినవారిఁబోలె నెదదర్పకుఁ డగ్గలమౌ భయంబుతో
భోగి విభూషణుంగనియె భూతగణేశుఁడు నిర్వికారుఁడున్
రాగవిహీనుఁడు ద్ధారదురంతుఁడు దుర్గముఁడై చెలంగుటన్ 522

క. వెనుదీయఁగ లజ్జితుఁడై
ననవిల్తుఁడు మరణమైన నాకహితంబుం
బొనరింపనెంచి యామని
వనమలరులఁ దలిరులన్ విభాసిలఁజేసెన్ 523

ఆ. వనము లుపవనములు వాపీతటాకముల్
దిక్చయంబు నధికదీప్తినొందెఁ
జచ్చినట్టిప్రాణి సముదయాత్మలఁగూడ
మేలుకొలిపెఁ బ్రేమమెఱయ మరుఁడు 524

మ. వనసౌందర్యముఁ బల్కశక్యమె మరుద్వారంబు గంధాంచితం
బునుమందంబుఁ గిశోరముం దనుసముద్భూతాగ్ని మిత్రంబునై
గొనఁబైవీచె సరోజముల్ వికచమై గుంజించు భృంగాళిచే
తనుమించెన్ శుకకోకిలాది విహగధ్వానంబు మోదంబిడెన్ 525

ఆ. గానపూర్వకంబుగా నప్సరోవధూ
బృందమాడెఁ గనులవిందు సేయ
నందనములకు నెల్ల నాకరంబగు మనో
భవచమూని సర్గభావ మమరె 526

క. కోటి విధోపాయంబుల
నోటమిఁగనె సర్వకళల మురుసేనలతో
మేటియగు నంగభవుఁడు ల
లాటాక్షు సమాధిదశతొలఁగమిఁ గుపితుఁడై 527

ఉ. కన్నులకింపుసేయు నొకకమ్రరసాల మహీజశాఖపైఁ
గన్నులవిల్తుఁడుండి కడకన్నులఁ దళ్కుపిసాళిచూపుతోఁ
గ్రొన్ననవిల్లు సజ్యముగఁ గూరిచి తూపులఁబూని క్రోధమ
త్యున్నతిగాఁగఁ గర్ణమున కొయ్యన నారినిలాగి యుద్ధతిన్ 528

ఉ. పంచశిలీముఖంబులను వక్షముఁ గాడఁగ శర్వుపైఁ బ్రయో
గించిన భంగమయ్యెను మహేశుసమాధి యతండు మానసో
దంచితమై జనించిన మహాకులతం గల్గఁతన్ వహించి వీ
క్షించె దిశాఖిలంబు నెవఁడింతటి సాహసుఁడంచు నెంచుచున్ 529

ఉ. చూతకుజంబుమీఁద నతిసుందరు మన్మథుఁ గాంచి యుగ్రుఁడై
భూతవిభుండు శంకరుఁడు మూడవనేత్రము విచ్చిచూచినం
గాతరభావమొందెఁ ద్రిజగంబులు నంబుజబాణుఁ డంతటం
భూతిగనై ధరంబడియె భోగివిభూషణు కంటిమంటలన్ 530

సీ. అఖిలజగంబుల హాహారవంబులు
ప్పతిల దేవతలెల్ల భయముఁజెందఁ
బొలసుదిండులపిండు ముదమొందఁగ విలాస
లాలసుల్ సుఖమొంచి జాలిఁబొంద

సాధనాపరులగు సంయముల్ తమయోగ
దీక్ష సాగునటంచు దిగులువిడువఁ
బొలుపులకిక్కయా పుష్పసాయకుఁ డిట్లు
బూదియయ్యెనటంచు భువనమడలఁ

తే. గుపిత నిటలాక్షనయనోగ్ర ఘోరవహ్ని
కీలికాజాల సంజ్వలత్కిసల మృదుల
కాయుఁడై దేవతాహిత కాంక్షియగుచు
నించువిల్తుండు ప్రాణమర్పించె నపుడు 531

చ. రతి తనప్రాణవల్లభు తెఱంగు నెఱింగి కరంబు మూర్ఛచే
క్షితిపయిఁ గూలి కొంతవడి చేతనహీనతనుండి లేచుచున్
మతినతిదుఃఖవహ్ని యలమన్ నెలదారిని జేరి నమ్రయై
యతికరుణంబుగా వనటనందఁగ సుందరిఁ గాంచి శర్వుఁడున్ 532

ఆ. అతిదయాసముద్రుఁడౌట శీఘ్రప్రస
న్నాత్ముఁడగుట నార్తిహరణుఁడగుట
నబలయాచరించు నాక్రందనము విని
పలికెనిట్లు తథ్యవాక్యములను 533

తే. ఇంతి నీప్రాణనాయకుఁ డిటుపయిని న
నంగుఁడనుపేర నెల్లెడ వ్యాప్తుఁడగుచు
నుండును శరీరహీనత నొప్పియున్న
నాతనికి నీకుఁగలయిక యగును వినుము 534

మ. అవనీభారమడంప యాదవవసుండై శ్రీమనోనాయకుం
డవతారంబునుబొందు నందనుఁడు నీయాత్మేశుఁడౌ శౌరికో
యువిదా నిక్కము గాఁదలంపుము మదీయోక్తుల్ వ్యథన్ మానుమ
న్నవృషాంకుంగని భక్తిమీఱ నతులం గావించి భావించుచున్ 535

## బ్రహ్మ విష్ణు సమేతులై దేవతలు శంకరుని దర్శింపనేగుట

క. రతిచనె నామీఁద కథా
స్థితి నెఱిఁగించెదను బ్రియముఁ జెందఁగ నతివి
స్తృతముగ సురలు వనజజ స
హితులై చని రెఱిఁగి యిందిరేశుని కడకున్ 536

ఆ. అపుడు విష్ణుసహితులై పద్మభవముఖ
విబుధులెల్ల రరిగి విశ్వనాథు
నొక్కరొకరు భక్తి యొప్పఁ బ్రస్తుతిసేయ
శశిధరుండు గడు ప్రసన్నుఁడగుచు 537

చ. సురవరులార మీరు ననుజూడఁగ వచ్చినకారణంబు స
త్వర నెఱిఁగింపుఁడన్న నెలదాలిఁ గృపానిధిఁ గాంచి పల్కె నా
సరసిజసంభవుండు విను సర్వహృదంతరవర్తివైన నీ
పరమరహస్యముం దెలిసి భక్తివశంబునఁ బ్రస్తుతించెదన్ 538

మానిని- దేవ యపారకుతూహలమొప్పఁగ దేవతలుం గమలావిభుఁడుం
భావములం గల యీప్సితమీఁగతిఁ బల్కుచునుండిరి మన్ముఖతం
గావునఁ దెల్పెద నీదువివాహముఁ గన్నులనెన్నఁడు గాంచి ప్రమో
దావహచిత్తులమై సుఖయించెదమంచుఁ దలంచెద రిందుధరా 539

చ. మరుని జయించినట్టి మహిమంబు నుతింపఁగ శక్యమే భవ
త్కరుణ గణింపఁగావశమె కామినియౌ రతికిం బ్రసన్నతన్
వరమునొసంగినావు సురవాంఛితసిద్ధి నొసర్పుమయ్య భూ
ధరవర పుత్త్రిఁ బెండ్లియయి దారుణమౌ తపమామె సల్పెడిన్ 540

ఆ. బ్రహ్మవినతి వినుచు రామచంద్రుని వాక్య
సరణి మదిస్మరించి చంద్రమౌళి
యానతిచ్చె మిగుల నానందమెనయ మీ
యభిమతప్రకార మగునటంచు 541

క. అదివిని సురలెల్ల మహా
ముదమున దుందుభులు మొరయ భూరిసుగంధా
స్పదపుష్పవృష్టిఁ గురిసిరి
మదనారికి జయము జయము మంగళమనుచున్ 542

ఆ. సమయమెఱిఁగి యటకు సప్తర్షివరులు రా
జలజభవ్రుఁడు శీతశైలనాథు
నింటికంప వారునేగి గిరిజఁగాంచి
ఛలయుతాతి మధురచతురఫణితి 543

క. అనిరప్పుడు మాపలుకుల
వినవైతివి నారదుని వివేకంబగు బో
ధనునమ్మి నీప్రతిన చెడె
ననవిల్తుఁడు భస్మమయ్యె నగవాసునిచేన్ 544

చ. అనఁ జెలునవ్వు నవ్వుచు నగాత్మజ యోమునివర్యులార మీ
రనినది లెస్స మీతలఁపులందు మృడుండు రతీశుభస్మముం
బొసరిఁచె నిప్పుడింతకును భోగివికారయుతుండుగాఁగ మీ
రనుకొనుచుండునట్లు కననయ్యెడి మీదువచోనిరూఢిచేఁ 545

ఉ. కాని మదీయభావమునఁ గామవిహీనుఁడు నిర్వికారుఁడున్
జ్ఞానియు భోగశూన్యుఁడును జన్మయు నిందయులేనియోగిగాఁ
గానఁబడుఁ మహేశ్వరుఁడు గావున వాక్యమనఃక్రియావిధిం
బూని భజింపఁగోరెదను మోదముతో నిరతంబు నీశ్వరున్ 546

ఉ. కావున నాప్రతిజ్ఞవినఁగా నిదె మిమ్ములవేఁడుచుంటి నా
దేవుఁడు దానిఁ దథ్యమగుతీరునఁజేయునుగాక శర్వుఁ డా
పూవిలుకాని భస్మముగ బ్రింగఁగఁ జేసెనటంచుఁబల్కి నా
రావచనంబు లజ్ఞులయి యాడితిరంచన సాహసించెదఁ 745

క. పాల్గేయ మగ్నికడకుం
బోలేదటు పోయెనేని పొలుపఱిచెదు నా
లీలం బూవిలుతుండును
గాలగళుంజేరి నష్టకాయుండయె నసన్ 548

క. శైలజ విశ్వాసము నా
భీల దృఢప్రీతినరసి ప్రియమంది మునుల్
చాలముదమ్మున మ్రొక్కుచుఁ
బ్రాలేయ ధరాధరేంద్రు పజ్జకరుగుచున్ 549

తే. ఎల్లవృత్తాంత మెఱిఁగింప హిమనగేంద్రుఁ
డలరువిల్తుండు భస్మమైనట్టివార్త
నాలకించుచు నధికదుఃఖాత్ముఁడయ్యె
రతి వరమునొందుటనువిని ప్రమదమొందె 550

ఆ. శివుని ప్రాభవంబుఁ జింతించి శైలేంద్రుఁ
డాదరమున మునుల నటకుఁబిలువ
నంపి శుభముహూర్త మతిశీఘ్రముగ నిర్ణ
యింపఁజేసె శ్రుతివిహితముగాఁగ 551

ఆ. లగ్నపత్రికను నిలాధరవరుఁడు స
ప్తర్షులకునొసంగి పాదములకు
వందనంబొనర్ప వారజునకొసంగఁ
జదివెఁ బట్టలేని సంతసమున 552

మ. శుభలగ్నం బజుఁడెల్లవారువిన నచ్చోటంబఠింపంగ నా
ఋభువర్గంబు ముదంబునం బొదలె భేరీముఖ్యవాద్యాధికా
రభటుల్ దిక్కులఁబిక్కటిల్లె సుమనోవాత్రంబుగా
నభమందుండిపడెం ఘటంబులెసఁగెన్ నారీకృతాలంకృతిన్ 553

—: పార్వతీ కల్యాణము :—

ధువకోకిల:-సురవరుల్ నిజవాహనంబులఁ సొంపుగుల్కు విమానముల్
పరమప్రీతి నలంకరింప శుభప్రదంపు నిమిత్తముల్
పరఁగె నచ్చరలేమలెల్ల విపంచికారవతుల్య భా
సురరవంబునఁ బాడి రెండినక్షోణిజాలి తలిర్పఁగన్ 554

సీ. కోటీరముగ జడల్ కూర్చికట్టి ఫణీంద్రు
నందంబుగా దానియందుఁ జుట్టి
కుండల కంకణమండనంబులుగాఁగ
భుజగావళిం దెచ్చి పొందుపఱచి
మైనిండ భస్మంబు జానుగాఁ బూసి వ్యా
ఘ్రాజినాంబరముఁ బ్రియమున నొసఁగి
జాబిల్లి మకుటంబుగాఁ బిసాళింప నౌ
దల సురాపగవింత చెలువునింప

తే. కంధరంబున విషము వక్షమున నరక
పాలమాలిక పొలుపొంద భవగణము ల
లంకరించిరి శంకరు నశుభ వేషు
నఖిలశుభధాముఁడైన దయాసముద్రు 555

తే. వాద్యముల్ మ్రోయ మదవృషభంబునెక్కి
కేలనొక డమరుకముఁ ద్రిశూలమమర
వెడలె నుడురాజశేఖరు వేల్పు దెఱవ
లరసి చిఱునవ్వు వాతెఱలందు మెఱయ 556

క. ఈవరునకు యోగ్యంబగు
నే వెలఁదియుఁ బెండ్లికూతురీవిశ్వమునం
దో వనితా యున్నదె యని
దేవాంగన లనుకొనిరి మదిన్ వెఱఁగొందవన్ 557

మ. వినతాసూనుఁడు క్షీరనీరముల వేర్వేఱౌనటుల్ సేయుపు
ల్గును దేజీలుఁగ శ్రీమనోహరుఁడుఁబల్కెంబోటి ప్రాణేశుఁడున్
ఖుషుగా దేవతలాత్మవాహనములం బొల్పొందఁగా నెక్కి శ
క్త్యాని వైవాహమహోత్సవంబునకుఁ జారు స్ఫూర్తినే తేరఁగన్ 558

తే. పెండిలికినేగు వేలుపు పిండుకనుల
పండువుగ నిరుపమమయియుండెఁగాని
విశ్వపతియైచెలంగు నా పెండ్లికొడుకు
తోడ ననురూపమగుచును దోఁపకుండె 559

చ. దరహసితాననుండగుచు దానవవైరి దిశాధిరాట్సము
త్కరమునుగాంచి యిట్లనెముదంబొదవం బరివారయుక్తులై
సురవరులార మీరు చనుచోఁ గనువిందుగనుండుఁగాన న
ట్లరుగుఁడు రాగరమ్యమతులై ససమాజత వేఱువేఱుగన్ 560

తే. చక్రిపలుకుల వించునిర్జరవరేణ్యు
లాననంబులఁ జిఱునగవంకురింప
సరభసంబునఁ దమతమసైన్యయుతము
గాఁగ వేర్వేఱనిలిచిరా క్షణమునంద 561

క. పరిణయయాత్రాపరులకు
నగుఁడనురూపంబుగాక వఱలుటమీరల్
పరనగరనగుదురే యని
పురుషోత్తముఁ డెల్ల వేలుపులఁగని పలుకన్ 562

క. లోలోన నవ్వికొనుచున్
ఫాలాక్షుఁడువలికె శౌరిపరిహాసవచో
లీలననె నాకుఁ బ్రియతమ
మాలాగున ననుచు భృంగిసనిచి గణంబున్ 563

మ. పిలువం జేయ నధీశునాజ్ఞ గణముల్ వేర్వేరు వేషంబులుం
బలురూపంబులఁ బెక్కువాహనములొప్పన్ వచ్చి శ్రీకంఠునం
ఘ్రులవ్రాలన్ స్వసమాజముం గనియె రుద్రుం డెంతయుం బ్రీతిమై
సెలనవ్వానన పంకజాతరుచులన్ వృద్ధింగనం జేయఁగన్ 564

చ. శివగణమందు నొండొకఁడు చేతులఁ గాళ్ళులు లేకయుండెఁ బా
హువులుఁ బదంబులొక్కనికినుండె ననేకముగాఁగఁ బెక్కు
చక్షువులుగలాఁ డొకండొకఁడు చూడఁగఁ గన్నులు లేనియాతడున్
మివుల శిరంబులం గలిగి మించు నొకండొక శీర్షహీనుడున్ 565

క. ఒకడు కృశతనుఁడు వేఱొక
వికటాకారుండు మిగుల విపులాంగుఁడు నిం
కొకఁడు పవిత్రశరీరుం
డొకరుండపవిత్రగాత్రుఁడురు నేత్రుండున్ 566

చ. కలిగి భయంకరాకృతులఁ గాయములందుఁ గరాళభూషణా
వలులును బాణులం ఘనకపాలములుండగఁ గ్రొత్తనల్ల జొ
త్తిలెడు శరీరముల్ వెలయఁ దీవ్రపు గర్దభసూకరాననం
బులును శృగాలకుర్కురసముగ్రముఖంబులనొప్పు వారలున్ 567

క. భూతప్రేతపిశాచము
లాతతసంఖ్యలును యోగులగువారలు నా
చేతోజాతాంతకునకుఁ
బ్రీతిగ నటనిలిచిర మరబృందమునడుమన్ 568

ఉ. గానముసేయుచుం బలుప్రకారములన్ నటనంబు సల్పుచున్
వానరులట్లు త్రుళ్ళుచును వార్ధిమహత్తరభంగరంగదు
ధ్వానములీల చాలనరవంబులొనర్చుచు నుగ్రవీక్షణం
బూని బహుప్రభేదములనుండెను రుద్రగణంబు లయ్యెడన్ 569

తే. పెండ్లికొడుకున కెనయగు పెండ్లివారు
గొండ్లి చేయుచు విబుధులఁగూడి బహువి
నోదగతి నేగఁగఁ దుషారమేది నీధ
రేంద్రుఁడు వితానమొసఁగ నిర్మింపఁజేసె 570

ఉ. లోకములోని శైలములలోఁ గడుఁజిన్నయుఁ బెద్దయున్న యా
లోకనసేయ కెల్లగిరిలోకము సింధుమహాటవీసరో
జాకరవారముం బిలువనంపె సమాదరణంబు మీఱఁగా
నాకులపర్వతాగ్రణి సమగ్రవిభూతిసతీసమేతుఁడై 571

చ. అతనుసమానరూపధరులై పరివారసతీసమేతులై
యతులమనోహరంబులగు నట్టి సుమంగళగీతగానముల్
రతినొనరించి రెల్ల రనురాగము మీఱఁగ నేగుదెంచి ప
ర్వతకులసార్వభౌముని నివాసముఁ జేరిరతండు వేడుకన్ 572

ఉ. అంతకుమున్నె పెక్కుగుగృహంబు లలంకరణంబొనర్ప న
త్యంతసమర్థులం బనిచి యర్హవిధిన్ విడియించె వానిలో
వింతగు నాపురీవిభవవిస్తృతిఁ గాంచి విరించిసృష్టియం
దింతమనోజ్ఞమౌపురము నెందునుగానమటంచు వారనన్ 573

మ. లఘువైతోఁచు విధాతృచాతురి పురీలాలిత్యసౌందర్యదీ
ప్రఘనారామనదీతటాకవనకూపస్తోమధామాంచితాం
కఘృణిభ్రాజితతోరణధ్వజపతాకాసుందరీసుందరా
పఘనశ్రీ చతురత్వముల్ గనమునివ్రాతంబు మోహింపదే 574

ఉ. ఏపురిలోకమాతజనియించెనొ తత్పురముం గణింపఁగా
నేపురుషుండునోపునె మహీస్థలిఁ బెంపగు వృద్ధిసిద్ధియుం
దీపితసంపదల్ తనివితీఱినసౌఖ్యము నిత్యనూత్నమై
కాపురముందుసందునల కాపురమున్ సరిగాదు దానికిన్ 575

హిమవంతుఁడు పరివారసమేతముగ పెండ్లివారి నెదుర్కొనుట

చ. అరుసముమీఱఁ బెండిలికినై యరుదెంచుసమూహరావముల్
పురనికటంబునన్ వినిపరిభూతములయ్యె హళాహళుల్ మనో
హరముగనూత్నశోభఁ జెలువందఁబు రేంజిరసర్వవాహనో
త్కరమునలంకరించి చనికాంచిరి స్వాగతమీయఁగాజనుల్ 576

సీ. తొలుదొల్త సురబృందకలితసౌందర్యంబుఁ
బొడఁగాంచి సంతోషమునఁ జెలంగి
పదపడి శ్రీవత్సుఁ బద్మాక్షుఁ వీక్షించి
పరవశత్వసుఖంబుఁ బడసిమించి
యామీఁదఁ బద్మాసనాదులఁగని మహా
మోదాబ్ధివీచుల మునిగిలేచి
యటుపైని నిటలాక్షు ననుచరవ్రాతంబుఁ
జూచి భీతాత్ములై బూచులనుచు

తే. వాహనంబులువాఱ విభ్రమమునొంది
మైచెమర్పంగఁ దమవారి మఱచి వెఱచి
పఱచి రఱచిరి యొక్కొక్కరురుజవమునఁ
బురముసొరనేగి యమ్మయో భూతములని
మొఱలువెట్టఁదొడంగిరి ముగుదలడల 577

తే. ధైర్యయుతులగు చతురులుదక్క నెల్ల
బాలకుల్ చేతఁ బ్రాణముల్ పట్టి పాఱఁ
దల్లిదండ్రులు ప్రశ్నింపఁ దల్లడమున
వడఁకుమేనుల నిట్లనినుడివిరపుడు 578

ఉ. ఏమనచించువార మిదియెక్కడి పెండిలివారు యాహ్యాది
క్స్వామి భటాళియొక్కొకడు చక్కని పెండ్లికుమారుఁడెద్దుపైఁ
బాములుభూతియుంబునుక పంక్తులు భూషలుగాధరించి యిం
కేమనివచ్చె వెఱ్ఱియగునేమొ యనంగనయ్యొ బాపురే 579

శా. భూతప్రేత పిశాచభీకరగణంబున్ యోగినీరాక్షస
వ్రాతంబుం దనవెంటరాఁగ భసితవ్యాళోత్కపాలోత్కరో
పేతాంగుండును నగ్నుఁడుం జటిలుఁడుం భీభత్సరూపుండునౌ
నీతండా వరుఁ డిట్టిపెండ్లిఁగనుచో నెవ్వాఁడు జీవించునే 580

క. జీవించె నేని యాతఁడ
పోవిస్తృతపుణ్యుఁ డద్రిపుత్రి వివాహం
బావాఁడె చూడఁగలఁడని
కావించిరి ప్రతిగృహమునఁ గలకలరవముల్ 581

ఉ. ఈవిధి నెల్ల బాలకులు నేగి గృహంబులఁ జెప్పఁగా మహా
దేవు దళంబుగా నెఱిఁగి దీనికి నింత భయంబుతో నస్థై
ర్యావిలభావ మొందుట యనర్హ మటంచు వచించి చేతన
వ్యావహిలంగఁ దెల్పిరి ప్రియంబునఁ దల్లులుఁ దండ్రులెల్లడన్ 582

శా. తూర్యారావములొప్పఁ బెండ్లికొడుకుం దోడ్తెచ్చి తోడ్తో హిమా
హార్యోత్తంసుఁడు వారికెల్లరకు రమ్యంబౌ జనావాసముం
బర్యంకాదిక వస్తుసంతతులు దాత్పర్యంబుతో నీయ సౌం
దర్యంబొప్పఁగ మేనకాదిసతులున్ గానంబుతో హారతుల్ 583

ఉ. బంగరుపళ్ళెరంబులను బట్టి నివాళులొసంగ నేగి సా
రంగధరాంక భీషణతరంబగు వేషముఁ గాంచికొంచి య
య్యంగన లెల్లఁ బాఱిరి భయంబున నిండ్లకు మట్టెలందియల్
ఖంగున మ్రోయ మేనకకు గాటపు దుఃఖము పుట్టె నాత్మలోన్ 584

.: మేనక తనసుతకుఁ దగినవరుఁడు లభింపలేదని దుఃఖించుట :.

తే. కొంతసేపట్లు దుఃఖించి కూర్మిసుతను
బిలిచి రప్పించి నీలాబ్జతులితనేత్ర
భరిత జలబిందువుల వ్రేలఁ బాఱమీఁటి
కొనుచుఁ దొడనుంచి యుమఁగాంచి యనియెనిట్లు 585

చ. సురుచిరరూప సంపదను శోభిలనీకు ఘటించి ధాత నీ
వరు నతిమూర్ఖుగా వెడఁగువానిగ నేలసృజించెఁ దల్లి యో
సురతరువందుఁ గూర్పగల సుందరమౌ ఫలమెందు శాల్మలీ
తరుగతమౌనటుల్ సలుపఁ దార్కొనదే నగ యెట్టివారికిన్ 586

చ. నినుఁ గొనిపోయి నేను నవనీధర శృంగమునుండి దూకెదన్
వననిధిఁ గూలెదన్ జ్వలితవహ్నిని మండెద దుర్యశంబునై
ననుభరియింతు నిల్లు చెడినన్ మదినోర్వఁగాని నిన్ను నా
తనికిడి పెండ్లిసేయ నెదఁ దాళఁగఁజాలను ప్రాణముండఁగన్ 587

శా. పుత్రీస్నేహమునం గిరీంద్రవనితా భూరివ్యథాభారమున్
ధాత్రిం బోర్లుచు లేచి పల్కుచును నేత్రద్వంద్వ బాష్పాంబువుల్
గాత్రంబుం దడుపంగ గాటమగు శోకంబందుటం గాంచుచుం
బాత్రంబయ్యెను వ్యాకులంబునకు సర్వస్త్రైణమయ్యింతితోన్ 588

క. నేనేమి యెగ్గొనర్చితి
నా నారదమౌని కతఁడు నాయిలు సెఱచెన్
వానినుడి నమ్మి నాసుత
తానీవరు వెట్టి గోరి తపమొనరించెన్ 589

ఆ. నిశ్చయముగ నతఁడు నిర్మోహి నిర్మాయి
జోగిధనము నిల్లు సుదతి లేక
సిగ్గుభయము లేక చెఱచు నన్యుల యిండ్లు
వంధ్య యెఱుఁగఁగలదె ప్రసవబాధ 590

తే. అనుచు దురపిల్లుచుండెడి జననిఁ గాంచి
జ్ఞానయుత మధురోక్తుల శైలకన్య
పలికె నోయమ్మ తప్పునే బ్రహ్మవ్రాత
చింతనొందంగఁ బనిలేదొకింతయైన 591

తే. వరుఁడు వెంగలిగాఁ గర్మవశతఁ గలుగ
నితరులను నిందచేయుట యెందుకమ్మ
నలినభవువ్రాఁతఁ దప్పింపఁగలవె నీవు
వ్యర్థముగను గలంకంబు నందనేల 592

మ. వగఁజెందంబని లేదు నీకుజననీ ఫాలస్థలిన్ నాకు నే
పగిదిం బ్రహ్మలిఖించె నావిధమునం బ్రాప్తించు సౌఖ్యవ్యథల్
జగమందెచ్చటికేగినం దొలఁగ వేలావంతయన్నట్టి సతుల్
నగజాకోమల నమ్రవాక్యముల నెల్లన్ వించుఁ జింతించుచున్ 593

తే. విధినిదూరుచుఁ గోమల వికచకమల
పత్రనిభనేత్రముల శోక బాష్పతోయ
కణములురలంగ వగచు సంగతినెఱింగి
యంతలో నంతిపురికి హిమాద్రివిభుఁడు 594

సీ. సప్తర్షి నారదసహితుఁడై యేతెంచె
నారదుఁడప్పుఁడు మేనకకు శోక
శమనంబుఁగావింప సతిపూర్వచరితంబు
సకలంబు వినిపించి సత్యమనుచు
నమ్ము నామాట నీనందన జగదంబ
జన్మమొందని యాదిశక్తి సుమ్ము
లేదు ప్రారంభంబు లేదు మధ్యంబును
లేదు నాశంబును నీదు హితకు

తే. సృజనపాలన నాశనక్రియల నఖిల
జగములందిప్డు నిమ్మహేశ్వరియె సుమ్ము
శూలియర్ధాంగవాసిని లీలఁగొఱకు
స్వేచ్ఛఁదను ధారణంబుఁ గావించుచుండు 595

క. ముందీమె దక్షునింటన్
సుందర తనువమరఁ బుట్టి సుతయై సతినా
నిందుధరుఁ బెండ్లియాడిన
దంద తెఱుంగుదురు జగమునందీ చరిత్రన్ 596

చ. అభవసమేతయై కనెనొకప్పుడు శ్రీరఘురామచంద్రునిన్
విభువచనంబు నమ్మకతి విభ్రమమోహనశాత్మయై రఘు
ప్రభునిఁబరీక్ష సేయుటకు బాగుగభూమి సుతాస్వరూప మ
య్యభసమయాన దక్షజవహించె మహేశుఁ డనాదరింపఁగన్ 597

తే. హరవియోగంబు సైపక యధ్వరంబు
దక్షుఁడొనరింప సరిగి చెందమునఁగన లి
యోగపావక శిఖలచేఁ గ్రాగితనువు
దొఱఁగి యిటఁబుట్టె హిమవంతు దుహితయగుచు 598

తే. సందియంబేల యీవిశ్వజనని నీకు
పుత్రియయ్యెను శివునికళత్రమగుట
కాత్రమునఁ దప మొనరించె నధికనిష్ఠ
నెపుడు సర్వేశ్వరునిప్రియ యీమె సుమ్ము 599

మ. అనుచున్ నారదుఁడాడు వాక్యముల కయ్యంభోజపత్రాక్షియున్
వనితాజాలము వంతమానగఁ బురిన్ వ్యాపించె గేహోత్కరం
బునఁ దద్వార్తక్షణంబులో సతియుఁదా భూభృద్వరుండంతమిం
చిన భక్తిం బ్రణమిల్లె నాగిరిసుతా శ్రీపాదపద్మద్వయిన్ 600

క. స్త్రీపురుష బాలవృద్ధులు
నాపట్టణ వాసులెల్ల రానందర సో
ద్దీపిత చిత్తంబులతోఁ
జూపట్టిరి చెలఁగెఁబురిని శుభగానంబుల్ 601

.: పార్వతీపరమేశ్వరుల పాణిగ్రహణమహోత్సవము :.

తే. శాతకుంభంబు లెల్లెడఁ జక్కనిలిపి
ఱంద ఱానందమొందుచు విందుమిగుల
వందమొసఁగంగఁ బాకశాస్త్రానుసార
మగుపదార్థంబులంజేసి రగణితముగ 602

ఉ. ఏభవనంబునందు జనయిత్రి భవానివసించు నచ్చటన్
వైభవమొప్పఁగా జరిగె వర్ణనసేయఁగరాని విందు లా
భూభృదధీశుఁడుత్సుకతఁ బొంగుచుఁ బిల్వనధోక్షజుండు నం
భోభవసంభవాదిక ఋభుప్రవరుల్ చనిరింపుమీఱఁగన్ 603

తే. నైకపంక్తులఁగూర్చుండ నాకులకును
జతురులౌ సూపకారులు షడ్రసాన్న
ముఖపదార్థాళి వడ్డింప ముదము భుతో
జించు నెడఁ బరిహాసముల్ చేడెలాడ 604

ఆ. సుందర స్వనముల సుందరుల్ పరిహాస
రసములొలుకఁ బాడఁబ్రమదమున ని
లింప బృందమెల్ల నింపుతో భుజియించి
కరసరోరుహములఁ గడిగి యంత 605

తే. వీడియంబులుసేయుచు విందువేళ
నందమైనట్టి యానందమొందుఁ గోటి
ముఖములను వర్ణనముసేయఁ బోలదనుచు
విబుధులేగిరి తమ తమ విడిదలకును 606

చ. మునివరులేగుదెంచి గిరిముఖ్యునితోడవివాహలగ్నమున్
వినుమని దెల్పనాధృతిని వేల్పులనెల్లరఁ బిల్వఁబంచి కాం
చనరచితార్హపీఠములొసంగి బహూకృతులాచరించె మిం
చిన ప్రమదంబుతో దివిజశేఖరులందు పవిష్టులౌటయున్ 607

తే. వేదవిధిఁ జొప్పునను చారు వేదికయు న
లంకరింపంగఁబడెఁ బుణ్య పంకజాస్య
కాంతుమాత్రికలు చిగురింప నింపుమీఱఁ
బ్రీతిఁ బాడిరి మంగళగీతములను 608

తే. వర్ణనాతీతవైచిత్ర్యభాసురమగు
దివ్యసింహాసనంబందుఁ దేజరిల్లె
నమ్రశిరుఁడయి విప్రగణంబునకు ని
జాధినాథుని శ్రీరాము నాత్మఁ దలఁచి

ఉ. అందుపవిష్టుఁడయ్యె శివుఁ డంత మునుల్ గిరిజాతఁ దెండనన్
సుందరులెల్ల గౌరి కతిశోభితభూషణరాజిఁ బెట్టి మైఁ
జందనమంద మొంద నునుసంపెంగదండలు వేణియందు నిం
పొందనలంకరించి చెలి నుత్సుకతన్ గొనివచ్చి రచ్చెలుల్ 610

చ. అనుపమమహాభవాని చెలువద్భుతమై సురకోటి మోహవా
ర్ధిని మునుఁగంగఁ జేసెఁ గలరే భువి నాజగదంబసోయగం
బును గణుతింపఁగల్గు కవిపుంగవులంగభవారినారిపా
వన భువనైకమాతయని భక్తిని మ్రొక్కిరి నిర్జరుల్ మదిన్ 611

క. సౌందర్యసీమయగునా
కుందరదనరూప మెన్నఁ గోటిముఖములం
బొందుపడ దిందువదనల
కుందలమాణికము శివుని కొమ్మ జగములన్ 612

మ. శ్రుతులున్ వాణియు శేషుఁడా గిరిసుతాశోభాయమానోల్లస
త్తతసౌందర్యము నెన్నఁగొంకు నెడ మందప్రజ్ఞుఁడన్ నేను స
న్నుతి సేయంగల నేయ నెందులసి నే నోరెత్తఁగా నేర్తు నే
యతిచాంచల్యమనస్కతం జడతకిమ్మా నీ జగన్నాథుఁడన్ 613

ఉ. బాలశశాంకభూషణుఁడు భాసిలుమంటపమధ్యభాగమం
దాలలితాంగిచేరి విభునంఘ్రిసరోజయుగంబుఁజూడఁగాఁ
బాలకఁగాంచియున్ హృదయషట్పదమందుమరందముందమిం
గ్రోలఁగ వ్రాలనుండెను హరుండు వరుండయ్యెనంచునుబ్బుచున్

కం. ఫణిభూషణుఁడుం గిరిజా
మణియున్ మునివర్యులయాజ్ఞ మహితశ్రద్ధం
గణపతిఁ బూజించిరి సుర
గణమున నాదిగఁ దలంచి తనకుఁడుశంకన్ 615

కం. వేదోక్తవివాహవిధుల్
మేదురమతులైనమునులు మిగులనొనర్పం
గాదుహితహస్త నద్రిపుఁ
డాదరమునఁ గుశయుతముగ నర్పణచేసెన్ 616

ఉ. బాలసుధాంశుశేఖరుఁడు పార్వతిపాణిగ్రహించె సన్మునుల్
చాలఁగ వేదనాదములుసల్పఁగ వేల్పులుహర్షవారిధిం
దేలి జయధ్వనుల్ నెఱప దేవికి దేవరకున్ శుభంబు లో
కాలకు మంగళంబనుచుఁ గాంతలుగానముసేయుచుండగన్ 617

మ. బహువాద్యప్రకరంబు మ్రోసె సుమనోవర్షంబువర్షించె న
మ్మిహికాహార్యసుతావివాహమతులామేయోల్లసద్వైభవా
వహమై యీపగిదిం బ్రవర్తిలెఁ బ్రభావంతంబులయ్యెందిశల్
మహదానందరసప్రపూర్తినభిరామంబయ్యె ముల్లోకముల్ 618

శా. దాసీదాసరథాశ్వధేనునికరస్తంబేరమానీకముల్
వాసోరత్నసువస్తుహేమరుచకవ్రాతంబునానావిధా
వాసాలంకరణంబులుం ఘుమఘుమన్వాసించు మాల్యంబులుం
గై సేయందగుసొమ్ములిచ్చె సుతకుం గ్రావప్రభుండింపుగన్ 619

చ. అగణితవస్తువాహనము లల్లునకిచ్చి కరాబ్జయుగ్మమున్
మొగిడిచిపూర్ణకామసురపూజితపాదసరోజ యేమి యి
య్యగలను నీకటంచుఁ జరణాంబురుహద్వయమంటి మ్రొక్కి మా
మఁగని కృపాసముద్రుఁ డభిమానమునన్ ముదమొందఁ జేయుదున్.

ఉ. మేనక ప్రేమపూరమెదమీఱఁగ మ్రొక్కి మహేశ నాసుతం
దీనిమదీయప్రాణసమ దేవిగనిచ్చితి గేహదాసిగాఁ
బూనిపరిగ్రహించి పరిపూర్ణకృపం దొసఁగుల్ క్షమించి యీ
మానిని నేలుమింక మను మన్ననఁగాంచి వరమ్ము లిమ్మనన్ 621

ఉ. అత్తను బెక్కుభంగుల వియత్తలకేశుఁడు గారవింపఁగా
నత్తరళాక్షి యిందుధరునంఘ్రులకుం బ్రణమిల్లి యింటికిం
దత్తరమొప్ప నేగి ప్రమదంబున నాత్మజనంకపీఠిపైఁ
బొత్తుననుంచి రమ్యమగు బుద్ధుల నేర్పఁదొడంగెఁ బ్రీతితోన్ 622

తే. అభవు బూజింపుమమ్మ నిత్యంబు భక్తి
ధవుఁడె దైవంబు సతులకు ధర్మమిదియ
టంచుఁ బల్కుచు నశ్రువుల్ నించి కనులఁ
జంచలాక్షిని బ్రీతి వక్షమున నదిమి 623

మ. తెలియన్ స్వప్నములోనివార్తలు పరాధీనుల్ సుఖంబందుటల్
నలుమోముల్ గలసామి లోకముల నేలా సృష్టిఁ గావించెఁ గాం
తలనంచుం గడుఁ జింతనొందుచుఁ గలంతం జెందఁగా వేళయా
వలదంచుండిటవూనె మేనమది దౌర్బల్యంబుఁ బోఁజేయుచున్ 624

ఉ. గాటపుఁబ్రేమ మాతృపదకంజయుగంబున వ్రాలి లేచుచుం
బోటులఁ గూడుచున్ మరలఁ బోవుచు వచ్చుచుఁ దల్లిఁ జేరుచున్
మాటికి మాటికిం గిరికుమారిక మేనకఁ గౌగలించు నా
సాటి యొకింతలేని సరసంబగు కూరిమి నెన్నశక్యమే 625

—: శివుఁడు పార్వతీసమేతుఁడై కైలాసమున కేగుట :—

సీ. అందఱానందంబు కందళింపంగ నా
శర్వాణి నప్పుడాశీర్వదింప
మరలి మరలి ప్రీతిమాత నీక్షించుచు
నగరాజకన్యక నడచుచుండఁ
జెలులామెఁ గొనిపోయి నెలదారికడనిల్వ
శివుఁడెల్లరం బ్రీతిఁ జెందఁజేయ
సురలుసంతోషింప సుమవృష్టిగురియింప
నాకాశవీథి వాద్యములు సెలఁగ

తే. నద్రివిభుఁ డాదరంబున నల్లుఁ గూతు
సంపుటకుఁ దోడనరుదేర హరుఁడు నతని
హర్ష సముచితభాషలనాడి నిలిపి
రజతగిరి కేగెనప్పు డపర్ణాయుతముగ 626

తే. అంత హిమవంతుఁ డింటికినరుగుదెంచి
పర్వతసరిత్సరోవరప్రతతిఁ బ్రీతి
సత్కృతుల గౌరవముసేసి సన్నుతించి
చనఁగ సెలవిచ్చెఁ దమతమ సదనములకు 627

క. హరుఁడు భవానీయుతుఁడై
యరిగెం గైలాసగిరికి నాతనియాజ్ఞన్
సురలెల్లరు సంతోష
స్ఫురణం జనసాగి రాత్మపురవరములకున్ 628

తే. తల్లియుం దండ్రి లోకత్రితయమునకును
శాంకరియు శంకరుఁడు వారిసరసచేష్టి
తముల వర్ణించి తెలుపఁగాఁ దగదు నాకుఁ
గాన నవి యిటవివరింప మానినాఁడ 629

చ, అతుల విలాసభోగములనందుచు నిందిరఁజక్రివోలె ప
ర్వతసుతఁగూడి శైవగణవారము భక్తిభజింపనుండెనా
శితిగళుఁ డాశ్రితావనుఁడు శీతమయూఖలసల్లలాటశో
భిత కమనీయవిగ్రహుఁడు బెక్కగుకాలము నేగెనీగతిన్ 630

తే. షణ్ముఖుండు కుమారుండు సంభవించెఁ
దారకాసురు నాతండె దర్పమడఁచె
వేద శాస్త్ర పురాణముల్ వినుతిసేయఁ
గార్తికేయాభ్యుదయము జగంబెఱుంగు 631

ఉ. కావున సంగ్రహంబగు ప్రకారమునన్ వచియించినాఁడ నా
దేవుని సచ్చరిత్రము నతిప్రమదావహ పార్వతీమహా
దేవ వివాహరమ్యకథ స్త్రీపురుషుల్ పఠియింప సంతత
శ్రీవిభవాఢ్యులై సుఖముఁ జెందెద రిందుధరాప్తభక్తులై 632

క. గిరిజా రమణకథా సా
గరముం దరియింప వేదగణమునకైనం
దరమే తులసీదాసే
కరణిన్ వర్ణింపఁగలఁడు కడుజడుఁడగుటన్ 633

చ. అతిరసయుక్తసుందర వృషాంక కథాసుధఁగ్రోలి చొక్కి లో
లతఁ దదధీనమహా శ్రవణలాలస మానసుఁడై కనుంగవన్
వితతముదాశ్రుపుల్ వొడమ వింతగమై గఱుపారనుండెనా
వ్రతి ప్రతిమానహీనమగు పారవశత్వసుఖంబు నొందుచున్ 634

తే. తన్మునీశ్వరునిం భరద్వాజుఁగాంచి
ప్రాణప్రదమహా నతని శివభక్తి మెచ్చి
వరతపోధన నీజన్మ పరమధన్య
తమమని నుతించె యాజ్ఞవల్క్యముని ప్రీతి 635

తే. పరమశివు పాదపంకజభక్తిపరులు
గానివారు స్వప్నమునను గానివారు
రామచంద్రున కవనిజారమణుభక్త
లక్షణంబిది ఛలహీన త్ర్యక్షభక్తి 636

క. సతినతి సాధ్వివిడిచియుం
బ్రతినంగొని రామభక్తిఁ బ్రబలించిన య
ప్రతిమానప్రియుఁడగజా
పతియేకద పుడమికన్యపతి కెల్లపుడున్ 637

క. శివకథ వినిపింపఁగ నా
కవగతమయ్యెన్ మునీంద్ర యవనీతనయా
ధవనిష్కళంక భక్తుఁడ
వవుదువు నీవనుచుఁ గరతలామలకముగన్ 638

క. నీగుణశీలము లెఱిఁగితి
బాగుగ నీస్నేహమునను బడసిన సుఖమున్
నేగణియింపఁగఁజాలను
వేగమవిను రామలీల విని చెదననఘా 639

ఆ. రామచరితపార రహితంబుశతకోటి
శేషులకును బలుకఁజేతఁగాని
దైనవాగధీశుహస్తసంశోభిత
చాపుఁదలఁచి తెలుప సాహసింతు 640

ఆ. వాణిదారుపుత్రి వలనొప్పనాడించు
నట్టిసూత్రధారి యంతరాత్మ
రాముఁడతనికృప సరస్వతినటియించు
రహిఁ గవీంద్రహృదజిరములయందు 641

## —: ఉమా-శంభూ సంవాదము :—

చ. పరివిమలభక్తితోడను గృపానిధి శ్రీరఘురామచంద్రునిం
దవిలిభజించి మ్రొక్కుచు ముదంబునఁదద్గుణగాథఁ దెల్పెదన్
శివుఁడు భవానితో సతముఁ జేరివసించెడు వెండికొండసొం
పు వెలయ రాజిలున్ సకలభూధరకోటుల నగ్రగణ్యమై 642

చ. పరమసుఖాలవాలుని శుభంకరు శంకరుఁగొల్చుచుండ్రు ని
ర్జరవరసిద్ధయోగిజనసన్ముని కిన్నరముఖ్యపుణ్యులా
హరిహరభక్తిహీనులగునట్టిజనుల్ కలనైనఁ జేరరా
పరిసరసీమఁ గిట్టదులవంబును ధర్మమటన్న వారికిన్ 643

తే. తన్నగంబున నిత్యనూతనవిలాస
భాసురవిశాల వటవిటపంబు వెలయు
మందగంధిల శీతలమారుత ప్ర
సారరమ్యంబు తత్తరుచ్ఛాయ దనరు 644

ఉ. దానన గాదె వేదము సదాశివుఁ డాదరమొప్పవిశ్రమ
స్థానముగా వసించు నిరతంబని వల్కుచునుండు నొక్కనా
డా నెలదారి వచ్చి మనమందుఁ గడుంగడు మెచ్చెఁ దత్తుజా
నూనవిశాలశాఖలమనోహరమై విలసిల్లుశోభకున్ 645

క. కుందేందుశంఖనిభదీ
ప్తిం దేహమెసంగ లంబపృథులభుజుండా
నందకరకృపాసింధుం
డందుం బులితోలుపఱచి యాసీనుండై 646

మ. శరదిందుద్యుతిమించునెమ్మొగముతో సద్యోరుణాబ్జోల్ల స
చ్చరణద్వంద్వముతో సుభక్తహృదయాజ్ఞానాంధకారంబు సం
హరియింపంగల పన్నఖచ్ఛవులతో నాలిప్తభస్మంబుతో
నురగాలంకృతుఁడై పురారి మునియై యొప్పారెఁ గౌపీనియై 647

క. శిరమున జటాకిరీటము
సురకల్లోలినియుఁ దరుణసోముఁడు నుదుటం
బరఁగఁగలావణ్యాంబుధి
హరుఁడసితగ్రీవుఁడుం డెనజ్జాక్షుండై 648

క్రౌంచపదవృత్తము
కామహరుండా కైవడి మేనుంగనినశమునఁగఁగడుఁ జెలువొప్పన్
ధాముఁడు దాన్తై రంజిలు వేళన్ రమణునిఁగనుఁగొనఁ
బ్రమదముమీఱన్
కామచనన్ రుద్రాణిభవానీరమణిజననిహరుప్రభుఁగ నెళవ్వన్
సోమనిటాలున్ సుందరదేహున్ సురమునిజనగణసులభు నిరీహున్

క. అర్థాంగి కాదరమున ని
జార్థాసనమొసఁగనందు హర్షంబున న
య్యర్థేందు నిటలపూర్వ భ
వార్థంబులుజ్ఞప్తిరాఁగ నాసీనయయెన్ 650

చ. పతిహృదయార్థకారణముఁ బార్వతిమిక్కిలిగాగ్రహించి స
స్మితవదనారవిందయయి చేసెను బ్రశ్నములోకకోటికిన్
హితమొనరింపఁగా గలుగునేకథ దాని వినంగఁగోరి యు
న్నతమతియై ప్రియంబగు వినమ్రమృదూక్తుల భక్తకామ్యనున్ 651

ఆ. విశ్వనాథత్రిపుర విధ్వంసమన్మనో
నాథ తెలిసెఁ ద్రిభువనములనీయ
పారమహిమ దేవఫణి నరాచరచర
సకలసేవితాంఘ్రి జలజయుగళ 652

తే. ఓప్రభూత్తమసామర్థ్యయుతసమస్త
మంగళాకరసర్వజ్ఞ మహితగుణ క
ళానిలయ యోగసువిరతి జ్ఞానరాశి
భక్తకల్పకసమనామ పరమధామ 653

క. నాయెడఁ బ్రసన్నచిత్తుఁడ
నైయుంటివ యేని దాసినని సుఖరాశీ
నాయజ్ఞాన ముడుప రఘు
నాయకు చరితము ముదంబునం దెలుపఁగదే. 654

ఆ. కల్పతరువు క్రిందఁ గలయింటివారికిఁ
గలుగునే దరిద్ర కష్టదశలు
జ్ఞాననామనమున గాఢమౌ భ్రమఁ బాపి
కావు మిందు భూష గళితదోష 655

క. పరతత్త్వవేత్తలౌ ముని
వరులారా మునిననాది బ్రహ్మమనెదరా
పరుగుణ గానమొనర్చెడి
నిరతము వాణియు ఫణీంద్ర నిగమాగమముల్ 656

క. మదనహర దినము రాత్రియు
ముదమున శ్రీరామమంత్రముం జపమొనరిం
చెదవాతఁ డయోధ్యాపతి
కుదయించిన సుతుఁడొయగుణుఁ డొరుఁడజుఁడొకఁడో 657

ఆ. రాజతనయుఁడైన బ్రహ్మంబదెట్లగు
వెలదిఁ బాసి యేలవేదురయ్యె
చర్యఁ గాంచి మహిమనార్యు లెన్నఁగవిని
పొడమె భ్రాంతి నాదు బుద్ధి నధిప 658

చ. అతడు నిరీహుఁడుం బరుఁడు వ్యాపకుఁడౌ ప్రభుఁడేని లెస్సనా
మతికనువైన రీతిని క్రమంబుగ బోధయొనర్చి నాదుమూ
ఢతఁ గని కిన్కఁ జెందకెదఁగల్గిన నాభ్రమ మెల్ల బాయునే
గతి నటు తెల్పవేఁడెద వికాసమతింగృపనానతీయవే 659

మ. వనసీమం గనుఁగొంటి రాముని ప్రభావంబుం భయవ్యాకులం
బున నీకుం దెలుపంగ నైతి మలినంబుం గల్గు మత్స్వాంతమం
దున బోధంగ నైతిఁ దత్ఫలితముం దోడ్తోడనే పొందితిన్
మనమందిప్పుడుఁ గూడ శంకకలదే మాడ్కిన్ నివారించెదో 660

ఉ. శరములు మోడ్చి మ్రొక్కెదను గాఢకృపన్ ననుఁ గాంచి నాథ యా
దరమున మున్ను పెక్కగు విధంబులఁ దెల్పితివైన నిప్పుడీ
శరణిని వేఁడుచుంటినని కాదు మదిం గినియంగ మన్మనో
హర దురితాటవీదహన వ్యాళ విభూషణ భక్తపోషణా 661

తే. అంతయజ్ఞానమిప్పుడు మత్స్వాంతమందు
లేదు రుచిపుట్టె వినఁగ సీతాదయితు ప
విత్రగుణ గాథ కావున విస్తరించి
తెల్పవే సందియము వోవ దేవదేవ 662

మ. ధరణిన్ సాగిలి మ్రొక్కెదం దవపదద్వంద్వంబు మత్పాణి పం
కరుహంబుల్ ముకుళించి చేయుదు నతిం గాకుత్స్థనం జేశు సు
స్థిర కీర్తిప్రభ వేదసారమనుచున్ సిద్ధాంతముం జేయుచుం
గరిమన్ వర్ణన చేసి తెల్పుము మహాకారుణ్యపాథోనిధీ 663

చ. అతినకు బోధచేయుట యనర్హమయైనను వాఙ్మనః క్రియా
త్రితయముచేఁ దమిం గొలుచు దేవరదాసినిగాన నాకు నా
దృతిఁ దెలుపందగున్ మిగుల దీనతతో ననురక్తి వేఁడు ప
ద్ధతి గలవారికిం దెలుపదాచరు పెద్దలు గూఢ తత్త్వమున్ 664

తే. దేవతాసార్వభౌమ యర్ధింతు భక్తిఁ
గరుణఁ దెల్పుము శ్రీరామకథను నాకు
ముందు బోధింపు నిర్గుణుం డెందువలన
సగుణ దేహంబుఁ దాల్చెనో సత్యమరసి 665

క. రామావతారకథయును
నామాంకిత బాలచరిత మవనీతనయా
శ్రీమంగళ కల్యాణముఁ
గామితరాజ్యంబు వినఁగల కారణమున్ 666

చ. వనమునఁ జేసినట్టి బహువర్తనముల్ దురమందు రావణుం
దునుముప్రకారమున్ ముదముతోడుత రాజ్యమునేలు కాలమం
దొనరిచినట్టిలీలలును నుత్సుకతన్ వినిపింపు నాథ ని
న్ననిశముఁ గొల్చువారలకు నబ్బనిదేది సుఖాకరాహారా 667

క. కరుణానిధాన మఱి య
చ్చెరువగు కార్యంబులేమిచేసె రఘుకులా
భరణమణి యెట్లునిజపరి
చరయుతముగఁ జేరె నాత్మసదనంబునకున్ 668

తే. ఎట్టి విజ్ఞానమగ్నులై యెల్లజ్ఞాను
లైన మునులుందురో గూఢమైనతత్త్వ
వర్ణనము జ్ఞాన వైరాగ్య భక్తియోగ
లక్షణముఁ దెల్పు కరుణాకటాక్ష మెసఁగ 669

తే. మఱియు రామరహస్య నిర్మలవివేక
మార్గమును నేను బ్రశ్నింపమఱచినట్టి
యంశములనెల్ల దాపక యానతిమ్ము
చిరకృపావాస దిగ్వాస చిద్విలాస 670

తే. నీవ త్రిభువనగురుఁడవై నెగడెదనుచు
వేదములు వర్ణనముసేయు విశ్వనాథ
యితర పామరజీవుల కేమియెఱుక
నీప్రభావంబు కల్యాణనిచయనిలయ 671

తే. అనుచుఁ బ్రార్థించు నిర్వ్యాజమహా భవాని
సహజరమ్యోక్తులకు మెచ్చి చంద్రమౌళి
రామచరితంబు స్మరణకురాఁగ నొడలు
పులకరింపంగ హర్షాశ్రుపుంజములరల 672

క. రాముఁడు సాక్షాత్కారుం
డై మనమునఁదోఁప సగణితానందముని
స్సీమ సుఖానుభవంబుం
గామహేశుండొందె నిర్వికారుండగుచున్ 673

తే. రెండుగడియలు ధ్యానమందుండి తెలిసి
పరమసంతోష సౌఖ్యసంభరితహృదయుఁ
డగుచు భూమిసుతామనోహరు చరిత్రఁ
దెలుపఁదొడఁగి భవానితోఁబలికె నిట్లు 674

—: శంకరుని భూమిక :—

చ. వివరముగాఁగఁ ద్రాడనివివేకమొనర్పమిఁ బాముగాఁ గనుం
గవకునుదోఁచున ట్లెవనిఁగానక దబ్బరసత్యమన్ భ్రమం
దవులును జిత్తమెవ్విభుని తత్త్వమెఱుంగ జగంబు స్వప్నమం
దవగతమైనభ్రాంతి తెలివందినఁ బాసినమాడ్కిఁ బాయునో 675

ఉ. అట్టి కిశోర రూపుఁడగు నారఘురాముని మ్రొక్కెదన్ మనం
బిట్టటుఁ బోక భక్తి మెయి నెవ్వని నామముసంస్మరింపఁ జే
పట్టునొ సర్వసిద్ధులు శుభప్రకరాలయుఁగోసలేశు తొ
ల్పట్టిన మంగళాసహాయుఁ బంక్తిరథాంగణ కేళీ లోలునిన్ 676

మ. అనుచున్ రాముని మ్రొక్కి యయ్యభవుఁడత్యానంద చేతస్కుఁడై
యనెఁ బీయూష సమోక్తులంగిరిసుతాయత్యంత ధన్యాత్మ వి
వెన యొక్కింతయులేని నీయుపకృతిక్ యేణాక్షి నేమెచ్చితిన్
నినుఁ బోలంగల ధన్యులెవ్వరు భవానీమన్మనోహారిణీ 677

చ. త్రిభువనముల్ పవిత్రమొనరింపఁగఁ జాలినయట్టి జానకీ
విభుచరితంబు నేఁడెలుప వీనులవిందుగ నాలకింపనీ
కభిమతమయ్యె రామచరణాంబుజభక్తి దృఢంబునీకు నీ
శుభకరమైన ప్రశ్నము వసుంధరకున్ హితమాచరింపదే 678

తే. వీఁదలంచెద స్వప్నమందేని నీకు
రామునత్కృప శోకవిభ్రమ విమోహ
సంశయములుండవనిమైన సర్వశుభద
కథవినం జెప్పమేలగుఁగాదె తన్వి 679

ఆ. ఎవరు భక్తితోడ నీశ్వరు సత్కథ
లాలకింపఁబోవ రట్టివారి
కర్ణరంధ్రయుగముఁగా కోదరంబుండు
పుట్టబిలములకును బోల్పవచ్చు 680

ఆ. ఎవరు సాధుజనుల నీశ్వరభక్తుల
దర్శనంబొనర్పఁ దలఁపరట్టి
వారినేత్రయుగము బర్హిపింఛాక్షి స
మానమనఁగనొప్పు మంజువాణి 681

క. హరిచరణ సరసిజములకు
గురుపాదంబులకు మ్రొక్కకున్న జనులవౌ
శిరములు గరముం జేదగు
సొరకాయలకరణి వృథయొసుమ్ము లతాంగీ 682

క. భగవద్భక్తి విహీనులు
జగతిం జీవించియున్న శవతుల్యులు రా
మగుణ గణగాన విముఖుల
వగుజిహ్వలు భేకజిహ్వలనఁదగు నబలా 683

క. హర్షమున రామచరితంబు నాలకింప
నట్టివారల హృదయంబు లతికఠోర
వజ్రసమనిష్ఠురములు భవానివిను సు
రశుభకర దైత్యమోహన రామలీల 684

క. రామకథాసేవన మభి
రామ సుఖంబొసఁగ సురసురభికల్పము స
త్సోపానమె స్వర్గము దాని క
హా మనమిడి యెవరువినరు హర్షోత్కర్షన్ 685

తే. రామకథ సంశయాండజ ప్రతతి నెగురఁ
గొట్టు సుందరకరతాళ మట్టిదగును
గట్టు దొరపట్టి కలిమంటి పుట్టువునకు
బెట్టిదపు గొడ్డలియనుమ్ము ప్రీతివినుము 686

ఉ. వేదము దెల్పు రాముని పవిత్రచరిత్రము జన్మకర్మముల్
మేదుర నామమంత్రము నమేయగుణంబు నగణ్యమంచు సీ
తాదయితుం డనంతుఁడౌటఁ దద్గుణకీర్తి చరిత్ర మల్పమే
నేఁ దెలుపంగలాఁడను మనీషకొలంది విన్నరీతిగన్ 687

క. గిరిరాజతనయ నీసుం
దరప్రశ్నము సాధుసమ్మతము నామదికిం
గరమిష్టమయ్యెఁ గావునఁ
దరుణీ! వివరింతు రామ తత్త్వముఁ బ్రీతిన్ 688

చ. అయిన నవిద్యకున్ వశతనాడిన నీపలుకొక్కటే సుమీ
ప్రియ మొనరింపలేదు బహురీతుల వేదములుగ్గడింపఁ ద
న్మయతమునీంద్రు లెల్లపుడు మానకధ్యాన మొనర్చు నాతఁడో
పయిగ మఱొక్కఁడో యనుచుఁ బ్రశ్న మొనర్చితి కాదె రామునిన్ 689

తే. ఎవరిమోహపిశాచంబు దవిలియుండు
నెవరు పాషండులై యుందురీశ విముఖు
లెవరొ మృషయును సత్యంబు నెఱుఁగ రెవరొ
యట్టి నీచులు పలుకుదు రావిధమున 690

క. మానసముకురంబుల స
జ్ఞానుల కోవిదుల భాగ్యజనులగు నెడలన్
మానదు విషయ కళంకము
కానరు సజ్జనుల వారు కలలో నైనన్ 691

ఆ. లాభహానులెవరు లక్షింపఁజాలరో
వారు శ్రుతివిరుద్ధ వచనములను
బలుకుచుందు రాముఁ బ్రభుగందు రే యంధ
మలిన హృదయము కురములుఁగలారు 692

సీ. సగుణ నిర్గుణరూప సందర్శన వివేక
శూన్యులఁ గల్పిత శుష్కవాక్య
జల్పన పరులను జక్రిమాయావశం
వదులై భ్రమించెడి వారిఁజగతిఁ
జచ్చుచుఁ బుట్టుచుఁ సంసార జలరాశి
కడగాన లేని దుష్కర్మ రతులఁ
దెలుపంగ శక్యమే తెప్పులున మతిసెడి
భూతంబు సోకిన బుద్ధిఁ దొఱఁగి

తే. సట్టుల జ్ఞాన మధుపానహత వివేకు
లరసి మాటాడ నేర్తు రే యట్టివారిఁ
దెలుపఁజెవిఁ జొఱనేర్చునే దివ్యబోధ
భ్రమవిడిచి కొల్వు శ్రీరామపదయుగంబు 693

క. గిరిరాజకన్యకా రవి
కిరణ సమానంబు లాలకింపుము నే నా
దరమున దెలిపెడు పలుకులు
కర మద్భుతముగ భ్రమాంధకార మడంపన్ 694

చ. నిగమపురాణ పండితమునిప్రకరంబ గుణంబునందునా
సగుణమునందు నించుక నిజంబగు భేదము లేద రూపుఁడౌ
నగుణుఁ డజుండు ప్రేమవశుఁడై నిజభక్తులఁ బ్రోచు వేళలన్
సగుణుఁడుగాఁగఁ దోచునని సమ్మతిగాన మొనర్చు నిచ్చలున్

చ. సలిలహిమోపలంబుల నిసర్గపు భేదము లేని కైవడిన్
వెలయుచునుండు నాసగుణ నిర్గుణముల్ హరిదశ్వకల్ప మా
యలఘుని దివ్యనామము భ్రమాంధతమిస్రమడంప మోహసం
కలితుఁ డతండటంచుఁ బలుకందగునే పరమాత్మరామునిన్ 696

తే. సచ్చిదానందుఁడౌ రామజలజమిత్రుఁ
డమిత మోహ తమస్విని యందు లేదు
సహజ తేజస్వియౌ రామచంద్రునందు
జ్ఞానసూర్యోదయపు వేళ కానఁబడదు 697

శా. జ్ఞానాజ్ఞానవిషాదమోదములుఁ దృష్ణాతృప్త్యహంకారముల్
మానంబాశయు జీవధర్మములు రామబ్రహ్మమానంద సం
ధానుండాద్యుఁ డనంతుఁ డీశ్వరుఁడు నంతర్యామి బోధోత్తమ
స్థానుం డవ్యయమూర్తి లోకవిబుధస్తవ్యుండు రాజాననా 698

చ. ఎవఁడు సమస్తలోకముల కీశ్వరుఁడుం బరలోకభర్తయౌ
నెవఁడు ప్రధానపూరుషుఁడు నెల్లవెలుంగుల కిక్కయైనవాఁ
డెవఁడు దినేశ వంశమణి యిష్టఫలప్రదుఁ డవ్విభుండె మ
ద్ధవుఁడని మ్రొక్కె శంకరుఁడు తన్మయుఁడౌచు నతోత్తమాంగుఁడై 699

తే. తెలియక జ్ఞానులతి భ్రమం దేవునందు
మోహగుణము నాపాదింతురు మూఢులగుచు
మొయిలు గప్పిన సూర్యుని మూర్ఖజనులు
మఱుఁగుపడెనని పలికెడి మాడ్కి నతివ 700

తే. కంటిపైనంగుళిం బెట్టి కనిన శీత
కరుఁడు రెండయి కనఁబడుకరణి మింట
ధూళిధూమాంధకారంబు దోఁచులీల
రామునకు మోహముంటయు రాజవదన 701

తే. విషయములు నింద్రియంబులు విబుధజీవు
లొండొకఁడుమీఱుఁ జైతన్యయుక్తివలన
నన్నిఁటికిఁ జేతనంబిడు నంతరాత్మ
రామచంద్రుండు సాకేతరాజతండు 702

చ. జడమగుమాయ యేవిభుని సత్వతమోహసహాయమొంది యే
ర్పడు ధ్రువమంచు నెల్లరనుభ్రాంతిల నారఘురామచంద్రుఁడే
కడు వెలుఁగొందఁజేయును వికాసవిహీన జడప్రపంచముం
బొడవగుమాయకుం బ్రభుఁడు బోధకునిక్కగుణాకరుండగున్ 703

ఆ. వెండి శుక్తియందు నెండమావులనీరుఁ
గలుగకుండు మూఁడుకాలములను
గాని భ్రాంతిదప్పఁగాఁ జేయఁగాఁబోల
దెవరికైన నిందిరేశుమాయ 704

ఆ. ఆవిధమున నీశ్వరాధీన లోకంబు
దబ్బరయ్యు దుఃఖదాయకంబు
తలనునఱకినట్లు కలఁగాంచి మేల్కొన్నఁ
గాని దుఃఖశాంతి గలుగనట్లు 705

తే. ఎవనికృపచేత దూరమౌ నిట్టిభ్రాంతి
యట్టికరుణాసముద్రుఁ డాద్యంతరహితుఁ
డైన శ్రీరామచంద్రుని గానమాచ
రించు వేదంబులు స్వబుద్ధిమించినంత 706

తే. చరణములు లేక యెల్లెడసంచరించు
శ్రవణములు లేక వినునెల్ల శబ్దములను
హస్తములు లేక కర్మంబులాచరించు
ముఖము లేకుండినను రసభోక్తయగును 707

తే. వాణిలేకున్న ఘనయోగి వక్తయగును
దనువు లేకున్న స్పృశియించుఁ గనులు లేక
కాంచు ఘ్రాణించు నాసిక కలుగకున్న
నతనిమహిమంబు వర్ణింపనలవియగునె 708

చ. అతని యలౌకికక్రియల నంతములంచును వేదముల్ బుధుల్
నుతులొనరించిపాడఁగ మునుల్ మదిధ్యానమొనర్ప భక్తసం
తతికనుకంప నెల్లెడహితప్రముఁడౌ భగవంతుఁ డాజగ
త్పతియగు కోసలప్రభుఁడు పంక్తిరథాత్మజుఁ డంగనామణీ 709

శా. కాశింజచ్చినప్రాణిసంతతికి నేఁ గైవల్యసౌఖ్యంబిడం
గా శక్తింగనినాఁడ నేవిభుమహాన్నామప్రభావంబుచేఁ
గ్లేశధ్వాంతసరోజమిత్రుఁడు మృగాక్షీ యాతఁడంతర్మయుం
డీశుం డెల్లచరాచరావళికి సీతేశుండు మన్నాథుఁడుల్ 710

ఉ. గోపదఖాతమట్టు లతిఘోరభవార్ణవ ముత్తరింపఁగా
నోపునరుండు సాదరతనూని స్మరించినమాత్రనే జగ
ద్భూప్రుని నామమొక్కపరిరూఢిగ విస్మృతినొంది పల్కినం
బాప మనేకజన్మకృతపాపవితసంచితమెల్ల భస్మమౌ 711

ఉ. ఆరఘురామచంద్రుఁ బరమాత్ముని భ్రాంతిలిసల్కితీవటుల్
నేరముగాదె పూర్ణజనీకర చారుముఖీయటుల్ హృదం
భోరుహమందు సందియముపుట్టిన జ్ఞానవిరాగయోగముల్
దూరముగా నెసద్గుణతతుల్ చనమోహము గ్రమ్మదేయనన్ 712

చ. భ్రమదొలఁగంగఁజేయు శివపల్కులవించుఁ గుతర్కమెల్ల దూ
రము సనరామచంద్రపదరమ్యకుశేశయభక్తి మీఱ న
య్యుమహృదయంబునంగల మహోగ్రకఠోరతరాతి సంశయం
బుమిహీరదర్శనంబొదవఁ బోయెడిమంచుక్రియందొలంగఁగన్ 713

ఉ. ఇందుధరాంఘ్రిపద్మములకెంతయు భక్తి మెయిన్ ముహుర్నమస్కృతా
ర్వందన మాచరించి చెలువంబగుపాణి సరోజయుగ్మముం
బొందుగ ఫాలభాగమున మోడ్పుఘటించి మనంబుప్రేమకున్
మందిరమైతగన్ వచనమాధురి యుట్టిపడంగనిట్లనెన్ 714

మ. శరదుగ్రాతప తుల్యమానక మహా సందేహమోహంబు నీ
కరుణాశీతల వాక్సుధాకరకళాకమ్ర ప్రసారంబుచే
హరియించెంగడుగూఢ భావమగు సత్యంబైన సీతామనో
హరు రూపంబుఁ గనుంగొనంగలిగె బ్రహ్మానందముంబొందితిన్ 715

ఉ. నీకృపచేత నాకిపుడు నెమ్మది దుఃఖవిదూరమయ్యె నీ
శ్రీకరపాదపంకరుహ సేవయొనర్చుటచే సుఖోన్నతుల్
చేకురె జ్ఞానహీననగు స్త్రీనయినంబడదాసి నౌటనం
జేకొని యిమ్మనేఁ దొలుత చేసిన ప్రశ్నలకుత్తరంబులన్ 716

ఉ. ఆనతియీఁగదే ప్రభుఁడనంతుఁడు బ్రహ్మము చిన్మయుండు వి
జ్ఞాన నిధానమవ్యయుఁడు సర్వహృదాలయ వాసియుంబరుం
డైన రఘూద్వహుండు గడునద్భుతమొప్ప నరావతారముం
బూనిన కారణంబన శివుండు బ్రసన్న మనఃసరోజుఁడై 717

చ. అగసుత నమ్రవాక్యముల కంచితరామకథాసుధారతిం
దగిలి వినంగ నెంతయును దత్తరమొందు తదీయదీక్షకున్
మిగులఁగ నాత్మ మెచ్చి యెలమింబహుభంగి ప్రశంస సేయుచున్
మృగధరలాంఛనుండు పరమేశుఁడు జ్ఞాననిధానమిట్లనెన్ 718

—: శ్రీరామావతార కారణము :—

క. కాగభుశుండి ఖగేంద్రుఁ
డౌ గరుడునితోడ విమలమా రామకథన్
వాగమృత పూరమొలుకం
బాగుగవర్ణించి తెలిపెఁ బార్వతివినుమా 719

క. అదితెలుపుటకుం బూర్వము
ముదితా రామావతార పుణ్యచరిత్రన్
హృదయానందకర రసా
స్పదమగు సద్దానిఁదెలియఁ బలికెదవినుమా 720

ఆ. ఆదరమున వినుము హరినామగుణకథ
లగణితము లపారమైనవగుట
నాదుబుద్ధికొలఁది నలినాక్షి తెలిపెద
వేదగేయమైన విష్ణులీల 721

చ. హరి యవతారకారణమిదంచు నిరూపణచేసి పల్కనె
వ్వరికిని శక్యమే మతికి వాక్కులకందఁగరాని జానకీ
శ్వరుని శ్రుతుల్ పురాణములు సాధులునించుకమాత్ర బుద్ధిగో
చరమగురీతిఁ బల్కెదను జ్ఞానవతీవిను నామతార్థమున్ 722

తే. ధర్మహానియు నభిమాన దర్పదనుజ
ఖలజనంబులు ప్రబలిన కాలమందు
సాధుభూసుర గోహింస జరుగునప్పు
డవతరించును హరివారి యార్తిఁదీర్ప 723

తే. రాక్షసుల సంహరించి నిర్జరులనిలిపి
వేదమర్యాద రక్షించి విశ్వమందు
నుజ్జ్వలంబగు తనకీర్తి నొలయఁజేయు
రామజన్మ కారణమిది రాజవదన 724

క. ఆయశముం గీర్తించుచు
హాయిగఁ దరియింతురు భక్తులగువారు ముని
ధ్యేయుఁడు వారలఁబ్రోవఁగఁ
గాయము ధరియించుఁ బెక్కుగతుల లతాంగీ 725

క. శ్రీరామ జన్మకిటువలెఁ
గారణములనేక గతులొకఁడు వేఱొకటిన్
మీఱు నతివిచిత్రంబులు
సారసదళనేత్రవినిన జన్మతరించున్ 726

క. అందొకటి రెండు దెలిపెద
నిందుముఖివినుమ యింది రేశుని ద్వారం
బందుండుజయుని విజయుని
నందఱెఱుంగుదురుగాదె హరికతిప్రియులన్ 727

ఆ. వ్రితులశాపమున హిరణ్యకశిప హిర
ణ్యాక్షులనఁగఁ దామసాసురులయి
శక్రమదహరణ ప్రచండవిక్రములయి
జగతిఁ బేరుఁగనిరి జయవిజయులు 728

క. కదనాజేయులలో దు
ర్మదుని హిరణ్యాక్షుఁజంపె మాధవుఁడు శుభ
ప్రద దంష్ట్రిరూపమున సద
మదమార్చి హిరణ్యకశిపు మానవహరియై 729

క. నిజభక్తాగ్రేసరు నిది
తిజకంటక వనగతప్రథిత కల్పకమున్
సుజనుం బ్రహ్లాదునిఁ బ్రో
చె జగత్పతి వానికీర్తి స్థిరమై వెలయన్ 730

క. ఆ వెనుక వారలిరువురు
రావణుఁడనఁ గుంభకర్ణరాక్షసుఁ డనఁగా
దేవతల కజేయులుగా
భూవిదిత బలాఢ్యులగుచుఁబుట్టిరి తరుణీ 731

మ. హరిచేఁజచ్చియు ముక్తినొందక భవంబందంగఁ తంబే మనం
ధరణీ నిర్జరదత్తశాపము త్రిజన్మల్ పొందఁగా నుండుటే
పరమాత్ముం డపుడున్ నిజాశ్రితహితప్రారంభుఁడై భక్తులం
గరుణింపంగ నరావతారమును బొందంగల్గె బింబాధరీ 732

క. కౌసల్యా దశరథులై
యాసర్వేశ్వరునిఁగనిరి యదితియును బుధా
గ్రేసరుఁడు కశ్యపుఁడు హరి
చేసెఁ బవిత్రముగ జగమశేషము రమణీ 733

మ. ఒక కల్పంబున నిర్జరప్రకరమున్ యుద్ధంబునం గెల్వ దై
త్యకులుండైన జలంధరుం గదిసి సేనాలంబుఁ గావించియుం
బ్రకటోదార సతీజనౌఘమణి దద్భార్యామహత్వంబునన్
వికలుం జేయఁగఁజాలనైతి నపుడావిష్ణుండు మాయాకృతిన్ 734

మ. వ్రతభంగం బొనరించె నయ్యమకు దేవవ్రాతకార్యార్థియై
మతినాకై తవముం గ్రహించి సతిసామర్థ్యోదతీక్ష శాపము
గ్రతనీయం గుతుకాభిలాషియయి శ్రీరామావతారంబునన్
హతుఁగావించె జలంధరుం దశముఖోగ్రాకారు నారావణున్ 735

చ. ఇదియొకకారణంబు జలజేక్షణ శ్రీరఘురామచంద్రుఁడై
మదనగురుండు పుట్టుటకు మహానుభావచ్చరితంబుఁ బ్రీతితో
విదితముసేయఁగావిని కవిప్రవరుల్ రమణీయ తత్కథా
పదమధురామృతంబొలుక వర్ణనచేసిరి పెక్కుభంగులన్ 736

క. నారదుఁ డొకపరి శాపము
నారాయణునకు నొసంగ నలినాక్షుండా
కారణమున రవికులమున
శ్రీరాముండగుచుఁ బుట్టె శీతాంశుముఖీ 737

మ. అని శ్రీకంఠుఁడు జానతీయవిని యత్యాశ్చర్య చేతస్కయై
మునిముఖ్యుండగు నారదుండు హరికిన్ మూఢుండు నా శాపమి
చ్చెనె విజ్ఞానియు సర్వకాలమును లక్ష్మీనాథభక్తుండు న
య్యును శాపంబిడఁ జక్రిదోషమదియేమో తెల్పుప్రాణేశ్వరా 738

క. మునిమనమున మోహంబుం
గనెనన నాశ్చర్యమొదవెఁ గావునఁ బురసూ
దన తెలుపుమనిన యుమఁగని
మనసిజసంహారుఁడు నగుచు మఱియిట్లనియెన్ 739

క. జ్ఞానియు నజ్ఞానియనం
గా నెవ్వఁడుఁగలఁడె ముజ్జగంబుల సీతా
జాని యెటు లెవనిఁజేసినఁ
బూనిక నతఁడట్లు నడచుఁ బోలలితాంగీ 740

క. మానమదముల విడిచి శ్రీ
జాని భజింపుమనెఁ దులసి సంసృతి వెతలం
బోనడఁచు రామచరితం
బూని భరద్వాజమునిని బోధింతుననెన్ 741

క. అన మునివాక్యముల కెంతయు
ననుమోదమునొంది పిదప హరుఁ డయ్యుమకున్
వినిపించె నేప్రకారము
మునవ్యోక్తుల నానతిమ్ము సూరివరయనన్ 742

-: నారదుని మోహము :-

చ. హిమగిరిగహ్వరం బొకఁ డహీనపవిత్రముగా నెసంగు న
య్యమరధునీమనోహర సరోజవిహారసమీర దేశమై
యమరుత దాశ్రమంబు హృదయంగమమైకనుపట్టె దేవసం
యమిగణపాళి నారదునకంచిత తత్త్వరహస్యవేదికిన్ 743

క. వృక్ష నదీ శైలంబుల
వీక్షించి రమాధినాథ విమలపదములం
దక్షీణభక్తి వొడమిన
దక్షుని శాపంబుదొలఁగఁదవిలె సమాధిన్ 744

ఉ. నారదుఁడావిధంబున ననారతగాఢ సమాధినుండ జం
భారిభయంబునొంది కుసుమాయుధునిం బరివారయుక్తునిం
జేరఁగఁబంచె నయ్యెడకుఁ జిత్తభవుండుఁ బ్రసన్నచిత్తుఁడై
కీరము నెక్కి యేగె రుచకేతన మొప్పఁగ నప్పుడొప్పఁగన్ 745

తే. కామలోభాత్ములగుజనుల్ కాకమట్లు
భయపడుచునుందు రెవ్వరినయినఁ జూచి
నారదుఁడు తనరాజ్యంబుఁ గోరి తపము
సేయుచున్నాఁడనుచు భీతిఁ జెందె వజ్రి 746

ఉ. కేసరిఁ గాంచి శ్వానము నికృష్టతమంబగు శుష్కశల్యముం
దీసి తొలంగఁ బాఱి పఱతెంచితిఁ గావునఁ దక్కె నెమ్మి పే
రాసను వచ్చు సింగమునకందక యంచుఁ దలంచురీతి నా
వాసవుఁ డుండలంచు నిజవర్తనకాత్మఁ ద్రపావిహీనుఁడై 747

ఉ. అంగభవుండు నారదుని యాశ్రమభూమికి నేగి నంత నే
రంగసువల్లరీ తరువరంబులు పల్లవపుష్పరాజితో
డంగడు నొప్పఁ గోయిల లెడందకు నింపుగఁ గూసె వింతగా
భృంగములున్ రొదల్సలిపె వీనులవిందుగఁ జైత్రరాకచేన్ 748

క. నిజమాయచే వసంతము
సృజియించెన్ మరుఁడు ప్రబలఁ జేయున్ మీన
ధ్వజ వహ్నిమంద గంధస
హాజ శీతలమారుతంబు లల్లన వీచెన్ 749

శా. రంభాద్యప్సరసల్ ఝషధ్వజకళా ప్రావీణ్యలత్యంత సం
రంభంబొప్పఁగ దానభేదవిధులన్ రంజిల్లఁగాఁ బాడుచుం
గుంభీంద్ర ప్రమదాలసాలసగతిం గ్రొంగావులం జిమ్ము హ
స్తాంభోజంబుల నెత్తి యాడిరి మనోజానందసంధానలై 750

ఉ. వారిసహాయతం గుసుమబాణుఁడు చాలఁ బ్రసన్నుఁడై మహో
దార నిజప్రభావరచితంబగు నూతనమా ప్రపంచముం
బార విహీనమానటులఁ బన్ని ననమ్మునిరాజుపట్ల నా
మారుని చర్యలెల్ల లవమాత్రమునుం బనిసేయకుండినన్ 751

ఉ. పాపియనంగుఁడాత్మ భయభావమునం భయమొందఁ జొచ్చె నా
శ్రీపతిప్రీతి రక్షణము సేయుచునుండిన వానిగౌరవం
బే పురుషుండుఁ బాపఁగలఁడే పరివారసమేతుఁడై భయో
ద్దీపితచిత్తుఁడై మరుఁడు దివ్యమునీంద్రపదంబులంటుచున్ 752

క. నాయపరాధము సైఁపుమ
యాయని దీనత మృదూక్తులాడినఁ గినుకం
జేయక నారదుఁడంపఁగఁ
గాయజుఁ డరిగెన్ స్వజననికాయముతోడన్ 753

చ. మదమును వోయి యింద్రసభమాని సుశీలము నాత్మకృత్యమున్
విదితముగాఁగ సర్వముఁ బ్రవీణతవర్ణనచేయఁగా సభా
సదులతి విస్మయంపడి ప్రశంసయొనర్చిరి నారదున్ శుభ
ప్రదుఁడగు విష్ణునెంచుచుశిరంబులువంచి నమస్కరించుచున్ 754

ఉ. కాముని గెల్చితంచు మమకారమునొందుచు నారదుండు నా
తో మదనప్రచారమునుదోఁప నెవచ్చి యెఱుంగఁజేయఁగా
శివుఁడిఁబ్రీతిఁ జెందుచు మునింగని యిట్లు హితంబుఁ దెల్పితిం
బ్రేమను నిన్ను వేఁడెదను విష్ణునిచెంత వచింపఁబోకుమా 755

క. నాకడఁ బలికినతీరున
వైకుంఠునితోఁ బ్రసంగవశమున నైనన్
నాకమునీంద్ర వచింపకు
మీకథ దాచుటయె మిగుల హితమనిపలుకన్ 756

తే. దేవమానికి నాయుపదేశమెల్ల
నచ్చలేదనె నుమకుఁ బినాకపాణి
విను భరద్వాజ యటమీఁది వింతకథను
భగవదిచ్ఛ మహాబలవంత మనుచు 757

తే. యాజ్ఞవల్క్యుండు వినిపించె నవ్వలికథఁ
బార్వతికి శంభుఁ డిట్లనెఁ బరమమైన
రాము ఘటనంబెవరికి దుర్లంఘ్య మబల
యన్యథాచరియింపంగ నలవియగునె 758

తే. అటుల నేఁజేయు నుపదేశమమర మాని
విశ్వసింపని చందంబు విశదపడఁగ
నాకడ ననుజ్ఞఁగొనిన యనంతరంబు
బ్రహ్మలోకంబునకు నేగెఁ బ్రమదమొసఁగ 759

—: నారదుడు విష్ణుదర్శనమున కేగుట :—

ఉ. చేత విపంచిఁబూని సరసీరుహనేత్రు గుణప్రపంచ సం
గీతముఁ బాడికొంచుఁ జనె క్షీరసముద్రముఁ జేరఁగాన వి
ఖ్యాతయశుండు నారదుఁడొకప్పుడు వేడుక శ్రీనివాసునిం
బీతదుకూలునిన్ నిగమవేద్యునినాద్యు ననంతుఁ జూడఁగన్ 760

చ. ఎదురుగ నేగి శ్రీశుఁడు మునీశ్వరుఁ దోడ్కొనివచ్చి సంతసం
బొదవఁగఁ బీఠమందుఁ బురుషోత్తముఁ డుంచి ఋషిప్రియయుక్తుఁడై
వదనసరోరుహద్యుతికి వన్నియ హెచ్చగురీతి నవ్వి నా
రద దయచేసినాఁడవు చిరంబగు కాలమునాటి కీడకున్ 761

చ. అనవుడు నారదుండు నలినాక్షునితో ననె శీతశైలభూ
మిని భవదీయభక్తి కలిమిం దృఢమైన సమాధినుండఁగా
ననవిలుతుండు వచ్చి చలనంబొనరింపఁగ నెంచె నామనం
బునను వికారమేమియును బొందకయుంటిని రస్తమోహినై 762

క. కావున నీదర్శనముం
గావింపఁగఁబట్టె నింత కాలంబనియెం
భావివశుఁడగుచు ముని సీ
తావిభు బలమైనమాయ దాటఁగవశమే 763

తే. వితతబలవంతమైన శ్రీవిష్ణుమాయ
మోహితులుగానివారలు మూఁడుజగము
లందుఁగలరె నిలింప సంయమినిఁ గాంచి
మృదుమధురవాఙ్నిరూఢి రమేశుఁడనియె 764

క. నినుస్మరియించిన మాత్రనఁ
జనకుండునె కామమోహజాలము మదముం
ఘనమగు నభిమానంబును
మునివర నినుఁబోలు నెవఁడు ముజ్జగములలోన్ 765

తే. జ్ఞాన వైరాగ్య విరహితుండైనవాఁడు
మోహవశుఁడగు నీవతిబుద్ధిశాలి
వనిశమును బ్రహ్మచర్యవ్రతానలంబి
వతులధీరుండ వోర్వ వేయయ్యనంగు 766

తే. అనిన నారదుఁ డభిమానమగ్గలముగ
సర్వమును నీదుకృపనన సరసిజాక్షుఁ
డనుపమాన కృపానిధి యతనిహృదయ
మందడరె నభిమాన వృక్షాంకురమని 767

చ. హితము మదీయభక్తులకు నెల్లపుడుం బొనరించుచుంట మ
త్ప్రతినముగాన నిందులకుపాయము నెంచి మనోభిమానమున్
హత మొనరించి సత్వరమయమ్మునికిన్ శుభముం ఘటింతు నేఁ
గుతుకముతోడ నంచును ముకుందుఁ డెడందఁ దలంచెనంతటన్ 768

క. కరివరదు పదములకు నత
శిరుఁడై సురమౌనిచనియెఁ జేతోవీధిం
గరమభిమానము వర్ధిల
హరియుం బ్రేరేచెనంత నద్భుతమాయన్ 769

హరిమాయచే నారదునకు శీలనిధియనురాజు పట్టణము గానవచ్చుట

క. శతయోజనవిస్తారం
బతి రమ్యంబైనపురము హరిపురి సౌంద
ర్యత మించు దానిఁ జేసెన్
వితతంబగు మాయమౌని వెడలుపథమునన్ 770

ఉ. ఆ నగరంబునందు మకరాంకరతీసమసుందరుల్ నరుల్
మానినులుండ్రు శీలనిధి మానవనాయకుఁ డేలు నప్పురిన్
సేనకు వేల్ కరుల్ హరులు వీరభటుల్ రథయూథమున్ మహా
సేనయుఁ గొల్చుచుండఁగ నశేషజనప్రమదప్రదాతయై 771

చ. అతఁడు శతేంద్రవైభవసమన్వితుఁడుం బలశౌర్యరూపధీ
యుతుఁడును నీతికోవిదుఁడు నుజ్జ్వలధైర్యపరాక్రముండు త
త్సుతరమనైనమోహమునఁ జొక్కఁగఁజేసెడిరూపవిభ్రమా
న్విత తగు విశ్వమోహిని భువిం బ్రమదాజనశీర్షరత్నమై 772

చ. సకలగుణాలవాల నవసారసలోచనుమాయరాజక
న్యక రమణీయతం బొగడనౌ న మనోహరతత్స్వయంవర
ప్రకటమహోత్సవంబునకు రాజకుమారకులెల్లవచ్చి రు
త్సుకతనువాహనప్రతతితోడఁ బురీవరముం జొఱంద్వరన్ 773

క. నారదుఁడా నగరంబునఁ
బౌరులచే వార్తలెఱిఁగి ప్రభునిలు సేరం
గౌరవమునఁ బూజించం
జారుతరాసన మొసంగి జనవిభుఁడంతన్ 774

క. తన కన్నియ మునిసముఖం
బునకున్ రావించిచూపి మునివర దీనిం
గని గుణదోషంబుల నె
మ్మనమునఁగని తెలుపుమనిన మౌనీంద్రుండున్ 775

క. వనితంగని వైరాగ్యం
బును మఱచెందన్నుమఱచె ముదమొదఁబొడమం
గనఁబడనీయక దాచెన్
మనమువ నీపగిది నారమణివర్ణించెన్ 776

ఉ. ఈయెలనాగ నెవ్వఁడువరించునో వాఁడమరుండు సంగరా
జేయుఁడునై చెలంగుఁదమిశీలనిధిప్రియపుత్రియెవ్వనిన్
నాయకుఁగావరించు భువనంబున సర్వచరాచరంబులుం
జేయుచునుండునిత్యమును సేవ మహామహుఁడైనవానికిన్ 777

క. అని కన్నియలక్షణములఁ
దనమనమున నెన్నికొనుచు ధరణీశునితో
విను సర్వలక్షణంబుల
గని నీసుతయని యథేచ్ఛగాఁ జనెఁ జింతన్ 778

చ. అటుల మునీంద్రుఁ డేగుచుఁ బ్రియంబున నానృపకన్యకన్ వరిం
చుట కనువౌనుపాయమును శోధనచేయుచుఁ దత్ప్రయత్నముం
బటుతరదీక్షఁ సల్పుచు జపంబుఁ దపంబును మాని చింతసే
యుటయును హా విధీయనుట యూరట లేక పరిభ్రమించుటల్

ఉ. చేయుచు రూపసంపదఁ బ్రసిద్ధివహించి లసించువాని శే
బ్రాయమువాని రాజసుత బాళివరించి జయప్రసూనమా
లాయుతకంఠుఁ జేయఁగఁ దలంచును గాన ముకుందుఁ జేరి నా
కీయఁగ వేఁడెదన్ సతులకింపగు చక్కదనంబు నాతనిన్ 780

ఉ. కాని విలంబమౌ హరినిఁ గాంచి మదీప్సితముగ్గడింపఁగా
నైనఁగలండె నాకు హరియంతటి మేల్ హితకారి యెయ్యెడన్
దానవవైరి యిట్టితఱినాకు సహాయ మొనర్పకుండు నే
ధ్యానమొనర్తునంచును రథాంగధరున్ స్తుతిచేయుచున్నెడన్ 781

మ. కరుణాసింధుఁడు కౌతుకప్రియుఁడు భక్తత్రాణపారీణుఁడా
హరి ప్రత్యక్షముగాఁగ లోచనయుగంబత్యంతముం జల్లనై
సురవాచంయమి సంతసించె వనజాక్షుంగంటి సిద్ధించు స
త్వరఁ గార్యంబని తెల్పె నెల్లకథఁ బద్మాక్షు జానికిం దీనతన్ 782

చ. అటు లెఱిఁగించి నాకొకసహాయ మొనర్పుము దేవదేవ నా
కెటువలెనైన సత్కరుణ నిమ్ము భవత్కమనీయరూపముం
జటినగునన్ నృపాలసుత సమ్మతితో వరియింపఁగా మఱొ
క్కటికలదే యుపాయము జగంబున సారసపత్రలోచనా 783

చ. హితమగునట్లు నాకటుల నేయొనరింపుము సత్వరంగృపా
ముతి భవదీయదాసుఁడను మాధవయన్న స్వమాయఁడాబలో
న్నతిఁగని యాత్మలోఁ బలసె నవ్వుచు దీనదయాళుఁ డిట్లనెన్
యతివర కల్లగాదు వినుమా భవదీయహితంబు సల్పెదన్ 784

ఉ. రోగి యపథ్యమై తనరు రుచ్యపదార్థముఁ గోర వైద్యుఁడుం
బాగొనరింప వానికది ప్రాప్తిలఁజేయక కాచుకైవడిన్
యోగివరేణ్య నీకును గృపోన్నతి నే హితమాచరించెదన్
వేగమ యంచు విష్ణుఁ డరవిందదళాక్షుఁ డదృశ్యుఁడై చనెన్ 785

మ. హరిమాయావశుఁడై విమూఢమతియై యాసంయమీంద్రుండు శ్రీ
ధరుగూఢోక్తులెఱుంగలేక చనె నుత్సాహంబు దీపింపఁగా
ధరణీనాథసుతాస్వయంవర సభాస్థానంబుఁ జేరంద్వరన్
వరియించుం దను రాజకన్యయను విశ్వాసంబు రెట్టింపఁగన్ 786

క. నృపవరు లాసనములపై
నుపవిష్టులుగాఁగ మౌనియును మోదముతో
నుపలక్షించి మఱియుం
జపలాక్షి యొరున్ వరింపఁజాలదటంచున్ 787

చ. అపరిమితానురాగమున శౌరిమహోజ్వలమూర్తినైన నన్
నృపసుత చూచుమాత్రముననే వరియింపదెయంచు నెంచుచుం
దపసి ముదంబునొందునెడఁ దద్గతకాంక్షుఁ గృపానిధానమై
విపులకు రూపమిచ్చె నరవిందదళాక్షుఁడు దివ్యమానికిన్ 788

క. ఆచరితం బెవ్వరికి న
గోచరమగుటన్ మునీంద్రకుం జరుఁగనుచున్
ఖేచరముని నారదుఁడని
లేచి నతుల్ చేసిరా స్థలింగలవారల్ 789

తే. కౌతుక ప్రియులౌ రుద్రగణము లిరువు
రవని సురవేషధారులై యచటనుండ
మౌనియును నాత్మరూపాభిమానియగుచుఁ
జేరి సభవారి సరసనాసీనుఁడయ్యె 790

ఆ. ఒరు తెఱుంగకుండ నుర్వీసురద్వయం
బగుచునున్న గణము లతనిఁ జూచి
వ్యంగవాక్యములను బలికి రా నృపకన్య
వలచు నిన్నె వీని చెలువుఁ గనిన 791

క. హరియెంత జగన్మోహన
కరరూపం బొసఁగె నితనిఁ గన్యక కనినన్
సరసిజలోచనుఁడే యని
వరియించి లతాంతమాల వైవదె గ్రీవన్ 792

క. అని పలుకుచు లోలో మునిఁ
గనుఁగొని నవ్వఁ గొన నా ముని ఘనమోహావశం
బున నైమఱచిన కతమున
వినియుం గనఁడయ్యె వారి వికటోక్తు లెదన్ 793

-: రాజకన్యక నారదుని మాని శ్రీహరుని వరించుట :-

ఉ. అట్టి విచిత్రమౌ చరిత మన్యు లెఱుంగరు రాజకన్యకం
గట్టెదుటం గనంబడిరొ నారదుఁ డేనపుఁ గోతిమోముతోఁ
నట్టి కనుంగొనం భయమునందఁగఁ జేయు వెడంద మేనితోఁ
బొట్టిదమౌ తదాకృతికి భీరమృగేక్షణ క్రోధమొందఁగన్ 794
రాజసురాళి యోయనఁగ రాజకుమారి సఖీసమేతయై
ఉ. రాజకుమారులం గనుచు రాజితమౌ జయమాలపాణి పం
కేజమునం గ్రహించి పరికించి చరించుచునుండె నప్పుడా
రాజసభాంతరంబునను రాజుల కుల్లము పల్లవింపఁగన్ 795

ఉ. నారదుఁడున్న దిక్కునకు నాతిపరాకుననైనఁజూడకా
తీరున రాజపుత్రిలను దేఱికనుంగొనుచుం జనంజనన్
సారెసారెకు ద్భ్రమితస్వాత్ముని వ్యాకులమందసాగఁగా
మారిగణద్వయంబు దరహాసము చేయుచుఁ జూచుచుండఁగన్

మ. కరుణాఖండుఁడు సరోజలోచనుఁడు సాక్షాత్కారుఁడై తోఁచెనుం
దరభూపాల శరీరధారియయి యత్యంతప్రసన్నాత్మయై
ధరణీనాథ కుమారికై చేఁదమిఁ బూదండంబయో జాక్షుకం
ధరమందల్లననెల్ల భూమివరబృందమ్ముల్ నిరాశంగనన్ 797

క. కన్నియఁదోడ్కొని చనియెన్
వెన్నుఁడు సురవరాని మోహ వివశాత్ముఁడై
యెన్నఁగరాని వ్యథన్ముని
యున్నమణింగోలుపడి నయోజన్ వగచెన్ 798

క. దరహాసితాననతన్ శశి
ధర గణయుగముం భవద్వదనము ముకురమం
దరయుమని పలుకుచున్ స
త్వరఁబఱచెం భీతినచటఁ దడవుండక యే. 799

-! నారదుఁడు రుద్రగణముల శపించుట :-

చ. జలములలోనఁ గాంచెముని సత్తముఁ డాత్మముఖంబుఁ గోతిరూ
పలవడియుంట వెంటనె మహాక్రుధతో వ్యధమీఱఁగాల య
జ్వలనునిఁబోలె మండిపడి శాపమొసంగె నిశాచరాకృతుల్
గలిగిజనింపుఁడంచుఁ బురఘుస్మరుకింకరులన్ మహోగ్రతన్ 800

క. నను గని నవ్విన కతమునఁ
గనిరీ ఫలమధిక పాపకఘటాత్మకులై
యనెనని మిషముని మునులం
గని నవ్వినపాప ఫలముఁగనరే యెవరున్ 801

చ. జలములలో మఱొక్కపరి సంయమిగాంచె నిజాస్యమెప్పటి
ట్టులనయినన్ మనంబునఁగడుం గ్రుధతీఱక మోవితోటిగ్రేలం
జల నిధికన్యకా వదనసారస సారసమిత్రుఁడైన యా
జలజదళాక్షు పాలికి జెనన్ సిగవీడనడల్ తడంబడన్ 802

చ. చనుచుమనంబునందలఁచె శాపమొసంగెదఁ జక్రికట్టులం
బనుపడదేనిఁ జచ్చెదనుపాయము లేదిఁకనంచుఁ బోవుచోఁ
గనఁబడె మార్గమధ్యమునఁ గల్మిమిటారినిఁగూడి సోయగం
బున మిఱుమిట్లుగొల్పు నృపపుత్రికతో నెదుటన్ ముకుందుఁడున్.

చ. అనిమిషమౌనిఁగాంచి వనజాక్షుఁడ నెన్ మధురోక్తులన్ మహా
మునివర వ్యాకులత్వమునఁబోయెద వెచ్చటికన్న నెమ్మనం
బునఁగడుక్రోధము బ్రహారి మోహిత విస్మృతబోధుఁడై ముకుం
దుని వలనంగదా జగతిఁదోఁచితిఁ బొల్పడినవ్వులాటకున్ 804

క. అనుచుం దన మనమునన
య్యనిమిషముని తలఁచి తలఁచి సామర్షమునం
గనలుచు నవ్వనమాలిం
గని సైపఁగలేక తీవ్రగతి నిట్లనియెన్ 805

చ. ఇతరుల సంపదంగని సహింపఁగఁజాలనివాఁడ వీర్ష్యయున్
మతిఁగపటంబు మెండు సురమండలిఁబ్రేరణచేసి యయ్యుమా
పతిఁగడువెఱ్ఱిఁజేసి విషభక్షణసల్పఁగఁజేసినావహం
పతి మథియించుకాలమునఁ బంకరుహాక్ష స్వలాభకాంక్షచే 806

ఉ. మదిరన్ రాక్షసకోటికిచ్చితివి పద్మంగౌస్తుభంబున్ మహా
ముదిత స్వాంతుఁడవై గ్రహించితివి శంభుండుంగడుంబేలయై
యిదిలోనెంచక మ్రింగె నన్విషము నీ వెంతేనియున్ స్వార్థ సం
పదఁగాక్షించి చరింతు నిత్యకపట వ్యాపారపారీణతన్ 807

క. పరమస్వతంత్రుఁడ వికం
బరుఁడధికుఁడు లేఁడు తలఁచుపని యేయగు నే
లురు హాని హానిమేలుగఁ
బరఁగించియు వెతయు ముదముఁబడయ వొకపుడున్ 808

-: నారదుఁడు విష్ణుదేవుని శపించుట :-

శా. శంకాహీనతమాయచే సకలమున్ సాధించి భేదింతు హ్యా
త్పంకేజంబుననిల్చియుండు సతము త్సాహంబు నీకున్ నిరా
తంకోల్లాసి వి లేదు బాధ శుభ మొందన్ హానివాటిల్ల ని
న్నింకన్ బాగొనరింపఁడింతనఱకెం దెవ్వాఁడునున్ మాధవా 809

ఉ. ఇప్పుడు తప్పిపోనఁదగ దెయ్యెడకుం భవదీయకృత్యమం
దొప్పు ఫలంబుఁగైకొనెద వూరకపోవునె నన్నుమాయచేఁ
గప్పి నృపాలరూపమును గైకొని మోసముచేసినాఁడవా
చొప్పున మేనుఁగైకొని వసుంధరఁబుట్టుము మద్వచఃస్థితిన్ 810

ఉ. వానరరూపమిచ్చి నను వంచనచేసితివందుచేత నా
వానరు లేసహాయులయి వర్తిల నాకపకారివౌటచే
మానినిఁగోలుపోయి ధృతిమాలితపించెదు గాక యంచు న
మ్మౌని శపించెఁ దీవ్రముగ మాధవుఁ గ్రోధపరీతచిత్తుఁడై 811

క. కోపమునొందక సురముని
శాపము శిరసావహించి సలిపెన్ వినతుల్
శ్రీపతి గుణనిధి హర్షో
ద్దీపితమతి సంహరించె దిటవగుమాయన్ 812

ఆ. మాయతొలఁగినన్ రమాకాంతయును రాజ
కన్యకూడ నచటఁ గానబడక
యున్న భీతినొంది యో యార్తజనరక్ష
నన్నుఁగావుమనుచు నారదుండు 813

మ. చరణాబ్జంబులుపట్టియో వరద నా శాపం బసత్యంబుగాఁ
బరఁగన్ నామది నిచ్చ చేసెదను నేఁ బాపుండనై మోహినై
యరయన్ లేక దురూక్తులాడితిని యత్యంతంబు నాపాపమే
కరణింబాయును దీనవత్సల కృపాకంధీ రమానాయకా 814

క. అని వేఁడిన విష్ణుండనెఁ
జని శివనామాళినిష్ఠ జపమొనరింపన్
మనమునకు శాంతి కలుగును
మనసిజహరుకంటె లేరు మత్ప్రియు లెవరున్ 815

శా. ఈవిశ్వాసము మానకెల్లపుడు సర్వేశుం బురారిన్ మదిం
భావింపందగు నెవ్వఁ డీశ్వరకృపాపాత్రుండౌ నవ్వానికే
యావిర్భావమునొందు డెందమున సత్యంబైన మద్భక్తియున్
నీవీభావమునిల్పి ధాత్రినెట నేనిన్ సంచరింపందగున్ 816

తే. అటులఁ జరియించు దేని డాయంగ వెఱచు
మాయ నిన్నని పన్నగశాయి చనఁగ
నారదుఁడు రామగుణగాన నందహృదయ
కమలుఁడగుచును సత్యలోకమునకరిగె 817

క. అరుగు నెడ మార్గమున నా
హరగణములు మోహరహితులై భయభక్తి
స్ఫురణన్ సురముని చరణాం
బురుహద్వయిఁ బట్టి దీనముగ ననిరిటులన్ 818

మ. అపరాధం బొనరించినాము మునిరాయా తత్ఫలంబందినా
ము పురారాతిగణంబులో మదులమై భూమీసురాకారతన్
గృప నీశాపముఁ గ్రిమ్మరించి మము రక్షింపంగ దేయంచు వి
న్నపముం జేయఁగ దీనవత్సలుఁడు గానన్ నారదుండిట్లనెన్ 819

మ. ఇలనక్తంచర జన్మమంది యెదురింకెవ్వారులున్ లేమిచే
బలతేజంబుల వైభవంబునను దుష్ప్రారంభులై లోకముల్
లలి మీఱాక్రమణంబు సేయుతఱి లీలామానవాకారుఁడై
కలశాంభోనిధి కన్యకాప్రియుఁడు గిన్కంగూల్చె మిమ్మాజిలోన్

తే. ముక్తినొందెదరటమీఁదఁ బుట్టువుండ
దెన్నఁటికి మీకుజగమున నన్నవారు
నమరముని చరణముల కత్యంతభక్తి
నమ్రశిరులయి చనిరి కొన్నాళ్ళుగడువ 821

క. రాక్షసులై జనియించిరి
సాక్షాద్విష్ణుండు మనుజ జన్మమునొందెం
దీక్షన్ సురసుఖదుండై
దక్షత భువిభారమడఁప దనుజాంతకుఁడై 822

ఉ. ఈవిధి వాసుదేవుని యనేకమనోహర సౌఖ్యదాయకం
బైవిలసిల్లు జన్మములు నద్భుతకర్మములుం జెలంగు నా
దేవుఁడు కల్పకల్పమున దివ్యముగా నవతారమొందుచున్
శ్రీవెలయన్ విలాసములఁజేయు విచిత్రమనోజ్ఞభంగులన్ 823

చ. ఎపుడెపుడట్టి సచ్చరిత మీభువనంబున నుల్లసిల్లు నో
యపుడపు డాత్మవేదులగు నార్యులు మౌనులు సంగ్రహించి త
ద్విపుల పవిత్రగాథలను వెల్లడిగా రచియించి పాడఁగా
నపరిమితంపుటబ్బురమునందరె నేర్పుకులాలకించుచున్ 824

తే. హరియనంతుండఖిల శుభంకరములైన
యతనికథలు ననంతంబు లలఘుమతులు
వినఁబలుకనొప్ప శ్రీరామవిభుచరిత్ర
పాడవశమౌనె కోటికల్పములకైన 825

క. హరిమాయా మోహితులౌ
దురు జ్ఞానులు మునులుఁగూడఁ దుహినాచల పు
త్రి రఘుపతివరుఁడు కౌతుక
కరుఁడు శుభంకరుఁడు భక్తగణసులభుండున్ 826

క. సురనర మునివరులందున్
హరిమాయామోహితాత్ములై యుండని వా
రరయఁగ లేరా మాయా
వరు నచ్యుతు రామభద్రు భజియింపఁదగున్ 827

ఉ. ఇంకొక కారణంబువిను మీశ్వరుఁడవ్యయుఁడచ్యుతుండు రూ
పాంకగుణాది శూన్యుఁడు ననంతుఁడు బ్రహ్మముకోసలేశుఁడై
పంకజమిత్రరాజకులపావనుఁడై యుదయించినందు కో
శాంకరి తద్విచిత్రకథ సర్వము నీకెఱిఁగింతుఁ బ్రీతితోన్ 828

వ. అనుజసమేతుఁడై వనమునందుఁ జరించెడి రామభద్రునిం
గనికనినట్టి వెఱ్ఱినిఁగాఁజేయఁబెట్టెడి నేటిదాక నో
వనజముఖి భ్రమామయముఁ బాఱఁగఁదోలెడి రామలీలలన్
విని చెవి నాలకింపుమిఁక వేడుకమన్మతి కందినట్లుగన్ 829

తే. యాజ్ఞవల్క్య మహాముని యనియె నిట్లు
వినుభరద్వాజ హనుమదుల్ వినిభవాని
మనమునఁ బ్రియంబు సంకోచమును జనింప
దరహసితముఖి కాఁగ శంకరుఁడు పలికె 830

క. రామావతార హేతువు
సోమార్ధధరుండు శైలసుతకుఁ దెలిపెనే
నో మునివర యెఱిఁగించెదఁ
గామిత శుభదంబు ఘోరకలిమల హరమున్ 831

## .: మనూపాఖ్యానము :.

క. స్వాయంభువ శతరూపలు
నాయుగ్మంబులకు సృష్టనరచయమ్ము తదా
మేయానుభావ మాశ్రుతి
గేయంబై వెలయునిపుడు క్షితితలమందున్ 832

క. ఉత్తానపాదుఁడనఁగాఁ
దత్తనయుఁడు భక్తధృవునితండ్రి కనిష్ఠుం
డుత్తమగుణుఁడు ప్రియవ్రతుఁ
డత్తొలి చదువులుఁ బురాణమతని నుతించున్ 833

ఆ. కన్యయొకతెకలిగెఁ గర్దమప్రియపత్ని
దేవహూతి యాదిదేవు సాంఖ్య
శాస్త్రతత్వవేత్త జగదేకగురుఁడైన
కపిలుగర్భమందుఁ గన్నతల్లి 834

క. స్వాయంభువ రాజేంద్రుం
డాయతమతి రాజ్యమేలె నధిక తరంబౌ
హాయనములు నిపుణుండై
న్యాయంబున భగవదాజ్ఞ నడపుచుఁ బ్రీతిన్ 835

ఉ. అంతటఁజింతనొందె హృదయమ్మున నమ్మనువింటనుండి నే
నెంతయుఁబొందితిన్ ముదిమి నీవిషయంబులపై విరాగ మొ
క్కింతయుఁబుట్టకుండె నిఁక నేమన వ్యర్థమునాదుజన్మ శ్రీ
కాంతుని భక్తి నల్పకని గ్రుక్కనఁబుత్రులఁ బిల్చివారికిన్ 836

ఉ. రాజ్యమునొప్పగించి తనరాణియుఁ దానును వీతరాగులై
పూజ్యముఁబుణ్యతీర్థయుతపూతముసాధకసిద్ధిదంబు సం
భోజ్యమనోజ్ఞమోక్షరమపొందొనగూడి సుఖించుమౌనిరా
డాజ్యకృతార్చనజ్వలితహవ్యవహాన్వితనైమిశాటవిన్ 837

శా. శాంతాసంయుతుఁడై మనుక్షితిపుఁడాకారంబులంగొన్న యా
శ్యాంతోద్దీప్తవివేకభక్తులనఁగా నానందమేపారఁగాఁ
సాధుతా దాంతరనిత్యయానములఁ జక్కం జేరె మౌనీంద్రులుం
దాంతుల్ శాంతులు సిద్ధసంఘమును మోదంబందివీక్షింపగన్

కం. ధేనుమతీ తీరంబున
మానవవర్యుఁడేగి నిలచి యతివయును సతం
బానది నిర్మలజలముల
స్నానంబొనరించిరంత సంయమివరులున్ 839

కం. ధీరుఁడు ధర్మధురంధరుఁ
డా రాజర్షింద్రుఁడనుచు సరసి ప్రియమునం
జేరువఁగల తీర్థంబుల
వారలదోఁగంగఁ జేయ వారతిభక్తిన్ 840

ఉ. మౌనిజనార్హవస్త్రముల మైధరియించి కృశించినట్టి వా
మేనులతోడ సజ్జనయమిప్రకరాన్వితమౌనసభన్ మహా
ధ్యానముతోఁ బురాణములఁ దజ్ఞులు దెల్పఁగనాలకించుచున్
జ్ఞానులబోధలన్ వినుచు సంతసమొందుచునుండి రంతటన్ 841

తే. ద్వాదశాక్షరీమంత్రసంధ్యానసక్తు
లగుచు శ్రీవాసుదేవ పాదాంబురుహము
రందపాన పరాయణానందపరవ
శాత్ములై నిత్యముండి రయ్యాలుమగలు 842

శా. కందాహారసుశాకభక్షణ ఫలగ్రాసంబులన్ సచ్చిదా
నందబ్రహ్మపరాయణాత్ములయి కొన్నాళ్ళుండి యామీఁద గో
విందుంగూర్చి తపంబొనర్చిరి మనోవృత్తిం ద్రియానీతమై
స్పందంబొందఁగనీక వారిఁగొని దుంపల్ పండ్లువర్జించుచున్ 843

చ. అగుణుఁడనాదిపూరుషుఁ డనంతుఁడఖండుఁడటంచు నాత్మనే
జగదధినాథుఁ జింతనముసల్పుదురో పరమార్థవాదులా
విగతసమస్తకిల్బిషుని విష్ణునిదర్శనలాభ మొందఁగా
మగనికి మానినీమణికి మానదు కాంక్ష నిరంతరంబెదన్ 844

ఆ. నేతినేతియనుచు నిగమంబు లేచిదా
నందుసర్వమయు ననంతునభవు
నిరుపమానునగుణు నిరుపాధికుని నిరూ
పణమొనర్చునట్టి పరమపురుషు 845

ఆ. ఎవనియంశమున ననేకాచ్యుతాంబుజ
భవ మహేశ్వరులు సుపర్వకోటి
సంభవింతురట్టి సర్వోన్నతోన్నతు
సూక్ష్మసూక్ష్ముఁ బరమ శుద్ధబుద్ధు 846

క. సేవకవశుడై భక్తులఁ
బ్రోవన్ లీలాశరీరములఁ దాల్చుననం
గా వేదమది యథార్థం
బై వెలసిన నభిమతార్థ మందమెయనుచున్ 847

ఉ. ఈవిధిషట్సహస్రమగునేం డ్లుదకంబునుమాత్రగ్రోలి
సద్భావముతోడ సప్తమపువర్షసహస్రము వాయుభక్షణన్
శ్రీవనితావరాంఘ్రి సరసీరుహలగ్నమనోమిళిందులై
భూవిభుఁడుందలోదరియుఁ బూనిననిష్ఠఁ దపంబుసేయుచున్ 848

చ. అదియునుమాని వత్సరసహస్రదశంబొక పాదమే ధరం
బదిలముగాఁగనూనుచు నపారతపంబొనరించుచుండఁగా
ముదమున నమ్మనుప్రభుని ముందఱనిల్చిరి వచ్చి బ్రహ్మయున్
త్రిదశవిపక్షవైరియును దీరగుకొన్నెలఁదాల్చువేలుపున్ 849

ఆ. వచ్చి పెక్కుసార్లు వరములనిచ్చెద
ననుచు వేడుమనుచు నాశపఱుప
నిచ్ఛ సేయరైరి యే వరంబులనైన
నస్థిమాత్రశేషితాంగులయ్యు 850

ఉ. లేశముఁ గ్లేశమొందక చలింపకయుండు నిలేశునింతి స
ర్వేశుఁ డనన్యభక్తిఁ దనకిష్టతపస్వులుగాఁ దలంచి యా
కాశమునుండి పల్కె నికఁ గాంక్షితమిచ్చెద వేఁడుఁడంచు నా
వేశకృపామృతాంబువుల వెల్లువమజ్జనమొందఁ జేయుచున్ 851

చ. హతుని సజీవుఁ జేయగల హరివచోనివహంబు వీనులం
దతిరయమారఁ జొచ్చి హృదయంబున వ్యాప్తముగాఁగ దేహముల్
సతికి నృపాలమౌళికిని జక్కగనొప్పెను హృష్టపుష్టతా
న్వితములుగాఁగ నాఁడె యటవిం జొరవచ్చిరి యింటినుండి నాన్

మ. మనురాజాయమృతోక్తులన్ వినుచు రోమాంచపరిఫుల్లాంగుఁడై
ఘనమైయాగఁగరాని ప్రేమ హృదయాక్రాంతంబుగా నెంతయున్
వినయంబొప్పఁగ దండవత్ప్రణతుఁడై విశ్వేశ్వరుం గూర్చి యి
ట్లనియెం భక్తసురద్రుమా సురగవీ యానందసంధాయకా 853

క. నీపాదాంబుజ రేణువు
లాపరమేష్ఠియును హరియుహరుఁడుం బ్రీతిం
జేపట్టి మొక్కుచుందురు
ప్రాపింతువు సహజముగనె భక్తజనులకున్ 854

చ. సకలచరాచరంబులకు స్వామివి సర్వసుఖప్రదాతవై
యకలుషభక్తిఁ గొల్చెడి జనాళినిఁ బ్రోచెడివాఁడ వీవ కా
కిఁక నొకరుండు లేఁడు పరికించి యనాథహితంబొనర్తు విం
చుక మనుసత్కటాక్షమునఁ జూచెదవేనిదె విన్నవించెదన్ 855

చ. హరుఁడు నిరంతరంబు హృదయంబున నిల్పు స్వరూపమెద్దియో
పరమమునీంద్రులెల్లపుడు బాయక దేనినిఁబొందఁగోరి దు
ష్కరనియమ వ్రతంబులను సాధనముల్బ్రచరించుచుందురో
కరమునిరీహుఁడై వెలయు కాగభుశుండి ఋషీంద్రపాళికిన్ 856

తే. హృదయమానస సరసిలో మదమరాళ
మై విహారము సేయు నెయ్యది సగుణము
నిర్గుణంబని వేదముల్ నిరుపమాన
ముగఁ బ్రశంసయొనర్చునా ముఖ్యమైన 857

తే. రూపమును మాకుఁగనులారఁ జూపుమనుచుఁ
బ్రార్థనము సేయుదును దీనపాల దుఃఖ
దూరకృపఁజూడుమనుచు మాధుర్యమెసఁగఁ
బలుకు నృప దంపతులమృదూక్తులకు నలరి 858

ఆ. భక్తవత్సలుండు పరమ కృపానిధి
వితత సౌఖ్యకరుఁడు విశ్వమయుఁడు
స్వప్రకాశుఁ డజుఁడు సాక్షాత్కరించెను
దంపతులు కృతార్థతం జెలంగ 859

క. నీలమణి నీలజలదను
నీలసరోరుహము మేని నిగ్గుంగనినం
జాలఁ దలవంచు సిగ్గునఁ
జాలదు సౌందర్యమునకు శతకోటిమరుల్ 860

సీ. శారదరాకా నిశాకరాకారంబుఁ
బరిహసింపఁగఁజాలు వదనమలరఁ
జారుకపోలముల్ చక్కని చుబుకంబుఁ
గంబు సమానమౌ గళము వెలయఁ

బద్మరాగద్యుతిం భాసిల్లు నోష్ఠంబు
దంతపంక్తులును గుందముల గెలువ
సెనలేని సౌందర్యమున కిమ్మగుచునొప్పు
నాసిక కనఁగ నానందమొనయ.

తే. నందమా సాంద్రచంద్రికాత్యంత ధవళ
కాంతినిరసించు హాసంబుకడలఁ బర్వ
సుందర నవీన సరసీజ శోభమీఱు
చక్షురమృత కటాక్షవీక్షణము దనర. 861

సీ. సుమశరాసనువింటి సొబగుఁ గ్రిందొనరించు
పొలుపింపు దులకించు భ్రూయుగంబు
సెలచెల్వు నిరసించు నలికంబునను సొంపు
గులుకఁ గాంతులఁ జిమ్ముఁగల తిలకముఁ
దళుకుఁజెక్కుల దగద్ధగిత దీధితులొల్క
చుండు వరమకరకుండలములు
శిరమందు నురురత్న గురురుచిందము మొల్లఁ
బరిహరించు కిరీట ప్రకటదీప్తి

తే. తేటి మొత్తంపు జిగిమించు నీటుగలిగి
తళతళలనొప్పు వక్రకుంతలచయంబు
నమల శ్రీవత్సవనమాలికాభిరాము
మగుచు లక్ష్మికి నాటపట్టగు నురంబు. 862

ఉ. చారుసువర్ణరత్నరుచిజాలముచే దిశలెల్ల దీప్తివి
స్ఫారములై వెలుంగఁ జెలువంబలరారెడు హారపంక్తి కే
యూరములంగుళీయకము లుజ్జ్వలకాంతుల వింతసూప సిం
గారము సారమింకెట జగంబుల లేదనఁ బొల్చుపొల్పునన్. 863

తే. కేసరి స్కంధసదృశమై భాసురంపు
భుజములకు రత్నకాంచన భూషలమరఁ
జారు యజ్ఞోపవీతమంసమున వెలయ
సమదగజశుండదోర్దండయమళ మెసఁగ. 864

మ. ఘనకోదండ శరంబులుం గరములం గ్రాలన్ నిషంగంబు సొం
పెనయంగాఁగటి మించుమించు జిగితో హేమాంబరం బొప్పఁగాఁ
గనువిందౌ నుదరంబునందుఁ ద్రివళుల్ గన్పట్టఁగా నాభిపా
వనమై నాయమునానదీ పృథుతరావర్తద్యుతిన్ మీఱఁగన్. 865

తే. ముని మనోబంభరావాస ఘనతమించు
చరణ సరసీజయుగళ భాస్వరతఁగాంచి
వర్ణనమొనర్ప శక్యమే వాణికైన
మొగములొక నాల్గుగల యామె మగనికైన. 866

శా. శంపాసంపద పెంపునొంపఁగలమై చక్కందనంబొప్పఁగా
నింపొందందన వామపార్శ్వమున నీయారేడు లోకాళి సృ
ష్టింపం బెంపఁగఁ ద్రుంపఁగా రణమునై చిచ్ఛక్తియుద్దీప్తి రా
ణింపన్ సొంపగుమూర్తి నార్తిహరుండౌనిస్తుల్య తేజోనిధిన్ 867

ఉ. ఏయమయంశచేతఁ బ్రభవించిరి సర్వగుణాలవాలతా
శ్రీయును వాగ్వధూటి శశిశేఖరియుం భ్రుకుటీవిలాసముం
జేయఁగ నెల్లలోకములు సృష్టినిజెందునో యట్టిసీతనే
జాయగ వామపార్శ్వమునఁ జక్కగ నిల్పిన రామచంద్రునిన్ 868

ఉ. కాంతిసముద్రుఁడై వెలయు కాంచనచేలుని రూపవిభ్రమం
బింతియుఁ దానుభూపతి తదేకవిలోకన మాచరించి య
త్యంత ముదంబునొంది తనివందక మాటిమాటికిన్ రమా
కాంతున నంతఁజూచిరి వికాసముతోఁ గనుమోడ్పనొల్లమిన్ 869

శా. తుష్టిన్ మేనులు విస్మరించి పులకల్ తోడ్తో జనింపంగ నా
విష్ట ప్రేమరసంబు వెల్లివిరియన్ వేగంబునం దండవ
త్సాష్టాంగ ప్రణతుల్ ఘటించి చరణద్వంద్వంబుఁ బాణిద్వయిన్
హృష్టస్వాంతతఁ బట్టఁగాఁ గరుణసర్వేశుండు సేచాచుచున్ 870

ఉ. శీర్షములంటి పాణిసరసీజమునం బయికెత్తి నేమహా
హర్షమునొందితిన్ హృదయమందున మీకుఁగలట్టివాంఛ రా
జర్షభ వేఁడుమిచ్చెదను చాగము బాగుగ నాచరించుదు
ర్ధర్షఫలప్రదుండనని తప్పక నమ్ముఁడనన్ ముదమ్మునన్ 871

చ. ప్రభువచనంబులన్ వినుచుఁ బాణిసరోరుహముల్ మొగిడ్చియో
శుభకర నీపదాబ్జములఁ జూచుటఁ దీఱెనుసర్వవాంఛలున్
విభుఁడవు నిన్ గనుంగొనియు వేఁడురు కోర్కుల వేలయైన దు
ర్లభమగు నొక్కకోరిక తలంపుననున్నది చాలగొప్పగన్ 872

క. సుగమంబును నగమంబును
నగు నద్దానిన్ వచింపనగునే యీయన్
మిగులన్ సుగమము నీకగు
నగమంబగుఁ గృపణభావమందిన నాకున్ 873

క. అమరద్రుమము దరిద్రున
కమరిన సంకోచమొంది యడుగున్ సిరులా
క్రమమున సందేహించెద
నమేయమగు త్వత్ప్రభావమరయ నశక్తిన్ 874

'. అంతర్యామివి నీవెఱుంగవె మదీయాభీష్టముం దానిఁ బల్
సంతోషంబుగఁ బూర్తిసేయుమన నాసర్వేశ్వరుండిట్లనెన్
స్వాంతంబందునఁ గొంకుమాని యడుగన్ ధ్యానాథ నేనిత్తు నీ
యంతర్వాంఛిత మీయరానిదెది లేదర్థంబు నీకంచనన్ 875

మ. కరుణాసాగర యోవదాన్యమణి నాకాంక్షన్ యథార్థంబుగాఁ
బరమ ప్రీతి నెఱుంగఁ బల్కెద భవత్ప్రాయున్ సుతుంగోరెదన్
బరమీ యంగదె దాచనేల యిఁక నావాంఛన్ చిదానంద యో
దురితారణ్యదవానలా సుజనచేతోధామ రామప్రభూ 876

చ. అనుడు నమూల్యభాషణము లాతని ప్రీతియుఁ గాంచి యాదయా
వననిధి నాసమానుఁడగు వానిని నేనెటఁ బోయి రోయుదుం
జనవర నీయభీష్టమగు సందియమొందకు నేనవచ్చి నీ
తనయునిఁగా జనించెదను తథ్యమటంచునుబల్కి వెండియున్ 877

చ. కరములుమోడ్చియున్న మనుకామిని నాశతరూపఁ జూచి యో
పరమపతివ్రతామణి భవత్ప్రియమేమియొ వేఁడుమన్న న
త్తరుణియు నోకృపాజలధితజ్ఞుఁడు మద్విభుఁడేదికోరెనా
వరమె మదిష్టమైన నిది పాత్రతమించిన సాహసంబగున్ 878

ఉ. ఐనను భక్తవత్సలుఁడవౌటను నీకిది యిష్టమయ్యె వా
గ్జాని ముఖాళికిం బితవు సర్వజగంబులకుం బ్రభుండవున్
జ్ఞాననిధాన దీనజనవర్ధిమ సర్వహృదంతరాత్మవై
పూనివసించు బ్రహ్మమవు పుట్టెదె నాకుసుతుండవై కృపన్ 879

చ. అటు మదినెంచి సందియమునందెద నీనుడి యేప్రమాణమౌ
జటికుల సార్వభౌములకు జ్ఞానమొసంగెడి దేవ భక్తులే
పటుతర సౌఖ్యమొందుదురో పావనమౌగతిఁ గాంచనేర్తురో
యటువలె సౌఖ్యముం గతియు నట్టిభవత్పదయుగ్మభక్తియున్ 880

క. ఆ నీ చరణప్రేమయు
నా నిశ్చలమగు వివేక మట్టిస్థితియు ని
త్యానందము మాకొసంగుమ
యో నిగమాంతార్థసార యురుతరకరుణన్ 881

చ. అను మృదుగూఢమై రుచిరమైతగు వాగ్రచనన్ మహాకృపా
ఘననిధి యాలకించి రసభావముల నిట్లనెన్ భవ
న్మనమున నెట్టి యిష్టము ఘనంబుగనున్నదొ దాని నాదరం
బున నిపుడిచ్చితిన్ వలదుపొందఁగ సందియమించుకేనియున్ 882

ఉ. అమ్మ భవద్హృదంతరమునందు నకిలోకమైనబల్ వివే
కమ్మునయించియున్నదది గాఢమువాయదు నాకృపావిశే
షమ్మున నన్న నమ్మనువు సమ్మతి నీశ్వరుపాదవారిజా
తమ్ములకున్ నతుల్ సలిపి దాత మఱొక్కటి విన్నపంబిదే 883

ఉ. ఎంతటిమూఢుఁడీతఁడనరే నను నెవ్వరునైన దేవ మ
త్స్వాంతమునందుఁ బుత్త్రికమిషంబగు త్వత్పదభక్తియుంటచే
నెంతయు నీకుచేపకు నహీందు్రనకున్ మణియైనరీతి న
శ్రాంతము నాదుజీవనము సాగుచునిల్చుత నీయధీనమై 884

ఉ. ఈవరమిమ్ము నాకనుచు నీశ్వరుపాదయుగమ్ముఁబట్టుచున్
లేవక యున్నవట్లయగు లెమ్మని నాయనుశాసనమ్మునన్
నీవు వసించియుండుమల నిర్జరనాథుని రాజధానిలో
భూవర కొంతకాలమట భోగవిలాసములొంది యాపయిన్ 885

క. అవని నయోధ్యాపతివగు
దువు నే నప్పుడు భవత్సుతుఁడనై స్వేచ్ఛం
భవదీయ మందిరంబున
నవతారము నొందగలను స్వాంశంబులతోన్ 886

చ. అపుడు మదీయభక్తుల కనంతసుఖప్రదమౌ చరిత్రముం
విపులముగానొనర్తు నది వింటకునాదరమూనుధన్యులె
ల్లపుడు మదంబునున్ మమతఁద్యక్తముచేసి మహానలీల ను
గ్రపుభవముం దరించెదరు కల్మషహీనవరాంతరంగులై 887

ఆ. ఆదిశక్తియైన యస్మదీయంబగు
మాయఁ భువనమెల్లఁ జేయు నీవె
యవతరింపఁగలదు భవదభిలాషంబుఁ
బూర్తిగాఁగ నేను దీర్తుననుచు 888

తే. మత్ప్రమాణంబు ధ్రువము ముమ్మాటికనుచు
సారెకు వచించుచును గృపాసాగరుండు
నజుఁడు భగవంతుఁ డంతర్హితం దెనపుడు
దంపతులు నాత్మహారిభక్తి ధారణంబు 889

తే. సల్పుచు వసించి రచటి యాశ్రమమునందు
గొంతకాలంబు సమయముగూడినంత
దేహములవీడి యమరావతికిని నేగి
యచట వసియించి రత్యంతహర్షమెసఁగ 890

తే. ఉమకెఱింగించె నితిహాస ముత్తుకేతుఁ
డతిపునీతంబు శ్రీరాముఁ డవతరింపఁ
గారణము వేఱొకటి విను గారవమున
నని భరద్వాజుతో ముని యనియెనిట్లు 891

ప్రతాపభానుని చరిత్రము

చ. ప్రతివరయాలకింపుము పురాతనపూతచరిత్ర పార్వతీ
సతికి మృడుండు దెల్పినదెసంగు జగద్విదితంబుగాఁగ నా
తతమగు కేకయాహ్వయముఁ దాల్చిన దేశ మొకండునుండుఁద
త్పతియయి సత్యకేతు నరపాలకుఁ డందుఁ బ్రతాపశీలుఁడై 892

ఉ. ధర్మధురంధరుండు బలదర్పపరాక్రమ తేజుఁడుం గడున్
నిర్మలమార్గవర్తనుఁడు నీతి నిధానమతండు వానికిం
గూర్మికుమారులిద్ధర లఘుప్రధనాంగణవీరులుల్ల స
త్కర్మ పరాయణుల్ విగతకల్మషశీలురు సద్గుణాకరుల్ 893

ఉ. అగ్రసుతుండు రాజ్యరమకర్హువిభుండు ప్రతాపభానుఁ డ
త్యుగ్రుఁడు నిశ్చలుండు సమరోర్విఁ గనిష్ఠసుతుండు విక్రమో
దగ్రుఁడు మేరుశైలసమధైర్యయుతుండరిమర్దనాహ్వయుం
డగ్రజునందు భక్తివినయాన్వితుఁ డాతని మెచ్చు నన్నయున్ 894

మ. అమలస్నేహమునం జెలంగు సుతులందగ్రాత్మజున్ రాజ్యభా
రమకున్ నాథునిఁగాఁగఁ జేసి మనమారన్ సత్యకేతుండు శ్రీ
రమణాంఘ్రిద్వయ చింతనోత్సుకత హర్షస్వాంతుఁడై యేగె సం
యమివాసార్హకుటీరవిస్ఫురిత సాంద్రారణ్యముం జేరఁగన్ 895

చ. ఘనుఁడు ప్రతాపభానుఁడు సుఖంకరుఁడై మహి నేలుకాలమం
దనయము క్షామచోరపరహింసముఖాఖిలబాధ లెన్నఁడుం
జనులను వేదమార్గమున సమ్మతితోఁ బరిపాలనంబు చే
సెను వృజినంబు నెక్కడను జెందఁగనీయక ధర్మపద్ధతిన్ 896

చ. నృపహితకారి మంత్రియవినీతివిదూరుఁడు శుక్రతుల్యుఁడై
నపరమకీర్తి ధర్మరుచినాముఁడు భ్రాతసమగ్రశూరుఁడున్
విపులబలుండు మంత్రియు వివేకియు నాతతబుద్ధిశాలియున్
నిపుణుఁడుఁ దాఁ బ్రతాపయుతనిస్తులసంగర రంగధీరుఁడున్ 897

మ. కదనాజేయులు శూరులౌ భటులుదగ్రస్ఫూర్తి నేతేరఁగా
మదమాతంగరథాశ్వయూథపులలోమానాన్వితుం డా నృపుం
డెదనుల్లాసము పల్లవింప వెసవాయింపించె వాద్యధ్వనుల్
చదలందిక్కులఁ బిక్కటిల్లఁగ రణోత్సాహంబు దీపింపగన్ 898

ఉ. సేన నలంకృతంబుగను జేసి శుభంబగు నాఁడు భేరికా
నూనధణంధణధ్వనులు నుద్ధురవీరకుతూహలధ్వనుల్
మేనులు పొంగఁ జేయఁ జని మించి రణోర్వి నృపాళి నెల్ల స్వా
ధీనముగ నొనర్చెఁ దన తేజము నెల్లరు మెచ్చునట్లుగన్ 899

చ. విజయమునొంది లోఁబఱచె విశ్రుతమైతగు నేడుదీవులం
భుజబలసంపదన్ సకలభూపతివర్గమునుండి కప్పముల్
నిజమతి పెంపువన్ గొనుచు నేలకు నెల్లను దానధీశుఁడై
ధ్వజమొకఁడై చెలంగఁగఁ బ్రతాపరవిప్రభుఁ డెన్న నల్పుఁడే 900

ఉ. ఆగతి విశ్వమంతయును నాత్మవశంబుగఁజేసి యా నృపుం
డేగి స్వపట్టణంబునకు నెప్పుడుధర్మము నర్థకామము
ఖ్యాగతసర్వసౌఖ్యములనందుచు నీతిపథానువర్తియై
రాగముతో సమంబుగ ధరం బరిపాలనమాచరింపగన్ 901

చ. అలఘు ప్రతాపభాను బలమందుట ధారుణి కామధేనువై
యలరెను సర్వసౌఖ్యములనందిరి దుఃఖము వాసి భూప్రజల్
లలనలుఁ బూరుషుల్ సకలలక్షణసంపద ధర్మశీలురై
మెలఁగిరి రాజ్యమం దెలమిమీఱఁగ సంతతశోభనంబులన్ 902

చ. సచివుఁడు ధర్మమార్గరతి సంతతమున్ హరిపాదభక్తుఁడై
సుచరితుఁడా నృపాలునకు సుందరనీతిపథైకతత్త్వవా
ఙ్నిచయము బోధసేయుగురు నిర్జరసజ్జనవిప్రసేవలం
దచల సుభక్తి సల్పు నృపుఁడంచితమా పితృభక్తియుక్తుఁడై 903

క. వేదములన్ నృపధర్మం
బేదియనుచుఁ దెలుపఁబడియె నెల్లపుడదియా
మోదమునఁ జేయువిను శా
స్త్రాదుల దానములఁ జేయు ననవరతంబున్ 904

శా. భూపాలుండు నిలింపమందిరములుం భూదేవతాగేహముల్
వాపీకూపతటాక సుందరవనప్రాసాదకేళీవనుల్
దీపింపన్ రచియింపఁజేసె నతితృప్తిం దీర్ఘదేశంబులం
దాపాదించె సమస్తసౌఖ్యతతులన్ యాత్రాపరశ్రేణికిన్ 90

ఉ. వేదములం బురాణముల విశ్రుతమైనమహాధ్వరంబులన్
సాదరమొప్పనొక్కొకటిసల్పెనతండు సహస్రవారముల్
లేదుఫలాభిలాషయుఁ జలింపనిజ్ఞాని సమస్తధర్మకా
ర్యాదులు వాసుదేవునకు నర్పణసేయుమనఃక్రియోక్తులన్ 906

-: ప్రతాపభానుఁడు వేటకేగుట :-

చ. ఒకపరిభూవిభుండు మృగయోచితవేషముదాల్చి వేటవే
డుకను వరాశ్వమెక్కుచుఁ గడుంఘనమైతగు వింధ్యపర్వతాం
తికవనసీమకేగి ధరఁ ద్రెళ్ళఁగ నేసెఁ బవిత్రమౌమృగ
ప్రకరమునంతఁ గ్రుమ్మరుచు రాజటఁ గాంచె మహావరాహమున్

చ. శశినిగ్రసించి రాహువు వెసంజని యావనిడాగెనోయనన్
శిశిరకరుండు పెద్దగుటచే ముఖమందిముడంగ లేదనన్
విశదమహాక్షుధన్ విధుని వెల్వడఁగ్రక్కకయుండెనోయనన్
నిశితవరాహదంష్ట్రలవనీపతి నచ్చెరువందఁజేయఁగన్ 908

చ. బలిసినదొడ్డమేన్ గలిగి వాజిఖురారవమాలకించి పీ
నులునిగుడించి తొట్రిలికనుంగనవిచ్చి తదేకవీక్షణం
బులఁబరఁగించి నీలమగుభూధరశృంగము నాగనొప్పుచుం
దలఁగక ఘుర్ఘురించుబలితంపు వరాహము రాజుగాంచుచున్ 909

చ. కశనదలించి గుఱ్ఱమును క్ష్మాపతిచెచ్చెరఁ దోలవాజి యా
దిశకరుదెంచుసవ్వడిని దేటికనుంగొనివించు వాయుతో
దృశమగు వేగమొప్పఁ బరతేరఁగఁ బందినినేయవింట ను
గ్రశరము రాజుబూనసది గ్రక్కున భూస్థలిలీనమౌటయున్ 910

చ. సరిగుటఁజూచి రాజు విలసచ్ఛరముంబరఁగింప మాయసూ
కరము శరీరరక్షణముఁ గోశలమొప్పఁగఁ జేసిచెంగటన్
దిరముగఁ గానుపించుచు నదృశ్యముగా నొకసారిపోవు చీ
కరణిని బాఱుచుంటఁగని క్ష్మావిభుఁడేగెను గిక్క వెంబడిన్ 911

చ. ఘనవనమందు హస్తితురగంబులు పోవనశక్యమైనచోఁ
జనెడి వరాహమున్ విడువఁజాలక రాజొకఁడయ్యె వేసటం
గొని కడుఁగ్లేశ మొందియునుగూడఁగఁ బాఱుట మానఁడయ్యె నా
జనవిభుధీరతంగనుచు శైలగుహాంజొఱఁ బాఱెఁ గోలమున్ 912

ఆ. అదియ గమ్యమనుచు నవనిపుఁడత్యంత
చింతనొంది మరలె శీఘ్రముగను
గాని త్రోవఁదప్పి గహనంబునం దప్పి
యాకలియును నొంప హాయయుతముగ 913

-: ప్రతాపభానుఁడరణ్యమున మాయామున్యాశ్రమముంజేరుట :-

చ. జలములఁగోరుచున్ వెదకసాగెఁ దటాకములున్ నదుల్ మహా
విలమతి సొమ్మసిల్లుచును వేసటనొందుచు నెందులేమి వ్యా
కులమునఁ బోవుచుండు నెడఁ గొంత సమీపమునందుఁ దోఁచెను
జ్జ్వలమగు నాశ్రమంబొకఁడు క్ష్మాపతికిన్ మదిసేదదేఱఁగన్ 914

ఉ. తొల్లి ప్రతాపభానుఁ డతిదోర్బల మొప్పఁగ రాజ్యవైభవం
బెల్లను బల్మిఁగైకొనిన నెంతయుఁ దత్ప్రభుఁడవ్వనంబునం
గల్లమునీంద్రుఁడై యపుడు గానఁగనయ్యెఁ దదాశ్రమంబునం
దుల్లమునందు సంతసము నొందుచునేగు నృపాలమౌళికిన్ 915

చ. అతఁడు ప్రతాపభానుకడ నాసమయంబున నోడిపాఱి తా
నతిశయమాని యాటవనమందునఁ గైతవమౌనియౌచు నా
యతనముఁ జేరఁడయ్యె నరిదైన ప్రతాపరవిప్రభుఁ డిన
మ్రితఁగన నేగఁడయ్యె నగరంబు ఘనంబగు గ్లానిఁజెందుచున్ 916

చ. మనమున నున్న క్రోధమును మాటుపడంగ నడంచి పేదరీ
తిని మునివేష మొంది కడుదీనతనవ్వనమందునున్న నా
తని దెసకేగు రాజును బ్రతాపరవి ప్రభుఁడంచెఱింగె నా
యన గుఱుతింపఁడయ్యెఁ దృషితాతురుఁడైన ప్రతాపుఁడాతనిన్ 917

చ. అతని సువేషముం గని మహాముని యంచుఁ దలంచి వేగ భూ
పతి తురగంబు డిగ్గి కడుభక్తిఁ బ్రణామ మొనర్చెఁ గాని యా
చతురుఁడు దెల్పకుండెను నిజప్రథితంబగు నామ మా నృపుం
డతి తృషితుండు గాన నెఱిఁగి యాతఁడు సూపె సరోవరంబటన్ 918

ఉ. రాజు ప్రసన్నుఁడై హృదయరంజకమౌ కమలాకరంబునన్
వాజిసమేతుఁడై విమలవారి నొనర్చెను స్నానపానముల్
తేజము నొందె నా నృపుఁడు దీఱెను శ్రాంతియు నంతలోన నా
వ్యాజమునీంద్రుఁ డాతని నిజాశ్రమసీమకుఁ గొంచు వేచనెన్ 919

చ. రవి యపరాద్రిఁ జేరుటయు రాజు నకాసన మొండొసంగి కై
తవముని పల్కె మంజులసుధామధురోక్తుల సుందరుండవున్
యువకుఁడవే మహాటవిని నొంటరివై చరియించె దేల నీ
వెవఁడవు ప్రాణభీతి యొకయించుకయుం జనియింపదేమ విన్ 920

ఉ. నీముఖలక్షణంబులను నేను గనుంగొనఁ జక్రవర్తివో
నా మదిలోనఁ దోఁచెను ఘనంబగు కూర్మియుఁ బుట్టె నాకనం
భూమివిభుండు వల్కె మునిపుంగవ నేను ప్రతాపభానుఁడన్
నామము గల్గునట్టి నరనాథుని మంత్రిని వేఁటకై ననిన్ 921

చ. తిరుగుచుఁ ద్రోవఁ దప్పి భవదీయపదాంబుజ దర్శనంబు నం
బరమముదంబుఁ బొందితిని భాగ్యవశంబున దుర్లభంబు మీ
దరిసెన మస్మదాదులకుఁ దప్పక భావిశుభంబు దోఁచె నా
నరవరుఁ గాంచి యిట్లు కుహనాముని పల్కె మనోహరోక్తులన్ 922

తే. వత్స చీకటియయ్యె భవత్పురంబు
నున్న దిచటికి డెబ్బది యోజనముల
దూరమున భీకరము రాత్రి త్రోవ యుండ
దురుతరాటవి నేటికి నుండు మిచట 923

ఉ. వేగిన నేఁగఁగా దగును వీటిక నెంభవితవ్యముండు నె
ట్లేగతి నట్లు సాయము లభించున నెందుల నీమహాత్ముఁడా
యోగి వచించు రీతి వినుచున్న మహీశుని భావి హేతు వే
లాగుచునున్న దాతనిఁ దొలంగఁగఁ బజ్జను రాదొకింతయున్ 924

శా. మాయామాతాని పిత్రియోక్తులన్ వినుచు నాక్ష్మాభర్త హర్షించి దే
వాయాజ్ఞం దలఁ దాల్చి నాఁడనని యాయశ్వంబుఁ దత్ప్రాంత మం
దేయుర్వీజము సందుఁ గట్టి మునిఁ గీర్తించెన్ సుఖాసీనుఁడై
నాయుష్యత్సుకృతంబు గొప్పదనుచున్ బాదంబులన్ మ్రొక్కుచున్

చ. మృదుమధురోక్తులన్ మఱియు మేదినినాథుఁడు వల్కె నాత్మ నెం
చెదని నుదండ్రిఁ బోలె మునిశేఖర పుత్త్రిని భంగి భృత్యు చూ
డ్కి దయ నను ద్వదాత్మఁ బరికించుచు సాహసమున్ సహించి ప
ల్కఁదగు ద్వదీయ నామమును గాదనఁ బోవక యానుపూర్విగన్ 926

చ. నృపుని నెఱుంగు నాతఁడ కనిం దెలియండు నృపుండు చిత్తమా
కపటయుతంబు వానికి సకల్మషమానగనాథ మౌళికిన్
నిపుణుఁడు వైరి క్షత్రియుఁడనిం బరిభూతుఁడు నైన వాఁడతం
డపుడను వౌను పాయమున నాతని కార్యమొనర్పఁ గోరుచున్ 927

క. మనుపటి రాజ్యసుఖంబులు
దనమనమున సజ్ఞప్తి రాఁగఁ దాపముఁ గనుచుం
ఘనమగు నిటికాననముక్రియ
వినియతని యమాయికోక్తి వికసితమతియై 928

చ. కపటమృదూక్తులం బలికె క్ష్మాతలనాయకుతోడ నాదు పే
రిపుడు బికారి గేహ ధనహీనుఁడనం చనివించు వానితో
నృపుఁడనె మిమ్ము బోటులగు నిర్మమతామతులైన జ్ఞానులే
నిపుణతఁ గల్గియుండియును నీరసవేషములం ధరించుచున్ 929

ఉ. ఉందురు స్వార్థతన్ విడిచియుత్తమసజ్జనవేదపాళిగో
విందుని కిష్టులౌదురన విశ్వమునందునకించనుల్ శతా
నందపినాకపాణులుఁ గనంగడు సందియమొందకుందు రే
మందిరద్రవ్యహీనులగు మాన్యభవాదృశయోగివర్యులన్ 930

చ. అదియె యథార్థమౌను భవదంఘ్రియుగంబునకున్ నమస్కరిం
చెదఁ గృపఁ జూడుమన్న నృపశేఖరుఁ డాతని మీఁద నైజమై
పొదలెడి ప్రీతిఁ జూపెనసి పొంగి మనమ్మున విశ్వసించుచున్
ముదమొదవంగ నాథరణి ఫుందనవానిగ నిశ్చయించుచున్ 931

మ. అధికప్రేమను జూపుచుం బలికె సత్యం బెంతయున్ నమ్ము మే
నధివాసం బొనరించుచుంటి నిటఁ బెక్కాకాలమే గెన్ ననుం
బధికుం డెవ్వఁడుఁ జూడ లేదెవఁడు నీభంగిన్ ననున్ వేఁడ నా
విధముం జెప్పఁగ లేదు నేటివఱకున్ విస్పష్టమౌ నట్టులన్ 932

క. ఏమనఁ బ్రపంచరుచియు
ద్దామంబగు బహ్నిలీలదహియించుఁ దపో
శ్యామల వనములఁ గావున
నేమానితి నెఱుక పఱుప నిజవృత్తము నేన్ 933

మ. తులసీదాసను సుందరాకృతుల నెందుం గాంచి మూర్ఖప్రజల్
తెలియంజాలక మోసముంగనరె బుద్ధిం బ్రోడలే భ్రాంతిలన్
లలితాకారమయూరముంగను సుధాలాపంబుగాఁ గూసి నం
జిలువం గాంచినయంత నోరెముగ భక్షించుం గదా ప్రీతితోన్ 934

మ. కుహనానామానివచించెఁగాన జగతిం గూఢంబుగా నుందు నే
నుహరిందప్పఁ బ్రయోజనంబుగలదే నోరత్తివాక్రివ్వకే
మహితుండాతఁడు సర్వముం దెలియు నీమాత్రంబు నూహింపకే
యిహసౌఖ్యేచ్ఛఁ జరింపసిద్ధిగలదే యేనాఁటికిం దెల్పుమా 935

తే. పూతసుమతివి నీయెడఁ బుట్టినాకుఁ
బ్రీతినాయెడ నీకును బృథులమైన
ప్రియము విశ్వాసముంగల విధమెఱింగి
దాచ నాకతిదోషంబు దవులకున్నె 936

చ. అనుచు విరాగసంయుతములౌ వచనంబుల నాతఁడొప్పఁబ
ల్కినకొలఁదిన్ నరేశునకుఁ గేవలముం జనియించె నెమ్మన
మ్మున ఘనమైననమ్మకము భూపతివాక్యమనఃక్రియావిధిం
దనకు వశుండుగాఁదలఁచి దంభమునీంద్రుఁడు కొంగభక్తితోన్

క. నానామమేకతనుఁడనఁ
గానొప్పనుభ్రాతయనఁగఁ గడునమ్రశిరుం
డై నీ సేవకుఁగాఁగని
యానామార్థంబుఁ దెలుపు మానాకనుడున్ 938

క. మునియిట్లనె నీసృష్టికి
మును నేజనియించినాఁడ భువి నేమరలం
దనుధారణంబుసల్పమి
నను నేకతనుప్రఖ్యాతంనామంబెనసెన్ 939

చ. తపమునదుర్లభంబెది విధాతసృజించుఁ దపోబలంబునన్
విపులములౌప్రపంచముల విష్ణుఁడుఁబ్రోచుఁదపోబలంబుచే
నపరిమితప్రభావయుతమైన మదీయచరిత్రవించునీ
విపుడు కరంబు నబ్బురము నెందుకు పొందెదవో కుమారకా 940

చ. శివుఁడుఁ దపోబలంబుననె చేయు లయంబుజగంబులన్నియుం
భువనమునన్ సమస్తమును బొందగవచ్చుఁదపంబుచే ననం
గవిని మహానురాగమును క్ష్మాపతిపొందగ మౌనిచెప్పె నిం
పవునొకపూర్వరాజ దితిహాసము హాసముపల్లవింపగన్ 941

చ. ఇతిహాసంబులు ధర్మకర్మవిధముల్ హేరాళవిజ్ఞానమా
తతవైరాగ్యము సృష్టియున్ స్థితియునేతన్నాశనోద్గాథలున్
హితవాక్యంబుల వర్ణనంబొనరించెన్ హృష్టాత్ముఁడై రాజు సం
స్తుతియింపంగను నబ్బురంపడఁగవద్దుర్మౌనిమర్మాకృతిన్ 942

చ. అదివినిరాజు మౌనివశుఁడై నిజనామమెఱుఁగ జేయఁగా
నిది మును నేనెఱుంగుదు మహీశ్వర దాచితివాత్మనామ మీ
యదనునసైన నేనెఱుఁగనా నినుగూడమునేత నీతియోఁ
జదువులుఁ బ్రోడలై వెలయు క్షత్రియవీరులకున్ స్వనామముల్ 943

క. ఈ నీ చాతుర్యముఁగని
నేనాత్మన్ మెచ్చినాఁడ నీపైనాకేం
తేనియుఁ బ్రేమజనించెను
గానన్ విను తెలిపెదను వికాసితమతివై

ఉ. నీవు ప్రతాపభానుఁడవు నీపితనామము సత్యకేతుఁడే
భావమునందెఱుంగుదు ధ్రువంబుగనెల్ల గురుప్రసాదల
బ్ధావిరళప్రభావమున నద్భుముగాదని తెల్పుకుంటినో
భూవరమన్మహత్త్వమును బూజ్యులు స్వాధికతన్ వచింతురే 945

క. నీసహజబుజగుణంబును
నీసత్త్వమయును నీతినిపుణతయును వి
శ్వాసంబు నరసిమమతన్
నేసమ్మతపడితిఁ దెలుప నిజవృత్తంబున్ 946

చ. ఇపుడుప్రసన్నచిత్తుఁడ నికెందుకుసందియమొంద నీమదిన్
నృపవర వాంఛయున్న యెడ నీకడుగందగునన్న నా ధరా
ధిపుఁడు ప్రమోదమొంది విసతిం బహురీతుల నాచరించె నా
కపటతపస్వి పాదములఁ గైనిడి మిక్కిలిభక్తిసూపుచున్ 947

మ. కరుణాసాగర యోగముసీంద్ర నిను నేఁ గన్నారదర్శించుటం
గరపం కేజగతంబులయ్యెను జతుష్కంబౌ పదార్థంబులుం
బరమప్రీతిని గోరు మిచ్చెదననంభావ్యంబె కాదంట నే
నరమర్థించెద శోకనాశకరమై వర్తిల్లు దుర్గమ్యమున్ 948

క. మరణజరారహితంబగు
శరీరమున జేయశక్తి సంగ్రామములం
దరిహీనసకలరాజ్యము
గరుణామతినిమ్ము నాకుఁ గల్పశతంబుల్ 949

చ. అనవుడు నట్లు కాక యని యైననిఁకొక్కటి కష్టహేతువో
జనవర యున్న దేమనగ బ్రాహ్మసురవంశముదక్కఁ గాలుడున్
నినుగని నమ్రశీర్షుడగు నీమపదంబులకింకఁదక్కభూ
జనములఁజెప్ప నేమిటికి చాలఁదపోబలసంయుతుల్ ద్విజుల్ 950

క. వారలు క్రోధమునూనగ
నేరును రక్షింపబడను నృప నీవశులన్
వారల జేసితివేనియు
వారిజభవ విష్ణుశివులు వశులేనీకున్ 951

తే. బాహువులుసాచి సత్యంబుఁ బలుకువాఁడ
విప్రనెడ బల్మిచెల్ల దేవేళనైన
ధారుణీసుర శాపంబుతక్క నిన్ను
నాశమొనరింప దితర మేనాటికైన 952

క. అని మునిపలికెడి మాటల
విని హర్షమునొంది రాజు విశ్వమునం దెం
దును లేదు నాకు నాశము
ఘనశుభముం గనెద నీదు కరుణ మహాత్మా 953

తే. అనిన నగుగాక యనుచు మాయాతపస్వి
మరలననె నీవు వనమున మఱచి నన్ను
గనుట యెవ్వరితోనైన ననెదవేని
లేదు నాదోషమేమియు మేదినీశ 954

తే. రాజ యెటనైన నీకథఁ బ్రకటపఱుప
హానివాటిల్లుఁ బడఁగూడ దాఱుచెవుల
నట్లుచేయ భవన్నాశమగును మదిని
నమ్మ నామాట మిగులసత్యమ్మ సుమ్మ 955

చ. వినుము ప్రతాపభానునృప వెల్లడిచేసిన విప్రశాపముం
గనినను నీకు నాశమగుఁగాని మఱేమిటహానియుండదా
వనరుహలోచనుండు బుర వైరియు నీపయిఁగ్రోధమొందిరన్
మనెదు రహస్యభేదమున మానదుకీడు ధ్రువంబునమ్మవా 956

మ. అనఁ బాదంబులఁబట్టి రాజనియె నార్యా సత్యమెందుంగురుం
డును విప్రుండును గోపమొందగ నెవండున్ రక్షణంబొందగా
నను వానే విధియల్గినం గురుఁ డుపాయం బెంచిరక్షింపనో
పును లేరా గురువైరి నాదరమునం బ్రోవం బ్రపంచంబునన్ 957

క. నీనుడిచొప్పున నడునమి
నానాశంబనిన చింత నాకంతగ లే
దోనాథ విప్రశాపము
నూనభయంకరమటంచు నులికెదమదిలోన్ 958

మ. కరుణంజూపుచు నేపరికారమున నాప్మాదేవతానీకముం
బరమప్రీతివశంబుజేయఁగలనామార్గంబు బోధింపు మిం
కొరు లెవ్వారునులేరు మామకహితోద్యోగంబుఁగావింప నీ
ధరణిం దీనకృపాకరా యనిన నాదంభవ్రతుం డిట్లనెన్ 959

చ. వినుము నృపాల లోకమునవే సదుపాయములున్న వెన్ననై
నను నగుఁగాదటంచును ననంగ నసాధ్యముకాని యొక్క సా
ధనమునిసర్గమై వెలయు దానను గష్టమొకందుగల్గునే
మనఁగఁదదీయయుక్తియును నస్మదధీనమెయైన నెట్లగుఁ 960

క. నేను భవన్నగరమునకు
రానొల్లను జన్మమాది గ్రామగృహాన్నపా
స్థానాదుల కెపుడేగను
నేనింతటివఱకుఁగూడ నృపకులతిలకా 961

క. నేనిపుడు రాకయుండిన
హానియగున్ నీకుఁదలఁప నసమంజసమౌ
నేనిర్ణయముం జేయఁగ
నానృపుఁ డిట్లనియె మధురనయమృదువాణిన్ 962

ఉ. వేదములందుఁజెప్పఁబడె వెల్లడిగా నిటువంటినీతి య
త్యాదరభావమొప్ప ఘనులల్పులనెప్పుడు గారవింతురం
చూదును మేదినీధరము లున్నతకూటములం దృణంబు మ
ర్యాద నగాధమై వెలయు నంబుధిఁదాల్చును ఫేనమౌదలన్ 963

ఉ. భూమి శిరంబునందు రజముంధరియించును సంతతంబు నం
చాముని పాదయుగ్మమును హస్తయుగంబునఁబట్టి రాజనెన్
స్వామి మదర్థమై భరముసైపుము దీనదయాళు సజ్జన
గ్రామణి నాపయింగరుణరంజిలుచూడ్కులఁ బర్వఁజేయుచున్ 964

తే. అనినఁ గపటప్రవీణుఁ డయ్యవనినాథుఁ
డన్నివిధములచేఁ దనకగ్గమయ్యె
ననితలఁచి రాజనమ్మె సత్యమ్మె నాకు
నీజగంబున దుర్లభమెదియు లేదు 965

తే. త్రికరణంబుల నీవు భక్తిప్రపత్తి
గలుగువాఁడవు గాన నీకార్యమేన
వశ్యమొనరింతు యోగప్రభానయుక్తి
మంత్రితపములు దాచినన్ మహిమఁజూపు 966

తే. వంటచేసెడివాఁడనై యంటి యుండి
యింటికేతెంచు నతిథుల వంటకములఁ
దనుపుదును నన్నెఱుంగఁగా ననువుపడదె
వారికిని నట్టియన్నంబు నారగించి 967

తే. వారలెల్లరు నాజ్ఞానువర్తులగుచు
నుండెదరునీకు రాజయింకొకటివినుము
వారియిండ్లను భుజియించువారుఁగూడ
నీకు వశవర్తులగుదురు నిక్కమముగ 968

తే. కాన నీయుపాయంబునుబూని చేయు
మొక్కవర్షంబువఱకు నీవుద్యమించి
సపరివారంబుగా నూత్నశతసహస్ర
విప్రులకు నిత్యభుక్తి నేఁబెట్టుచుందు 969

తే. ఈవిధంబున నుంతకష్టించినంత
సర్వవిప్రులు నీకు వశంబగుదురు
సకలసురవశ్యమగు నీకుసహజముగనే
యవనిసురహోమ మఖసేవ లాచరింప 970

తే. మఱియు నొకమాటఁదెలిపెద మానవేంద్ర
యిట్టివేషంబుతోడ నేనెపుడు రాను
నీపురోహితుమాయచే నేహరించి
వాని ననుఁబోలె నాతపోబలమువలన 971

తే. సలిపి యిటనుంచి యొక్కవత్సరముదనుక
వాని వేషంబు నేఁదాల్చివచ్చి నీదు
కార్యముం జక్కబెట్టెదఁ గడచెఁజాల
రాత్రికావున శయనింపు రాజయింక 972

క. మూనాళ్ళకు నాదర్శన
మౌ నీకున్నృపాలతిలక యశ్వయుతముగా
నీనగరు నిన్నుఁజేర్చెద
నేను దపోబలమువలన నిదురించుతఱిన్ 973

ఆ. అట్టివేషమూని యరుదెంచి యేకాంత
మునకు నిన్నుఁజేరి ముచ్చటించి
యెల్లకథయుఁదెలుప నెఱుఁగంగవలెనీవు
నన్ను నాసమయమునన్ మహీశ 974

చ. అనవుడు నాజ్ఞఁగైకొని నృపాగ్రణి నిద్రనుజెంద వంచనా
మునిచని కూరుచుండెనట మున్నొకయాసనమందు రాజు శ్రాం
తినిగొనియుంట గాఢముగ నిద్దురవోవఁగసాగెమూని యో
చనలమునింగియుండెను దృషావివశాత్ముఁడు నిద్రవోవునే 975

కాలకేతుఁడను రాక్షసుఁడు మాయామునియొద్దకు వచ్చుట

తే. కాలకేత్వాహ్వయుండు రాక్షసుడొకండు
వచ్చెనచటికి రాజును వంచనమున
సూకరాకృతిఁ గొనితెచ్చె నాకుటిలుఁడె
దంభముని రాజునకువాఁడు తగుసఖుండు 976

క. సుతశతము భ్రాతృదశకము
నతనికిఁగలుగుచు నజేయమై క్రొవ్వున దే
వతలఁగలఁప నాదానవ
వితతిఁ బ్రతాపుండుసంపె పృథునుమగమునన్ 977

తే. ఆఖలుఁడు తొంటివైరంబు నాత్మఁ దలఁచి
తపసి రాజునుగూడి మంత్రిమ్మునరసె
నేయుపాయంబుచే నామహీశునకును
నాశమగుదానిఁ జేయుదు రాశయమున 978

ఉ. భావివశంబుచేత నరపాలుఁడు దాని నెఱుంగఁడాయె దు
ర్భాపుఁడుఁ దేజుఁడౌనృపుఁ బరాజితు నొంటరినల్పుగాద యా
భావమునం గణింపఁగ నపాయము వాటిలు సూర్యచంద్రులం
గేవల శీర్షశేషుఁడయి ఖిన్నులఁ జేయఁడె రాహువిప్పుడున్ 979

మ. హితునిం జూచి తపస్విరాజు మనమందే పారు సంప్రీతి ను
ద్ధితుఁడై యెల్లయుదంతముం దెలుప నా దేవారియున్ సంప్రమో
దితచిత్తుండయి పల్కె రాజ విను మేఁ దెల్పంగ నీవట్లు చే
సితివాటన్ మనవైరి చిక్కె నిఁక నిశ్చింతన్ శయింపందగున్ 980

తే. ఔషధము లేకయే వ్యాధి నడఁగఁ జేసె
విధి రిపునిగులయుతముగ వేరుఁ బెఱికి
కలసెదను నిన్ను వచ్చి నాల్గవదినమున
నని యతని నలరించి దుష్టాత్ముఁ డరిగె 981

చ. క్షణమున నాప్రతాపమహీకాంతుని సాశ్వునినిల్లు సేర్చి త
న్మణిగృహమందు రాణికడ మంచముపైఁ బవళింపఁ జేసి దు
ర్గుణుఁడగు రాక్షసుండు హరిగుఱ్ఱపుసాలను గట్టి యానృపా
గ్రణికిఁ బురోహితుండయిన బ్రాహ్మణునిం గిరిగహ్వరంబునన్ 982

తే. మతిఁ జెఱచి దాచి తాపురోహితునిరూప
మొంది యనుపనుమైన యయ్యుర్విసురుని
శయ్యఁబన్నుండె వేగ రాజన్యుఁ డింటఁ
దొలుత మేల్కని కాంచి యద్భుతమునొందె 983

ఆ. తపసిమహిమఁగాఁగఁ దలపోసి వేలేచి
రాణి తెలియకుండ రాజువనికి
నాతురంగమెక్కి యరిగెనుబురసతుల్
మగలెఱుంగలేని మార్గమునను 984

తే. రెండుగడియలు సనినంత నృపతివచ్చె
సంత నింటింట నుత్సవంబలరె వాద్య
రవము లెసఁగెఁబురోహితు నవనివిభుఁడు
కాంచిస్మరియించెఁ జకితుఁడై కార్యమెదను 985

తే. మూఁడుదినములుయుగముగా భూవిభుండు
దలఁచె మదిలగ్నమయ్యె నాదంభమౌని
పదములం దా తనికివచ్చె నదనెఱింగి
రాజకడకుఁ బురోహితబ్రాహ్మణుండు 986

తే. వచ్చి రాజుసకెఱిఁగించె వలయునట్టి
యంశముల నెల్ల నృపతియు నతనిగురునిఁ
గాగ్రిహించి ప్రమోదించి గాఢమైన
భ్రిమకు వశుఁడౌట నిశ్చేష్టభావమొందె 987

-: బ్రాహ్మణులు ప్రతాపభానుని శపించుట :-

ఉ. భూసురపట్సహస్రశతమున్ సకుటుంబముగాఁగఁబిల్వఁగా
జేసెనృపుండు వేదమునఁ జెప్పినరీతిఁ జతుర్విధంబులై
వాసికి నెక్కుభోజ్యములు వాంఛనుగొల్పెడిషడ్రసంబులున్
వేసముఁబూనియున్న పృథివీతలనాథుపురోహితుండొగిన్ 988

ఉ. వండెను బెక్కుకూరలిక వానిగణింపవశంబె యేరికా
తండు స్వమాయచేత వివిధంబగు జంతుసమూహమాంసముల్
మెండుగవంటచేయు నెడ మిశ్రిమముంబొనరించె వానదు
ష్టుండు ధరామరామిషముక్షోణిసురావళిఁ జీరెనంతటన్ 989

ఆ. అటుల వారినెల్ల నాహ్వానమొనరించి
పాదములనుగడిగి పంక్తిగాఁగఁ
గూరుచుండఁజేసె క్షోణీపతియు వారి
కన్నమిడుచునుండ నభ్రవాణి 990

క. ద్విజులార తెండు లెండది
భుజియించినమొదల హానిఁ బొందెదరచటం
ద్యజియించి యిండ్లకేగుడు
వృజినంబగు విప్రమాంస మిందుంట ననెన్ 991

తే. అనిన భోవాణిపలికిన నఖిలవిప్రు
లొక్కమొగి లేచి నిలుచుండి రుర్విభుఁడు
వ్యాకులంబొందసాగెను భావివశత
మోహియగుటను మాటైనఁ బుట్టకుండె 992

ఉ. అంతటవిప్రులెల్లఁ గడునాగ్రహమొంది మనంబునందు నొ
క్కింతయు జింతసేయక మహీశుని మూర్ఖనిశాచరుండవై
వంతనుబొందుమీవు పరివారయుతంబుగ క్షత్రబంధు నీ
స్వాంతమునందు మాకులము సర్వము భ్రష్టమొనర్పనెంచుటన్

ఆ. ఈశ్వరుండు మమ్మునెల్లఁగాపాడె మా
ధర్మరక్షణంబుఁ దగనొనర్చి
కాని నీవు నీసకలపరివారంబుఁ
జెడెద రొక్కయేడు గడువకుండ 994

ఆ. నీ కులంబునందు నీరొసంగుటకైన
నుండబోవఁడొకఁడు నుర్విమీద
ననుచు శాపమీయ నవనీంద్రుఁ డది విని
వసటనొంద నభ్రవాణి మరల 995

ఆ. విప్రవర్యులార వివరింపకే మీరు
శాపమొసగినారు జనవరేణ్యుఁ
డాచరింపకుండె నపరాధమేమియు
ననిన నింగిపలుకు లవనిసురులు 996

క. విని చకితులైరి భూపతి
చనియెం బానసమునకు నచటభోజ్యంబుల్
గనఁబడవు లేఁడుపాకం
బును జేసిన బ్రాహ్మణుండు భూవిభుఁడంతన్ 997

క. పెనుదుఃఖంబున మరలం
జనుదెంచి యుదంతమంత క్ష్మాదేవులకున్
వినిపించి పుడమిపై వ్రా
లెను భయవిహ్వలతఁ దాల్మి లేనికలంతన్ 998

ఉ. ఓనృపదోషమించుకయు నుండకపోయిన నీకు యోగమిం
తేనియుఁ దోఁపశక్యమె మహీసురశాపను దారుణంబదె
లైయినను నన్యథాసలుప నర్హముగానిదటంచు రాజుతో
నానతియిచ్చి భూమిసురులందఱు నేగిరి యిండ్లకంతటన్ 999

మ. విని యాపట్టణవాసులైన జనులావేళన్ సమాచారముం
ఘనసంతాపమునొందుచుం జెడు విధీకట్టామరాళంబుగా
కిని జేయన్ సమకట్టినావె నృపుఁడీ కీడొంద నష్టండెయుం
చును దైవంబును దూరసాగిరి మహాశోకాకులస్వాంతులై 1000

ఉ. అంతఁ బురోహితున్ నిజగృహంబునఁ జేర్చి దైత్యుఁడెల్ల వృ
త్తాంత మెఱుంగఁ జేయుటయు దంభతపస్వియు నెమ్మనంబునన్
సంతసమొంది మిత్రులగు క్షత్రియులందఱ లేఖలంపి దు
శ్చింత ఖలుండు గూర్చెనొక సేనఁ బ్రతాప రవీంద్రుఁ దాకఁగన్

చ. అటులొనరించి సైన్యయుతుఁడై పురమున్ పడి ముట్టడింప ను
ద్భట రణభేరి మ్రోఁగియ నిరుపక్షము వారికిఁ బోరుఘోరమై
యట జరిగెం బరాక్రమము నత్యధికంబుగఁ జూపి నిత్యముం
భటులు దివంబుఁ జేరిరి నృపాలుఁడు భ్రాతృయుతంబుగాఁ బడెన్

ఉ. ఈవిధి సత్యకేతు కులమెల్ల నశించె నొకండు లేక భూ
దేవుల శాపవాక్యములు దీవనలున్ వృథయౌనె యప్పుడా
భూవరులెల్ల నొక్కటరి పుత్రయముం బొనరించి కీర్తి ల
క్ష్మీవిజయంబులం గొని తమిన్ నగరంబు నాక్రమించుచున్ 1003

క. పోయిరి తమనగరములకు
నోయి భరద్వాజ దైవ మొక్కొక వేళం
జేయును బ్రతికూలుండయి
యే యిడుములనైన జగతి నెవ్వరికైనన్ 1004

తే. ధూళియే మేరుపర్వత తుల్యమగును
జనకుఁడు పరేత నాయకసదృశుఁడగును
త్రాడు భయమును గొల్పు సర్పంబురీతి
నగును దైవంబు ప్రతికూలుఁడైనయపుడు 1005

—: రావణాదుల జననము :—

కాలము గూడినం ధరణికాంతుఁడు రావణనాముఁడై మహో
ద్వేలదశాననంబులును వింశతి బాహువులొప్పఁ బుట్టెనా
భీలపరాక్రమాన్వితుఁడు వీరుఁడు నిద్ధబలుండు దైత్యుఁడై
యేలికతోఁ గుటుంబము నుదయించెను ఘోరనిశాచరాళియై

క. అరిమర్దన నాముండగు
ధరణీశుని సోదరుండు దర్పోద్ధతుఁడు
ద్ధురబలుఁడు కుంభకర్ణుం
డురుభీకరగాత్రుఁడగుచు నుద్భవమయ్యెన్. 1007

ఉ. భూవరుమంత్రి ధర్మరుచి పుట్టెను రెండవతల్లియందు నా
రావణు చిన్నతమ్ముఁడు నిరంతరధర్మరతుండు సంతత
శ్రీవరుపాదభక్తుఁడు విశిష్టగుణుండు విభీషణాఖ్య వి
శ్రావితకీర్తిజ్ఞాననిధి శాంతుఁడు దాంతుఁడుఁ దత్త్వవేత్తయై 1008

క. భూతలనాథునిపుత్రులు
నాతనిసేవకులు నతిభయంకర నానా
జాతుల రాక్షసులై రతి
నీతివిదూరులును ఖలులు నిర్దాక్షిణ్యుల్ 1009

తే. కామరూపులుఁ గుటిలులు గతవివేకు
లతులపాపులుఁ హింసకు లనవరతము
విశ్వసంతాపకరులు దోర్వీర్యయుతులు
వర్ణనముసేయ రాదిఁక వారినడత 1010

తే, పావనపులస్త్యవంశ సంభవమునపుడు
గనిన బ్రాహ్మణశాపంబు కారణమునఁ
బాపులై రందఱును ధర్మపరులుగాక
భూపతికులంబువా రుగ్రరూపులగుచు 1011

రావణ కుంభకర్ణ విభీషణులు బ్రహ్మచే వరములొందుట

తే. సోదరులు ముప్వురును గడునుగ్రతపము
సేసి రద్దాని వర్ణనచేయవశమె
ధాతవిచ్చేసి మెచ్చితిఁదాత నీదు
తపమునకు వేఁడు వరమన దశముఖుండు 1012

తే. పాదపద్మద్వయింబట్టి బ్రస్తుతించి
యోజగత్పతి కృప మదీయోక్తివినుము
నరులు వానరులుందక్క నాకు నితర
జాతిచేఁ జావులేకుండ సలుపుమయ్య 1013

తే. అనిన నట్లగుఁగాక నీవతులతపము
సేసితివియని బ్రహ్మతో శివుఁడుఁగలిసి
యంతఁ బ్రభుఁడేగి కుంభకర్ణాసురుఁగని
విపులముగఁజొందె మదిలోన విస్మయంబు 1014

తే. అతఁడు నిత్యంబు భుజియింప నఖిలజగము
నాశమగుఁగాన వాణినా నలువరాణిఁ
బ్రేరణమొనర్చి యా సురరిపునిబుద్ధిఁ
జెలుపషణ్మాసముల్ నిద్రఁజెందనడిగె 1015

శా. అంతంభ్రీతివిభీషణుంగని త్వదీయార్థంబువాంఛింపు మే
నెంతేనిం గృపనిత్తుఁ బుత్రియన నాకెల్లప్పుడుం శ్రీరమా
కాంతాంఘ్రిద్వయభక్తినిమ్మనిన వాక్కాంతాప్రియుండిచ్చి తా
నంతర్థానమునొందె వారరిగి రత్యంతప్రసన్నాత్ములై 1016

క. మయదైత్యపుత్రియతివి
స్మయకరసౌందర్యధుర్యమందోదరినాఁ
బ్రియవినయాన్విత గెలుచున్
వయోకృతుల విభ్రమమున వనితామణులన్ 1017

క. మయుఁడా కన్యారత్నముఁ
బ్రియమునఁ గొనిపోయి యిచ్చె భీకరదనుజా
న్వయమునకు నెల్లఁ బ్రభుఁడ
ద్వయబాహుబలాఢ్యుఁడనుచు దశవదనునకున్ 1081

ఉ. మేలగుస్త్రీ లభించెనని మిక్కిలిసంతస మొంది రావణుం
డా లలితాంగిఁబెండ్లియయి యాతనితమ్ములకున్ వివాహముల్
చాలఁ బ్రియంబునన్ సలిపెఁ జక్కనికన్యలఁదోడి తెచ్చియా
బాలికలన్ వివాహమయి వారును సంతసమొందిరంతటన్ 1019

:- రావణుఁడు సపరివారుఁడై లంకాపట్టణమున నివసించుట :-

చ. నవనిధిమధ్యమందుఁ జెలువం బలరారఁ త్రికూటనామకం
బనగమగమ్యమై కమలభూపరికల్పితమై చెలంగుమున్
దనుజులకై మయుండు వివిధంబగుసౌధములన్ రచించెఁ గాం
చనబహురత్నకుడ్యరుచిజాలము మీఱఁగనందుఁ బొందుగన్

చ. భుజగనివాసమై వెలయు భోగవతీ విభవంబు మించి య
య్యజరవరేణ్యుఁ డేలు పురమా నమరావతి సోయగంబు న
క్క-జమగు నాత్మ తేజమునఁ గప్పెడి చక్కఁదనంపు పెంపుతో
రజనిచరుల్ వసించునగరంబగు లంకతగుంబ్రసిద్ధమై 1021

తే. ఖేయముగ నాల్గు దెసలం
దో యధియే యావరింప దుర్గము దృఢమై
యాయతరత్నఖచిత తప
నీయ విరచితముగఁ దగుగణింపఁగ వశమే 1022

శా. ఏకల్పంబున నీశ్వరేచ్ఛఁ బ్రభుఁడై యేరాక్షసాధీశ్వరుం
డాకమ్రింబవు పట్టణంబున నతుల్య ప్రాభవోపేతుఁడై
వీఁకన్ సైన్య సమేతుఁడై వెలయు నవ్వీరున్ ససైన్యంబుగా
నాకల్పంబున సంహరించిరి రణప్రారంభులై నిర్జరుల్ 1023

క. శక్రప్రేరితులై ని
ర్వక్ర పరాక్రములు యక్షవరులా దుర్గం
బాక్రమణచేసి రక్షణ
సక్రమముగ సలుపు చుండ్రి శతలక్షభటుల్ 1024

క. రావణుఁ డది విని సైన్యము
తో వడిఁజని ముట్టడించె దుర్గముయక్షుల్
పోవన్ సాగిరి కనితమ
జీవంబులఁ జేతఁబట్టి చెచ్చెర భీతిన్ 1025

ఉ. అంతట రావణుండు పురమంతయుఁ జూచి సుఖాకరంబుగా
నెంతయు నూహఁ జేసి యదు లేరికగమ్యము సుందరంబున
త్యంతనివాస యోగ్యమని యయ్యది వానికి రాజధానిగాఁ
గాంతలుఁ దమ్ములుం గొలువఁగా నసియించెనిశాట కోటితోన్ 1026

చ. ఎవనికి నుండ యోగ్యమగు నిల్లది వానికి నాప్రకారమా
భవనము నెంచి వారలకుఁ బంచియొసంగి సుఖింపఁ జేసెదా
సవులను యక్షకోటులకు నాయకుఁడై తగు నాకుబేరు నా
హావమున నోంచి పుష్పకము నగ్గముఁ జేసికొనెం బ్రవీణతన్ 1027

క. కైలాసశైలమెత్తెన్
హేలం భుజబలమెసంగ నెంతయుఁ గ్రీడా
లోలుండై యాదానవ
పాలుండరిగెన్ వికాస భావముతోడన్ 1028

తే. సుఖము సంపద పుత్రులు శూరతయుఁ బ్ర
తాప బలజయకీర్తి సంతతులు నతుల
బుద్ధియును నిత్యనూతన వృద్ధిఁ జెందె
లాభమభివృద్ధిఁ గనమించు లోభమట్లు 1029

ఉ. చండబలుండు వాని సహజన్ముఁడు తీవ్రముఖుండు కుంభక
ర్ణుండు జగంబులోన నొకరుండును బుట్టఁగ లేదు వాని ను
ద్దండతఁ దాకి పోరఁగలదంట సురంగొని కూర్కు నార్నెలల్
నెండియు నిద్ర మేల్కొనఁ ద్రివిష్టపముల్ కలఁగుం భయంబునన్ 1030

క. ప్రతిదినమతఁడు భుజించిన
సతి శీఘ్రుంబున నెతీఱు నఖిలజగము ల
ద్భుత సంగరప్రవీణుం
డతనికి సములైన జోదు లటఁ గలరింకన్ 1031

ఉ. రావణు జ్యేష్ఠపుత్రుఁడు దురంబున నాతనిమ్రోల నిల్వఁగా
లావరిలేఁడు ముజ్జగములంగల యోధుల నగ్రగణ్యుఁడా
దేవతలం బరాజితుల దీనులఁజేయఁగఁగోరి నిత్యముం
బోవుచునుండుఁ దత్పురముపొంతకు నంతకుఁడో యనన్ వడిన్ 1032

తే. కుముఖుఁడును ధూమకేతుండు కులిశరదుఁడ
కంపనుం డతికాయుఁడన్ ఖలులలోన
నొకఁడొకఁడె గెల్చు జగములనొక్క మొగిని
యట్టి యోధులుగల రసంఖ్యాకులచట 1033

క. అందఱును గామరూపులు
నందఱు మాయావులగుదురందఱుఁ గలలో
నంనయయు ధర్మమెఱుఁగరు
మందోదరి విభునిగొలుచు మదదైత్యులలోన్ 1034

చ. ఒకపరిరావణుండు సభనుండి యపారముగాఁ జెలంగు దై
త్యకులమునందుఁ బెక్కుగువిధంబుల జాతులవారిఁ బుత్రపౌ
త్రకముఖబంధువర్గమును దక్కినసైన్యముఁజూచి క్రోధమ
త్తకలితభాషణంబుల నధర్మపరాయణుఁడౌచు నిట్లనెన్ 1035

చ. సురలు మదీయశాత్రవులునుండు నిశాచరయోధులార నే
నరిగితినేని వారలెదురై సమరంబుననిల్వ లేకపో
దురు పరువెత్తి వైరియగు దోర్బలయుక్తునిఁజూచి కానఁద
న్మరణదశావహంబయిన మార్గముఁ దెల్పెదనాలకింపుఁడా 1036

క. భుజబలులగు మీరలు నని
ద్విజభోజన హోమయజ్ఞ దీక్షల మంత్రా
ర్థజప శ్రాద్ధక్రియలను
నజస్రమును బాధసేయుఁడటు చేసినచోన్ 1037

క. సురలు బుభుక్షం గృశులై
యురుదెంచి తమంతదొరక నందఱనే నా
శరణమున నొక్కసారిగఁ
బరిమార్తు లేక చెఱలబంధమొనర్తున్ 1038

క. అని తెలిపి మేఘనాదుం
దనయునిరావించి సురల దర్పోద్ధతులం
దనవశులఁజేసి తెమ్మని
పనిచె సునాశీరుమ్మీఁదఁ బగరెట్టింపన్ 1039

రావణుఁడు దిగ్విజయార్థమేగుట.

తే. అతఁడుఁ బిత్రాజ్ఞ స్కంధమునందుఁ దాల్చి
యరిగెనటునలెఁ దక్కుయోధాళిఁబంచి
తాను గదఁబూని నడచె నద్దశముఖుండు
సరభసంబున సంగరోత్సాహి యగుచు 1040

ఉ. రావణుఁడేగుచోఁ బృథివి గ్రక్కదలెన్ ఖచరీ సుగర్భవి
స్రావములయ్యె గర్జనముసల్పఁ గ్రోధితుఁడైన యాదశ
గ్రీవుఁడు వచ్చుచుంటవిని గేహములంద్యజియించి కాంచన
గ్రావగుహాంతరంబుల సురల్ సొరఁబాఱిరి భీతచిత్తులై 1041

ఉ. అలరి రావణుండటు దిశాధిపలోకములందుఁజొచ్చి ది
క్పాలుర నందుఁగానక నభంబును దిక్కులువ్రీలనార్చి వా
చాలత నిర్జరాళిని దిసంతులుగొట్టుచుఁ దిట్టసాగెనా
భీలత మాటిమాటికిని బిట్టుగఁజేయుచు సింహనాదముల్ 1042

మ. రణకాంక్షన్ మదమత్తుఁడౌచుఁ బ్రతివీరగ్రామణిన్ రోసి రా
వణుఁడెందుంబొడఁగానలేక భువనవ్రాతంబునందా నభో
మణి చంద్రానలపాశిపాశి మరుదంబానాథమిత్రాదులం
ఫణిసిద్ధామర మర్త్యకిన్నరతతింబాధించె మార్గంబునన్ 1043

ఆ. అజుని సృష్టిలోన నంగధారణు లెంత
వఱకుఁగలరో యంతవఱకుఁగూడ
సతులుఁ బురుషులును వశంబయిపోయి రా
దైత్యనాయకునకు దశముఖునకు 1044

తే. అందఱునుగూడ నాతనియాజ్ఞ భయము
నంది పాలన మొనరించు చధిక నమ్ర
భావమున నాదురాత్ముని పాదములకు
వంగి నతులొనరింపఁ గావలసెనపుడు 1045

తే. భుజబలంబున సకలమహా భువనములను
స్వవశ మొనరించి రావణచక్రవర్తి
యొరులకేరికి స్వాతంత్ర్య మొసఁగకుండ
నఖిల రాజ్యము నేలు నిరంకుశముగ 1046

తే. యక్షగంధర్వనరకిన్నరాహి దేవ
కన్యకల బల్మి బాహువిక్రమము సూపి
యెత్తికొనివచ్చి ప్రీతివరించె నతఁడు
లలిత సౌందర్యవతుల విలాసవతుల 1047

ఆ. ఇంద్రజిత్తు తండ్రియిచ్చిన యానతి
కైవడిని సమస్త కార్యములను
జక్కఁబెట్టివచ్చెఁ దక్కిన దానవుల్
సలిపినట్టి చెయిదములను వినుము 1048

ఉ. పాపులు భీమరూపులు నుపద్రవకారులు నాదితేయ సం
తాపకరుల్ కృపారహితదారుణ కార్యధురంధరుల్ స్వమా
యాపరికల్పితాకృతు లుదగ్ర నిశాచరులెల్లఁగూడి ధ
ర్మాపహులై యొనర్తురు ప్రియంబున వేదవిరుద్ధకృత్యముల్. 1049

క. ఏ దేశంబున గోవులు
భూదివిజులుఁ గలరో యట్టి పురజనపదముల్
బూది యొనర్పఁ గడంగుదు
రాదురితాత్మకులు దహనునందిడి కడిమిన్ 1050

తే. ఎచ్చటను శుభాచరణంబు లెసఁగకుండె
నమర భూసురగురుగౌరవములు లేవు
లేవు జపయజ్ఞదానముల్ దైవభక్తి
వినఁబడదు కలను బురాణవేదపఠన 1051

చ. జపతపముల్ క్రతూరుదివిమద్వ్రతయోగవిరాగదాన స
ల్లపనము వీనులంబడ భళాయని రావణుఁడే స్వయంబుగా
నపరిమితత్వరంజని యవన్నియుఁ జిందరవందరౌనటుల్
చపలతఁ జేయు విశ్వమున సత్క్రియ లెల్లఁ జెడన్ మహాక్రుధన్ 1052

క. వినఁబడదు ధర్మమనుమాట విశ్వమందు
రక్తి నెవడైన వేదపురాణములను
జెప్పుచుండిన భయమొందఁ జేసి వాని
రాష్ట్రమునునుండి తోలఁగించు రావణుండు 1053

క. హింసాప్రియులగు భీకర
మాంసాశనపాప మనుపమానమమితమా
ధ్వంసకుల దుర్వినీతిఁ బ్ర
శంసింపఁగ దుర్లభంబు జగతి నెవరికిన్ 1054

తే. మాతృపితృదైవముల నవమానపరచి
సాధువులు దమ్ము సేవింప సమదులగుచు
ఖలులుఁ జోరులు జూదరుల్ కలుషమతులుఁ
బరధనపరాంగనారతుల్ ప్రబలిరపుడు 1055

తే. శైలజానినుమట్టి యాచరణపరులు
రాక్షసులుగాఁ దలంపు ధరామతల్లి
ధర్మహానినిగాంచి సంతాపమొంద
సాగె మనమున నత్యంత సాధ్వసమున 1056

గోరూపధారిణియగు భూమియు, సురలును బ్రహ్మయు
విష్ణుని శరణు వేడుట.

తే. వసుధ యిట్లనితలఁచెఁ బవిత్రసరిత్స
ముద్ర భరమెంత యేనియు మోయుచున్నఁ
దోఁపదే బాధయును బరద్రోహపరుల
భరము భరియింప నత్యంత బాధ నాకు 1057

తే. అనుచుఁ బ్రతికూలధర్మవర్తనముఁగాంచి
పలుకఁజాలక రావణుభయముచేత
ధారుణీదేవి గోరూపధారిణియయి
మునులు సురలున్నచోటికిఁ బోయియేడ్చె 1058

క. కాని ప్రయోజనమేమియు
గానంబడకుండెవారుఁ గాతరులగుటం
దీనతవినిరా రోదన
మానసముల దుఃఖభావ మానసహీలంగన్ 1059

మ. సుర గంధర్వ మునీంద్రులెల్ల గుమియై శోకార్త గోరూపయా
ధరణీదేవిని వెంటఁబెట్టుకొని శ్రద్ధాభక్తులేపార నా
సరసీజాసనుపాలికింజనఁగ నాసందర్భమాలించి యా
హరియే నీకును నాకుసాయమగు నీవానాథుసేవింపుమా 1060

తే. ధీరతవహించి హరిపదవారిజముల
స్మరణసేయుమతఁడు భక్తజనులపీడ
నెఱిఁగి తొలఁగించుఁ గరుణ సర్వేశ్వరుండ
టంచు ధరఁగాంచి యెఱిఁగించెనవ్విరించి 1061

తే. అపుడు సురలెల్లఁ గూర్చుండి హరినిఁగనఁగ
యోచనము సేసిరా పద్మలోచనుండు
మనకెటులనబ్బుఁ బిల్వఁగా ననుచు నొక్కఁ
డనియె వైకుంఠపురి కేగనగు నటంచు 1062

తే. మఱియొకండను క్షీరాబ్ధిమధ్యమును స
వాసమొనరించు వైకుంఠవాసుఁడనుచు
నెవని కేరీతిభక్తియు నెంతప్రీతి
కలుగు నారీతిఁ బ్రభుఁడు సాక్షాత్కరించు 1063

తే. అని మహాదేవుఁడనియె నోయద్రిరాజ
తనయ నేనా సమాజమధ్యమునుండి
పలికితిని వ్యాపకుండు సర్వసముఁ డెఱుఁగు
దమలమగు ప్రేమఁ బ్రత్యక్షమగు నతండు 1064

తే. ఎందు నేదేశకాలములందు నే ది
శల విదిశలను నెచట నీశ్వరుఁడు లేఁడె
సర్వజగదంతరాత్ముండు సర్వరహితుఁ
డును విరాగియుఁ బ్రేమఁ దోఁచును విభుండు 1065

క. అను నావచనం బెల్లరి
మనములకుం బ్రీతిసేయ మహితుండగు స
ద్వనజజుఁడు సాధుసాధని
వినుతించెన్ విపులహర్షవివశుండగుచున్ 1066

తే. కనుల నానందబాష్పాంబుకణము లొలుక
సావధానత మదికి ధైర్యంబు గొలిపి
హస్తయుగళంబు ముకుళించి హరిని గూర్చి
యిట్లనిస్తుతింపఁ దొడఁగె వాణీశ్వరుండు 1067

సీ. జయజయసురనాథ జయసుఖదాయక
జయప్రణతావన జయపరేశ
జయగోద్విజానంద సంఘాతదైత్యారి
జయసింధుకన్యకాప్రియహృదీశ
జయజయ భయవినాశ సర్వహృదయవాస
జయపరమానంద జయముకుంద
జయజగద్వ్యాపక సర్వంసహాదేవ
పాలకయద్భుత భద్రకరణ

తే. మహితభవదీయఘటనల మర్మమెఱుఁగ
నెవరిశక్యము సర్వేశ యీశ్వరేశ
సహజకరుణాళుఁడవు దీనజనకృపాళు
మము ననుగ్రహదృష్టిఁ జూడుమయనంత 1068

మ. అతివైరాగ్యయుతానురాగ గతమోహానందమానీంద్రసం
తతి రాత్రింబవలుల్ మహానియతితో ధ్యానంబుఁగావించును
న్నతినే దేవు పవిత్రచిత్రచరితన్ మాయావిహీనంబు సాం
ద్రతరాఖండమునింద్రియాదృశమునా బ్రహ్మంబునేగొల్చెదన్

తే. జయతు శ్రీసచ్చిదానంద జయదమంద
సత్కృపాసాంద్ర దైతేయ జలజచంద్ర
నిర్గుణనిరీహ నిస్తులనిర్వికార
సగుణసజ్జనహృత్కుశేశయవిహార 1070

సీ. ఏవిభుండు సహాయమేమియులేకయే
సృష్టించుజగములఁ ద్రివిధగతుల
నెవ్వండు భవభయాహీనవిపచ్ఛమా
భంజనుండును మునిరంజనుండు

భక్తియుఁబూజించు పద్ధతియెట్టుఁగని
మనుసయ్యఘూదిపే)మమునఁగనఁడౌ
శబ్దచాతుర్యంబు సకలంబుఁద్యజియించి
వాఙ్మనఃక్రియల దేవవ్రజంబు

ఆ. సకలమిప్పుడెవని శరణంబునందుండె
శారదయును వేదచయము శేషుఁ
డఖిలసన్మునీంద్రులంతరంగంబుల
నేవిభుని మహత్వమెట్టుఁగ తేరో 1071

ఉ. వేదము లేమహావిభుని విష్ణువచించెనుదీనకోటికా
హ్లాదకరుండునుం బ్రియుఁడునంచతఁడే కరుణించుమమ్మలన్
శ్రీదయితుండు శాశ్వతుఁడు జిన్మయుఁడార్తిమహాంధకార వి
చ్ఛేదకభానుమూర్తి భవసింధునుమందరకల్పుఁడాదృతిన్ 1072

చ. సకలమునీంద్రసిద్ధసురసంఘము లేము భయాతురత్వదు
ర్వికలమనస్కతంబరుని విశ్వమయున్ సుఖపుంజునిన్ను నీ
ప్రకృతికిఁ గారణుండనగు భవ్యగుణాశ్రయు నాశ్రయించి నీ
యకలుషపాదపద్మము లనన్యమతింభజియింతుమవ్యయా 1073

తే. కాన నందఱుఁబ్రోవుమో కమలనాథ
భక్తవత్సలయాశ్రిత పారిజాత
పరమపావనసర్వేశ భవవినాశ
యనుచు నతిభక్తిఁ బ్రార్థించునవసరమున 1074

మ. ధరణీదేవియు నిర్జరుల్ సభయులై తాత్పర్యతంబట్టనా
పరమస్నేహరసార్ద్రవాక్యములకుం బ్రానంబునన్ మెచ్చి దు
స్తరమా సంశయశోకనాశక మహాసంతోషసంధాయక
స్ఫురదుక్తుల్ దగ నభ్రవాణియనె సంభోదోద్గభీరధ్వనిన్ 1075

చ. మునివరులార నిర్జరసమూహములార భయంబుమానుఁడీ
నినకులమందు మీహితము నెంచి జనించెద మానవాకృతిం
గనుచు మదంశయుక్తముగఁ గశ్యపుఁడయ్యదితీసమేతుఁడై
ఘనతపమాచరింప మును కామితమిచ్చితి వారిమెచ్చుచున్ 1076

క. కౌసల్యా దశరథులై
యాసుమహితమతులు కోసలాఖ్యాతపురీ
వాసులయి భూరిరాజ్యము
వాసిగ నిపుడేలుచున్న వారు ధరిత్రిన్ 1077

క. ఇనకులతిలకుండగు నా
యనఘునకే నాల్గురూపులై జనియింతున్
మును నారదవాక్యము చొ
ప్పునను బరమశక్తి సహితముగ మానవతన్ 1078

చ. ధరణిభరంబు వాపెదను దైత్యకులంబునడంచి మీరు ని
ర్భరపరితోషమొంద వగవంబనిలేదనఁగన్ నిలింపులా
పరమవియత్సరస్వతి శ్రవఃపుటపర్వమొనర్పఁగా మనో
బుజహములెల్లఁ జల్లఁబడఁబోయిరి భూమియు నిర్భయాత్మయై 1079

ఉ. అంబుజసంభవుండను నచంబొనరింపఁగ నిర్భరావలం
బంబొనగూడె నాకనుచు భావమునందు ముదంబునొందె హే
మాంబరుఁడుర్విసంభవిలసద్విభుఁగొల్వ సురల్ ప్లవంగ రూ
పంబులఁదాల్ప నాజ్ఞయిడి బ్రహ్మచనెన్ నిజరాజధానికిన్ 1080

—: దేవతలు వానరులై జనియించుట :—

క. సురలు నిజధామములకే
గిరి విశ్రమితాత్ములగుచు క్షితిసహితముగా
సరసిజసంభవునానతి
శిరములనిడి హర్షమొదవ క్షిప్రముగ మహిన్ 1081

క. జనియించిరి వానరులై
ఘనువమబలధీపరాక్రము లతివీరులుగా
ఘనపర్వత తరునఖముల
ననివారుపయోగపటుతరాయుధములుగన్ 1082

తే. ధీరులుం బుద్ధిమంతులు దారధైర్య
సాహసులు శౌర్యవంతులా సకలకపులు
భగవదాగమనమునకై పథముఁగనుచు
నుందురద్రివనాదుల యూథములుగ 1083

తే. నడుమవిడిచితి నుడువుచుఁ గడువిచిత్ర
సుందరచరిత్ర మిస్పుడానందమొదవఁ
జెప్పెదను వినునుద్దానిఁ జిత్తమలర
సావధానమనస్కవై యద్రితనయ 1084

-: శ్రీ రామావతార చరిత్రము :-

సీ. శ్రీరఘువంశ శిరోరత్నమలఘు గు
ణాకరుండమల వివేకయుతుఁడు
దశరథుండనఁగ వేదప్రసిద్ధాఖ్యుండ
యోధ్యాపురప్రభుండుత్తముండు
ప్రజ్ఞానిధి సత్యపాలనపరుఁడు ని
రంతర ధర్మధురంధరుండు
నీతిమంతుఁడు కృపానిరతుండు సత్కళా
భరితుండు కోదండపండితుండు

తే. సతత శార్ఙ్గధరధ్యానసక్తవిమల
భక్తిమధురసుధారస పానరతుఁడు
ధీయుతుఁడు ధీరుఁడంచిత శ్రీయుతుండు
శిష్ట బుధజనవినుత సచ్ఛీలయుతుఁడు 1085

మ. సరసుండానరనాథచంద్రునకుఁ గౌసల్యాదిభార్యాత్రయం
బురుసౌందర్యవిలాసభాసుర పవిత్రోదారశీలోద్గుణా
భరణాలంకృతమై నిరంతర నిజప్రాణేశసేవాధురం
ధరమై శ్రీహరి పాదపంకరుహసంధ్యానప్రియంబై తగున్ 1086

-: దశరథుని పుత్రకామేష్టి :-

మ. తనయుల్ లేరనుచింత నొక్కపరి యాధాత్రీవరుండా వసి
ష్ఠునిజూడంజని తత్పదాంబురుహముల్ సోకం గిరీటంబు వం
చి నమస్కారమొనర్చి కష్టసుఖముల్ చెప్పెంగురూత్తంసుతో
వినయంబొప్పఁగ మౌనియిట్లనియె నుర్వీనాథునో దార్చుచున్ 1087

మ. వెతనీకేందుకు ధైర్యమూనుత్రిజగద్విఖ్యాతచారిత్రులౌ
సుతులన్ నల్వురభక్తభీతిహరులన్ క్షోణీభరోత్పాటన
వ్రతులం బావనశీలురన్ సుగుణులం బ్రస్ఫీతసౌందర్యులన్
క్షితినాథోత్తమ కాంచఁగాఁగలవనం జిత్తంబురంజిల్లఁగన్ 1088

ఉ. భూవిభుఁడేగెనంత మునిపుంగవుఁడైతగు ఋష్యశృంగు స
ద్భావుని శాంతునిం బరమపావనునిం బిలిపించిభక్తితో
నావసుధావరార్థమయి యాతనిచేతను బుత్రకామమన్
బావనమైన యిష్టిసలుపంగనొనర్చె వసిష్ఠుఁడత్తఱిన్ 1089

తే. భక్తినాతఁడు వేల్వ వైశ్వానరుండు
పాణిపంకేజమునఁజరు పాత్రఁబూని
యతులదేదీప్యమాన దివ్యాంగమెసఁగ
ధారుణీశ్వరుప్రేమాలఁ బ్రత్యక్షమయ్యె 1090

తే. అటులఁ బ్రత్యక్షమైనిల్చి యవనినాథ
యివ్వసిష్ఠుండు దలఁచినట్టిష్టసిద్ధి
యయ్యెనీకీహవిస్సు నీయంగనలకుఁ
బంచియిమ్ము యథాయోగ్యభాగములుగ 1091

క. అని చెప్పి యదృశ్యుండై
చనె నాపాయసపుఁబాత్ర జననాథుకరం
బునఁబెట్టి యగ్నిహోత్రుఁడు
వినుమవ్వలికథను పూర్ణవిధుబింబముఖీ 1092

తే. అంత దశరథమేదినీకాంతుఁ డంత
రంగమునఁ బట్టరానిహర్షంబునిగుడఁ
బిలువఁబంపెఁ గౌసల్యాది ప్రియసతులను
వచ్చిరా కామినీమణుల్ ప్రభునికడకు 1093

క. వారలలోఁ గౌసల్యకు
నారాజేంద్రుండొసంగె నర్థాంశంబున్
సారతర పాయసంబుం
భూరమణుఁడు సేసె శేషమునుద్వ్యంశముగన్ 1094

తే. అందులోనొకపాలు సానందుఁడగుచు
నిచ్చెఁ గైకేయికిం ధరణీశ్వరుండు
మరలఁ గరములనుంచె నమ్మానినులకు
శేషమును రెండుభాగముల్ సేసి యతఁడు 1095

క. సంతోషమున సుమిత్రా
కాంతకు నయ్యుభయహస్తకలితాంశములం
గాంతుం డొసఁగఁగ నెద న
త్యంత ముదంబొదవ వానినాయమకొనియెన్ 1096

తే. మువ్వురును గర్భవతులయి భూరిసౌఖ్య
హర్షరసభరితాత్మలై యలరుచుండ
సౌఖ్యసంపత్తులొప్పారె జగమునందుఁ
జక్రి గర్భస్థుఁడౌ దివసంబు మొదలు 1097

క. తేజశ్శీలాన్వితలై
భ్రాజిత కమనీయ గర్భభారంబులతో
రాజగృహంబున మెలఁగిరి
రాజాస్యలుమువురు సురుచిర శ్రీగరిమన్ 1098

-: కౌసల్యకు శ్రీరామచంద్రుఁ డుదయించుట :-

క. భగవంతుఁడవతరింపం
దగుసమయమునచ్చొ వార తారాగ్రహముల్
మిగుల శుభస్థితినుండఁగ
నగణిత శుభలగ్నయోగమగు తిథియందున్ 1099

చ. సకల చరాచరంబులును సంతసమొందఁగ సౌఖ్యమూలమై
యకలుష చైత్రశుద్ధమున నంచితమౌ నవమిం గృపాంబురా
శికి హరికిష్టమైన యభిజిచ్ఛుభ వేళను శీతముష్ణమొం
దక దినమధ్యమై ప్రమదదంబగుకాలమునందు రాముఁడై 1100

ఆ. అవతరించెఁ జక్రి యఖిలలోకేశ్వరుం
డాదిమధ్యరహితుఁడైన విభుఁడు
సకలలోకములును సంతోషజలరాశి
నోలలాడె శాంతి యుప్పతిల్ల 1101

ఆ. ఎన్నియేనిదినము లేతెంచుఁ బఱతెంచి
యుట్టెపోవుచుండు నేమరించి
కోసలేంద్రకన్య కొడుకునుగనినట్టి
దినముఁబోలవెట్టి దినములైన 1102

ఉ. మందసుగంధబంధుర సుమారుతముల్ విలసిల్లెఁజల్లనై
సుందరమై వసంతతతిసూన విరాజితమయ్యెవాహినీ
బృందము నిర్మలామృతపు నెల్లువలం జెలఁగెన్ సురాళియా
నందమునొందె సాధులమనంబులనుల్లసిలెం బ్రమోదముల్ 1103

మ. గిరులన్ రత్నములుప్పతిల్లెవిధియుం గీర్వాణసంఘంబులుం
బరమానందమునన్ విమానములఁ జెల్వొంబొప్ప సన్నాహులై
వరుసంబోయి సమూహమైనిలువ నభ్రంబెల్లశోభిల్లెఁ బా
డిరిగంధర్వులు శౌరిచారుగుణకోటిన్ నాట్యముల్ సేయుచున్ 1104

ఉ. ప్రాంజలులంఘటించి ప్రసవాళి వసంగురియించి యాజగ
ద్రంజకు రాము నెన్నుచు సురల్ మునులున్ ఫణులున్ సహర్షులై
సంజనితాశ్రుపూరముల సంస్తవముల్ బొనరించిరెల్ల ది
క్పుంజముప్రేల దుందుభులు మ్రోయఁగ మింటనకుంఠితంబుగన్

క. సురలీవిధమున వినతుల్
పరమానందమునఁ జేసి భగవంతు గుణా
కరునిం బరిపరివిధముల
స్మరియించుచు నేగిరాత్మ సదనంబులకున్ 1106

ఆ. అఖిలభువననిలయుఁ డాదిమధ్యాంత వి
హీనుఁ డక్షగుం డహీంద్రశాయి
యాదివిష్ణుఁ డుదయమయ్యె నజుం డయ్యె
దశరథావనీంద్ర తనయుఁ డగుచు 1107

ఆ. దేహధారణులను ద్వివిధమార్గంబులఁ
ద్రిప్ప నేర్పుగలుగు దిట్ట యపుడు
దేహియయ్యె నట్టి దేవ్రుని మూఢుఁడౌ
దేహధారి యెట్లు తెలియఁగలఁడు 1108

ఆ. సౌఖ్యదాయకుండు సకలలోకములకు
ముక్తిదాయకుండు మునివరులకు
భక్తిదాయకుండు పరమయోగీంద్రుల
కిష్టదాయకుండు శిష్టులకును 1109

-: కౌసల్య శ్రీరామచంద్రుని స్తుతించుట :-

సీ. పరమదయాళుని భాసురకౌశేయ
వాసుఁబరేశు శ్రీవత్సవక్షు
నద్భుతచారిత్రు నతిరూపలావణ్యు
నమల భక్తవిధేయు నంబుజాక్షు
శంఖచక్రగదాది సాధనాంచిత చతు
ర్బాహుని విజితనిర్జరవిపక్షు
కౌస్తుభవనమాలికా ముఖాలంకార
భూషితు సంతతభువనరక్షు

తే. అంబుదశ్యామదేహు విహంగవాహు
ప్రమదకరరామభద్రు శోభాసముద్రు
ఘనుని నిజహితకారి జగద్విహారిఁ
గాంచెఁ గౌసల్యకన్నుల కఱవుదీఱ 1110

ఆ. కరయుగంబుమోడ్చి కౌసల్యస్తుతియింప
సాగె నీవిధమున సర్వమయుని
తనయరూపమొంది తనమ్రోలనున్నట్టి
జలదనీలగాత్రు జలజనేత్రు 1111

తే. నిన్ను నేరీతి స్తుతియింతు నే ననంత
వేదములును బురాణముల్ విభునినిన్ను
జ్ఞానమాయాగుణాతీతుగా నుతించుఁ
బారరహితకృపా సుఖభద్రజలధి 1112

ఆ. నాహితంబుఁగోరి నలినాక్ష భక్తజ
నానురాగి యుదయమందితీవు
సరసిజాసనాది సన్నుతచారిత్ర
చిత్తజారిమిత్ర శ్రీకళత్ర 1113

శా. సీమాయాకరచితాబ్జజాండతతి రాణించుంగృపాళూ భవ
ద్రోమాగ్రంబులనంచు నెందడగు నాశ్రుత్యుక్తమున్ వించుదే
వామద్గర్భమునందునుంటి ననుసీవాసోక్తినాలించి నం
ధీమంతుల్ స్థిరబుద్ధినుండగల రే దేవప్రియా యవ్యయా 1114

చ. అనవుడుదల్లి జ్ఞానమున కాననమందెలనవ్వుదోచఁజి
త్రినటనసల్పనున్న గుణధాముఁడు రాముడు రమ్యమా కథం
జననికిఁదెల్పె పుత్రునెపఁజాల్కగ మోహముగల్గునట్లుగా
నొనరుపనాత్మరాగరసముప్పతిలంజనయిత్రి యిట్లనన్ 1115

క. తనయా కోటితరణి సమ
ఘనతేజముగల్గు మూర్తిఁగనుఁగొన నాకుం
గనులు సెదరెఁగావునఁజి
క్కనిబాలుఁడవై ప్రియంబుఁగలిగింపుమనన్ 1116

ఆ. సకలసురవిభుండు చక్కనిశిశువయి
యేడ్వసాగె నెవ్వరీచరిత్రఁ
బాడిరేనివారు భవకూపమునఁబడ
కన్యయంపు పదమునందఁగలరు 1117

క. మాయాగుణేంద్రియ ముఖా
జ్ఞేయుండౌ ప్రభుఁడుస్వేచ్ఛచే దేహధరుం
డైయవనీసురగోసుర
శ్రేయార్థ నరావతారసిద్ధినెసంగెన్ 1118

క. అంతశిశువేడ్వవిని నృప
కాంతలు ధాత్రులునుదాసికాగణమెల్లన్
సంతోషసంభ్రమను సమే
తాంతఃకరణములనేగి యాప్రియవాణిన్ 1119

క. విని శిశువుంగని మోదం
బినుమడిగా సంభ్రమమున నిటునటు దాసీ
జనము వరువెత్తఁ బట్టణ
జననివహముగూడ హర్షజలనిధిఁ దేలెన్ 1120

-: దశరథుఁడు పుత్రజననవార్తనాలించి యంతిపురమున కేగుట :-

ఆ. తనయు జననవార్త దశరథుండాలించి
ప్రేమఁ బులకితాంగుఁడై మనోర
థము ఫలించెననుచుఁ దలఁచి బ్రహ్మానంద
పరవశాత్ముఁడగుచు నరవరుండు 1121

ఉ. ఏవిభు నామమున్ వినిన నెల్ల శుభంబులు సంభవించు నా
దేవుఁడు నాగృహంబున మదీయతపఃఫలమై జనించె నా
జీవనమున్ ఫలించెనని చింతనచేయుచు హర్షమగ్నుఁడై
మ్రోవఁగఁ జేయఁగాఁ బనిచె భూరిరవంబున వాద్యసంతతిన్ 1122

మ. గురువర్యుండగు నవ్వసిష్ఠుఁ బిలువన్ క్షోణీసురవ్రాతముల్
పరివేష్టింపఁగ వచ్చి యయ్యనుపమప్రస్ఫీత తేజున్ మనో
హరసౌందర్యఖనిన్ వచోప్రతతిచే నగ్గింపనెన్నాళ్లకుం
బరిపూర్తింగనవట్టి సద్గుణగణప్రాలంబకుం డింభకున్ 1123

క. కాంచెఁ దరంగిత హర్షో
దంచిత మతియగుచు భూవరాగారము సొ
త్తెంచి నృపుఁ డప్పుడు రహిఁగా
వించెన్ నాందీముఖ ప్రవిమలక్రియలన్ 1124

తే. జాతకర్మంబుఁ గావించి జనవిభుండు
బ్రాహ్మణులకును హాటకాంబరసురత్న
ధేనుదానంబు లొనరించి తృప్తిపఱచె
నర్థిజనములకును నభీష్టార్థములిడి 1125

చ. నగరము శోభమీఱుచుఁగనంబడెఁ గేతనతోరణాళిచే
నగణితవైభవంబడరనంబర దేశమునుండి పూలుపె
ల్లుగ్గఁగురిసెన్ సమస్తజనులుంబ్రమదాంబుధిమగ్నులైరి యిం
పుగసమలంకరించుకొనిపోయిరి కాంతలుగుంపుగుంపులై 1126

ఉ. కాంచనకుంభముల్ గొనుచుఁగామినులాగతిఁబళ్ళెరంబులం
దుంచి శుభప్రదంబులగు నుత్తమవస్తువులంగ్రహించిమో
దించుచుఁ బాడుచుందశరథేశ్వరు మందిరముం బ్రవేశమై
యంచితమాప్రియంబెసఁగ నారతులిచ్చుచుమాటిమాటికిన్ 1127

క. శిశుచరణంబులవ్రాలుచుఁ
గృశమధ్యలు ప్రేమవశతఁ గేరుచునుండన్
విశదముగ వందిమాగధ
కుశలులుగాయకులు రామగుణములుపాడన్ 1128

క. చెలఁగె బహువైభవంబుగ
నిలాపతియొసంగె ధనము లెల్లరకునుపీ
ధులెసఁగె మృగమదకుంకుమ
మలయజసంకలిత కర్దమప్రచురములై 1129

క. సౌందర్యధాముఁడగు గో
విందుఁడు వొడమెనని సకలవేశ్మముల శుభా
నందకర వాద్యఘోషము
లందముగాఁజెలఁగెఁ బురుషులతివలు నలరన్ 1130

-: కైకేయీసుమిత్రలకు భరతలక్ష్మణశత్రుఘ్నులుదయించుట :-

శా. కైకేయీసతియున్ సుమిత్రయుశుభాకారాంగులంబుత్రులన్
లోకానందకరేడ్యలక్షణుల భానుప్రోల్లసత్తేజులన్
రాకాచంద్రనిభాస్యులంగనిరి సర్వస్వామికేన్ వాణికే
నాకాలంబునఁ బౌరులందిన సుఖంబగ్గింపఁగాశక్యమే 1131

ఆ. అగరుధూపధూమ మంధకారంబన
నలముర క్తచూర్ణ మరుణిమమన
మందిరముల నలరుమణులు తారలనంగఁ
బూర్ణకలశ మిందుమూర్తి యనఁగ 1132

చ. పొలుచుతమస్వినీసతిప్రభుంగన నేగి సరోజబంధుని
జ్జ్వలుఁగని సంకుచించి తగుసంధ్యక్రియన్ విలసిల్లనోయనం
జెలఁగెనయోధ్య మందిరవిశిష్టశ్రుతి ధ్వనిపక్షికూజితం
బులఁగ నినుండునొక్కదినముంబలె మాసమునిల్చెఁ బ్రీతుఁడై 1133

ఆ. రథసమేతుఁడగుచు రవినిల్చియుండంగ
రాత్రి యేవిధమున రాఁదొడంగు
నేకమాసదివస మెన్నాళ్ళకయ్యె నీ
భేద మెఱుఁగ రెవరుఁ బృథివిజనులు 1134

క. గుణగానము చేయుచు దిన
మణి యేగెఁ మానులును నమర్త్యులు సిద్ధుల్
ఫణులును దమభాగ్యంబుల
గణుతించుచు నరిగిరి స్వనికాయంబులతోఁ 1135

తే. వినుము పార్వతి దృఢమతి వింతయైన
నాదుచౌర్యవృత్తాంతంబు నాదరమున
నపుడు కాగభుశుండితో నరిగి నేన
రాకృతిధరించి యయ్యయోధ్యాపురమున 1136

ఆ. పరమహర్ష మెసఁగ నాడవాడలయందు
సంచరించితిమి ప్రశస్తమైన
ప్రేమసౌఖ్యవశత వికసితాత్ములమయి
యుకపురమును దీని నెఱుఁగ రెవరు 1137

తే. ఈశుభచరిత్రి నెఱుఁగుదు రెవరియందు
సాంద్రముగనుండు శ్రీరామచంద్రుకరుణ
వారుతక్కినవారికి వశముగాదు
తెలియ మిహికావనీధరాధిపకుమారి 1138

తే. ఎవరెవరి కేదియిష్టమో యెఱిఁగి రాజు
రథగజతురంగ ధేనువస్త్రవ్రజంబు
హేమమహీరాదు లెలమితో నిచ్చెనట్టి
హార్షసమయంబు నందసంఖ్యాకముగను 1139

క. మోదించి రెల్ల రాశీ
ర్వాదంబులొసంగి మహిఁజిరంజీవులుగా
శ్రీదయితుఁడు తులసీశుం
డాదరమునఁబ్రోచు సుతులనని ప్రేమమునన్ 1140

—: బాలచరిత్రము :—

ఉ. ఈగతిఁగొన్ని నాళ్లు సనె నెవ్వరెఱుంగక రాత్రులుంబవల్
సాగుచునుండ నంతన్నృపచంద్రుఁడు బిల్వఁగఁబంపె నామహా
భాగుని జ్ఞానియైన మునివర్యు వసిష్ఠుని నాత్మజాళికిన్
నాగరులుబ్బ నామకరణంపు మహోత్సవమాచరింపఁగన్ 1141

ఉ. పూజయొనర్చి రాజుమునిపుంగవ నీమదికిష్టమైన యా
యోజను బేళ్లువెట్టుమన నుబ్బుచు నిస్తుల నామధేయముల్
రాజయనేకముల్ సుగుణరాశులు వీరికినున్నవైన నా
యోజనకందినట్లు తగునుత్తమనామములన్ వచించెదన్ 1142

తే. సకలలోక విశ్రామదాయకుని హర్ష
సింధుసుఖరాశి నిజదయా శీకరములఁ
ద్రిభువనంబుల సౌఖ్యాబ్ధిఁ దేల్చువిభుని
రాముఁడనుపేరఁ బిల్వనర్హము నృపాల 1143

తే. విశ్వంభర మెల్ల భరియింపఁ బ్రీతితోడఁ
బోషణ మొనర్పఁ దగిన యాపుణ్యరాశి
భరతుఁడను పేర నొప్పు నీ బాలుఁ డలఁప
మ్రింగు రిపురాజి కాన శత్రుఘ్నుఁ డితఁడు 1144

తే. సకలశుభలక్షణములకు స్థానమగుచు
రామచంద్రున కత్యను రక్తుఁ డగుచు
భువనముల కెల్ల నాధారభూతుఁ డగుచుఁ
దనరు నీతండు లక్ష్మణుండనియె మౌని 1145

తే. ఈవిధంబునఁ దనమది నెంచి గురుఁడు
నామకరణంబుఁ గావించి యామహీశుఁ
గాంచి సానందుఁ డగుచు నిక్కరణిఁ బలికె
రాజచంద్రుండు హర్షాంబురాశిఁ దేల 1146

తే. వేదతత్త్వంబు మునిజనామోదధనము
భక్తసర్వస్వ మంబికా ప్రాణనాథ
ప్రాణ మత్యంత సుఖశుభాశ్రయము సుమ్ము
నీసుతచతుష్టయం బవనీతలేంద్ర 1147

ఆ. బాలలీలచేతఁ బ్రాణులకెల్లను
సౌఖ్యమిడఁగఁ జాలు చారుగుణులు
సౌఖ్యకరులు గారె జగములన్నింటికి
నీతిమంతులైన నీతనయులు 1148

తే. బాల్యముననుండి లక్ష్మణస్వామి తనకు
హితకరుండని ప్రభుఁడని యెంచి రామ
చంద్ర చరణాంబుజద్వయాచల సుభక్తిఁ
గలిగి భజియించుచుండు నుత్కంఠతోడ 1149

**తే.** భరతశత్రుఘ్నులుంగూడఁ బ్రభుఁడు సేవ
కుండునాఁ బ్రీతివర్ధిలుచుండనుండి
రండఁబాయక శ్యామగౌరాంగకాంతిఁ
బుత్రియుగళద్వయంబు విస్ఫూర్తినలరు 1150

**తే.** పుత్రికుల సోయగముఁగాంచి ముదమునొంది
దృష్టిదోషంబువాయఁగాఁ దృణముత్రుంచి
పాఱవైతురు తల్లులాబాలురెల్ల
శీలరూప గుణాఢ్యులై చెలగుచుండ్రి 1151

**తే.** వారిలో నెల్ల శ్రీరామభద్రమూర్తి
సకలసద్గుణధాముండు స్వచ్ఛకీర్తి
శ్రితజనావన శీలుండు శ్రీకరుండు
సారసాక్షుండమల సుఖసాగరుండు 1152

**ఆ.** అతనిహృదయమందు నధికంపుకృపయును
నమృతకరుఁడు వెలయుననుచుఁ దెలుపు
నతిమనోహరంపు హాసచంద్రిక సర్వ
భువనములకు సౌఖ్యమునుఘటింప 1153

**క.** జనయిత్రులంకమున డో
లను బాలురనుంచి లాలిలాలియనుచుఁ బ్రీ
తిని బాడుచు నూచుచులా
లన సేయుచు ముద్దుగొని చెలంగుదురురహిన్ 1154

**చ.** అజుఁడు నిరంజనుండు పరమాత్ముఁడు బ్రహ్మము వ్యాపకుండు శో
కజనన హర్షహీనుఁడు వికారవిదూరుఁడు నిర్గుణుండు న
క్కజముగ భక్తికిన్ వశుఁడుగానఁ బ్రియంబునఁగోసలాత్మజా
ప్రజుఁడయి యంకపీఠమున బాలవినోదముసల్పుఁబొల్పుగన్ 1155

ఉ. శ్యామల కోమలాత్యసిత సారసవారిదతుల్యవర్ణమై
కామ సహస్రకోటి సమకమ్రశరీర మొనంగఁగాళ్లు కెం
దామరలోయనన్ వెలయు ధాళధళద్యుతి మౌక్తికాళినా
రాముని పాదపంకరుహరమ్యనఖాళి చెలంగురంగుగన్ 1156

క. కులిశధ్వజాంకుశాంకము
లలరుపదాబ్జములు నూపురారావము వీ
నులఁబడ మునిజనమానస
ములు సహితముఁ దక్షణంబ మోహితములగున్ 1157

క, అతిరమణీయముగ వళి
త్రితయమ్ము దరమ్మునందుఁ దేజరిలంగన్
నతనాభియొప్పఁ గింకిణు
లతులముగఁ గటిప్రదేశమందురహింపన్ 1158

చ. భుజములుదీర్ఘమై బహుళభూషణ సంయుతమై చెలంగ సా
మజరిపుప్రోల్లసన్నఖరమండనముల్ మణిహారహీరకాం
తిజనితశోభయుం భృగుపదిస్ఫుట చిహ్నమురంబునందు నా
రజమయియొప్పఁజూడ మదిరంజిలు లాలసమైయొవారికిన్ 1159

ఉ. కంబుసమాన చారుతరకంధరముం జుబుకంపుసొంపు నా
స్యంబు బహుప్రసూనశరసామ్యసులక్షణ లక్షితంబుయు
గ్మంబగు దంతముల్ దొగరుగల్గి వెలుంగురదాంశుకంబుఁదో
రంబగు నాసయుందిలకరమ్యత నెన్నఁగఁబారమున్న దే 1160

ఉ. చారుకపోలముల్ చెవులచక్కదనంబు విశాలనేత్రముల్
కీరముఁగేరుపల్కులును గేశచయమ్మతిపేశలమ్ము వి
స్తారముఁగుంచితమ్ము విలసద్రుచిరమ్మయియొప్పు దానిసిం
గార మొనర్పఁదల్లి యొడికంబుగదువ్వుచుఁజక్కదిద్దుచున్ 1161

చ. విలసితపీతమై కడునవీనమునౌ కుబుసంబుఁ దాల్చుచుం
గలకలనవ్వుచుం రహిఁ జకాచకిఁ బర్విడ జానుకూర్పరం
బులును గరంబులూఁతఁగొని పోయెడి సుందరమూర్తిఁ గన్గొనం
బులకితగాత్ర మొప్పముదమునఁగని చొక్కుదు నేఁగడుంగడున్ 1162

తే. అట్టిరూపంబు వేదంబులహివిభుండు
వర్ణనముసేయనోపరు స్వప్నమునను
జూచియున్నట్టి వారికా సొబగు తెలియుఁ
గాని యితరులకేరీతిఁ గాంచనగును 1163

తే. మోహరహితుండు సౌఖ్యసమూహనిలయుఁ
డింద్రియాగమ జ్ఞానవాగీశ్వరుండు
రక్తిఁ గౌసల్య దశరథరాజు నలరఁ
బ్రేమవశుఁడయి విహరించె బిడ్డఁడగుచు 1164

తే. ఈవిధంబున లోకాళికెల్లఁ దల్లి
తండ్రియును నైన రామచంద్ర ప్రభుండు
కోసలప్రజాశ్రేణికిఁ గూర్చు సుఖము
పాదరతులకు నాగతి ప్రకటమగజ 1165

తే. భయమడంగుఁ జరాచరప్రాణిచయ వ
శీకరణచణ శ్రీరాము చేతఁగాని
రానువిముఖులు భవబంధరహితులగుట
కేయుపాయంబుఁగలదె పూర్ణేందువదన 1166

చ. ప్రభుభృకుటీవిలాసము ప్రపంచములన్ నటియింపఁజేయు నా
త్రిభువననాథుఁగాక యెవరిం భజియించుట నేర్పమాని శ్రీ
విభునిమనోవచః క్రియలవేఁడి భజింప గృపాకరుండు దు
ర్లభమగు మోక్షమున్ సకలలాభములందయసేయకుండునే 1167

ఆ. ఈవిధమున జనులకెల్ల సుఖంబిచ్చి
బాలలీలసలిపెఁ బ్రభుడు మాత
యొకట మోదమొందు నుత్సంగమున నిడి
యొక్కవేళ డోలనుంచి యూచు 1068

ఆ. ప్రేమమగ్న యగుచు వివశయై కౌసల్య
దినము రాత్రి గడువ దెలియదయ్యె
బుత్రమోహవశతఁ బొంగుచు ననిశంబు
బాలచరితఁ బ్రీతిఁ బాడుచుండు 1169

## కౌసల్య శ్రీరామచంద్రుని మహిమం గని యాశ్చర్యమొందుట

చ. జలకములార్చి యొక్కపరి జక్కనలంకృతుఁ జేసి మాతయా
యలఘుని బాలునుయ్యలఁ బ్రియంబున నుంచి కులేష్టదైవముం
గొలువఁగ స్నానమున్ సలిపి కోరికఁ బూజ యొనర్చి భక్తిసం
ధిలఁగని వేదనంబొసఁగి యేగెను బాకమొనర్చు నింటికిన్ 1170

ఆ. అచటినుండి వచ్చు చాయమ భోజనం
బాచరించు తనయు నరసి భీతి
నరిగి తొట్లలోన హాయిగా నిద్రించు
పుత్రుఁ గాంచి మరలఁ బోయి యచట 1171

ఆ. భోజనంబు సేయు పుత్రునిఁ దిలకించి
కంపితాత్మ యయ్యెఁ గాంతకపుడు
కుదురుపడక యుండె మదిలోన ధైర్యంబు
తనయు రెండుచోట్లఁ గనినకతన 1172

ఉ. ఇయ్యెడ నయ్యెడం దనయు నేఁ గనుఁగొంటిని యేకకాలమం
దెయ్యది నిక్కవంబు భ్రమియించితి నేమొ మనంబునందు లే
కయ్యది యేవిశేషమొ యటంచుఁ దలంచుచునుండ నంతలో
నయ్యమ చింతఁ గాంచి దరహాసము రాముఁడొనర్చెఁ దియ్యగన్

తే. రోమరోమంబునందు సరోజసంభ
వాండకోటిధరించు నఖండమూర్తి
మాత కద్భుతమైనయాత్మస్వరూప
మెల్లదర్శింపఁగాఁజేసె నల్లనవ్వి 1174

మ. అగణిత సూర్యచంద్రులభవాంబుజసంభవముఖ్య నిర్జరుల్
నగసరిదుర్వితో యథినవప్రకరంబులుఁ గాలకర్మముల్
సుగుణచయంబుజ్ఞానమును శుద్ధతనొప్పుస్వభావభావముల్
మిగులఁగఁజూచెఁ దల్లి యిలమీఁదవినంగనలేనిచోద్యముల్ 1175

ఆ. హస్తయుగముమోడ్చి యతిభీతినిలిచిన
మాయఁజూచె దానిమహిమచేత
నాట్యమాడుజీవ నలినాక్షి కనెదానిఁ
బరిహారంబొనర్చు భక్తిఁగాంచె 1176

క. పులకీకృతాంగియయి ప
ల్కులు నోటన్ రాకమోడ్చి లోచనయుగమున్
విలసిత తచ్చరణములకుఁ
దలోదరి నమస్కరించెఁ దలవాంచి వెసన్ 1177

తే. విస్మయాన్వితయౌతల్లి విధమునరసి
సర్వమయుఁడగు శ్రీరామచంద్రమూర్తి
బాలుఁడైయొప్పె నెప్పటిపగిదిమరల
జనని స్తుతిసల్పకయమున్న సత్వరమున 1178

క. ఏను జగత్పతిసుతునిగ
మానసమున నెంచితనుచు మాతతలంపం
గానిసువగు హరిజననీ
దీనినెవరికేని నీవు దెలుపకుమనగన్ 1179

ఆ. కరయుగంబుమోడ్చి కౌసల్య యోదేవ
నీదుమాయ నన్ను నియతి నెపుడుఁ
గ్రమ్మకుండఁజేయు కరుణానిధానమ
భక్తవరద దీనపాలయనిమె 1180

తే. బహుగతులఁజేసె శ్రీహరి బాలచరిత
దాసజనులకు నానందదాయియయ్యె
గొంతకాలంబునఁ బ్రీతిఁగూర్చునట్టి
యన్నదమ్ములు పెద్దవారైరియంత 1181

క. చూడాకరణంబును గురు
చూడామణిచేసె రాజసుతులకు నటుసన్
బాడబులు భూరిదక్షిణ
లోడనిసంతసములలరనొందిరిమరలన్ 1182

క. నలువురు సుకుమారులుఁగడు
నలరుచు నానాప్రకారమగులీలలచే
నెలమిఘటింపంజేయుచు
మెలఁగిరి భువినెల్లజనుల మెప్పులఁగొనుచున్ 1183

తే. వాఙ్మనశ్శక్తియాగోచరపథవిహారి
దశరథేశ్వరుప్రాంగణస్థలిఁజరించె
భోజనముసేయుతఱి భూవిభుండు పిలువ
రాఁడు బాలసమాజంబువీడియెపుడు 1184

తే. తల్లి కౌసల్యపిలువ సౌందర్యమెసఁగ
దుముకుచుం బాఱువేదసందోహమనని
నేతియనునంత మెఱుఁగండు భూతనాథుఁ
డమ్మహాత్ముఁ జననిపాఱియాగిపట్టు 1185

తే. ధూళిధూసరితాంగంబుతోడ రాఁగ
ధారుణీపతి నవ్వి యుత్సంగమందు
గూరుచుండఁగఁజేయు నాకూర్మిఁ బట్టి
సుపనిషద్వీధివిహరించు నురుపదాబ్జు 1186

తే. చపలచిత్తంబునం భుక్తి సలుపుచుండి
యవసర మెఱింగి యుజ్జ్వలంబైనవదన
మందు దధ్యోదనముఁ బూసి యటునిటుఁ
బరుగులిడుచుండు శ్రీరామభద్రమూర్తి 1187

తే. సరళమును సుందరంబు విస్తారమైన
బాలచరితంబు వాణియుఁ బాపతేఁడు
శ్రుతులు శంభుండు గానంబు సొంపుమీఱ
నాచరించుచునుండుదు రనవరతము 1188

ఆ. ఎవరిమనముత వ్వులదిందు సంప్రీతమై
యట్టిమానవులను నజునిచేత
వంచితులుగ నెన్న వలయు నీజగమున
భవనిగాఢపాశ బద్ధులగుట 1189

తే. సోదరచతుష్టయంబుఁ గిశోరచారు
రూపులై యున్న వేళ గురుండు జనని
జనకుఁడును నుపనీతులసలిపి రెలమి
సర్వవిద్యల శ్రీరామచంద్రమూర్తి 1190

క. గురుగేహంబున నేర్చె న
చిరకాలంబుననె శ్వాసచే శ్రుతిచయముం
బరఁగించు ప్రభుఁడు సదివెను
నిరతిశయగ నబ్బురము జనింపదె మదికిన్ 1191

తే. వినయ విద్యానిపుణగుణ విమలనీతి
శీలురై ప్రీతితోడ భూపాలసుతులు
హేలగ్రీడించుచుండి నృపాలలీల
ఖేలనంబుల నత్యంతలోలురగుచు 1192

చ. కరములఁజాపబాణములు గల్గి మనోహరరూప విభ్రమ
స్ఫురణఁజెలంగు రాసుతుల శోభఁగనుంగొని మోహమొందును
ర్వరను జరాచరంబులును వారల నల్వురఁజూచి భ్రాంతిన
శ్చెరువున నిల్చిపోవుదురు స్త్రీపురుషుల్ పురివీథివీథులన్ 1193

ఉ. బాలురు వద్ధులున్ మగలుభామలుఁ గోసలవాసులెల్లరున్
శ్రీలలనామనోహరుని శ్రీరఘురాముఁ గృపావిశాలునిం
బాలుని లీలనాడుకొనుబ్రహ్మముఁ బ్రాణముకంటెఁ బ్రీతిగాఁ
జాలఁగ నిశ్చయింతురు విచక్షణతో నిజమానసంబులన్ 1194

చ. అనుసజభ్రాన్వితుండయి మహాటవి నిత్యము వేఁటకేగి పా
వన మృగకోటిఁజంపి నృపవర్యనకుంగనఁజేయు రామచం
ద్రుని శరవిద్ధమై తనువు తోడనె వీడినురాలయంబుఁజొ
చ్చును మృగపాళి భోగములఁజూరలఁగొంచు సుఖించుసచ్చటన్

ఉ. రాముఁడు మిత్రియుక్తముగ భ్రాతృయుతంబుగ భోజనంబు వి
శ్రామవిహార లీలలనుసల్పుచు నిచ్చలుఁదల్లిదండ్రులం
బ్రేమయు భక్తి యొప్పఁడఁగఁబిల్చుచు వారలయాజ్ఞమీఱక కు
ద్దామగతింజరించు గుణధాముఁడు లోకమనోభిరాముఁడై 1196

ని. నగరనివాసులెల్లరును సర్వసుఖంబుల నొందునట్లుగాఁ
దగువిధయోగముల్ గలుపుఁదాను కృపానిధి రాముఁడెప్పుడున్
నిగమములంబురాణముల నిర్మలమా మతినాలకించి యిం
పుగ నెఱిఁగించుఁదమ్ములకు బోధయొనర్చుచుఁ దద్రహస్యముల్

క. ప్రాతఃకాలంబున నే
యాతఁడు మేల్కాంచి భక్తినవనతశిరుఁడై
మాతాపితృ గురుపదముల
కాతతమతిఁ మ్రొక్కి యాజ్ఞనందినపిదపన్ 1198

తే. నగరకార్యంబులం బ్రీతినడుపుచుండు
రామచంద్రుండు దశరథరాజు నతని
చరితమరసి మనమున హర్షంబునొందు
రామభద్రుండె తన బహిఃప్రాణమనుచు 1199

తే. నిష్కళుండు నిరీహుండు నిర్గుణుండు
నజుఁడు నిర్నామరూపుండు వ్యాపకుండు
భక్తజనములకొఱకునై బహువిధముల
ననుపమానచరిత్రంబు నాచరించు 1200

—: విశ్వామిత్రాగమనము :—

తే. ఈచరిత్రంబు సర్వంబు నెఱుకపడఁగ
గానమొసరించి తెలిపితిఁగాని ముందు
జరుగుకథఁ జెప్పెదనువిను సావధాన
చిత్తమునను మహామునిసత్తముండు 1201

క. విశ్వామిత్రాభిఖ్యుఁడు
వైశ్వానరతేజుఁడొక్కవని నాశ్రమమునం
దీశ్వరునిం ధ్యానించుచు
శాశ్వతమగు జ్ఞాననిష్ఠ సలుపుచునుండెన్ 1202

మ. అట యజ్ఞంబులఁజేయుచున్ మునులు క్రవ్యాదుండు మారీచుఁడుం
బటుదేహుండు సుబాహుఁడుంగదిసి పైపైనత్తురంచున్ మహో
త్కటభీతిన్ వహియింతురా ఖలులు యాగంబన్న వేగంబ యు
చ్చాటికింబోయి యుపద్రవంబొనరుపన్ శోకింతురా సంయముల్

ఉ. గాధిసుతుండెవందలఁచెఁ గ్రవ్యభుగావళిసంహరింప శ్రీ
నాథుఁడుదక్క లేఁడుభువనంబుల నొండొకఁడున్నఁడీశ్వరుం
డీ ధరణీభరంబుడుపనిప్పుడుదాల్చె నరావతారమున్
శ్రీధరుపాదదర్శనము సేసెదనీమిషఁబూని నేనొగిన్ 1204

చ. వినతియొనర్చి సోదరులవేడుక నిక్కురఁదోడితెత్తు జ్ఞా
ననిధి విరాగయోగసుగుణప్రకరాకరుఁడౌప్రభుండు న
న్ననుపమ సత్కృపావిలసితాంబకయుగ్మమువిచ్చి నిండుగాఁ
గనును మదీయజన్మమునుగాంచును ధన్యతనంచునుబ్బుచున్ 1205

క. చనుచు మనోరథమాత్రం
బెనగొనఁగా ననతికాలవిస్ఫుటగమనం
బున సరయూస్నానంబుం
బొనరిచి నృపుకొల్వుకూటమును మునిచేరెన్ 1206

చ. మునిచనుదెంచెనంచువిని భూపతి బ్రాహ్మణయుక్తుఁడౌచు నా
తనికెదురేగి యంఘ్రులకుదండవదానతుఁడై సుభక్తిఁ దో
డ్కొని చనియాత్మపీఠి మునికుంజరునుండఁగఁ జేసి పాదపూ
జనమొనరించె ధౌతముగసల్పి వినిర్మలవారిధారలన్ 1207

తే. నేడు నన్బోలుధన్యుండు లేఁడటంచు
ఱేఁడు మునికిష్టభోజ్యముల్ వేడుకనిడ
మునియు నత్యంత సంతోషమునఁ జెలంగ
దశరథావనినాథు నాదరముఁ గాంచి 1208

తే. అపుడు నరనాయకుండు నిజాత్మజులను
నలువురం దెచ్చి మునిపాదనలినములను
బెట్ట శ్రీరామునింగని విస్మరించె
దేహముల్ ముని తన్మయాధీనుఁడగుచు 1209

తే. సకలసుఖశోభలకునిమ్ము స్వామిరామ
చంద్రువదనమ్ముఁగని పూర్ణచంద్రుఁగాంచి
లోభమొందు చకోరమట్లుగ మునిపతి
యనుపమానందసౌఖ్యంబు ననుభవించె 1210

ఉ. అంతట రాజుహర్షమున నందనుసున్నిటువంటి మీకృపన్
శాంతినిధీ త్వదాగమనసంగతహేతువుఁ దెల్ప వేఁడెదో
క్కాంతయు జాగుచేయకొనరింతు భవద్ధృదయాభిలాషమున్
స్వాంతమునందుఁ గొంకకయె సర్వమునాకెఱిఁగింపుఁడీదయన్ 1211

చ. అనవుడు మౌనినన్ను సమదాసురసంఘము బాధసేయఁగా
నిను నిపుడర్థమొందడుగ నేనరుదెంచితి రాములక్ష్మణుం
బనుపుము రాక్షసావళిని భంజనముంబొనరింతు రుగ్రకా
ననమున నేనుగూడను సనాథుఁడనౌదు నృపాలచంద్రమా 1212

క. సంతోషస్వాంతత నీ
వెంతయు నజ్ఞానమోహహీనత నిమ్మ
త్యంత యశోధర్మంబులఁ
గాంతువు నీసుతులకగును కళ్యాణంబుల్ 1213

క. అనవిప్రియవచనంబుల
విని నలువురుసుతులఁగంటి వృద్ధాప్యమునన్
మునివర యోచింపకయడు
గనుజనునేయనియె నిజముఖద్యుతితఱుగన్ 1214

చ. ధరణియొ గోవులో ధననిధానమొ కోశమొ దేనిఁగోరెదో
సరభసవృత్తి నిచ్చెదను సర్వము ప్రాణములంగమన్నచోఁ
గరముఁబ్రియంబుజీవులకుఁగాదె యవైనను నీవుకోరినం
ద్వరనిమిషంబులోనొసఁగెదన్ వెసదెల్పుము మౌనిశేఖరా 1215

చ. కొమరులు నాకెదంబ్రియము(గూర్తుగు ప్రాణముకన్నమిన్నలై
యమివర రాముని౦బనున నల్లలలాడదె నామనంబు క్రూ
ప్రమతియుతుల్ కఠోరులగు రాక్షసులెక్కడ సుందరుండు( బ్రా
యము( గడుంగిశోరు(డగు నాత్మజుడెక్కడ మానిచంద్రమా.

చ. అనుటయు(బ్రేమపూరసముదంచితమా నవనీశువాక్యముల్
విని పరిమదంబునొందెముని పెక్కువిధంబుల నవ్వసిష్ఠు(డుం
జనపతిశంకవాయుటకు( జక్కనిబోధయొనర్చె నంత( బో
యెను మదిసందియంబు ధర్మణీశ్వరవర్యున కట్టిబోధచేన్ 1217

క. అంత(గుమారులనిర్వుర
సంతోషాద్భుతుల(బిలిచి చాల(దెలిసి య
త్యంతప్రియమున( దనదో
రంతర్భాగముననదిమి యవనిపుడనియెన్ 1218

—: దశరథు(డు రామలక్ష్మణుల విశ్వామిత్రుని వెంట బంపుట :—

ఉ. కూరిమినాదుప్రాణములకున్ విభులీ సుకుమారులిర్వురున్
వీరల నీకొసంగితిని ప్రేము(గనుంగొనుమీావతండ్రివై
లేరిక నన్యులంచు ధృతిలేకయనేకము గాంగ నాశుభా
కారులదీవనల్ సలిపి గాధితనూజున కప్పగింపగన్ 1219

క. రామప్రభుండు సానుజు(
డై మాతృగృహంబు(జేరి యవనతశిరు(డై
యామానిని పాదములకు
వేమారునమస్కరించి నెడలెన్ మునితో(గా 1220

చ. పురుషమృగేంద్రసన్నిభులు పుణ్యమతుల్ కడుధీరవీరులా
పరమకృపాంబురాశులు ప్రపంచక కారణకర్తలైన యా
సురుచిరరూపులిర్వురును శోకవిదూరులు మానిభీతిసం
హరణనిమిత్తమైచనిరి హర్షరసార్ద్రమనోంబుజాతులై 1221

సీ. అరుణాంబకంబులు నాజానుబాహువు
లతివిశాలంబగునట్టి యురము
నీలసరోజాతమాల చారుశ్యామ
లాంగంబుగటిని బీతాంబరంబు
వరనిషంగంబు నుజ్జ్వలబాణబాణాస
నాంచితసుందర హస్తయుగము
నద్వితీయమనోహరాంగకసౌష్ఠవ
పరిహాసితలతాంత బాణమూర్తి
తే. కలిగి సౌందర్యరాశియై వెలయు రామ
చంద్రు చెలువంబుగనినట్టి చక్షువులకు
నితరసౌందర్యముంజూడ నిచ్ఛకలుగ
దమృతరుచిఁగన్న జిహ్వచే దన్నుఁగోను నె 1222

ఉ. శ్యామలగౌరసుందర మహానిధులన్ రఘురామలక్ష్మణ
స్వాముల గాధినందనుఁడు భాగ్యవశంబునఁబొంది యాత్మలో
రాముని నాదిదేవునిగ బ్రహ్మముగాఁదలపోసి నాపయిం
బ్రేమముచేఁ బితన్విడిచి వేడుకవచ్చెనటంచు నుబ్బుచున్ 1223

—: శ్రీరాముడు తాటకను వధించుట :—

మ. ముని మార్గంబునఁజూపె రామునకు సంపూర్ణక్రుధన్ సవ్వడిన్
వినినంతంబఱతెంచు దానవసతిన్ వేల్లజ్జటందాటకం
గనినంతన్ రఘురామమూర్తి శరముంగాడించి కైవల్యముం
గనఁగాఁబంచెను దీనఁగాఁదలఁచి యాక్రవ్యాదదుష్టాంగనన్ 1224

—: విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు విద్యలనొసంగుట :—

తే. అంత గాధిసుతుండు నిజాంతరంగ
విభులఁగా నెంచి సోదరద్వితయమునకు
విద్యలకు నంబునిధులగు పృథుమతులకు
విద్యనుపదేశ మొసరించె వింతగాఁగ

తే. అతులతేజంబు బలము దేహంబులకును
గలిగి యాకలిదప్పులు గలుగనట్టి
మహిమగలవిద్యఁ బడసిరి మహితుఁడైన
గాధిసుతుచేత రామలక్ష్మణులు ప్రీతి 122

తే. సర్వశస్త్రాస్త్ర విద్యలొసంగి ప్రభుని
ననుజ యుక్తముగాఁగనిజాశ్రమమున
కెలమిఁగొనిచనిభక్తజనేష్టుఁడని
కందమూలఫలములిచ్చె గాధి సుతుఁడు 1227

శా. ప్రాతఃకాలమునందు రాముఁడు కృపాపారీణుఁడమ్మౌనితోఁ
జేతోభీతిఁ దొలంగిచేయుమికఁ నిశ్చింతందపోయజ్ఞ సం
ప్రాతంబన్నమునుల్ కండగి రొనరింపఁగా హోమముల్ రాముఁడుం
బ్రీతిం దత్సవన ప్రరక్షణకునై వేచెంధనుష్పాణియై 1228

-: విశ్వామిత్ర యాగ రక్షణము :-

క. మారీచనిశాచరుఁడప్పు
డారఘురాముని ప్రయత్నమంతయు వినిదు
ర్వారక్రోధంబుసఁబరి
వారసమేతముగ నటకు వచ్చె రయమునన్ 1229

క. శ్రీరాముఁడు శతయోజన
దూరంబునఁ గూలనేసె దుష్టుండగున
మ్మారీచునకూపారపు
తీరంబునఁబడగను సుసు దెరలకయుండఁగా 1230

తే. పడపడి సుబాహు శ్రీరామభద్రమూర్తి
పావకశరంబు సంధించి వరమపదము
నొందఁగానేసె లక్ష్మణుండురు నిశాట
సంఘమంతయు నొక్కట సంహరించె 1231

తే. విప్రభయనివారకుఁడగు విభుఁడటువలె
సర్వరాక్షస సంఘంబు సంహరింప
స్తుతులొనర్పఁదొడంగిరి సురలుమునులు
సచ్చిదానందుఁడౌ రామచంద్రునపుడు 1232

తే. కొన్ని దివసంబులచ్చట క్షోణిసురుల
దయనుగాంచుచు రామచంద్రప్రభుండు
వాసమొనరించె బ్రాహ్మణుల్ పరమభక్తి
పూర్వకములగు కథలు సెప్పుచుఁజెలంగ 1233

ఆ. ఆదరమున నప్పుడనియె విశ్వామిత్రుఁ
డధిప చూడఁ దగినయట్టి చరిత
మొండు గలదటంచు సుత్సాహమున ధను
ర్యాగమనిన మాటనాలకించి 1234

క. మునివెంటన్ సంతోషం
బున ననుజసమేతుఁడగుచుఁబోవఁదొడంగెం
దినకరకుల కలశాబ్ధితు
హినకరుఁడగు రాము మేదినీశ్వరుఁడంతన్ 1235

-: అహల్యాశాపవిమోచనము :-

చ. ఖగమృగజీవహీనమగు కాననమందొక యాశ్రమంబువిం
తగఁదగు నొక్క జాతిని పథంబున రాముఁడు గాంచిపూనిన
ద్గగసుతుఁడాను పూర్వముగగాథ నెఱుంగఁగజేసె వానినిం
పుగవినె సానుజుండగుచు భూమివరుండగు రాముఁడత్తఱిన్ 1236

తే. శాపవశమున గౌతమ సతియహల్య
యుపలమైయుండె ధైర్యంబు నూనియిచట
నీ పదాంభోజరజముపన్నెలఁత కోరుఁ
గరుణఁజూపఁగదవె దీనకల్ప భూజ 1237

తే. అనెడు మునివాక్యముల విని హరి సమస్త
శోకనాశక చరణాంబు సోకఁజేయఁ
బ్రకటమయ్యెఁ దపఃపుంజ భద్రనిలయ
యానహల్య శిలాదేహ మపనయించి 1238

కవిరాజవిరాజితం. కని రఘునాయకు జనసుఖదాయకుఁ గలుషనివారకు దైవమణిన్
మునిసతి హస్తసరోరుహయుగ్మము మోడిచి భక్తిసమీపమునం
జని నిలిచెం గడుఁ బ్రేమవశంబున సంచలితంబగు ధైర్యమునం
దనువు గగుర్పొడువం బలుకన్ వదనంబున మాటలు వెల్వడమిన్

చ. కనులను హర్షబాష్పములు గ్రమ్మఁగ శ్రీరఘురామచంద్రు పా
దనలినయుగ్మమందు వనితామణి యామునిపత్ని వ్రాలి నె
మ్మనమున ధైర్యమూని వనమాలిగ నాత్మ నెఱింగి భక్తియున్
వనజదళాక్షు సత్కృపయుఁ బ్రాప్తముగాఁ గస్తుతిం చెసీక్రియన్ 1240

చ. జయరఘువంశ శీతఘృణి సర్వశరణ్యక జ్ఞానగమ్య్యయ
ద్వయ యపవిత్రనైన వనితన్ నను రక్షణసేయుమీవు ని
శ్చయముగ లోకపావనము సల్పువలంతివి రావణారి చి
న్మయ శరణంటి నన్నుఁ గరుణం దిలకింపుము పాహిశ్రీహరీ 1241

మ. మునిశాపంబిడి మేలుసేసెనది నాపుణ్యంబుగా నెంచెదం
గనసబ్బెం గనులార ఘోరభవదుఃఖధ్వాంతభానున్ సనా
తను శ్రీశంకరముఖ్యవాంఛితఫలుం ధన్యుం గృపన్ మన్మనం
బను తేటిం భవదంఘ్రిపంకజరసంబానం బ్రసాదింపవే 1242

ఉ. ఏవిభుపాదసంభవసమిద్ధపవిత్రసురాపగన్ మహా
దేవుఁడు దాల్చె శీర్షమున దీక్షసమర్చనసేయు నబ్జజుం
డేవిభులాంఘ్రితోయజమునిప్పుడు నాశిరమందుసోకెనా
శ్రీవరుపాదమంచు సరసీరుహలోచన మాటిమాటికిన్ 1243

తే. రామచంద్రుని చరణనీరజయుగమున
వ్రాలి మ్రొక్కుచు నన్నిఁట నర్హమైన
వరముఁ బడసితి ననుచు భావమునఁ బొంగి
చనియె నిజభర్తృలోకంపు సరణిఁ బట్టి 1244

ఉ. ఈగతి దీనబంధుఁడు రమేశుఁడు హేతువు లేకయే దయా
సాగరుఁడై నిజాశ్రితుల సమ్మతిఁ బ్రోచును గాన దుష్టతన్
త్యాగమొనర్చి నిష్కపటతన్ హరిఁ గొల్వఁడ నేన్ నిరంతర
శ్రీకరిమన్ లసించు తులసీమహితాత్ముఁడు నందితాత్ముఁడై 1245

## విశ్వామిత్రుఁడు రామలక్ష్మణసమేతుఁడై మిథిలానగరమున కేగుట

ఉ. సానుజుఁడై రఘూద్వహుఁడు సంయమివర్యునితోడ దివ్యగం
గానదిఁ జేరఁ నేగ నట గాధితనూజుఁడు దెల్పె పావనం
బైన తదీయవాహిని రయంబున భూమికి వచ్చునయ్యుపా
ఖ్యానము నానుపూర్విగ మహాప్రమదంబున సోదరుల్ వినన్ 1246

ఉ. స్నానము నందొనర్చి మునిసంఘముతో రఘురాముఁ డెన్నియో
దానములాచరించి ప్రమదమ్మున మానిసమూహసంయుతుం
డై నికటంబునందె మిథిలావనినాథు పురంబుఁ జూడఁగా
యానము సల్పెఁ బట్టణమహారమణీయతఁ గాంచి మెచ్చుచున్ 1247

క. వాపీకూపతటాక స
దీపరిశుద్ధోదకంబు దీటగు సుధకుఁ
దీపితమణి రచితములగు
సోపానములరసి సానుజుండయి యలరెన్ 1248

క. మదభృంగ వ్రజమింపుగ
రొదసేయఁగ వివిధవర్ణరుచిరవిహంగో
న్మృదుకూజితములెసంగన్
ముదముగ విరిదమ్ములలరనును గాడ్పొలయన్ 1249

చ. పురినలుప్రక్కలన్ ఫలితపుష్పితపల్లవితంబులై మనో
హరవనరాజిశోభిలు విహంగమసంఘనివాసదేశమై
పరిమళమంద శైత్యయుతవాయుకిశోరము లెల్లెడన్ నిరం
తరమునువీచుచుండు సుఖదంబులుగా జనకోటికెంతయున్ 1250

క. మణిగణ రచితవితానవి
పణివీథులవిధియె చేసెఁ బ్రౌఢిననఁదగుం
గణుతింప మసంబె చటికి
వణుమాత్రంబరుగలోభమందునటఁబురికన్ 1251

క. ధనవంతులైన వణిజులు
ధనదసమానులయి వస్తుతతులసమృద్ధిం
గని విక్రయింత్రు వీథులు
వనయము వాసితజలార్ద్రమై విలసిల్లున్ 1252

తే. మంగళాకర పట్టణమందిరముల
నంగభవుఁడు రచించెనోయనఁగ నొప్పు
సతులుఁబురుషులు సుందరులతిపవిత్ర
సాధుశీలురు ధర్మవిజ్ఞానగుణులు 1253

చ. అనుపమశోభికంబు జనకావనినాథునిమందిరంబు త
ద్ఘనతరమా విలాసములఁగన్గొని నాకనివాసులబ్బురం
బునుగననొవ్వఁ గోటఁగనఁబుట్టును వింతసమస్తలోకశో
భను నిరసింపఁజాలు చెలువమ్ములకిమ్మని యెల్లవారికిన్ 1254

మ. ధవళంబైతగు నొక్కమందిరము సీతాధామమైయొప్పు నా
భవనంబుం గణుతింపశక్యమగునే భరోర్మిల్లసద్రత్నవ
స్త్రవితాన ప్రచురప్రదీప్తమయి సాక్షాల్లక్ష్మివాసించు గే
హవిలాసంబులఁ గేలిసేయఁ దగు నత్యంతప్రభావంతమై 1255

ఆ. బహుళశివవజ్రమయ కవాటసంశోభిత
ద్వారములు సెలంగు వందిజనులు
నటులు మాగధులును నరనాథమందిర
ద్వారమునను గుమిగఁ జేరియుండ్రు 1256

క. హరులుం గరియూథంబులుఁ
గరమున్నతమగు రథప్రకరమున్ వెలయున్
విరివిగ నప్పురశాలలు
వరుసం జూపరకునబ్రమై కనుపట్టెన్ 1257

క. శూరసచివ సేనాధిప
వారంబునకలరు నృపభవనతుల్యములౌ
చారుతరమందిరప్రా
కారారామాదికములు గడురమ్యములై 1258

తే. పట్టణబహిస్సరిత్సరోవరతటముల
వివిధదేశాగతులు నృపుల్ విడిసియుండ్రి
సపరివారంబుగా బటశాలలందు
ధరణిజా స్వయంవరమహోత్సవముగనఁగ 1259

క. సుందరమగు నొకయామ్రవ
నేందిర నటఁగాంచి రాఘవేశ్వర యిచ్చో
నుందము మన కత్యా
నందంబొసగూర్చెనని యనన్ మునితోడన్ 1260

క. మంచిది స్వామియటంచు వ
సించె ననుజ సకలమౌనిశేఖరయుతుఁడై
పాచిత్కరుణానిధి య
కాంచనగర్భాది విబుధ గణ సేవ్యుఁడటన్ 1261

## జనకుఁడు రామలక్ష్మణ సమేతుఁడగు విశ్వామిత్రుని నగరమునకుఁ గొనియేగుట

తే. కౌశికుఁడు వచ్చెనని విని కడుముదమున
సచివ గురు బంధు భట విప్ర సహితుఁడగుచు
జనకుఁడరిగెను బ్రీతి నాసంయమీంద్ర
దర్శనోత్సాహియై బహుత్వరితముగను 1262

క. జనకుఁడు కౌశికముని పద
వనజములకు మ్రొక్కెనతఁడు పరమముదితుఁడై
యొనరించె నాశీర్వాదం
బనంతరము సకలమునులకవనిపుఁడెఱఁగెన్ 1263

ఆ. జనకుఁడఖిల మునుల సందర్శనముగల్గె
నెంత భాగ్యమనుచు నెంచెమదిని
గడుఁబ్రసన్నుఁడగుచు గాధి సూనుఁడు రాజుఁ
గుశలమడిగె మిగులఁగూర్మి వెలయ 1264

మ. మునికూర్చుండఁగఁజేసె నాజనపతిన్ మోదంబుతో నాతఁడా
తని సామీప్యమునన్ వసింప నటముక్ దమ్ముండుదానున్ ముదం
బునఁబూదోటను జూడనేగిన కృపాంభోరాశిరాముండు వ
చ్చెను తద్బాలకులెల్లవారలకు నక్షిద్వంద్వసౌఖ్యప్రదుల్ 1265

క. శ్యామల గౌరశరీరులుఁ
గోమల తారుణ్యరుచిరగుంఫిత మూర్తుల్
శ్రీమీఱ విశ్వచిత్త
స్తోమంబు హరింపఁజాలు సుందరగాత్రిల్ 1266

ఆ. రాముఁడేగుదేర నామహా సభలోన
నఖిల జనులుసంభ్రమాత్ములగుచు
లేచి నిలువఁబడిరి వాచంయమి నృపాల
సుతులఁజెంతఁ గూరుచుండజేసె 1267

తే. అన్నదమ్ముల నిర్వుర నరసినంతఁ
గనుల నానందబాష్పాంబుకణము లురల
నంగములు పులకింపఁగా ననుపమాన
సౌఖ్యముం బొంది రచ్చటి సకలజనులు 1268

క. అనుపమ సుందరమూర్తులఁ
గనినంత విదేహనృపతి గాత్రమె మఱచెం
గని ధైర్యంబు వివేకం
బున మునిపదవనజములకు మ్రొక్కి వినీతిన్ 1269

ఆ. గద్గదస్వనమున గంభీరవాక్కుల
ననియె దేవమునికులావతంస
మణులో లేక సకలమండలాధిపకుల
పాలురొక్కొ యీకృపాళువరయ 1270

ఆ. నేతి నేతియనుచు నిగమంబులే పర
బ్రహ్మమును నుతించి పాడుచుండు
నట్టి తత్త్వమిచటి కాకృతి ద్వయమూని
వచ్చెననఁగఁ జెలఁగువారు వీరు 1271

తే. సహజవైరాగ్య యుక్త మస్మన్మనంబు
కుముదహితుఁగాంచినట్టి చకోరమట్లు
ముగ్ధమయ్యె మునీంద్ర సంపూర్ణసౌఖ్య
ధామమౌనీకుమారకద్వయముఁ గాంచి 1272

క. ఏతత్కారణమడిగెద
నాతత సద్భావమున మహామునివర నీ
వీతఱి దాపక తెలుపుము
చేతో మోదంబు నాకుఁ జేకూఱునటుల్ 1273

ఆ. వీరిఁజూడ మదిని బ్రేమముత్పన్నమై
బ్రహ్మసుఖముఁగూడఁ బరిహరించె
ననిన మౌని నవ్వి యనె రాజ బాగునీ
వనినమాట సత్యమగునుజుమ్ము 1274

తే. విశ్వమునఁ బ్రాణికోటికిఁ బ్రియులువీర
లనుచు మునిపల్కె నాత్మలో నల్లననగె
రామచంద్రుండు రఘువంశరత్నమైన
దశరథనరేంద్రచంద్ర నందనులువీరు 1275

ఆ. నాకు మేలుసేయ నరనాథుఁడంపెనీ
రామలక్ష్మణులను ప్రథితబలుల
నతులరూప శీలురైన యీసుకుమార
తనుల నన్నదమ్ములను మహీశ 1276

క. జగమెఱుఁగ సంగరంబున
నగణిత గర్వాంధకాయులగు రాక్షసులం
దెగటార్చి నామఖంబున్
సుగమముఁగ నొనర్పఁజేసిస్తుతిఁగనిరి నృపా 1277

తే. అనిన వినిరాజు దేవత్వదంఘ్రియుగళ
దర్శనంబున నేఁబుణ్యతముఁడనైతిఁ
దత్ప్రభావంబు వర్ణింపఁదరమె నాకు
నీకుమారులఁ గాంచఁబ్రాప్తించె నిపుడు 1278

తే. సుందర శ్యామగౌరాంగ శోభితులయి
వెలయునీ సుకుమారులు విజ్ఞులెల్లఁ
బొందు నానందమునకు నానందమొసఁగఁ
జాలువారలు మునిలోక సార్వభౌమ 1279

ఉ. హరిపరస్పరప్రియము నెల్లడిగాగణుతింప శక్యమే
చారుమనోభిరుచ్యమయి చక్కఁగ నొప్పు మహాత్మ జీవుఁడుం
దారిత కల్మషంబుఁబరతత్త్వమునై విలసిల్లు బ్రహ్మమే
తీరున స్నేహభావమున దీపితమౌదు రటుండ్రి వీరలున్ 1280

తే. సారె సారెకు శ్రీరామచంద్రుఁ గాంచి
పులకిత శరీరుఁడగుచు సమ్మోదమొంది
మునిఁబ్రశంసయొనర్చుచు మ్రొక్కులిడుచు
జనకుఁడందఱ నగరికిఁ గొనుచునరిగె 1281

తే. సర్వకాలంబులందతి సౌఖ్యమొసఁగు
సందమగు మందిరమున సంయమివరేణ్యు
విడియఁగాఁజేసె జనక భూవిభుఁడు భక్తి
సేవలొనరించి పూజించి సెలవుఁబొంది 1282

క. చనెఁ దనగేహంబున కిట,
నినకులపతి భ్రాతృసహితుఁడెలమింభక్తిం
గొని విశ్రమించి కూర్చుం
డెను మునికడ యామమొక్కటియె పవలుండెన్ 1283

.: రామలక్ష్మణులు జనకుని పురముం జూడనేగుట :-

తే. లక్ష్మణుఁడు మనమున నతి లాలసుఁడయి
యుండె జనకుని నగరంబు నొక్కసారి
కాంచవలెనని రాముఁడు గాధి సుతుఁడు
నేమనెదరో యనుచు నవ్వె నించుకమది 1284

తే. భక్తవత్సలుఁడౌ రామభద్రుఁడనుజు
హృదభిలాష నెఱింగి మునీంద్రుతోడ
నాజ్ఞఁ గొనియిట్టులనియె నత్యంత వినయ
భాషణంబుల సంకోచపడుచునగుచు 1285

తే. దేవ లక్ష్మణుఁడిపుడు విదేహరాజ
నగరముంజూడఁగోరి మనంబునందుఁ
గొంచి భయమున వచియింపకుండెఁగాన
నాజ్ఞయిడఁజూపి తోడ్కొని యరుగు డెంతు 1286

తే. అనుడుముని యనె రామ నీవమలనీతి
రక్షణంబెట్లు చేయవు రక్షకుఁడవు
ధర్మగతికిని పేర్మికెంతయును వశత
సుఖము సేవకులకు నిచ్చుచుందు వెపుడు 1287

తే. ఓసుఖనిధాన మీరిర్వు రుత్సహించి
నగరముంజూచిరం డెల్లనాగరులను
సఫలనయనులఁ జేయుడు చక్కనైన
మీముఖాంభోజములఁ జూపి రామచంద్ర 1288

తే. ముని పదంబులకిర్వురు మ్రొక్కి భక్తి
లోక లోచన సుఖదు లాలోకనంబొ
నర్చ నగరికి నేగ మనములుఁగనులు
లోభ మొందఁగఁ జనిరి బాలురును వెంట 1289

మ. కటిఁబీతాంబరముల్ సమాంగములుఁజొక్కంపొ ధనుర్బాణముల్
బటుశోభాన్వితమై కరంబులఁదగంబ్రస్ఫీత దేహంబులు
త్కటపాటీరవిలిప్తమై వెలయ సౌందర్యంబుగా నిర్వురా
స్ఫుటభేదంబున శ్యామగౌరరుచులం బొల్పొందిరాసోదరుల్ 1290

క. హరి సదృశదీర్ఘబాహువు
లురముల రుచిరేభమౌక్తికోత్కరమాలల్
స్ఫురదరుణ కమలనేత్రము
లుసు తాపత్రయమడంచు నుడురాణ్ముఖముల్ 1291

క. వీనులఁ గనకసుమంబులు
మానసముహరించుఁ గనుబొమలు వక్రిమములై
యానందమొసఁగుఁ జూచిన
జానగు తిలకములతీరు సంశోభించున్ 1292

తే. నీలకుంచితకేశ శోభాలసచ్ఛి
రః ప్రదేశంబులన్ శిరస్త్రాణకాంతు
లాలయ లావణ్యమయములై యొడలులెంతొ
యొప్పె నఖశిఖపర్యంత ముభయులకును 1293

మ. పురికిన్ రాసుతులేగుదెంచిరని సమ్మోదంబునం గార్యముల్
పరిహారంబొనరించి నిర్ధన జనుల్ భండారముంగొల్లగా
హరియింపంబఱతెంచురీతిఁ జనిరత్యంతత్వరంగుంపులై
పురవాసుల్ కనులార వారిఁగని తృప్తుల్గా మదింగోరుచున్ 1294

తే. సహజసుందరులౌ రామచంద్రు లక్ష్మ
ణులను దర్శించి కన్నులు గలఫలంబు
నొంది సుఖియించుచుండిరి యువతులెల్ల
స్వామిఁగాంచిరి గృహగవాక్షములనుండి 1295

ఉ. వారు పరస్పరంబిటుల వర్ణనసేయుచుఁబల్కిరో సఖీ
మార సహస్రలక్షల సమానము సేయఁగ రానిరూప వి
స్తారుఁడితండు దేవ నర దానవ పన్నగ యక్షహానిరా
ట్చారణులందు వింటిమె యెటన్ మనమింతటి సుందరాంగునిన్

తే. హరి చతుర్భుజుండు సజుఁడు చతుర్ముఖుం
డభవుఁడాస్యపంచకాఢ్యి వికట
వేషుఁడగును సకల విబుధులందో సఖి
యితని సాటి చెలువుఁడెందు లేఁడు 1297

క. వయసునఁ జఱుతలు శత కో
టి యలరువిల్తుల చెలువము శిఖిగలుగు నీ
ప్రియకర ప్రత్యవయవమున
హొయలునకు నివాళిసేయ నొప్పుం జెలియా 1298

ఆ. శ్యామగౌరదేహులైనయీసుందర
యుగళ దర్శనమున నువిద జగతి
దేహధారులెవరు మోహితుల్ గాకుంద్రు
తెలుపుమనియె నొక్క తీవబోడి 1299

క. మఱియొక భామినియనెనో
తెలివా విను నేను విన్న తెఱఁగంతయు నీ
కెఱిఁగింతు దశరథసుతుల్
చిఱు పాయపుటంచలసఁగఁ జెలఁగిరివీరల్ 1300

క. సమరాంగణమున నసురుల
సమయించి మునీంద్రయజ్ఞ సంరక్షణ మీ
కమలఁదళాక్షులొనర్చిరి
విమలమతీ కౌశికుండు వినుతి యొనర్పన్ 1301

ఉ. శ్యామల కోమలాంగుఁడు విశాల సరోరుహనేత్రుఁడుగ్రసం
గ్రామమునన్ సుబాహుసతిగర్వితునాతనియన్నఁ గూలిచెన్
రాముఁడు పేరు సౌఖ్య ఖనిరాజిత పాణిసరోజసంభృతో
ద్ధామధనుశ్శిలీ ముఖుఁడితండలకోసలకన్యపుత్రుఁడే 1302

ఉ. గౌరశరీరసుందర వికాసముఖుండగు బాలుఁ డాగుణో
దారుఁడు రామచంద్రునకుఁదమ్ముఁడు రాముపిఱుందఁ బాణిపం
కేరుహమందు విల్లుదులకించు శరంబును బూనివచ్చునా
పీకునితల్లియేయతిపవిత్ర సుమిత్రసుమీ తలోదరీ 1303

తే. విప్రకార్యంబునెఱవేర్చి విపినమార్గ
మందహల్యకు శాపంబునపనయించి
వచ్చిరిటకు ధనుర్యాగవైభవంబుఁ
గనఁగ సతులకుఁ గన్నుల కరవుదీఱ 1304

ఆ. రామచంద్రు చెలువు రమణియొక్కతె కాంచి
భాగ్యవరుఁ డితండు యువతులార
జానకికిని యితని జనకుండు గాంచినఁ
బ్రతినవిడిచి చేయుఁబరిణయంబు 1305

తే. మఱియొక తెపల్కెఁ గనెరాజు మానిసహిత
ముగను వీరల సన్మానముంబొనర్చెఁ
బ్రతినవీడఁ డతఁడు విధివశమునాపి
తన వివేకవిహీన తత్పరతఁగొలుచు 1306

ఉ. ఒండొకయింతిపల్కెఁ గడునుత్తముఁడేని విధాతవించు నా
తండుచితంపు సత్ఫలితదానము నెల్లరకిచ్చునేని యు
ద్దండపరాక్రముండుఁ గనుదమ్ములకుఁ సుఖమిచ్చు నీకుమా
రుండు లభించునీశకువరుండయి సందియమేలనేచెలీ 1307

మ. విధిసంయోగము నట్లుకూర్చినఁ జెలీవిశ్వంబునందెల్ల ర
త్యధికాహ్లాదమునం గృతార్థులుగదా యానందముంగూర్చెనీ
విధి నాకెంతయు నిట్టిబాంధవము పృథ్వీభాగమందెప్పుడో
విధుబింబాస్య లభింపఁబోవదనెఁ దన్వీజాలమగ్గింపఁగన్ 1308

ఆ. అట్లుకానియెడల సతివరో యీాతని
దర్శనంబు మనకు దవ్వుకాదె
సకియ మనకు నితనిసంయోగము లభించెఁ
బూర్వకృత విశేషపుణ్యమునను 1309

ఆ. ఈవివాహమన్న నెల్లరకిష్టంబ
టంచుఁబలికె నొక్కయలరుబోఁడి
హరునివిలుకఠోర మతికోమలాంగుఁ డీ
నీలవర్ణుఁడనియె నెలఁతయొక్కతె 1310

తే. అంద ఱన్నివిధంబుల నాడిరంత
మధురవాక్యలలర నొకమగువ చెలియ
చూపునకుఁజిన్నదైన నీసుందరాంగు
మహిమ మధికంబు మీరెన్ని మాటలనిన 1311

తే. చరణకమల రజోలవస్పర్శమున న
హల్యతరియించె సత్యఘంబాచరించి
నను శివునివిల్లుత్రుంపఁగాననుపడ దీ
తనికని పరాకుచేనైనఁ దలఁపఁదగదు 1312

క. ఏవిధి సీతరచించెనో
యావిధియే శ్యామలాంగుఁడగు నీచెలువుం
గావించెననియె నదివిని
యావెలఁదులు మధురవాణి యటులౌననఁగన్ 1313

తే. సుందరాస్యలు సుందరాక్షులుగ వెలయు
కామినీజను లత్యంతకౌతుకమునఁ
బూజసింగురియించిరి పోదు రెచటి
కన్నదమ్ములచట మహాహర్ష మెసఁగు 1314

ఆ. అన్నదమ్ములిరుపురరిగిరి పట్టణ
పూర్వదిశకు నచటఁబోలుపుమీఱ
నతివిశాలమగు స్వయంవరభూమిప
విత్రవేదికయును వెలయుచుండె 1315

చ. నలుదెసలందు నెల్లనరనాథచయం బుపవిష్టమౌటకుం
జెలువగుమంచలొప్పఁ దపనీయకృతంబులుగాఁ దదీయమం
చలకుఁ బిఱుందఁజెంగటనె చక్కనిమంచలు నాల్గుదిక్కులం
దలరును గొంచెమున్నతములై పురవాసులుగూరుచుంటకున్ 1316

ఉ. తన్నికటంబునందు వివిధంబగురంగులతో విశాలమౌ
ష్రిన్నిమంటపంబొకఁడు భాసిలునందు విలాసినీజనుల్
చెన్నలరన్ గులోచితవిశిష్టగతిన్ వసియించిచూడఁగా
సన్నియుఁ దివ్యనావలుకులాడుచు బాలురచూపఁజూచుచున్

ఉ. సావరజుండు రాముఁడు మహాముదమొందఁగ నీమిషంబునం
భావములందుఁ బ్రేమరసవాహినిపొంగఁగ నామనోజ్ఞ శో
భావిలసత్కుమారయుగ పావనగాత్రములంటి పుల్కలా
త్మానయనంబులం బొడమ హర్షతఁజూచిరి వారిబాలకుల్ 1318

తే. బాలురెల్లరు శ్రీరామభద్రుఁ దమల
ప్రేమకువశుండుగా నెంచి ప్రియముతోడ
వారివారిగృహములఁ జూపంగఁగొనుచుఁ
బోవ నాసోదరుల్ ప్రీతిఁబోవుచుండ్రి 1319

ఆ. ఎవనియాజ్ఞచేత నీజగంబులనెల్ల
మాయసలుపు నిమిషమాత్రమున నె
యావిభుండు రాముఁడనుజసఖుంజూపు
రచన మృదుమనోజ్ఞవచనరచన 1320

తే. భక్తికారణమున రామభద్రమూర్తి
దీనవత్సలుఁడౌ దేవదేవుఁడపుడు
చకితుఁడై యాధనుర్మఖశాలఁజూచె
సఖుల సోదరులావినోదాళిఁగాంచి 1321

ఆ. అతివిలంబమయ్యెనని భీతినొందుచు
సరిగిరప్పుడు వారు గురునికడకు
నెవనిభయమువలన నెపుడు భయముఁగూడ
భయమునొందునట్టి ప్రభువరుండు 1322

తే. ఆత్మభజనప్రభావంబునట్టుచూపె
నగ్రజానుజులారీతినరిగి మృదుల
మధురసుందరవాక్కులం బాలకులకు
సెలవొసంగి బలవంతంబుచేసి పంపి 1323

క. వినయము భయముం బ్రేమయుఁ
బెనఁగొనఁగా గురునిచరణబిసరుహయుగ్మం
బునకుఁ సంకోచంబున
వినతులయివసించి రాజ్ఞవేఁడియిరువురుఁ 1324

ఆ. సంజయైన మౌనిచంద్రుఁడాజ్ఞ నొసంగ
సంధ్యవార్చిరంతఁ జక్కనైన
రాత్రిరెండు జాలుఁ జిత్రపురాణేతి
హాస గోష్ఠిఁగడపిరందఱపుడు 1325

ఆ. సంయమీంద్రుఁడంత శయనింప నిద్రకుఁ
జరణయుగళ మొత్తసాగి రెవరె
చరణయుగముఁగోరి సాధులు జపతపో
యోగములను సలుపుచుందురావారు 1326

తే. ప్రేమవారిజయించెనో యేమొ యనఁగఁ
బట్టుచుండిరి గురువరుపాదములను
ప్రేమతో మటిమాటికి ఋషివరేణ్యుఁ
డాజ్ఞనిడఁబోయి శయనించె నారఘుపతి 1327

క. సౌమిత్రి రాముపదములఁ
బ్రేమంబున నొత్తుచుండి హృదయంబుచ కా
కోమల చరణ సరోజము
లామహితుఁడు హత్తఁజేర్చె నాసమయమునన్ 1328

తే. మఱియు భీతియుఁబ్రీతియు మల్లడిగొనఁ
గొంకుచుండగ రాముండు గూర్మితమ్మ
వత్స పన్నుండుమిఁకనని పలుకుచుండె
మాటిమాటికి వెనుక లక్ష్మణుఁడుఁగూడ 1329

తే. అన్న పాదాబ్జముల హృదయంబునందు
ధారణమొనర్చి శయనించెఁదమిముఁగడువఁ
గూయు చరణాయుధంబుల కూతలు విని
మేలుకొనిలేచె వేగసౌమిత్రియపుడు 1330

ఆ. గురునికన్నమున్న పరతత్త్వమా జగ
త్పతి రఘుప్రభుండు దరుణ మెఱిఁగి
మేలుకాంచెనంతఁగాలోచితక్రియ
లాచరించి స్నానమాడిరెలమి 1331

-: జనకునుద్యానవనమున సీతారాములన్యోన్య సందర్శనము సేయుట :-

తే. రామలక్ష్మణులమితమౌ ప్రేమమెసఁగ
నిత్యకృత్యంబులందీర్చి నియతులగుచు
మునికిఁబ్రణమిల్లి యాజ్ఞను బొందివేగఁ
బూలుగొని తేగనేగిరి ముదమెలర్ప 1332

తే. ధారుణీనాథు సుందరోద్యానవనముఁ
గాంచి రామని లుబ్ధమై కదలదచట
వివిధమైన మనోహరవృక్షములును
మంజువర్ణలతా కుంజపుంజములును 1333

చ. ఫలకుసుమనూత్న పల్లవవిభాసితమై సురభూజముల్ త్రిపా
కలితములౌనటుల్ సలుపఁగాఁగలసంపద నొప్పమీఱుఁగో
యిలలును జాతకంబులును నింపగుకీర చకోర ముఖ్యమా
పులుఁగులు గూయుచుండఁగను బొల్పుగనృత్యముసేయుఁగేకులున్

శా. ఆరామంబున మధ్యభాగమున రమ్యంబౌసరోరాజమొ
ప్పారుంజారువిచిత్రరత్నమయసోపానప్రభాజాల శృం
గారంబై కలహంససారస బకక్రౌంచాదినానాఖగ
స్ఫారారావమిళిందఝంకృతులు నబ్జంబుల్ పిసాళింపగన్ 1335

ఉ. రాముఁడు లక్ష్మణుండు నతిరమ్యతనొప్పు వనాంబుజాకర
శ్రీముదికింపుసేయ విహరించిరి హర్షసమేతులై తదా
రాముని సౌఖ్యమిచ్చెరఘురామునకుంగుణధాముఁడైన యా
శ్యామలవర్ణుతమ్మునకు సౌరభగంధవహాప్రచారమై 1336

ఉ. నాలుగు దిక్కులంగని వనంబునఁగావలివారినడ్గిభూ
పాలకుమారులిద్దరును పాదపపంక్తిఁబ్రసన్నచిత్తులై
పూలునుబత్రముల్ గొనఁగఁబోవఁగనంతటసీత శర్వాని
ల్లాలిని బూజచేసెడి తలంపుననింపునఁదల్లి పంపునన్ 1337

ఆ. సఖులు భాగ్యవతులుఁజతురులు దన వెంటఁ
గూడి సుస్వరములఁబాడికొనుచు
నరుగుదేరవచ్చె నాసుందరోద్యాన
సీమ కెలమిమీఱఁ జెలువుగులుక 1338

క. పరికించినంత మనమున్
హరియింపఁగఁజాలి వర్ణనాతీతంబై
సరసికిసరసన్ వెలయుం
గిరిజామందిరము సిరికి గీముగుచువనిన్ 1339

ఆ. సఖులఁగూడి సీత సరసి మజ్జనమాడి
యిందుధరుని రాణిమందిరంబు
నందుఁజొచ్చి పూజలతిభక్తిఁగావించి
యడిగెఁదనకు నర్హుఁడైనవరుని 1340

తే. ఒక్కచెలి సీతచెంగట నుంటమాని
పుష్పవనమును దిలకింపఁబోయి యచట
రామలక్ష్మణులంగాంచి ప్రేమవివశ
యగుచు నేతెంచె జనకకన్యకసరసకు 1341

ఆ. చెలులు దానిస్థితిని దిలకించి పులకిత
గాత్రమమరఁజారు నేత్రయుగళి
జలకణంబులలర సంతసించెదు హేతు
వేమి తెలుపుమనిరి మృదులవాణి 1342

మ. అననాయుగ్మలి పల్కెనిస్పృహకిశోరావస్థ నొప్పారు చ
క్కని రూపంబున శ్యామగౌరరుచులంగాంతిల్లు మేనుల్ దగన్
వనముంజూడఁగవచ్చిరా సొబగులన్ వర్ణింపనాజిహ్వకుం
గనులున్ లేవు మదక్షియుగ్మమున నాల్కల్ లేనెటుల్ తెల్పుదున్

చ. అనవిని నెచ్చెలుఁగు చెలులందఱు హర్షమునొందిరప్పుడా
జనకజమాన సోత్కలికఁ జయ్యనఁదాగ్రహియించి యొక్క మా
నినియనె మౌని వెంబడిని నిన్నను వచ్చిరి రాజపుత్రులం
చును వినియున్న దాననగుచో నయియుండును వారెవీరలై 1344

ఆ. నిజసురూప మోహినిన్ జైచికట్టెరె
స్త్రీపురుషుల వశము జేసికొనిరి
యన్నిచోట్ల నగరి నాకుమారుల చెల్వ
మభినుతించుచుండి రఖిలజనులు 1345

క. వారినవశ్యము చూచియు
తీరవలెంజూడఁదగినదీపికమూఁకల్
నారీరత్నములారా
రారండని పిలిచెనదిపురంధ్రులనెల్లన్ 1346

ఉ. ఆవచనంబు తెల్లజగదంబకు సీతకు నింపుసేయ నా
దేవుని దర్శనంబునకతిత్వరఁ జెందెను లోచనంబు లా
దేవికి వెంటనే తనకతిప్రియమైనసఖీసమేతయై
యావిరిబోణి యేగెఁగదరా మె పురాతనప్రీతి నెవ్వరున్ 1347

ఉ. నారదుచేత విన్నకథనంబుమదిన్ స్మరియించె సీత యా
వారిజనేత్రికాత్మఁ బ్రభవంబయి యొప్పెఁ బవిత్రప్రేమ యా
యారతితోడనే చకితయై చెలువంబుగఁ జూడసాగె నా
చారుముఖీలలామ మృగశాబకమో యన నెల్లదిక్కులన్ 1348

ఉ. కంకణకింకిణీనిచయకమ్రరవంబును నూపురధ్వనుల్
పంకజపత్రలోచనుఁడు భానుకులేశుఁడు వించు లక్ష్మణా
పంకజసంభవాండమును పైఁబడి గెల్వఁగ నెత్తివచ్చు మీ
నాంకుని దుందుభిధ్వనులొ యావినవచ్చెడి సుందరధ్వనుల్

శా. అంచున్ శ్రీరఘురామచంద్రుఁడు తదేకాయత్తమౌ దృష్టిసా
రించన్ నేత్రచకోరయుగ్మమునకున్ శ్రీజానకీసుందరో
దంచత్కోమలమౌ ముఖంబు విధుఁడై యాదేవు నేత్రంబులం
జాంచల్యంబును బాపె జంకి నిమిషధ్యానంబులన్ లేఁడనన్ 1350

శా. శ్రీరాముండు సుఖంబునొందెఁగరమున్ సీతామహాదేవి చె
ల్వారూఢింగని చెప్పవేయక తదీయాకారముం బ్రీతిహృ
న్నీరేజంబున మెచ్చెఁగాని పలుకన్ లేకుండె నాసోయగం
బారాజీవజుఁడుర్వి నేర్పరకనఁ జేయంజేసెనో నాఁదగున్ 1351

క. సౌందర్యంబునకుం దా
సౌందర్యంబొసఁగఁజాలు జనకాత్మజ దా
సౌందర్యము దేజోగృహ
మందు వెలుఁగుదీపశిఖయొ యనవిలసిల్లున్ 1352

క. ఉపమానంబులన్నిఁటి
నపుడేసరిపెట్టియుండిరాదికవులు నే
నుపమానమేమి తెలుపుదు
నపరిమితద్యోత సీతనభివర్ణింపన్ 1353

క. సీతాసౌందర్యంబును
జేతంబున నభినుతించి శ్రీరాముండెం
తో తనస్థితిసరసికతముం
బూతాత్ముండగుచు సమయమునకనుగతిగన్ 1354

ఉ. తమ్మునితోడఁబల్కె వినుతంపుధనుర్మఖమే సతీసిమి
త్తమ్మయి యొప్పె నాజనకధారుణినాథు సుతామతల్లి యీ
కొమ్మ సఖీపరీతయయి క్షోణిధరాత్మజఁబూజసేయఁగా
నిమ్మెయి వచ్చి పుష్పవనమెల్లఁబ్రకాశిలఁ ద్రిమ్మకుంజుమీ 1355

ఉ. ఆమె యలౌకికంపు చెలువారసినంతటనే పునీతమా
నామనమెంతయేని జలనంబును బొందెను దీని హేతువా
తామరసోద్భవుండెఱుఁగు దక్షిణపార్శ్వశుభాంగపాళి యా
శ్యామనుజూచుచుండఁగనె స్పందములయ్యెను నాకుసోదరా 1356

చ. సహజములైన భావముల సత్పథమందు పదంబువెట్టఁగా
మహిరఘువంశసంభవుల మానసమొప్పకయుండుటల్ మదీ
య హృదయమందు నాకుదృఢమై తగునమ్మకమున్నదన్యలా
మహిళలస్వప్నమందు ననుమాత్రముఁజూడఁగనొల్లదెప్పుడున్

ఆ. సంగరంబునందు శత్రులకుఁ వెన్నుఁ
జూపనట్టివాఁడు సేపరసతి
వాంఛఁజూడనట్టివాఁడు నర్థులఁ ద్రోల
నట్టివాఁడు జగతి నసుదుసుమ్మ 1358

ఆ. అనుజుతోడ మాటలాడుచుండెను గాని
సీతరూపమందుఁ జిత్తమధిక
లుబ్ధమయ్యెఁబ్రీతి లోలాక్షి ముఖపద్మ
మధువుఁగ్రోలుచుండె మధుపమట్లు 1359

చ. నలు దెసలన్ విలోకన మొనర్చుచునుండెను సీత భీతయై
మెలఁగు మృగార్భకంబనఁగ మిక్కిలి నెమ్మది వాంఛసేయు నా
చెలువగు రాకుమారుఁడెటు చేయుచునుండె విహారమంచు నా
లలనకటాక్షముల్ సనువలంకులనిండెను దెల్లతామరల్ 1360

ఉ. జవ్వనులంతఁజూపిరట శ్యామలగౌరవిభాసురాంగులన్
మవ్వపుఁబువ్వుఁదీవియలమాటునఁజూచినయంత సీతకం
ఠమ్మిళులూరె నాత్మనిధి నొప్పఁగఁగన్గొనఁగల్గినంతనే
నివ్వటిలెం బ్రమోదము పనీయుతకున్ మదిలోన నిండుగన్ 1361

ఉ. రాముని చెల్వుఁగన్గొనిస్థిరంబయి చొక్కెను తెప్పవేయకా
భూమిసుతాంబకద్వయము పూర్తిగ దేహము విస్మరించెనా
లేమయుపారమై మదిఁజలింపని స్నేహమునిండఁగా శర
త్సోముఁజకోరికన్గొనెడి తోయమునంగనె రామచంద్రునిన్ 1362

తే. లోచన ద్వారమునను రాము మేచకాభ
నష్ణగ్రహియించి హృదయసంవాసుఁ జేసి
లక్ష్మియా సీత బంధించెఁ బక్ష్మలంబు
లను కవాట ద్వితయమును నతినిపుణత 13

ఆ. ప్రేమవివశయయ్యె భీతమృగాక్షి యీ
సీతయనిగ్రహించి చెలులు వలుకఁ
జాలకుండి హృదయసంకోచమునఁ జేసి
వాటమెఱిఁగి యొక్కమాటయైన 1364

ఉ. ఆతఱి రామలక్ష్మణ సుధాంశు యుగంబు వినీలమేఘసం
ఘాతము విచ్చినన్ వెలిని గాంతిలుచుండెనొ నాగబోఁట్లతో
సీత విహారముం గనలుపు చెంతలతాభవనంబునుండి వి
ద్యోత తనూరుచుల్ దిశలనొప్పగ వెల్వడెనందమొందగన్ 1365

క. శోభాసీమలు సుందరు
లాభానుకులప్రదీపు లసితహరిన్నా
ళ్జాభశరీరులు శిఖిపిం
ఛాభూషిత కుసుమమాలికాంచితశీర్షుల్ 1366

ఉ. ఫాలములందు స్వేదకణభాసితమౌ తిలకంపుసొంపులుం
గ్రాలువిభూషణద్యుతులు గండతలమ్ములఁ గ్రమ్మమించు శో
భాలసితంబులౌ చెవులు భాసురతందగుభ్రూలతల్ సువ
క్రాలకకేశముల్ వికసితాంబురుహారుణ నేత్రయుగ్మముల్ 1367

ఉ. చారుకపోలనాసికలుఁ జక్కనివౌ చుబుకంబులొప్ప శృం
గారరసాధిదేవతలకైవడి హాసవిలాసభాసురాం
భోరుహ సుందరాస్యులయి మూల్యము మానస పిక్షిఁదోఁప నా
పీకులపారమార్థులకుప్రీడ నొసంగుదు రెన్నశక్యమే 1368

చ. ఉరమున రత్నహారములు నుజ్జ్వలకంబుసమానకంధరం
బురుబలయుక్తమైన కలభోచ్ఛ్రయశుం డసమాన బాహువుల్
వరసుమనోయుతంబగుచు వామకరంబునదోణ మొప్పనా
సురుచిరమూర్తి శ్యామతను శోభితుఁ జూచితి వేతలోదరీ 1369

మ. అనుచుం గేసరిమధ్యుఁ బీతపరిధానాంచత్కటిభ్రాజితుం
ఘనసౌందర్యసుశీలధాముని స్ఫురత్కంజాతపత్రేక్షణుం
దిననాథాన్వయభూషణుంగని చెలుల్ దేహంబులన్ విస్మరిం
చి నిగాఢప్రమదంబునొందిరొక రాజీవాక్షి ధైర్యంబునన్ 1370

శా. సీతాపాణి సరోజమాత్మకర రాజీవంబునంబట్టి యీ
రీతింబల్కెను ధ్యానమున్ సలుపు గౌరీం గ్రమ్మరన్ సర్వలో
కాతీతోజ్జ్వలరూపసంపదలకిమ్మా నీ మహీపాలక
ప్రాతిత్యంగసుమారవీరులను శేషంజూడ వేలా చెలీ 1371

మ. అనినంగొంకుచు సీత లేనగవుతో నక్షిద్వయిన్ విచ్చి పా
వనులౌ శ్రీరఘువంశసింహములఁ బ్రేమంజూచె శ్రీరామచం
ద్రుని యాపాదశిరఃప్రదేశగతచారుస్ఫూర్తి వీక్షించినం
తనె చింతించెను దండ్రి దౌప్రతిన కాతన్వంగి లోలోపలన్ 1372

చ. పరవశయైనసీతఁగని భామినులెల్ల విలంబమయ్యెనం
చురుభయమంద నందునొక యుగ్మలి రేపును నిట్టిరమ్యహా
తరుణమువచ్చు నేయనె నెదన్ హసియించుచు దాని గూఢవా
క్సరణినివించుసీత కడుసంకుచితస్థితినొంది నెండియున్ 1373

ఆ. అతివిలంబమయ్యె నమ్మ యేమనునొకో
యనుచు భీతి మనమునందుఁ గదుర
నధికధైర్యమూని యా రామచంద్రుని
నాత్మ హృదయపద్మమందు నిలిపి 1374

ఆ. ఉత్సుకతను రామునుపగూహన మొనర్చి
మాటిమాటి కాత్మ మానసమునఁ
దనదు మానమిపుడు తండ్రి వశంబని
సీత మరలె నంతఁ జెలులఁ గూడి 1375

క. పక్షిని లేడిని మొక్కల
వీక్షించు నెపమున రామవిభుసోయగమున్
లక్షించు మరలమరలం
దీక్షన్ సీతావధూటి తిరిగి వెనుకకున్ 1376

మ. శివచాపంబు కఠోరమంచు మదిలోఁ జింతించుచున్ శ్యామలాం
గవిరాజచ్ఛుభమూర్తి డెందమునఁ జిక్కన్ నిల్పుచుం జానకీ
ధవళాంభోరుహపత్రనేత్ర చనఁ దత్సౌందర్యమున్నే మహాసౌ
ఖ్యవిభాసద్గుణరాశి యేగుటను నయ్యబ్జాక్షుఁ డూహించుచున్ 1377

ఆ. హృదయఫలకమున నహీనమౌ ప్రేమ మ
షీరసంబుతోడ సీతరూప
మచ్చుపడ రచించె నా జానకీదేవి
మరలఁ జొచ్చి గౌరిమందిరంబు 1378

ఉ. పురహరురాణి యంఘ్రులకు మ్రొక్కి వినిర్మలభక్తియుక్తయై
కరయుగళంబు మోడ్చి యలికంబునఁ జేరిచి సంస్తుతించె నో
వరగిరిరాట్కుమారి వృషవాహముఖేందుచకోరి చంద్రశే
ఖరి కరివక్త్రషణ్ముఖముఖప్రియపుత్రులతల్లి శాంకరీ 1379

చ. జయజయ లోకమాత మునిసన్నుతకీర్తిసమేత శాంభవీ
జయజయ విద్యుదుల్లలిత చారుశరీరిణి విశ్వమోహినీ
జయజయ ఘోరకిల్బిషనిశాచరకాననకీలి కాళికా
జయజయ సాధుభక్తజనసంఘసురద్రుమసంభృతక్షమా 1380

తే. ఆదిమధ్యాంతరహితవో యంబ నీవు
నీప్రభావం బెఱుంగవు నిగమములును
భవవిభవపరాభవకరీ భువనమోహి
నీ విహారంబునల్పెదు నీవు స్వేచ్ఛ 1381

ఉ. అంబపతివ్రతానివహమంతటిలోపల నగ్రగణ్య వీ
వంబుజసంభవాంగనలు నాదిఫణీంద్రులు వేయిమంది ని
క్కంబుగ నీయపారమునగమ్యమునౌమహిమన్ వచింప శ
క్యంబని పల్కఁజాలరిఁక నే నెవినుంబ్రస్తుతింపనేరికిన్ 1382

మ. నినుసేవించినఁగల్గు నాల్గుఫలముల్ నిక్కంబు గాఁగన్ వరం
బునొసంగాఁగలదానవీవ బుధసంపూజ్యాపురారిప్రియా
యనయంబున్ సురమానిమర్త్యతతినీయంఘ్రిద్వయింగొల్చి యే
ఘనసౌఖ్యంబులనొందుచుండును జగత్కల్యాణసంధాయినీ 1383

ఉ. అందఱి హృత్పురాళిననయంబు నివాసమొనర్చియుందువో
యిందు కళాధరీ తెలుపనేల మదీప్సితముల్ స్ఫుటంబుగా
ముందె యెఱింగియుందువని భూసుత భూధరరాజకన్యకున్
వందనమాచరించి పదవారిజయుగ్మముఁబట్టె భక్తితోఁ 1384

మ. వినయప్రేమవశాత్మయైనకతనన్ విశ్వేశునిల్లాలి మూ
ర్తిని లేనవ్వుసెలంగె మాలికయు జాఱెం దానినత్యాదరం
బున వైదేహి ప్రసాదమంచుఁ దలపైఁబూనెన్ శివాదేవియా
త్మను హర్షంబెసఁగన్ వచించెనిటు సీతాదేవితోఁ బ్రీతిగన్ 1385

తే. సీతవిను సత్యమూమ కాశీర్వచనము
నీయభీష్టముసిద్ధించు నిక్కముగను
నారదునిమాట తప్పదేనాడుఁ గానఁ
బ్రేమఁ గాంక్షించువరుఁడె లభించునీకు 1386

ఉ. నీమది వాంఛచేసెదెవనిన్ సుకుమారమనోహరాకృతిన్
శ్యామలవర్ణుఁడైన జలజాక్షుఁడతండె లభించునీకు నీ
ప్రేమయు స్నేహముల్ సుగుణబృందము సందము శీలమాకృపా
ధాముఁడెఱుంగునంచు నిభదైత్యరిపుప్రియభామపల్కెనన్ 1387

తే. గాధిసుతాశీర్వచన ముత్తమకన్యక విని
చెలులతోఁగూడ హర్షంబుఁజెంది మరల
మరల నంబికఁబూజించి మందిరమున
కరిగె మోదంబుతో డుతి ననియెదులసి 1388

తే. నీలకంఠుసతి యనుకూలయయ్యెఁ
దనకునని సీతకనిన ముదంబు నెన్న
నలవియగునె యమ్ముదితవామాంగకంబు
లదరె శుభసూచకముగ నయ్యవసరమున 1389

క. సీతాసౌందర్యంబును
క్షేత్రంబుల నెన్నికొనుచు శ్రీరామసుమి
త్రాతనయులరిగి మునిలో
నాతఱి దాపకవచించిరంతయుఁ బ్రీతిన్ 1390

తే. పుష్పములఁగొని కౌశికమునియుఁ బూజ
చేసి రామలక్ష్మణుల నాశీర్వదించె
నామనోభీష్టసిద్ధి సత్యముగననుచు
విని సుఖంబొందిరా రఘువీరులపుడు 1391

తే. భోజనమొనర్చి విజ్ఞాని మునిపురాణ
కథల వివరించి చెప్పె లక్ష్మణుఁడుఁదాను
నర్కకులమణి దివసాంతమైన మౌని
యానతింగొని సంధ్యాకృత్యములఁదీర్చె 1392

మ. ఉదయించెన్ శశిప్రాచిషోడశకళాయుక్తంబుగా నందమై
కద నాజేయుఁడు రాముఁడొందె సుఖమూర్త్యాకన్య కావిస్ఫుర
ద్వదనంబోయని కాంచి కాంచి మతిఁయుఁభావించె శీతాంశుఁడా
ముదితాచాయముఖంబుతో నెటువలెంబోలంగలాఁడంచెదన్ 1393

తే. దీనుఁడగు చంద్రుఁడెల్లు విదేహకన్య
మోమునకు సాటి విషముతోఁ బుట్టె నబ్ధిఁ
బనలు మలినుండు సకలంకుఁడవు నతండ
టంచు భావించె రఘురాముఁ డాత్మలోన 1394

తే. విరహిణీదుఃఖదుండవు వృద్ధిక్షయము
నొందుదువు మ్రింగు రాహువా కొక్కవేళ
కోక శోకప్రదుండవు కుటిలగుణుఁడ
వబ్జినీద్రోహమొనరింతు వకట చంద్ర 1395

క. సీతాముఖ పద్మముతోఁ
జాతకమగు నిన్నుఁబోల్ప బహ్వానుచితమం
చాతఁడెఁ జంద్రమిషంబున
నాతరుణిముఖంబు నెన్ను చవ్విభుఁ డరిగెన్ 1396

తే. అరిగి గురుచరణంబుల కధికభక్తి
వందనమొనర్చి యనుమతినొంది విశ్ర
మించె నిశయెల్ల మేల్కొని మిత్రతేజుఁ
డనుజుఁ దెసఁ బొడఁగాంచి యిట్లనుచుఁ బలికె 1397

తే. లోకకోకపంకజసుఖ శ్రీకరప్ర
భావుఁ డరుణుం డుదయమయ్యె వత్సకనుమ
నంగఁ బాణియుగము మోడ్చి నయవిదుఁడు ప్ర
భుప్రభావ సంసూచకముగ వచించె 1398

క. భవదీయాగమనము విని
యవనీవిభులెల్ల సబలులైనవిధమున సం
గువలయములు ముకుళించెం
దివినుడుగణతేజ ముడిగె దినకరురాకన్ 1399

తే. సకలరాజులుఁ దారకాజాలమట్లు
తేజరిల్లియు ధనువను తిమిరమధిక
మగుట వారింపజాలరు యామినిచనఁ
గమలచక్రభ్రమరముఖ ఖగములలరె 1400

చ. అటువలె దేవ నీకుఁబ్రియులైన ప్రశాంతులు భక్తులెల్లరుం
బటుతరమౌ శరాసనముభంగముగాఁగ సుఖింతురుపూర్వది
క్తటమున భానుబింబము ప్రకాశిల నశ్రమగాఢమైన చీ
కటినశియించెఁ దారకలకాంతి చెడెన్ వెలుగొందెలోకముల్ 1401

ఉ. ఓరఘువంశదీప భవదుజ్జ్వలమైన ప్రతాపమిప్పుడీ
వారిజబాంధవోదయపు వ్యాజమునంగనఁజేసె నెల్లయు
ర్వీరమణాళికిద్ధభుజవీర్యమహత్వము వెల్లడింపఁగా
మారిశరాసనంబుఁ దునుమాడెడిరీతియు నీకు నొప్పెడున్ 1402

చ. అనఁజెలునప్పుసుందరతరానన మందోలయంగ రాఘవుం
డనుజునిమాటలన్ వినియహర్ముఖకృత్యము లాచరించి మ
జ్జనము స్వభావపూతముగసల్పి సుమిత్రిసుతుండుఁ దోడరాఁ
జని గురుసుందరాంఘ్రిజలజంబులకున్ నతశీర్షుఁడై లగ్గ 1403

## విశ్వామిత్రుడును మునిబృందమును రామలక్ష్మణులును స్వయంవర రంగమున కేగుట

క. జనకుండు శతానందునిఁ
బనిచెం గౌశికునికడకుఁ బనివినియతఁ డ
మ్మునికి నెఱిఁగించె జనకుని
వినతి నతండలరి రామవిభు లక్ష్మణుల్గ 1404

తే. పిలువనేతెంచి రాముండు వినయమొనయఁ
గా శతానందు పాదయుగమునకెఱఁగి
గురుసమీపంబునకునేగి కూరుచుండ
జనకుఁడంపెను బిలువఁగాఁ జనుమువత్స 1405

ఆ. ఉర్వీజాస్వయంవరోత్సవంబును జూడ
నేగి యొనవనినిప్పుడీశ్వరుండు
పెద్దసేయువాఁడొ వీక్షింపఁగావలె
ననియె గాధిసుతుఁడు హర్ష మెసఁగ 1406

తే. ఎవనిపై భవదీయ సమిద్ధకరుణ
పరఁగు నవ్వాఁడగున్ యశోభాజనుండు
దేవ యనెలక్ష్మణుఁడు కడుఁదియ్య మెసఁగ
హర్షమొందిరి సకలసంయములు వినుచు 1407

శా. ఆశీర్వాదములిచ్చిరందఱు సుఖాయత్తాత్ములై సత్కృపా
సౌశీల్యాకరుఁడైన రాముఁడరిగెన్ సౌమిత్రియుం దాపసా
ధీశస్తోమముఁ దోడ రాముదముసంధిల్లం ధనుర్యజ్ఞ దీ
క్షాశాలంగను వేడుకందవిలి విశ్వామిత్రునాజ్ఞన్ వెసన్ 1408

ఉ. ఆసుకుమారు లిర్వురు స్వయంవరరంగముఁ జేరిరన్న యా
భాసురవార్తవించుఁ బురవాసులుత్యక్తసమస్తకర్ములై
యాసుభగస్వరూపులఁబ్రియంబునఁగాంచఁగ నేగుదెంచి రు
ల్లాసముతోడ వృద్ధులు విలాసినులున్ మగవారు బాలురున్ 1409

మ. జనవారం బధికంబురాఁగ జనకక్ష్మానాథుఁడద్దానిఁగాం
చినియోగించెను భృత్యవర్గము సుఖాసీనార్థ మర్హాసనా
ళినిరూపింపఁగ నారులంబురుషపాళిందీరుగా నుత్తమం
బును మధ్యాధమరీతి నమ్రవచన స్ఫూర్తిన్ సమాసీనులన్ 1410

క. కావించిరప్పుడచటికి
శ్రీవిలసిల శ్యామసిత శరీరులయోధ్యా
భూవిభు పుత్రులనూన ప్ర
భావులు సభయెల్ల దీప్తిఁబ్రజ్వరిలంగన్ 1411

తే. వచ్చి యుడుగణములమధ్య వారి జారి
బింబయుగళంబునా రాజబృందమందుఁ
దేజరిల రామచంద్రమూర్తి నిఁగని లెవ
రెవతి కేరీతి భావన మెసఁగెనటుల 1412

ఉ. వీరరసాంగమొంది ప్రతిభవించెననన్ రణధీరమూర్తియై
శ్రీరఘురామమూర్తి నృపశేఖర కోటికిఁదోఁచె దుష్టమా
భూరమణ ప్రజంబునకు భూరి భయాస్పదుఁడౌచు భీకరా
కారమునంగనంబడియెఁగంజదళాక్షుఁడు రాముఁడయ్యెడన్ 1413

తే. రాజవేషాళితోనున్న రాక్షసులకుఁ
గాలుఁడై తోఁచెనా స్వప్రకాశమూర్తి
యన్నదమ్ములు పౌరులకక్షి సుఖద
మనుజ భూషణులై తోఁచిరనుపమముగ 1414

క. తరుణులు దమతమ యభిరుచి
పరిపాటింజూచి రానృపాలాత్మజులన్
నిరుపమ శృంగారరసము
శరీరములఁ దాల్చెననుచు సంతోషమునన్ 1415

ఉ. రాముని బండితావళి విరాట్శుభమూర్తిగఁజూచె నెన్నియో
మోములుఁగన్నులుండలలు మూపులుఁజేతులుఁగాళ్ళుఁదోఁచఁగా
భూమివిభుల్ విదేహపతిముఖ్యుల కెంతయు నాత్మబంధులై
యామహితాత్ములివ్వరుఁ బ్రియంకరులైకననైరి యత్తఱిన్ 1416

చ. జనకునిరాణులా సహజ సౌమ్యులఁజూచిరి బాలురంచు న
య్యనుపమమైన ప్రేమ యెటులైనను వర్ణనసేయ శక్యమే
మునులకు యోగిముఖ్యులకు ముక్తినిధానము స్వప్రకాశముం
ఘనపరమార్థ తత్త్వమయి కానఁగవచ్చిరి శుద్ధశాంతులై 1417

మ. హరిభక్తుల్ గనిరిష్టదైవములుగా నాభ్రాతృయుగ్మంబునా
దర మొప్పంగ సమస్తసౌఖ్యములఁజెందం జేయువారంచు నా
ధరణీనందన రాము నెట్టిమదితో దర్శించెనా స్నేహసౌ
ఖ్యరసోదంచిత భావముం బలుక యోగ్యంబెట్లగున్ వాక్కులన్

క. హృదయముచే ననుభవపడి
నది ప్రకటముగా వచింప నలవియగునె యే
చదురుఁడగు కవికి నెవరె
ల్లెదఁదలఁచిరో యట్లుచూచిరి నకులతిలకున్ 1419

ఉ. భూరమణాళిమధ్యమునఁ బొల్పుగనుండిరి శ్యామగౌరశృం
గారశరీరవర్ణులు వికారవిదూరులు కోసలావనీ
భారధురంధరుండయిన పంక్తిరథప్రభుకూర్మిబిడ్డలా
కారములం జగజ్జనుల కన్నులదొంగిలఁజాలు సుందరుల్ 1420

చ. సహజమనోహరాకృతులు చక్కదనంబులనిక్కుచాపధూ
ర్వహులొక కోటిమందియును స్వల్పము వారినిబోల్పఁగా శర
త్తుహినకరున్ హసించుఁ గడుతోరపు మోములు భావసమ్మదా
వహసరసీరుహాక్షులభివర్ణన సేయఁదరంబె యేరికిన్ 1421

క. మదనుమదమడఁచు సుందర
హృదయాహ్లాదకరమూర్తు లెంచఁగఁదరమే
మృదుగండ లోలకుండల
సదమలకాంతిప్రసార శ్రవణయుగంబుల్ 1422

క. చక్కని చుబుకాధరములుఁ
జిక్కని సుధలొలుకఁబలుకు చెలువుశశిరుచిం
ధిక్కార మాచరించెడి
మిక్కిలి యింపొదవఁజేయు మృదునగవుల్ 1423

ఆ. అతిమనోహరంబులైన నాసికలు న
క్రంబులైన భ్రూయుగములుఁ గడువి
శాల ఫాలభాగసంశోభితంబులౌ
తిలకములును నళులఁ దెగడు కురులు 1424

క. పీతశిరోవేష్టనములుఁ
జాతుర్యతమధ్యమధ్య సవరించినప్ర
స్ఫీతసుమమంజరులు శే
ఖాతతిశోభిల్లు రుచిరకంబుగళంబుల్ 1425

తే. త్రిభువనైక సౌందర్యమీతీసుగాఁగ
నన్నదమ్ములుగా నొప్పెసఁగఁ గంఠ
దేశముల గజమౌక్తికదీప్తహార
ములును నురములఁ దులసిమాలలును వెలయ 1426

శా. వామస్కంధములన్ శరాసనములుం బాణిన్ శరంబుల్ కళా
ధామంబై తగు పీతజంధ్యములు నుద్యద్దీప్తి రాణింపఁగా
నామూర్తిద్వయ మొప్పె సంఘ్రినఖకేశాంతంబుగా సోయగం
బేమాత్రింబుఁ గొఱంత లేక కనువారెంతో సుఖంబందఁగన్ 1427

తే. మదవృషస్కంధములు సింహమధ్యములును
శ్రీవులును బలమునకెల్లఁ దావులైన
బాహువులు గటిస్థలపీతవస్త్రములును
గలితతూణీరములుఁగల్గి చెలువుమిగుల 1428

ధ్రువకోకిల:- జనములెల్లఁ దదేకదృష్టిని చాపమూర్తులనిర్వరం
గనుచునుండిరి తృప్తిలేనికాంక్షఁ జూపులుద్రిప్పకా
జనకుఁడాయనుజన్మనగ్రిజు సంతసంబునఁగాంచుచున్
మునిపదంబులఁబట్టి చెప్పెను మొక్కి యాత్మకథాస్థితిన్ 1429

క. మునికి స్వయంవరరంగము
జనకుఁడు చూపింప మౌనిసరసనె రాముం
డును లక్ష్మణుఁడును జనుచో
జనులా సుందరులఁ గనిరి చకితాత్మకులై 1430

క. తమతమ భావనచొప్పునఁ
గమలాక్షుని రాముఁ గనిరి కడుమర్మమెఱుం
గమి జనులు మౌని మెచ్చెన్
సుమహితమగు రచనఁ గాంచి క్షోణిపుఁడలరెన్ 1431

ఆ. అన్నిమంచలందు నందంబు నతివిశా
లమును నైనమంచఁ బ్రీమద మెసఁగ
రామలక్ష్మణులను భూమీశుఁ డుపవిష్టు
లౌనటుల నొనర్చె యమియుతముగ 1432

తే. పూర్ణచంద్రుఁ డుదయమైనఁ బోలుపుదొఱఁగు
చుక్కలంబోలె సకలరాజులును దేజు
వాసి యోటమిఁ గనిరెల్లవారు ధనువు
విఱచు నిశ్చయమితఁడని వెఱఁగుపడిరి 1433

క. ఘనశివకోదండ విఖం
డన మితఁడొనరింపకున్న నలినాక్షి మహీ
తనయ వరియించి సుమమా
లను వైచు నితనియురఃఫలకమున నెలమిన్ 1434

ఆ. అన్నలార మనకు నపయశంబగు బల
తేజములకు హానియౌ జయంబుఁ
గలుగ దింక ప్రతాపగరిమంబు సెల్లదు
పోదమిండ్లకనుచు భూమివిభులు 1435

తే. పలుకనదివిని యభిమానపరులు జ్ఞాన
హీనులంధులునైన మహీశులునగి
ధనువువిఱచియుఁ గఠినముద్వాహమగుట
విఱువకేరీతి నెవఁడింతిఁబెండ్లియాడు 1436

తే. కాలునైననుసీతకై కదనమందు
నొక్కవరి తాకి విజయంబునొందువార
మనఁగఁ జతురులు హరిభక్తులనఘ ధర్మ
శీలురగు భూపతులువిని చిఱునగవుల 1437

తే. అఖిలరాజుల గర్వంబులడఁచి జనక
తనయఁ బెండ్లాడు రామచంద్రప్రభుండు
దశరథేశ్వరు రణధీర తనయుఁడతని
ననిజయింప నెవరికైన నలవియగునె 1438

తే. జల్పముల వ్యర్థముగనాడి చావనేల
మతిమనోమోదకాపేక్ష మానరేల
యతిపవిత్రంపు మాబోధనాలకించి
సీత జగదంబగాఁగ నెంచెదరుగాక 1439

తే రామచంద్రప్రభుని జగద్రక్షకునిగ
లోకపితఁగాఁగఁ మదినెంచి లోచనముల
నిండ సౌందర్యముంగాంచి మెండుతృప్తిఁ
గండుసందేహములు విడువుండుమదిని 1440

క. ఈయన్నదమ్ములిరువురు
సోయగమునకిరవులఖిల సుఖదాయకులీ
శ్రీయుతులు సుగుణరాశులు
కాయజహరహృన్నివాస ఘనశుభమూర్తుల్ 1441

తే. అమృతసాగర సామీప్యమందుఁ బాసి
జలము మృగతృష్ణలోఁ గోరి సత్వరముగఁ
బాఱిమడిసెదరేల యేభావమెవరి
కున్న వారట్లు గావింపుఁడూహామీఱ 1442

తే. మేముజీవించినందుకుగా మహౌఘ
లంబుఁగంటిమి నేడని యంబుజాక్షు
భక్తులును మంచివారగు వసుమతీసు
లనుపమ ప్రేమరసమగ్నులగుచు మఱియు 1443

తే. అతుల రఘురామచంద్ర రూపావలోక
నంబొనర్పం దొడఁగిరి నభంబునందు
సురలు విరివానఁగురియించి రసమెసఁగఁ
బాడుచు విమానములనుండి ప్రభునిఁగనుచు 1444

—: జానకీ స్వయంవర మహోత్సవము :—

చ. అదనిదిమంచిదంచు జనకావనినాథుఁడు సీతఁదెంచఁగన్
ముదమున సుందరాంగులగు ప్రోడచెలుల్ జగదంబయుం గుణా
స్పదయును జారుశీలయును సన్నుతిసేయఁగరానియట్టి చ
క్కదనపుటిక్క భూసుతను గారవమొప్పఁగఁదెచ్చిరంతటన్ 1445

తే. ఎట్లువర్ణింతునా జగదేకజనని
మదికిలఘువయ్యె సర్వోపమానములును
బ్రాకృతస్త్రీజనాంగ వర్ణనముసేయు
పట్లనవియెల్ల సంపూర్తిఁబడయుకతన 1446

ఆ. ఎట్టిసుకవియైన నట్టినికృష్టోప
మానములను లోకమాతనెన్ని
యపయశంబుఁగుకవియను నామమొందునే
లోకమందుఁ గడువివేకముడిగి 1447

ఆ. సీతరూప మెట్టి స్త్రీతోడ ననుపమాన
మాచరింత మన్న నట్టి మహిళ
త్రిభువనముల గలదె త్రిపురాంతకునిరాణి
శ్రీయు వాణి రతియు సీతకెనయె 1448

క. వాచాలిని వాణి సగం
బై చిక్కిన మేనుగలది యద్రిజపతికిన్
మైచెడెనని వగచున్ రతి
శ్రీ చెడుగగు విషమదిరల చెలియలు గాదే 1449

క. ఛవియను సుధాపయోనిధి
నవకంబగు రూప కూర్మనాథుని లిపియిం
పవు శోభారజ్జుపుచే
తవిపుల శృంగారమనెడి తఱికొండ తగన్ 1450

తే. కామదేవుండు నిజహస్త కమలయుగళ
మున మథింపంగ నందులోఁ బొడము సౌఖ్య
మూల సుందరలక్ష్మితోఁ బుడమికన్యఁ
బోల్చుటకును సంకోచంబుఁ బొందు సుకవి 1451

చ. చతుర విలాసినీమణులు సక్కని పాటలు పాడికొంచు భూ
సుతఁ దమ వెంటఁ దోడుకొని సుందరమౌ తరుణాంగవల్లులా
తతకమనీయతన్ వెలయఁ దజ్జగదంబ విశేషసుందర
ద్యుతి వెలుగంగ వచ్చిరి మహోత్సుకతన్ వరరంగ భూమికిన్ 1452

మ. సకలాంగంబుల బోటికత్తియలు భూషాశ్రేణి గైసేయఁగా
నకలంకద్యుతి నొప్పె నప్పృథివికన్యారత్నమద్దేవి భ
ద్రికరంబౌ పదమౌ స్వయంపర మహారంగస్థలిం బెట్ట స్త్రీ
ప్రకరంబుం బుసపాళియుంగనియె విభ్రాంతిన్ విమోహంబునన్

క. దివి మ్రోసె దేవ దుందుభు
లవనిజపైఁ బుష్పవృష్టి నమరులు గురియిం
పవియచ్చర తరళాక్షులు
పరివిమలగతి సుస్వరములఁ బాడిరలరుచున్ 1454

చ. తటుకున సీత సర్వవసుధా వరమండలిదిక్కుఁ జూచె నా
కుటిలశిరోజ రాముమదిఁ గోరుచునుండె మనంబు భీతిచే
నటులిటులాడసాగె సకలావని నాథులు నామెఁ జూచియు
త్కటమగు మోహమొందిరి యొకానొకచోట విదేహకన్యయున్

తే. గాధినందను చెంగటఁ గనియె నంత
భద్రకోట్యర్కనిభలసద్భ్రాతృయుగము
నాత్మనిధి వెంటనే లభ్యమయ్యెననుచు
బహుతరోత్కంఠఁ జూపులఁ బఱపె నటకు 1456

తే. గురుజనసమక్షమని లజ్జఁ గొంకె సీత
బహుసమాజమధ్యంబని భద్రమూర్తి
రామచంద్రుని హృదయ నీరజమునందు
నిలిపి దర్శింపసాగె నన్నెలఁత ప్రీతి 1457

చ. ధరణిజరూపముల్ సుగుణధాముని రాముని చెల్వముం దలో
దరులును భూపపాళియుఁ దత్పరతం గని తెప్పపాటులం
బరిహరమాచరించి యొకపల్కును బల్కఁగఁ గొంకి లోననే
సరసిజగర్భు నెంతయును సన్నుతిసేసిరి వారి నెంచుచున్ 1458

చ. జనకుఁడు మూర్ఖతన్ విడిచి సమ్మతితోడఁ బ్రతిజ్ఞ మాని మా
మనములనున్న రీతి నణుమాత్రముఁ గొంకక రామమూర్తికిం
దనయ నొసంగి పెండిలి ముదంబునఁ జేయుగలట్టి బుద్ధి యా
తనికి నొసంగవే జడదము తామరసోద్భవ యట్లొనర్పవే 1459

ఉ. మేలని సంతసించెదను మేనిదిని నెల్లను నట్లుకానిచోఁ
జాల తపించు మానసము జానకి కర్హవరుండువీరిలో
నాలలితాంగుఁడై నెలయు శ్యామలసన్నుఁడటంచు భూజనుల్
లాలసులై విధాతను దలంచి స్తుతించిరి పెక్కుభంగులన్ 1460

ఆ. వందిజనులఁ బిల్వఁ బంపెను జనకుండు
వారు బిరుదములను బలికికొనుచు
వచ్చిరటకు నాదు ప్రతినంబు వినిపింపుఁ
డనియె రాజు మిగుల హర్షమునను 1461

ఆ. వందిజనులు శ్రేష్ఠవచనంబు నీరీతిఁ
బల్కిరో సమస్త వసుమతీశు
లార వినుఁడు బాహులను మేముపైకెత్తి
పలికెదము విదేహ పతిప్రతిజ్ఞ 1462

తే. నృపభుజబలంబు చంద్రుండు వృషభవాహు
కార్ముకము రాహువత్యంత కర్కశంబు
నెల్లరెఱుఁగుదురది కడుబల్లిదులగు
రావణుఁడు బాణుఁడును బోయి రావిలుగని 1463

ఆ. అతికఠోరమైన హరశరాసనము నీ
రాజులందెవండు ప్రక్కలించు
వాని సీత నేడు వరియించుఁద్రిభువన
విజయలక్ష్మితోడఁ బ్రీతిఁజెంది 1464

తే. ప్రతినవిని రాజులెల్లరుఁ బ్రబలవాంఛ
మనములన్ యోధులమనుచు మానమూని
నడుములంగట్టికలఁతతో నడువసాగి
రిష్టదైవంబులన్ మదినెంచి మ్రొక్కి 1465

తే. తమకముతో శివధనువు హస్తమునఁబట్టి
కోటివిధములఁదమ తమ పాటవముల
నెత్తఁబోవంగఁ గోదండ మించుకైన
లేవకుండిన నెల్లనై పోనవారు 1466

తే. మదివిచారంబుగలిగిన మనుజవిభులు
వోవకుండిరి యావింటిపొంత కంత
మూర్ఖులగు రాజులావింటిఁ బూని యెత్తఁ
జాలకతిలజ్జతోఁ బోవసాగిరపుడు 1467

తే. యోధనృపతులభుజబలంబొంది పొంది
యంతకంతకు నతిభారమయ్యె ధనువ
నంగ నొక్కించుకయుఁగదలంగఁబోక
యుండె గర్వితులగు నృపుల్ బెండుపడఁగ 1468

ఆ. ఊని దశసహస్రి యోధు లొక్కుమ్మడి
నిందుధరుని ధనువు నెత్తఁ బోవ
నించుకైనఁ గదలదీలుపురతిమది
కామి వచనములకుఁగదలనట్లు 1469

క. వైరాగ్య మొందకయె యా
గారము విడి సన్యసించు కాపురుషుగతిం
భూరమణులెల్లర పహా
సారంభాస్పదతఁగనిరి హరు విలు వట్టన్ 1470

తే. బాహు వీర్యంబు విజయంబుఁ బ్రాభవంబు
యశము బలవంతమగు ధనువపహరింప
నోటమింబొందిరపుడు సర్వోర్వీ పతులుఁ
గాంతి హీనంబులైన మొగములతోడ

తే. అట్లు తేజోవిహీనులై యపుడు తమస
మాజ మధ్యంబునం దెల్ల రాజ సుతులుఁ
బోయి కూర్చుండఁ జూచి యాభూవరులకు
రోషముదయింప రాజచంద్రుఁడు జనకుఁడు 1472

తే. పలికె నీరీతి వ్యాకుల భావమునను
దీవి దీవులనుండి యేతెంచినారు
నాదు ప్రతిననువిని నరనాథులెల్ల
దేవదనుజ మనుజ రణధీరబలులు 1473

చ. అతులమనోహరాంగిని మదాత్మజనున్ విజయేందిరన్ మహో
న్నత కమనీయ కీర్తిరమనాగ విభూషణు విల్లువ్రంచియు
ద్ధతిఁగానఁజాలు వీరుని విధాత సృజింపఁగ లేదయెవ్వఁడా
శితిగళు చాపమెక్కిడఁగఁ జేవఁగలుంగఁడొ యట్టివానికిన్ 1474

క. అలక్ష్మిత్రియలాభము
మేలుగ నెదఁదోఁపకుండు మెలపున ధనువు
ద్వేలత నెక్కిడి విఱచుట
యేలా కడుదవ్వు దాని నెత్తుటలోనన్ 1475

క. తిల మాత్రమైన మీఁదికి
నిలనుండి కదల్పఁజాల రెందఱో వీరుల్
కలఁడే యభిమానముగల
యలఘుండగు వీరుఁడిప్పుడవనీ స్థలిలోన్ 1476

ఉ. వీరవిహీనమయ్యెఁ బృథివీస్థలియంచెద నాకుఁదోఁచెడిన్
మీరిఁక యాశఁబోవిడిచి మీదు గృహంబులఁ జేర నేగుఁడో
ధారుణి నాథులార యల తామర సోద్భవుఁడే వివాహముం
గూరిచి వ్రాయఁడే మొకద కూరిమిపట్టికి సీతకుర్వరన్ 1477

గీ. ప్రతినఁ బరిత్యజించినఁ దపఃఫలపుణ్య విశిష్టమౌను మ
త్సుత భువిఁగన్యయైమనినఁ జూచెదఁగాకిఁక నేమిసేయుదున్
క్షితిఁదగు జెట్టిలేఁడనుచుఁ జింతిలి మత్ప్రతినంబుహాస్యమౌ
గతినొనరింపఁజాలననఁగా విని యామిథిలేశువాక్యముల్ 1478

చ. సకల తలోదరుల్ పురుషజాతియు జానకిదిక్కుఁజూచుచున్
వికలమనస్కులైరి రఘువీరకుమారుఁడు లక్ష్మణుండు క్రో
ధకలితనేత్రుఁడయ్యెను రదచ్ఛదమంతయుఁ గంపమొందఁగా
భ్రుకుటియు బద్ధమయ్యె రఘుపుంగవు భీతివచింపఁడేమియున్

ఉ. కాని విదేహరాడ్వచన గాథ శరంబులుగాఁ దాలిమిం
బూనఁగలేక రామవిభు ఫుల్ల సరోరుహసన్నిభాంఘ్రు లం
దానతశీర్షుఁడై పలికె సర్వములైన యథార్థవాక్యముల్
భానుకులప్రదీపరవివంశ్యులమించెడి వీరులుండిరే 1480

ఉ. రాముని దుష్టదానవవిరాముని శ్రీరఘువంశరత్నమున్
శ్యామలవర్ణు నిందు జనకావని భర్తయెఱింగి యీనృప
స్తోమమునందు సర్వమగుచొప్పునఁ బల్కెను భాస్కరాన్వయో
ద్దామ పయోరుహద్యుమణి దబ్బరగాదిది యాలకింపుమా 1481

మ. అభిమానంబునఁబల్కలేదు భవదీయాజ్ఞన్ లవంబుండినన్
రభసంబొప్పఁగఁ బద్మజాండమును దోరంబైన పూబంతిగా
నభముందాఁకఁగ నెత్తఁగల్గుదు బిరానం బచ్చికుండంబలెన్
విభజింపంగలవాఁడ వ్రక్కలు గనుద్వేలప్రతాపంబునన్ 1482

ఉ. మూలిక రీతి మేరునగముం బెకలింపఁగఁజాలువాఁడ నా
భీల భవత్ప్రతాపయుత విస్తృతమౌ మహిమంబు ముందఱన్
శూలిశరాసనంబనఁగఁ జోద్యమె పాతదిచెప్పనేల నీ
వేల యనుజ్ఞనిమ్ము కనుమెట్టి వినోదమునాచరింతునో 1483

ఆ. కమలనాళమట్లు కాలకంథరు ధను
వెక్కువెట్టి దాని నెలమిఁబట్టి
నూఱుయోజనముల దూరంబు వఱకైనఁ
బఱుగు వాఱఁగలను త్వరితగతిని 1484

ఆ. పుట్టగొడుగు గాఁడఁబట్టి త్రుంచెడిరీతిఁ
గార్ముకంబుఁ ద్రుంపఁగలను నీవ్రి
తాపబలమువలనఁ దప్పిన నీపాద
మానవిడుతు ధనువుఁ బంప పొదియు 1485

మ. అని సామర్థ్యమునన్ సుమిత్రితనయుం డాడంగ భూమండలం
బును గంపించె దిశేభముల్ చలనముంబొందెన్ మహీజాత నె
మ్మనమందున్ ముదమొందె సర్వజనముల్ త్రస్తారాయ కానీకమె
ల్లను భీతిల్లె విదేహభూవిభుఁడుఁ జాలన్సంకుచించెన్ మదిన్ 1486

ఓ. గురుఁడు రఘూద్వహుండు మునికుంజరులెల్లరు నెమ్మనంబులం
బరమముదంబునొందిరి యపారముగాఁ బులకల్ జనింపఁగాఁ
దరణికులప్రభుండు దన తమ్ముని గన్నుల సన్నఁ జాపి ప్రే
మరసనిరూఢిఁ జేసెను సమంబుగఁ జెంగటఁ గూరుచుండఁగన్ 1487

చ. శుభసమయంబు గాఁదలఁచి శూరుని రాముని గాంచి ధాతృస
న్నిభుఁడగు గాధిసూనుఁ డతినిర్భరప్రేమ వచించె వత్స య
య్యభవు శరాసనంబుఁ దునుమాడుము తెమ్మిఁక నీవిదేహభూ
ప్రభునకుఁ దాపమార్పుము సభాసదులెల్లరు సన్నుతింపగన్

చ. గురువచనంబులన్ విని రఘుప్రభుఁడెంతో దలవంచి యమ్ముని
శ్వరుచరణద్వయంబునకు భక్తి మెయింబ్రణమిల్లి హర్షశో
కరహితచిత్తుఁడై నిలచె గ్రక్కున నాతని శీవిఁ గాంచి నం
బరఁగు స్వభావసిద్ధమయి బాలమృగేంద్రము లజ్జనొందఁగన్ 1489

ఆ. ఒప్పుమంచయ నెడు నుదయాచలంబున
రామచంద్రబాల రవి వెలుంగ
సజ్జనాళియ నెడి సారసంబులు విచ్చె
నక్షిభృంగవితతి యలరుచుండ 1490

తే. రాజగణములయాశయన్ రాత్రి నాశ
మయ్యెఁ దద్వాక్యతారాగణాళికాంతిఁ
బాసె నభిమాననృపకైరవములు ముకుళి
తములుగాఁ గపటోలూకతతియుఁడాగె 1491

తే. సకలముని దేవతానీక చక్రవాక
శోకములుదీఱ రాముపై సురభి కుసుమ
వృష్టిఁగురియించి సేవింపఁ బ్రేమ గురుని
పదములకు మ్రొక్కి మునులాజ్ఞఁబడసె విభుఁడు 1492

ఉ. అంత జగత్ప్రభుండు మదహస్తివరేణ్యవిలాస భాసురా
త్యంతమనోహరంబయిన యానమునన్ సహజస్వభావుఁడై
కాంతలుఁ బూరుషుల్ మిగులగాత్రములం బులకల్ జనింపఁగా
సంతసమొందఁగాఁ జనియె సౌఖ్యపయోనిధి నోలలాడఁగన్ 1493

క. తమతమ పితృదేవతలకు
నమస్కృతులొనర్చి సుకృతనానాకార్య
క్రమము నెదనెంచి మాపు
ణ్యముమహిమ నితండు నవమృణాళములీలన్ 1494

క. శివధనువువిఱచుఁ గావుత
మహీధరకన్యకాప్రియాత్మజ గణనా
థ వరంబొసఁగు మటుల నినుఁ
బ్రవిమలమగుభక్తితోడ భావింతు నెదన్ 1495

క. అని స్త్రీపురుషులు రాముని
గనుఁగొని యనుపమసుఖంబుఁ గాంచఁగ సీతా
జనయిత్రి పేర్మి రాముం
గని చెలులం జీరి పలికెఁ గడువిహ్వలయై 1496

క. అందఱు వినోదమునుంగన
నిందుండిరి నెవ్వరైన నేగినృపునిఁ
చందమునఁ దెగువతగదని
యందురె సుకుమారుఁడీతఁడని మద్ధితులై 1497

క. రావణ బాణాసురులును
శ్రీవిశ్వేశ్వరునిధనువుఁ జేతం దాకం
గా వెరవు లేకపోయిరి
భూవిభులతిదర్పలోడి పోయిరి కాదే 1498

ఆ. అట్టిధనువుఁ గోమలాంగుఁడీ రాజన్య
తనయుచేతికీయ ధర్మమగునె
పట్టమందరాద్రి బాలమరాళమె
త్తంగఁగలదె బాహుదర్పమునను 1499

మ. నృపుచాతుర్యమదెల్లఁ బోపును సఖి నిక్కంబుగా ధాత్రిచే
దపురీతిం దెలియంగశక్యమె యనన్ దద్వాక్యముల్ వించు నే
నుపుతో నొక్కసఖీలలామ యనియెన్ రుచ్యంబుగా దేవి నీ
వెపుడుం దక్కువగా గణింపఁ జనదెం దేనిన్ మహాతేజులన్ 1500

క. కుంభజుఁడేడ యపారం
బంభోనిధి యేడ దానినతఁడింకింపం
గుంభిని నాతనికీర్తి వి
జృంభింపదె నేటివఱకు శీతాంశుముఖీ 1501

ఆ. సూర్యమండలంబు చూడఁజిన్నదిగాఁగఁ
గాన్పబడిన నుదయకాలమందు
త్రిభువనములఁగ్రమ్ము తిమిర మొక్కుమ్మడిఁ
బాతిపోవకున్న పద్మనేత్రి 1502

తే. మంత్రిమతిలఘువైన బ్రహ్మయును విష్ణు
దేవుఁడుఁ బినాకపాణియు దివిజులెల్ల
వశులగుటలేదె యున్మత్తవారణేంద్ర
మంకుశముచిన్నదైన వశ్యంబుగాదె 1503

తే. మరుఁడు శరశరాసనములు విరులుగాఁగ
సకలభువనంబులవశంబు సలుపలేదె
యిది మనంబుననెంచి దేవీశరాస
నముఁదునుము రాముఁడెద సందియమునువిడుము 1504

క. అనిన సఖీవచనంబుల
విని చింతనుమానె రాణివిపులంబయ్యెన్
మనమునఁగల ప్రేమంబును
జనకజ శ్రీరాముఁగాంచి సభయాత్మకయై 1505

తే. వినతులొనరించుచుండె హృద్వీధియందె
వ్యాకులంబొంది యభవు భవానిఁగూర్చి
నాదుసేవ ఫలింపగా మోదమునను
జేయుఁడు హితంబువిలుఁ జుల్కచేసికరుణ 1506

తే. సకల సురవరదాయకా సమదహస్తి
వదనగణనాయకా నేటివఱకునిన్ను
సేవచేసితిఁగాననేఁ జేయువినతి
నాదరించిధనువు భారమడఁపుమయ్య 1507

గీ. అనుచు శ్రీరామచంద్రునిఁ గనుచుఁగనుచు
ధైర్యమువహించి దేవతాతతిని మదిని
దల్చుచుండెను సీతమ్మ తనువుపులకి
తంబుగా నేత్రములను హర్షాంబువురల 1508

ఆ. కనులనిండ రాము కల్యాణరూపంబుఁ
గాంచి తండ్రి ప్రతినగతిఁదలంచి
లాభహానులెన్నఁదలంపక తండ్రియి
ట్లాచరింపఁదగునె యనుచువగచు 1509

తే. మంత్రి భయమునఁ దెలుపఁడు మఱియు నితర
జనులు దెలుపమిచేనింత సంభవించె
ననుచితము వజ్రమునుమించు నట్టిధనువ
దేమి శ్యామలమృదుబాలుఁడిత్తఁడేడ 1510

శా. హాదైవంబ యదెట్లునిల్పుదును ధైర్యంబుఁ మనంబందెటుల్
ఖేదింపంబడు హీరపాదలను దీప్తింబొల్చుపూరెమ్మ సం
ఛేదింపంబడుకన్నఁ జుల్కనగ యీవిస్తారసభ్యాళికిన్
లేదొక్కింతయు బుద్ధిచాతురి నినున్ నేవేఁడెదం జాపమా 1511

తే. నీమహత్త్వంబు జనులపైనిలిపి రామ
చంద్రుఁగని పొందుమిప్పుడు చాలలఘుత
ననుచు సీతామహాదేవి యధికతాప
మొందె నవమునిమిషంబు యుగశతముగ 1512

చ. చపలవిశాలనేత్రములఁ జయ్యనరాముముఖంబుఁగాంచియుం
ద్రిపమహిదిక్కుఁజూచు వెలిదామరతేటులఁ గ్రుమ్మరించుచున్
నృపసుతసీత చంద్రుఁడను నీటగునుయ్యాల మన్మథుండుతో
సఫరుషయుక్తమై రతినిరంతొనరించుచునుండెనో యనన్ 1513

ఆ. వదనపంకజమున వాగ్భ్రమరంబులు
హ్రీయనంగనొప్పు రేయిఁగాంచి
వెడలకుండెఁగృపణు విపులభర్మముమాడ్కి
నక్షికోణములనె యశ్రులుండె 1514

తే. ఇట్టిస్థితినుండి తనమది నెన్నరాని
వ్యాకులమునొందియుండుట నరసికాంచి
ధైర్యవిశ్వాసములను డెందమున నిలిపి
తలఁచె నాక్షోణికన్యామతల్లి యిట్లు 1515

తే. వాఙ్మనఃకాయములను నావ్రతము సత్య
మయ్యెనేనియు శ్రీరామునంఘ్రియుగళ
మందు నాచిత్తమెంతయు సక్తమయ్యె
నేనిసర్వాంతరాత్ముఁడౌ నీశ్వరుండు 1516

ఉ. దాసిగఁజేయుఁగాక ననుదప్పక యారఘురామమూర్తికిన్
వాసిగ దేని కెందధికవాంఛయథార్థముగా జనించునా
యాసఫలించి నిక్కముగ నయ్యది చేకుఱు లేదు శంకయం
చాసరసీరుహాక్షి తనయాత్మఁదలంచుచు రాముఁజూచుచున్

ఉ. ప్రేమపరీక్ష సుస్థిరగరిష్ఠముగా నొనరించెసీత శ్రీ
రాముఁడెఱింగె సర్వముఁ గరంబు కృపానిధియంత సీత నె
మ్మోమునుగాంచి యండజవిభుండొక చిన్నఫణింగ్రహింపఁగా
నేమెయిఁజూచునట్లు పరమేశ్వరువింటిదెసంగనుంగొనన్ 1518

మ. హరకోదండము రాముఁడట్లుకనుటన్ హర్షంబునంగాంచి మై
నురురోమాంచములుప్పతిల్లఁగ సహోత్సాహియై లక్ష్మణుం
డరవిందప్రభవాండమంఘ్రియుగళిన్ హత్తించి తాటించుచుం
బరమామోదముతోడ నిట్టులనె శుంభద్వ్యాఘ్రధీరధ్వనిన్ 1519

ఉ. ఆదివరాహకూర్మములు నాదిఫణీంద్రుఁడు దిగ్గజంబులీ
మేదినిఁబట్టి నిల్పఁదగు మీదుమనంబుల ధైర్యమూనుచుం
గాదుభయంబునొంద మహికంపమునొందుట లేదు వింటిరే
నాదగునాజ్ఞ రాముఁడు పినాకిధనుర్దళనంబొనర్చెడిన్ 1520

సీ. అంత శ్రీరాముండు హరశరాసనసమీ
పముఁజేర నిర్జరుల్ భామినులును
బురుషులుఁ దలఁచిరి పుణ్యకార్యములను
సకలజనముల యజ్ఞానసంశ
యములును మందులౌ నవనీపతులయభి
మానంబు భృగురాముమానఘనత
ముని దేవతలభీతి భూపుత్రి చింతయు
జనకుపశ్చాత్తాప సంస్థితియును

తే. ధరణిజామాతృఘన దుఃఖదావవహ్ని
శివధనుస్సను నావలోఁ జేరి యెక్కి
రామభుజబలమను నపారజలనిధిని
కడువ నెంచెను లేఁడటకర్ణధారి 1521

ఉ. రాముఁడు గాంచెఁ జిత్రములు వ్రాసినకైవడి దృశ్యమౌ జన
స్తోమము నెంచియుం గరుణశోభిలు నయ్యినవంశరత్నమా
భూమిసుతం గనుంగొని ప్రభుండు గ్రహించెను వ్యాకులత్వము
ద్దామముగాఁగ నాయమ మొదంగలదంచును దత్క్షణంబునన్ 1522

చ. నిముసముఁ గల్పమట్టుల వనీసుత డెందమునందు వ్యాకులం
బమితముగాఁగనొందఁగని యావిభుఁడెంచెను నీరుపట్టుచే
శ్రమపడి నీరుప్రాప్తిలక చచ్చిన వెన్క సుధాతటాకమే
క్రమమున వచ్చు నక్కరకుత్వాస్థలినే నరజాతికేనియున్ 1523

తే. సస్యమెండి కపిదప వర్షంబుసమయు
మెల్లమించినఁ జింతయు నేమిఫలము
టంచుమది నెంచి రాముఁడయ్యవనిజాత
ప్రీతిఁ దిలకించి పులకించి వేడ్కమించి 1524

ఆ. గురునకాత్మయందె పరమభక్తిని మ్రొక్కి
హరశరాసనంబు నధికలాఘ
వమున నెత్తనదియు భాసిల్లె మెఱపునా
ఘనపథమున నింద్రధనువనఁగ 1525

మ. ధనువుం జేకొనియెత్తి యెక్కిడుచుఁ జేతన్ వారిసంధించి లా
గినయాతీరును జూచునేరికిని లక్షింపంగఁ గాన్పించునా
మునుపే మధ్యకువ్రిక్కలించె రఘురాముండుద్ధతిం జాపమా
ధ్వని బ్రహ్మాండమునిండె భీషణనినాదంబై కఠోరంబునై 1526

చ. భువనములెల్లనిండ నతిభూరికఠోరభయంకరస్వనం
బవుటఁ బ్రభాకరాశ్వములు నధ్వముఁ దప్పిచరించె దిక్చయం
బదిసెను దిగ్గజావళియు నార్చెను ఘీంకృతు లాచరించుచుం
భువిచలియించెఁ గూర్మకిటిభోగిపతుల్ కడు మ్రొగ్గిరొక్కటన్ 1527

చ. అమరులు రాక్షసుల్ మునులు హస్తములన్ శ్రవణద్వయంబుమూ
సిమిర్పుల వ్యాకులత్వమునఁ జింతిలఁ జొచ్చిరి చంద్రమౌళిచా
పము రఘురామచంద్రుఁడు విభంజనమొనరించెనంచు మో
దమున జయధ్వనుల్ సలిపెఁ దన్మయుఁడై తులసీసుధీంద్రుడున్

ఆ. హరశరాసనంబు యానపాతము రామ
చంద్రు భుజబలంబు సాగరంబు
మోహవశతనొంది ముందెక్కియున్న స
మాజమెల్ల నొక్కమారె మునిఁగె

క. ధనువును ఖండద్వయముగ
నొనరించి శ్రీరామచంద్రుఁ డుర్వారస్థైవం
గని సుఖియించిరి మోదం
బున నెల్లరు నమ్మహాత్ముఁ బొగడుచుఁ బ్రీతిన్ 1530

ఉ. లోఁతగు ప్రేమరూపకవిలోలమనోహర వారిపూరితం
బైతగు గాధిసూనుఁడను నట్టివిపత్రిసముద్రమా జగ
ద్ద్యోతక కీర్తిరాఘుఁడను నొప్పగు పూర్ణశశాంకుఁ గాంచి పై
నాతతమైనపుల్కలను నట్టియలల్ కదుమించఁ బొంగఁగన్ 1531

క. దివి దేవదుందుభిధ్వను
లవార్యముగ నెసఁగె నిర్జరాంగనలుద్య
ద్రవమునఁ బాడుచు నాడిరి
భవచాపవిఖండనోత్సవపు శుభవేళన్ 1532

మ. అజముఖ్యామరకోటి సిద్ధులుమునుల్ హర్షంబునం బ్రస్తుతిం
చి జయధ్వానములొప్ప రామవిభునాశీర్వాదముల్ సేసి ర
క్కజమై పెక్కుగురంగులన్ నెలయు స్రగ్జాలంబువర్షించె నిం
పుజనింపన్ రసయుక్తగీతముల వేల్పుల్ కిన్నరుల్ వాడఁగన్ 1533

తే. హరధనుర్భంగ శబ్దమెట్లఖిలభువన
భరితమయ్యెనటుల జయధ్వానములును
నిండెజగములనపుడు కోదండదళన
వార్త స్త్రీపురుషులు ప్రీతిఁ బలికికొనఁగ 1534

తే. సువిదులౌ వందిమాగధ సూతజనులు
బిరుదముల వర్ణనముసేయఁ బృథివిజనులు
హయమతంగజరత్న వస్త్రార్థచయము
చాగ మొసరించి రుతతరోత్సాహ మెసఁగ 1535

క. భేరీమృదంగకాహళ
భూరిధ్వానములు శంఖమురజరవంబుల్
సారతర దుందుభిధ్వను
లారూఢిగఁ దాళరవము లంతటఁ బెరసెన్ 1536

క. యువతీజనములు సుందర
రవముల మంగళము వాడ రహిమీఱఁగను
త్సవములసలిపిరి యెల్లెడ
నవనీస్థలి సకలజనుల కానందముగన్ 1537

క. చెలికత్తెలు రాజ్ఞీమణు
లలఘుతర సుఖంబునొంది రతిశుష్కములౌ
కలమాంకూరంబులపై
జలములఁ జిలికింపనలరు చందముదోఁపన్ 1538

తే. ఈదియీది విసుపుఁజెంది యెలమిమీఱఁ
దీరముంజేరురీతిఁ జెందెనుసుఖంబు
జనకుఁడనుపమ సంతాపమునుత్యజించి
పరమసంతోషభరిత హృత్పద్ముఁడగుచు 1539

తే. ధనువువిఱిగిన సకలభూధవులుఁదేజ
మెడలిపగలింటి దీపికాకృతులనుండి
రవనిజాహర్ష సుఖమునెట్లభినుతింతు
స్వాతిజలమొంది సుఖియించుచాతకమొకొ 1540

ఆ. చందమామఁగాంచి సంతసించుచకోర
మనఁగలక్ష్మణుండు నగ్రజన్ముఁ
గాంచె జనకపుత్రికయు శతానందాజ్ఞ
నడచె రామచంద్రుకడకుఁ బ్రీతి 1541

ఉ. లాలిత సుందరాంగులు వలంతులు క్షోణికుమారికా సఖుల్
చాలగ మంగళంబులను సంతస మొప్పఁగఁ బాడి తోడరా
బాలమరాళి యోాయనఁగఁ బాదములల్లన వైచుచున్ సరో
జాలయ మించి సీత తనయంగరుచుల్ విలసిల్ల నేగఁగన్ 1542

ఉ. బోటులమధ్యరూపములఁ బొందిన యందము మధ్యఁదోరమా
హాటకకాంతులీనెడు మహాచ్ఛవి యోాయన సీత యొప్పెనా
పాటలపుష్పగంధి కరపంకరుహంబున విశ్వజైత్రమా
మేటి వెలుంగు నాగరుచిమించఁ గడుం జయమాలలీలగన్ 1543

తే. తనువు సంకోచమొందె నుత్సాహ మాత్మ
నొప్పె గాఢానురాగంబు నొరు లెఱుఁగరు
జానకీదేవి శ్రీరామచంద్రురూప
మరసి చిత్తరువోయన నట్టె నిలచె 1544

తే. చతురలా బోటికత్తెలా స్థితిని గాంచి
సుందరంబగు జయమాల నిందు హరశ
రాసనవిఖండనుని కంఠమందు వైవ
నంచు బోధించి రా జనకాత్మజకును 1545

ఉ. అదివిని సీత బాలహరిణాక్షి కరద్వయి మాల నెత్తివే
యను కడుప్రేమచే వివశయైనది మిక్కిలిశోభ నొప్పె నో
ప్పిదముగ నాళయుక్తమగు విస్ఫురదబ్జయుగంబు భీతిన
మ్మదనుని మేనమామ జయమాల నలంకృతుఁ జేయుకైవడిన్ 1546

ఉ. అంతటసీత రామవిభు సత్కృతుఁ జేసె నురఃప్రదేశమ
త్యంత సుసౌరభద్యుతులకాకరమౌ జయమాలచేత శ్రీ
కాంతకు నాటపట్టగుచుఁ గాంతిలఁ గాంచి కలస్వనంబుతో
నెంతయు వేడ్క సీత చెలులెల్లరు గానము సేయుచుండఁగన్ 1547

మ. జయమాలాసములంకరిష్ణుఁడగు కౌసల్యాసుతుం జానకిం
బ్రియమే పారఁగఁ గాంచి దివ్యసుమనోవృష్టిన్ సురల్ విస్మయో
దయదీక్షం గురియించిరొక్కట జగద్బంధుల్ విలోకించి యొం
తయు సంకోచమునొందు కల్యాగమి యోనానుండిరుర్వీధవుల్ 1548

ఆ. వీటనింట మ్రోసె వివిధవాద్యంబులు
ఖలులు దేజమెల్లఁ దొలఁగనుండి
రఖిలసాధుజనులు హర్షంబునొందిరి
సురలుఁ గిన్నరాహి నరమునులును 1549

క. జయజయ జయయని సంతో
షయుతాశీర్వాదములను సలిపిరి గంధ
ర్వయువతులాడిరి పాడిరి
రయమునఁ బలుమారు కుసుమరాజి విసరుచున్ 1550

తే. విప్రులెల్లడ సలిపిరి వేదరవము
వందులుం బిరుదావళి వర్ణనంబు
సేసిరి త్రిలోకములఁ బర్వె సీతరాము
హరధనుర్భంజనను వరించినట్టి వార్త 1551

క. పురమున యువతులుఁ బురుషులు
నరుసంబుననిడిరి మంగళారతులుగడున్
విరివిగనొసఁగిరి ధనములఁ
బరికింపక యాత్మశక్తి భావములందున్ 1552

క. ఛవియును శృంగారంబును
గవగూడినయట్లుండి త్రైలోక్యైకయుం
భువనేశ్వరుఁడగు రాముఁడు
నవనీజనమునకు లోచనానందములై 1553

క. చెలికత్తెలు సీతావిభు
జలజసదృశ చరణయుగము స్పర్శింపుమనం
జలజాక్షి సిగ్గువెంపునఁ
దలవాంచి స్పృశింప వెఱచు ధవుపాదములన్ 1554

క. గౌతమపత్నీస్థితి మది
సీతస్మృతిం జెందిమానె శ్రీరామపదా
బ్జాతములంటుటనగె విభుఁ
డా తెఱవ యలౌకికంపుటతిప్రేమకెదన్ 1555

ఉ. సీతను దుర్వినీతులును శీలవిహీనులుఁ గ్రూరులున్ మహా
పాతకమూఢచిత్తులగు పార్థివు లారసి సాభిలాషులై
వీతసుభాగ్యులై క్రుధను వేకనచంబులదొడ్గి దుష్టవా
క్యాతురి లేచిరొక్కమొగి సంగరకాంక్ష రఘుప్రవీరుపై 1556

ఉ. అందొకఁడిట్లు పల్కె జనకాత్మజఁ గైకొనుఁ డా కుమారులన్
ముందుగఁ గట్టుఁడిర్వురను బోవఁగనీకుఁడు విల్లుదున్మినం
తంనుదముట్టెఁ గార్యమనితల్పఁగ రాము సుకుండమాకు మా
ముందఱఁ గన్యఁ బెండ్లియగుపోటరియెవ్వఁడు గల్గుఁ జూడుడా 1557

చ. జనకుఁడుతోడు వచ్చినను సంగరమందుఁ గుమారకద్వయం
బును నతనింజయింపుఁడను మూర్ఖవచఃస్థితినాలకించి సా
ధునృపులువల్కిరాగ్రహముతో నిటరాజసమాజమధ్యమం
దునఁ గడులజ్జలజ్జఁగొనె దోషముదోషమటంచుఁ దీవ్రతన్ 1558

చ. ఘనతప్రతాపవీర్యబలగర్వములెల్లఁ బినాకివింటితోఁ
జనియెఁ దదీయవీరతఁ బ్రశంసయొనర్చిన నిప్పుడేమిన
చ్చును విధిమోహములెల్ల మసిపోకినవానిగఁ జేసె నప్పుడే
ఘనములనిప్పుడైన నణుమాత్రము బోధఁహింపరాదొకో 1559

చ. మదమును నీర్ష్యయుం గ్రోధయుమానుచుఁగన్నులనిండరాముస
మ్ముదమునఁగాంచి సౌఖ్యమునుబొందుఁడులక్ష్మణురోషవహ్నిమీ
మదిఁబరికింపుఁడత్యలఘు మాత్రము దానికి మీరు హీనతా
స్పదశలభంబులై వృథగఁజావగనేల తలంపుఁడిందఱున్ 1560

ఉ. కాకము వైనతేయునెఱఁగైకొననెంచుగతిన్ మృగేంద్రుపా
లీక శశంబు గోరునటు హేతువులేకయె క్రోధమొందువాఁ
డేకుశలంబు నొందమదినెంచిన భంగి శివాపచారముం
గైకొని చేయువాఁడు సిరిఁగాంచగఁగాంక్షయొనర్చుకైవడిన్ 1561

తే. లోభియు దురాశగలవాఁడు లోకమందుఁ
గీర్తిఁగాంక్షించు విధమునఁ గేవలంబుఁ
గామి నిర్మల తంగోరుగతి హరిపద
విముఖచిత్తుఁడు మోక్షంబు వేఁడునటుల 1562

తే. ఉండె మీలోభమెన్నంగ నుర్వినాథు
లార యనిరట కోలాహలంబు వినుచు
భీతి సీతామహాదేవి వెఱఁగుపడఁగ
సఖులరిగి రామెఁగొని తల్లి సముఖమునకు 1563

క. శ్రీరాముండుంగురునిం
జేరెన్ సహజముగ మదినిసీతాస్నేహం
బారూఢిగ వర్ణించుచు
నారీజనతిలకమనుచు నమ్మెచుఁబ్రీతిన్ 1564

ఉ. సీతయు యోచనావశతఁజెందెను రాణులతోడఁగూడ నే
హేతువెఱుంగరాదు విధినేమియొనర్చెట లక్ష్మణుండు నా
భూతలనాథ వాక్యములఁబూర్ణముగావిని రాముభీతిచే
వాకెఱవిచ్చి యేమియును బల్కఁడుసూచుచునుండెనట్టిటున్ 1565

మ. భ్రూకుటీబంధముతోడ రక్త నయనాంభోజాతయుగ్మంబుతోఁ
బ్రకటంబౌ కినుకన్ సుమిత్రిసుతుఁడా రాజన్యసంఘంబు మ
త్తకరి వ్రాతముఁగాంచి పంతమది నుత్సాహోద్ధతిన్ మించు సిం
హకిశోరంబనఁ జూచుచుండె రఘురామాజ్ఞంబ్రతీక్షించుచున్ 1560

క. కోలాహలముంగనిపుర
హేలావతులెల్లఁగలతనెంతెయు ధరణీ
పాలకులందూషింపఁగ
నాలో శివధనువు విఱిగెనని విని కినుకన్ 1567

## — పరశురాముఁడు సీతాస్వయంవరరంగమునకు వచ్చుట —

క. భృగుకుల కమల పతంగుం
డగు రాముఁడు వచ్చెనటకు నతనికి ధవళం
బగు దేహంబున భస్మము
దగుఁదత ఫాలము త్రిపుండ్రతన్ శోభించున్ 1568

క. అతనింగని ధరణీపతు
లతిసంకోచంబునొందిరట శ్యేనరవ
శ్రుతి డాగులావకాండజ
తతి యోయన భీతినొంది తత్క్షణమందున్ 1569

ఉ. ఆనన మిందుబింబసమమై విలసిల్లుచు నించుకంతలో
నూనిన కిన్కరక్తరుచినొప్పు జటావళిమౌళి రాజిలం
గా నయనంబులెఱ్ఱఁబడఁగా భ్రుకుటీకుటిలత్వ మేర్పడం
గాఁగఁదోచుఁగ్రోధితుఁడు గా సహజంబుగ నాతఁడత్తఱిన్ 1570

తే. విరవృషస్కంధ తత బాహు వక్షుఁడగుచు
నమరు యజ్ఞోపవీతకృష్ణాజినములు
మాలికయుఁగటి మునియోగ్య చేల మొప్ప
మిగుల మొలయందుఁ దూణీరయుగళ మెసఁగ 1571

ఆ. శరశరాసనములఁ గరముఁ గరమొప్పఁ
జక్కనగుచు వెలయు స్కంధమందు
వరకుఠారమమర వాడియౌకర్మంబు
శాంతవేష మెసఁగు జామదగ్ని 1572

క. వర్ణనసేయ నశక్యము
పూర్ణంబగు వీరరసము మునివేషముతోఁ
దూర్ణంబుగ విచ్చేసెను
దీర్ణంబుగ రాజులున్న దెసకసనొప్పన్ 1573

మ. భృగువంశేశుకరాళరూపమును భూభృచ్ఛ్రేణి వీక్షించుచున్
మిగులన్ వ్యాకులమొంది భీతిలుచు నాత్మీయాహ్వయంబుం బితం
దగఁ బేర్కొంచును లేచినిల్వఁబడుచుండం డప్రణామంబు సే
యఁగ నాభూపసమూహమధ్యమున నయ్యార్యోత్తముం డేగుచున్

క. హితమెఱిఁగి యొనని దిక్కున
కతఁడు స్వభావముగఁ జూచు నాయు వడకెసం
చలిని శ్వేదముఁ గనుచున్
మతివ్యాకులమొందువాఁడు మనుజవిభులలోన్ 1575

క. అంతట విదేహధరణీ
కాంతుండరుదెంచి మ్రొక్కి క్రమ్మనసీతా
కాంతా తిలకముచే భృగు
కాంతునకు నమస్కరింపఁగాఁ జేసెనొగిన్ 1576

క. ఆతం డాశీర్వాదము
భూతనయకొసంగ సఖులు వొంగుచు మహిళా
వ్రాతంబున్న యెడకు నా
సీతం గలహంసయానఁ జేకొనిచనఁగన్ 1577

క. పదపడి విశ్వామిత్రుఁడు
ముదమున భృగురాముఁగాంచి భూరి వివేకా
స్పదమైన భ్రాతృయుగళముఁ
బదవనజద్వంద్వమందుఁబడ నైచియనెన్ 1578

తే. రామలక్ష్మణులీకుమారకులు దశర
థావనీనాథనందనులనఁగ వినుచు
వారి నాశీర్వదించె భావమున నలరి
పరశురాముండు త్రిభువనపావనుండు 1579

క. సౌందర్యాధిక నిర్జిత
కందర్పుని రామచంద్రుఁగనుదమ్ములకున్
విందుగఁగాంచుచునతఁడా
నందంబును బొంది తనమనంబున నుతియున్ 1580

క. జనకునిగని యాక్రియఁగ్రొం
దెనసినకతమేమటంచు నెఱిఁగియు నెఱుఁగం
డనువడువునఁబ్రశ్నించెం
దనువునఁ గ్రోధంబు వ్యాప్తంగనియుండన్ 1581

చ. జనకుఁడు సర్వముందెలిపె క్ష్మాపతి సంఘము రాకకుంగతం
బునువిని జామదగ్న్ని కనె భూస్థలిపైఁబడి రెండుముక్కలై
త్రినయను చాపముండుటొక దిక్కునఁగ్రుక్కననక్కజంబుగాఁ
గినుక జనింపనిట్లు పలికెంగడుఁదీవ్రకఠోరవాక్యముల్ 1582

శా. ఓరీ మూఢ విదేహరాజ యెవఁడీ యుగ్రాత్ము కోదండముం
భీరుత్వంబొకయింత లేక విఱిచెన్ వేవానినింజూపుమా
నీరాజ్యంబు గలంత భాగముధరన్ నేఁగ్రిందుమీఁదౌనటుల్
భూరి ప్రాభవమొప్పఁ జేసెదతనిన్ ముంజూపకేనిం ద్వరన్ 1583

క. అనుటయుఁ గడు భయమునన
జనవిభుఁడుత్తర మొసంగఁజాలకయుండెన్
మనమున ఘనమగుహర్షం
బును బొందిరి కుటిలులైన భూపతులెల్లన్ 1584

క. సురముని ఫణిఖగముఖ్యులుఁ
బురనారీపురుషచయము భూరిభయమునం
బరిపరివిధముల యోచిం
చిరి యేమగునొక్కొ యనుచుఁ జిత్తములందున్ 1585

తే. అతిభయంబునఁ జింతించు నప్పుడు సీత
జనని విధిపాడుగావించె సర్వసిద్ధ
మైనకార్యంబనుచుఁ దాపమందెఁ
భార్గవు స్వభావమును విన్న బాలయగుట 1586

తే. అర్ధనిముషంబుఁ గల్పసామ్యంబు గాఁగఁ
గడుపుచుండెను రాముఁడాపుడమికన్నె
భీతినొందుట జనులెల్ల బెగడియుంట
నరసి హర్ష విషాద శూన్యతవహించె 1587

ఆ. స్వామి శివునిధనువు వ్రిచ్చినవాఁడు మీ
దాసుఁడొకఁడు నుండు తావకాజ్ఞ
యేమి పలుకకుంటి రేల నాతో నన
ననియెఁ గుపితమౌని యాగ్రహమున 1588

తే. వాఁడు సేవకుఁడైనసేవయె యొనర్చు
శత్రుగతిఁజేయ సమరంబు సలుపవలయు
రామ వినుమిదె హరధనుర్భంజనుండు
కార్తవీర్యుని క్రియవైరిగాఁడె నాకు 1589

తే. ఈసమాజంబు విడనాడి యీవలకును
వేఱుగా వాఁడు రాకున్న వీరలెల్లఁ
జత్తురన లేతగాఁగ లక్ష్మణుడు నగుచుఁ
బరశురామునకవమాన భంగిఁబలికె 1590

-• పరశురామలక్ష్మణులసంవాదము •-

తే. బాల్యమున నెన్నియో విండ్లు పట్టివిఱచి
యాగ్రహమునొందియుండరేమయ్య స్వామి
యీధనువు మీఁద మమకారమేల మీకుఁ
దెల్పుఁడన నగ్గి భృగుకుల తిలకుఁడనియె 1591

ఉ. ఔర నృపాలబాలక పురారిశరాసనమెన్న సర్వసా
ధారణ చాపతుల్యమె యెదంబరికింపక యిట్లులాడెదే
చేరెను నీకుఁగాలమది సిద్ధము సర్వజగంబులందు వి
స్తారముగాఁబ్రసిద్ధిఁగనె శంకర కార్ముకమంచుఁబల్కఁగన్ 1592

చ. నగుచు సుమిత్రపుత్రుఁడనె నామదికన్ని ధనుస్సులున్ సమం
బుగఁగనుపట్టు దేవకడుఁబూర్వపు విల్లది లాభహానులే
మగు నది త్రుంచినంత మనమందది క్రొత్తదిగాఁదలంచి యే
తగునని పట్టిచూచె గుణధాముఁడు రాముఁడెఱిఁగియంటునే 1593

ఉ. తాకినయంతనే పటిమతప్పినదౌటను వ్రక్కలయ్యెఁజుం
డాశఱకంఠు చాపము మదగ్రజు దోషమదేమియుండు మీ
రీ కరణింగ్రుధాకలితులెందుకు కావలె మానిచంద్రచి
కాకునుబొందఁగాఁదగిన కారణమేమియులేదెఱుంగుఁడా 1594

కం. అనుటయుఁ దనపరశువు దెసఁ
గని యోరీ శరయథేచ్ఛగాఁ బలుకుటకున్
మనమున నులుక వొకింతయు
వినియుండవొ నాస్వభావ విధమిది వటుకున్ 1595

ఉ. బాలుఁడవంచు నిన్ దునుమ భావమునందుఁ దలంపకుంటివా
చాల జడాత్మ నన్ను నొకసంయమిగా గణియించుచుంటివే
బాల వటుండఁ గ్రోధిని నృపాలకులాటవికిన్ మహోగ్రహా
కేళినటంచు లోకములఁ గీర్తివహించితి నీ వెఱుంగవే 1596

ఉ. బాహుబలంబువంధరణిఁ బార్థివశూన్యముగా నొనర్చియు
త్సాహముతో నొసంగితిని క్ష్మాసురకోటికిఁ బెక్కుమాఱులు
గ్రాహపకేళి నర్జును సహస్రభుజంబులఁ జెండెనొక్క సం
దోహముగా ధరంబడనిదో పరశుంగనురాజనందనా 1597

కం. మాతా పితల విచారముఁ
జేతంబుల బాపుకొఱకు స్త్రీ గర్భ శిశు
వ్రాతముఁ దునిమిన పరశువు
భీతిదముగఁ మిదికనుము పృథివీశసుతా 1598

చం. అనవుడు లక్ష్మణుండు నగియయ్య మునీంద్ర మహాపరాక్రమం
బును నభిమానముంగలుగు పోటరివౌదువు మాటిమాటికిం
గనుమని గండగొడ్డలిని గైకొనిచూపెదు నాకు నూది కొం
డ నెగురఁగొట్ట నెంచెద వెడందన దెవ్వరికైన శక్యమే 1599

తే. తర్జనిం జాచి చూపినంతట నె మఱిఁగి
చచ్చు గుమ్మడికాయ లిచ్చటను లేవు
శరశరాసనములును నీపరశువుఁగని
కొంచెమభిమానమొంది వాక్రుచ్చుచుంటి 1600

చ. భృగుకులమం చెటింగియుపవీతముఁ గాంచి జనించుకోపమున్
మిగులనడంచినాఁడను సుమీ భవదుక్తులకన్ సహించిదే
వగురు గవాననీసుకులపట్లను శ్రీహరిభక్తకోటిపై
మగటిమిఁజూపరెవ్వరును మాకులమందుమునీంద్రచంద్రమా

ఉ. చంపినఁ బాపమూనపయశంబగునోడినఁగాన నిన్ను నేఁ
జంపుటకంటె నీచరణసారసయుగ్మమువిూఁదవ్రాలెదం
దెంపునఁగోటివజ్రసమతీవ్రవచోరచనుండవైతివా
పెంపుసెడంగుఠారమును విల్లును నమ్ములు నుంట వ్యర్థమా 1602

క. అదికనియనుచితమాడుట
మదిక్షమియింపుము మునీంద్ర మహిత సుధైర్యా
హృదయసఁగనలుచు భృగుకుల
సదమలమణి యనెగభీర చటులోక్తి నిటుల్ 1603

ఉ. కౌశిక వింటె యీ చిఱుత కాలవశుండునిజాన్వవాయమున్
నాశమొనర్చు మందమతి నైజముగాఁగుటిలుండు చాల దు
ష్టాశయుఁడజ్ఞుఁడల్పుఁడు నిరంకుశ నిర్భయచిత్తుఁ డాదినా
ధీశకులేందు బింబమున దీప్తివిహీనకళంకమూఁజుమీ 1604

ఆ. క్షణములోన వీఁడు కాలవశుండగుఁ
బిలిచిచెప్పుచుంటి వినకయున్న
లేదొకింతయైన నాదోషమూ మీఁదఁ
గానఁదలఁచితేని కడురయమున 1605

తే. మత్ప్రతాపంబు బలము సమగ్రవిధము
బోధమొనరించి వీనికి బుద్ధిఁగఱపి
వారితుంజేయు మవివేక వచనములను
మానుమని తెల్పి యనిన రామానుజుండు 1606

తే. పలికెనోముని నీయశఃప్రాభవములు
నీయెదుర సాంతముగను వర్ణింతురెవరు
నీవెనీముఖముననె వర్ణించుకొంటి
పమితముగ నీప్రతాపకార్యముల నెల్ల 1607

తే. మదినిసంతుష్టి లేకున్న మరలఁజెప్పు
ముదయమయ్యెడి క్రోధంబునదిమిదుఃఖ
సహనమొందుకుచేసెదు సహజధీర
మతివినవ్యాకులుండవు మహితగుణివి 1608

తే. వీరపురుషోచితంబగు వృత్తికూడఁ
గానఁబడుచుండె నీయందుఁగానఁబరుల
దూషణము సేయుచుండుట తులువతనము
గాని నీవంటివారికిఁ గాదుశోభ 1609

క. వీరులు సమరాంగణమున
శూరతఁజూపెదరుగాని స్తుతియించుకొనన్
నేరరుస్వీయముగ పందలు
వైరిఁగని ప్రలాపములనె పలికెదరెపుడున్ 1610

క. కాలుని వెంబడిఁ దెచ్చిన
లీలందోఁచెదవు నీవు లేకుండినచోఁ
గాలునిమాటికిఁ బిలచెద
వేలానాపైకిఁబంప ఋషికులతిలకా 1611

మ. అనసౌమిత్రి కఠోరవాక్యముల నత్యంతక్రుధావేశతన్
విని శాతోగ్రకుఠారముం గరమునన్ వేపట్టినాదోపమిం
దునొకింతేనియు లేదు నుండిపుడునన్ దూషింపఁగాఁ బోకుఁడీ
జనులారా పరుషోక్తులం బలుకు నీక్షాత్రార్భకుం డెంతయున్ 1612

ఉ. మారణయోగ్యుఁడెంతొ సుకుమారుఁడు బాలుఁడటంచుఁ జాలఁగా
నారసి కాచినాఁడనిఁక నాగనుపీనికిఁజావునిక్కమం
చారభటించుభార్గవుని కడ్డముగాఁజని కౌశికుండనెన్
నేరము సైపుమెన్నఁడు గణింపరు సాధులు బాలకోక్తులన్ 1613

చ. అనవుడు నేఁగుఠారమును హస్తమునంధరియించియుండినన్
మనమునఁగ్రోధమొందియును మద్గురుపట్లనుద్రోహియౌచు నా
కనులకు ముందునిల్వఁబడఁ గాఁ బలుపల్కినపాపరాధునిం
దునుమకయుంటి గాధిసుతతో డనె నీదగుశీలమెంచుచున్ 1614

ఆ. కాకయున్ననిపుడె కౌశికవీనిఁగ
ఠోరమైన నాకుఠారధార
నశ్రమమునఁద్రుంచి యస్మద్గురునిఋణ
ముక్తిచేసియుందు మందుగానె 1615

ఉ. నావుడుగాధిసూనుఁడు మనంబుననవ్వుచునంత లేతగా
భావమునందుఁదోఁచెను దపస్వికి లీలమహేశు కార్ముకం
బేవిభుఁడిక్షుదండమటులిట్టె కరంబునఁబట్టి త్రుంచెనో
యావిభునించు కేని యిపుడైన నెఱుంగఁడు జ్ఞానహీనుఁడై 1616

చ. అనుచుఁ దలంచుచుండ జమదగ్నికుమారునిఁ గాంచి లక్ష్మణుం
డనియె మునీంద్ర యీజగమునందుఁ బ్రసిద్ధము నీదుశీలమె
వ్వనికి నెఱుంగరానిదె యనశ్యము దల్లికిఁ దండ్రికిన్ ఋణం
బును మునుదీర్చినావు గురుపూజ్యఋణంబిఁక నున్నదెన్నఁగన్

అంటులకై భవద్ధృదయమందు విచారముగల్గెఁగాననిం
కొందఁగనేల మాదుతలలూఁచినవంచుఁదలంచి వ్యాజముం
బొందెను చాలవృద్ధిదినముంగతియించుటఁజేసి వర్తకున్
ముందుగఁదోడితెమ్ము ఋణమున్ నెసనిచ్చెదసంచివిప్పుచున్

చ. అనఁగటువైనవాక్యములకా భృగురాముఁడు సైఁజాలకె
త్తెను గులిశోపమంబయిన తీవ్రకుఠారము దానిఁగాంచి హా
యనిరిజనంబులెల్ల నపుడాతనిఁగాంచి సుమిత్రిసూనుఁడి
ట్లనియెభృగూత్తమాకనుమటంచును జూపెదెగండగొడ్డలిన్ 1619

క. ధరణీశద్రోహీ నినుఁ
బరిమార్చక కాచినాఁడ బాపఁడవనుచు
గ్రరణంబున నీకెవ్వఁడు
వరయోధుఁడు దొరకఁడింతవఱకెవ్వండున్ 1620

క. ధరణీసురులు సురలుమం
దిరమందే పెద్దలనుచుఁ దీవ్రతఁబలుకం
గరమనుచిత మనిరెల్లరు
నురురవమున రామచంద్రుఁడొగిననుజన్మున్ 1621

తే. సన్నవారించి లక్ష్మణస్వామియొసఁగు
నుత్తరంబనునాహుతి నుజ్జ్వలముగ
మండుభార్గవు కోపాగ్ని మాన్పకొఱకు
జలసమోక్తులరవికుల సవితృఁడనియె 1622

—• శ్రీ రఘురామ భృగురామ సంవాదము •—

తే. దేవయీతఁడు పసివాఁడు కేవలంబు
క్రోధమునుమాని బాలుఁగపుణనుగనుఁడు
ప్రభుప్రభావంబు లేశమాత్రంబెఱిఁగిన
నజ్ఞుఁడెదిరించునోటు సామ్యముగనిలిచి 1623

తే. బాలురొకవేళ దుష్టమౌపనులొనర్ప
గురుఁడు జననీజనకులును గూడఁ గడుప్ర
సన్నతంజూతురితఁ డుయుష్మత్సుతుండు
సేవకుఁడుగాఁగఁగని కృపసేయవలయు 1624

క. మీరలు సమదర్శులునున
ధీరులు సచ్ఛీలయుతులు దీప్తజ్ఞానా
పారాకూపారులు సువి
చారులగుట క్షాంతిఁగనుఁడు సన్మునిచంద్రా 1625

తే. అనుడు రాముని వాక్యంబులాలకించి
చల్లఁబడె భార్గవుఁడు గొంత సస్మితాస్యుఁ
డయ్యె నొక్కింత పలికి రామానుజుండు
నవ్వుటంగాంచి భృగువంశనాథుఁడప్పుడు 1626

క. నఖశిఖపర్యంతంబుగ
శిఖివోలెం గ్రోధమలమఁ జిడిముడిపడియా
సుఖరాశి రాముఁగనియెం
తఖలుండో రామనీదు తమ్ముండనియెన్ 1627

ఆ. ఒడలు ధవళమసిత మెడఁద కాడుర పయో
ముఖుఁడు కాలకూటముఖుఁడుగాని
సహజవక్రబుద్ధి చనఁడు నీపద్ధతి
నన్నుమృత్యు సమత నెన్నఁడఘుఁడు 1628

చ. అనవుడు లక్ష్మణుండు నగి యయ్యమునీశ్వరక్రోధమెన్నఁడుం
జనదది పాపమూలము నశంసదులై క్రుధకుంజనవ్రజం
బనుచితమైన కార్యముల నాచరణంబొనరించుచుం జగం
బునకు విరుద్ధతన్ మెలఁగఁబూనును నానుడులన్ వినందగున్ 1629

క. మునిరాయా వినునేనీ
యనుచరుఁడను గోపముడుగుమయ్యా సదయతన్
గినిసిన విఱిగిన ధనువతు
కునె నిలచినఁగాళ్లునొచ్చుఁ గూర్చుండుమిఁకన్ 1630

తే. ఇదియె నీకతిప్రియమ్మైప నెచటనైన
ఘనునిమాంత్రికుఁబిలిపించి కలిపియతుకఁ
జేయఁదగులేక యేదొయుపాయమైన
సలుపఁదగునన భయమొంది జనకుఁడపుడు 1631

ఆ. ఊరకుండు మనుచితోక్తులుపలుకంగ
మేలుగాదనియెను మిగుల నగర
కాంతలుం బురుషులు గడగడవడఁకుచు
బుడుత చిన్న పెద్ద దుడుకుతనము 1632

క. అనిరి సుమిత్రానందనుఁ
డనునిర్భయవచనచయము నా భృగుపతియున్
వినివిని ఘనమగు రోషము
దనువునుమండింపబలము దఱుగఁగనుండెన్ 1633

క. శ్రీరామచంద్రు దెసఁ గడు
గారవమునఁగాంచి పలికెఁగాచితినీకుం
గూరిమితమ్ముండని విష
పూరితమగు కనకఘటముపోలికవీఁడున్ 1634

తే. మలినచిత్తుండు సుందరలలితగాత్రుఁ
డనఁగసౌమిత్రిమరల నవ్వాపలేక
గట్టిగానవ్వవలదని కనులతోడ
తీవ్రముగఁజూచి రాముండు దెలియఁజేయ 1635

తే. ఉలికిప్రతికూలవచనముల్ వలుకమాని
యరిగెగురు చెంతకంత రామానుజుండు
రెండుచేతులు మోడ్చి రాముండు వినయ
మృదులశీతలవాక్య సమృద్ధిననియె 1636

తే. దేవతాముసహజ సుస్వభావులగుట
జ్ఞానసింధులౌట సర్వసమానులగుట
బాలకోక్తులఁ జెవినిడఁ బాడిగాదు
బాలునకుఁ గంకురీగకు భావమొకటి 1637

తే. కానవిద్వాంసులెపుడవి గణనచేసి
దోషమెంచరువానిచేఁ దొలుతనేమి
చెఱుపఁబడలేదు కార్యమెంచినమహాత్మ
కానిభవదపరాధిని నేనుసుండు 1638

మ. దయయో కోపమొ బంధమో వధయొ మీదాసుండఁగా నెంచియొ
మ్మోయిఁగావింపఁదలంచిరట్టులనె స్వామీ చేయుఁడీ నన్ను మీ
రుయథార్థంబుగ వేగఁదెల్పుఁడెటు మీరోషానలంబాఱు న
ట్లెయొనర్తున్ వలనౌనుపాయమిఁక నేలా జాగు మాసీశ్వరా 1639

క. అన భవదనుజుండిపుడున్
సునిశితదృష్టుల నిగుడ్చుజూడుమతని గ్రీ
వను మత్కుఠారధారం
దునుమక కోపంబు తీఱదుర రఘురామా 1640

మ. అతిఘోరంబగు మత్కుఠారగతి విన్నంతన్ నృపాలాంగనా
తతిగర్భంబులుజాఱి క్రిందఁబడునాదంభోళికన్నన్ మహో
గ్రత నొప్పారు పరశ్వధంబుఁగనియుం బ్రాణంబుతోనున్న యీ
క్షితిపాలాత్మజు మద్విరోధి నిచటం జిత్రింబుగాఁజూచెదన్ 1641

సు. కరయుగ్మంబును బట్టుదప్పెడిని యింకంగుంఠితంబయ్యె నీ
నరనాథాంతకమా కుఠారవరమున్ నాభావమున్ మార్చె నీ
శ్వరుఁడెన్నంబ్రతికూలుఁడయ్యె హృదయాఘాతంబునం దేరిపైఁ
గరుణాలేశ మెఱుంగ నెన్నఁడును దత్కాఠిన్యమేమయ్యెనో 1642

తే. అతుల దుస్సహ దుఃఖ సహనతనిడుచు
నేడు నామదిఁ గరుణ జనించెననుచుఁ
బరశురాముండు వచియించు పలుకులవిని
మరలఁ దలవంచి మ్రొక్కి లక్ష్మణుఁడు పలికె 1643

క. ఆరోషంబను వాయువు
గారుణ్యాకృతి వహించి కనెననుకూల
త్వారూఢి ననఁగఁ బువ్వుల
వారిగ జల్లెననఁ నొప్పెవాని మృదూక్తుల్ 1644

తే. ఓమునీశ్వర కరుణచే నొడలుమండ
దైవమేనిల్పుఁ గ్రోధమొందంగ మేర
నంగ వినుజనకావనీనాథ మూర్ఖ
నాపు యమపురముం గోరు నాలయముగ 1645

క. నాకన్నులకుం జాటుగ
నీ కుట్టని ధూర్తుఁ బంపవేల త్వరనన్
నీకనులు మూసికొనినన్
లేకుండుదు రెదుట నెవరు నీకు మహాత్మా 1646

క. అని నవ్వుచు లక్ష్మణుఁడన
మనమున ఘనరోషమొదవ మరల రఘువరుం
గని శర ననుబోధించెదె
త్రినయను చాపంబుఁ దునిమి దిట్టతనమునన్ 1647

క. నీయనుమతి చొప్పననే
నీయనుజుఁడు దీక్ష్ణ వచన నిచయము వలికెన్
మాయా వినయమునం జే
దోయిఁ ముకుళించిపలుకుదువు నీ వెపుడున్ 1648

క. అనిచేసి నన్నుఁ బరిత్య
ప్తునిఁ జేయఁగ నోపవే నిఁ దోడన రామా
ఖ్యను విడువుమనుచు రోషం
బినుమడిగాఁ బలికె మఱియు నినకులపతితోన్ 1649

క. త్రినయను విద్రోహి రణ
మొనరుపుము ఛలంబు విడిచి యోరీ కాకుం
డిన ననుజ సమేతంబుగ
నిను గూల్చెద ననుచు నధిక నిష్ఠురఫణితిన్ 1650

క. ఉరువేగంబునఁ బరశువు
గరమున సంధించి యెత్తఁగాఁ కుత్స్థ విభుం
డరసి భృగురాము వదరుట
శిరమల్లన వంచి మదిని జిఱునవ్వెనయున్ 1651

మ. అపరాధంబొనరింప లక్ష్మణుఁడు మీకత్యంత రోషోగ్రస
ల్లపనం బేటికి నా మెడన్ శమయుతుల్ గండ్రొక్కచో హానియె
ట్లపరాశంబొడసూపు వక్రశశిపూజ్యంబౌ జనుల్ మ్రొక్కఁగాఁ
నెపుడున్ రాహువు మ్రింగకుండునటువో యీ లోకమర్యాదయున్

ఉ. కోపము మానుఁడింక మునికుంజర చేతఁగుఠారముండె మీ
దాపున శీర్షమున్నయది తావకచిత్తము వచ్చినట్టుగా
నేపనియైనఁ జేసి శమియింపుఁడు మీయనుగామిఁ గాఁగన
న్నాపయి నెంచఁగాఁదగు మహాత్మ్యయటంచును బల్కె వెండియున్

క. సేవకునకుఁ బ్రభుతోడం
గావింపఁగ నెట్లు పొసగుఁ గదనము మానుం
డో విప్రవర్య కోపము
నా విన్నప మాలకించిన యుపథవర్తీ 1654

క. మీవేషమరసి లక్ష్మణుఁ
డేవోవచియించినాఁడ హితవచనములం
దేవా బాలుఁడుగానన్
గావందగుదోషిగాఁగ గణియింపకెదన్ 1655

క. మీరుధనుర్బాణములుఁ గు
ఠారముధరియించియుండుటంగని యెవఁడో
వీరుండని యీబాలుం
డారడిఁగావించెఁ గ్రోధమందిమహాత్మా 1656

క. మీనామ మెఱిఁగియుండియుఁ
గానఁడు గుర్తింపమిమ్ముఁ గావునఁగులజం
బైనస్వభావము పెంపున
మీనుడులకు నుత్తరంబు మించివచించెన్ 1657

క. మునివలెవచ్చిన మీపద
వనజరజంబుంధరించు వానిశిరమునం
గనికరమధికము విప్రుల
కనఘా క్షమియింపుఁ డెఱుఁగకాడినతప్పున్ 1658

శా. నాకున్ మీకుసమానమెట్టులగునో నాధాపదంబేడయు
స్తోకంబైనశిరంబదేడ చెప్పఁడాసూక్ష్మంబు రామాఖ్యయే
నాకయ్యెం బరశుప్రియుక్తమయి మీనామంబురాముండనన్
లోకఖ్యాతిఁగనెం ఘనంబగుచు నాలోచింపుఁడీనెమ్మదిన్ 1659

క. నాచాపమేకగుణమగు
మీచాపమునవగుణంబు మిగులఁబునీతం
బేచందముచే మీకున్
నీచులముక్షమింపుఁడింక నేరముదేవా 1660

క. అనిరాముఁడు భృగురాముని
మునియనియుఁ విప్రుఁడనియు మ్రొక్కుచుఁబిలువన్
వినిక్రోధంబున నవ్వుచు
ననె నీవును వక్రబుద్ధిననుజసముఁడవే 1661

క. కేవల విప్రుండనుచుఁ
నీ వెంచెదునన్ను నీకు నేఁ దెలిపెదనే
నేవిధవిప్రుండనొ శుగ్రివ
మౌవిలుమదమర్ష సహ్ని కాహుతిశరముల్ 1662

క. చతురంగసేన సమిధ
పృథివిమహారాజులెల్లఁ బశువులు వారిఁ
హతమార్చి బలియొసంగితి
శతపంశుప్రహతినఱకి చిన్నమఖములన్ 1663

ఆ. ఈప్రపంచమందు నెన్నియోకోటుల
కొలఁది సమరయజ్ఞములనొనర్చి
యున్న నాప్రభావమొక్కింత యెఱుఁగమిఁ
బాఱుఁడనుచుఁ జుల్కఁబల్కెదీవు 1664

ఆ. ధనువువిఱచినట్టి దర్పాధికమున న
హంకరించి భువనమంతనీవె
గెలిచినట్టులెంచి నిలిచెదవని భృగు
రాముఁడనఁగ వినుచు రాముఁడపుడు 1665

ఉ. యోచనచేసిపల్కెఁడు మహోగ్రముమీఁదగుకోపమెన్న నే
నాచరణంబొనర్చినది యల్పము నేరముపాత్రదాటచే
బూచులతేనిచాపమది ముట్టినయంత నె ముక్కలయ్యెనా
దాచతురత్వమున్నదె యహంకృతినొందుటకో మునీశ్వరా 1666

చ. భృగుకులనాథనిన్ను నొకవిప్రుఁడవంచు నిరాదరించినం
జగమున నేము శీర్షములఁజయ్యనవంచి భయంబునొందఁగాఁ
దగునరయోధుఁడెవ్వఁడల దైత్యసురావనినాథయోధులన్
మగటిమిమాకుఁ దుల్యుఁడును మాకధికంబగువాఁడు బోరికిన్

క. పిలచిన నతిసుకరంబుగఁ
గలనొనరించెదము దుదకు కాలుండైనం
దలఁకుదుమె క్షత్రియాంగం
బిలఁదాల్చియు యుద్ధమన్న నెవఁడు భయపడున్ 1668

ఆ. వాఁడుహీనుఁడనఁగ వంశకళంకుఁడ
నంగఁదగును నేను నైజముగ వ
చించుచుంటిఁ గులము శ్రేష్ఠతఁబొగడుట
కాదు రఘుకులజులు కాలునైన 1669

క. సమరమున వెఱవరెదురఁగ
సుమహితచారిత్రభూమి సుకులప్రభుత్వం
బమరునటు లెవఁడు భయపడుఁ
దమకాంతనినిర్భయునిగఁ దలఁపఁగవలయున్ 1670

పరశురాముఁడు శ్రీరాముని జగన్నాథునిగ నెఱింగి స్తుతించుట

తే. అనినరాముని మృదులగూఢాతివినయ
భాషణంబులవినినంత భార్గవునకు
బుద్ధివికసించె జ్ఞానంబుపుట్టె మదిని
రాముఁడొక రాజపుత్రుఁడన్ భ్రాంతితొలఁగె 1671

తే. అంత భార్గవరాముఁడయ్యర్కవంశ
రామునింగాంచి యిందిరారమణికీవు
భర్తవగుదేని యిదిగో నాపాలిధనువు
నంది యెక్కిడఁ దొలఁగునాసందియంబు 1672

క. అసిధనువునంది యీయం
దనంతటనె యేగెనదియు దాశరథికరం
బునకు నదిగాంచి విస్మయ
మును భార్గవరాముఁ డపుడు పొందె మనమునన్ 1673

ఉ. రాముప్రభావముం బరశురాముఁ డెఱింగి శరీర మెల్లను
ద్దామతనూరుహాంచసహితంబయి యొప్పఁ బ్రఫుల్లగాత్రుఁడై
ప్రేమనిజాంతరంగమునఁ బెంపగుచుండఁగ నాపలేక యా
శ్యామలవర్ణుఁ గాంచి తనహస్తములన్ ముకుళించి యిట్లనెన్ 1674

చ. జయరఘువంశ పద్మవనసప్తతురంగ మహోగ్రదానవా
న్వయవనవీతిహోత్ర జయ బ్రాహ్మణనిర్జరగోప్రియంకరా
జయమదమోహవిభ్రమవిచార నివారణరోషనాశనా
జయనయశీల సద్గుణవిశాల కృపాజలధీ సుఖావధీ 1675

క. జయ చతురవచనరచనా
జయ సేవకసుఖదశుభదసకలాంగక య
ద్వయ కోటిమారసదృశా
త్రయరూపా యేకముఖతశక్యమె పొగడన్ 1676

క. జయ శివమానస మానస
పయోరుహాకరమరాళ భవబంధహరా
వియదాపగా జనకపద
భయనాశా పరమపురుష పాహి సురేశా 1677

క. తెలియక యనుచితభాషణ
ములనాడితి సైపవలయు మ్రొక్కెద క్షమకున్
నిలయములన్నయుఁ దమ్ముఁడు
నలఘులు మీరిద్దరును మహామునిగేయా 1678

క. రఘుకుల విజయపతాకా
యఘునాశా జయజయజయ యనిపొగడుచునే
గెఘనుండు పరశురాముఁడు
విఘటితబద్ధాంజలియయి వేతపమునకున్ 1679

క. నృపులు తమంతటఁదామే
యపరిమితంబైన భయమునంది పఱచిర
వ్విపులతరకోపి భార్గవుఁ
డెపుడచటికివచ్చునన్న డింద్లకువడిగన్ 1680

క. విరివానన్ రామునిపైఁ
గురియించిరి మురజవాద్యఘోషములెసఁగన్
సురలుపుర సతీపురుషులు
గరమున్ హర్షించిరపుడు గతమోహితులై 1681

-• జనకుఁడు శ్రీ జానకీ కల్యాణసన్నాహ మాచరించుట •-

క. అతిరభసంబునఁ దూర్య
ప్రితతియు వాద్యములు మ్రోసె భానములలరన్
సతులుపిక కలస్వరముల
నతులితగతిఁ బాడిరెల్లరానందమునన్ 1682

క. మంగళవేషములొప్పన్
శృంగారించుకొనిరతి దరిదుఁడు ధనరా
శింగన్న రీతి జనకుఁడు
వొంగెన్ వర్ణింపదరమె పొందినసుఖమున్ 1683

ఆ. భయముఁదొఱఁగిసీత బహుసంతసమున సు
ఖంబునొందెశితకరుఁడు వొడమ
నతిసుఖంబునొందునట్టి చకోరకు
మారిమోయనంగ మానసమున 1684

కం. జనకుఁడు విశ్వామిత్రునిఁ
గనుఁగొని ప్రణమిల్లి దేవ కడుఁగృతకృత్యుం
డనుగా నన్నీసోదరు
లానరించిరి మీప్రసాద మొందుటఁగా దే 1685

కం. ధనువున్ రాముఁడువిఱచెన్
మునినాయక యిప్పుడుచితమును గృపనెఱిఁగిం
చిన నట్లానరింతుననం
జనకునిఁగని కౌశికుండు సంతస మొదవన్ 1686

తే. చతుర జననాథ విను భవ చాపమునక
ధీనమై యుండెను వివాహదీక్ష యిప్పు
డాధనువు ద్రుంగె నప్పుడే యయ్యెఁబెండ్లి
యనియెఱుంగుదు రమర నరాహిముఖులు 1687

ఉ. ఐనను వెండినీవు భవదన్వయపద్ధతి వేదచోదితం
బైనవిధంబునం గురు ధరామరులం గులవృద్ధ బంధు భూ
జానులఁబిల్వనంపి కడుసంతస మొప్ప వివాహ కార్యముం
భూనుత వైభవంబెసఁగఁబూని యొనర్పుము తెస్ముభూవరా 1688

— జనకుఁ డయోధ్యకు దూతంబంపుట —

శా. దూతంబంపు మయోధ్యకొక్కని సమర్ధున్ వేగమే తత్పురీ
నేతంబూతచరిత్రునిం దశరథున్ వేతోడి తేరంగ నాఁ
బ్రీతుండై కడుతెన్పునుండి దికృపాబ్ధియుంచు నా వెంట నే
చాతుర్యాధికుదూతఁబంచె జనకక్ష్మానాయకుండొప్పఁగన్ 1689

చ. అపుడు త్వరన్ మహాజనులఁ సందడినింబిలిపింప వారలున్
నృపునకు నమ్రశీర్షులయి నేర్పుననిల్చి యనుజ్ఞ యేమనన్
విపణులు బాటలున్ సకలవేశ్మములున్ సురమందిరంబులున్
నిపుణత నాల్గుతట్ల గవనింబురలక్ష్మి నలంకరింపుఁడీ 1690

తే. అనిన హర్షంబుతో వారలాత్మగృహము
లకుఁజనినవెనక్ రాజసేవకులఁ బిలిచి
జానుగ విచిత్రభంగి వితానములర
చింపుఁడనన్నాజ్ఞ మూళి ధరించి చనిరి 1691

క. ఆసేవకులు చతురగుణు
లైసలిపెడివారిఁ బిలిచియారంభింపం
జేసిరి వితానములవా
రాసరసీ జాననునకు నతిభక్తి మెయిన్ 1692

ఆ. వినతులాచరించి కనకరంభాస్తంభ
ములును మరకతములఁబోలుపెసంగు
పత్రిఫలచయమును బద్మరాగంబులఁ
బుష్పములరచించి పొందుపఱుప 1693

క. ఆచిత్రరచనఁగనుచో
నాచతురాస్యుండుఁగూడ నాశ్చర్యపడుం
దోఁచును వింతగఁ గనులకుఁ
జూచిన నితరులకు ననుట చోద్యముగాదే 1694

ఆ. పచ్చతాళ్ళతోడ వంశదండములు స
పత్రికముగ రమ్య భర్మ కలిత
వర్ణసహిత నాగవల్లీమతల్లులఁ
బోల్పఁబడకయుండఁబొందుపఱచి 1695

క. ఆలతలన్ సుందరతర
లీలంబంధించి యుజ్జ్వలితమగు ముక్తా
మాలికల నడుమ నడుమం
గీలించిరనూన దీప్తికిన్ నెలవులుగన్ 1696

తే. వజ్రమరకత మాణిక్యవరమణులఁ బి
రోజయుఁ జెల్చి చెక్కి సరోజములర
చించి రెంతయుఁ బ్రౌఢి విచిత్రగతుల
ననుపమాన సౌందర్యధుర్యతఁ జెలంగ

తే. గాలివీచిన యంతనే కదలిరాదలు
సలుపుతుమ్మెదలంగూయఁ జాలునట్టి
వివిధవర్ణవిహంగమ వితతిఁ జేసి
రెంతయుం జూచువారికి వింతఁ గొలుప

తే. అతుల దేదీప్యమానమహా నమరవరుల
ప్రతిమలరచించి మంగళద్రవ్యములను
హస్తములఁ బట్టి నిలిచినట్లమరఁ జేసి
స్తంభములమీఁద నిలిపిరందంబుమీఱ

తే. వేదికలు చారు సింధూర వివిధరత్న
కలితములుగ సహజరమ్యగరిమనొప్ప
నతుల సౌరభపల్లవప్రతతి నీల
రత్నములతోడఁ జేసి రచ్రింబుగాఁగ

తే. కనకవల్లులు మరకతకమ్రగుచ్ఛ
ములను నామీఁదవింతగా మురువుగుల్క
పట్టుదారంబులుం గాంతి పరిఢవిల్లఁ
జేసిరెంతయు రచనావిచిత్రమెసఁగ

క. మరుఁడే యొనరించెనన
సురుచిరవర సృక్చయంబు సొంపుదలిర్పం
గవముం జతురతఁ గూర్చిరి
వరమంగళకలశములను బహుళముగాఁగన్

ఆ. ధ్వజపతాకలునును వసనముల్ గుంజెలు
నతిమనోహరముగ నమరఁజేసి
వివిధరత్నదీప వితతి వెలుఁగఁజేసి
రందములకు నిలయమగుచు వెలయ 1703

తే. ఈవిధంబునఁబ్రొఢి నిర్మించినట్టి
సుందర వితానసందోహ సురుచిరప్ర
భాభి వర్ణనమొనరింపనలవియగునె
జలజభవునకునైన వాక్పతికినైన 1704

క. ఏమండపమున సీతా
శ్యామామణిఁబెండ్లిఁజూతుసలిపిరో శోభా
ధామంబది వర్ణింపఁగ
నీమహిమతి చాలునొకో యేకవికైనన్ 1705

ఆ. త్రిభువన ప్రసిద్ధ దేదీప్యమానమహా
భద్రరూప గుణసముద్రుఁడైన
రామచంద్ర విభుఁడు రహిమీఱఁబెండ్లి కు
మారుఁడైన దివ్య మండపంబు 1706

క. జనకునిమందిర మేగతి
ననుపమ శోభాయమానమయ్యెనొ నగరం
బున నెల్లగృహములాగతి
మనోహరతఁదేజరిల్లె మహిత విభూతిన్ 1707

క. ఆరాజధాని నత్తఱి
నేరైనను గాంచఁదోఁచు హీనంబులుగా
నీరేడు లోకములు వి
స్తారంబగు శోభకదియె స్థానంబగుటన్ 1708

క. తక్కిన గృహమునవైసన్
మిక్కిలియగా సంపదలయమేయతఁగనిసం
గ్రిక్కన ముక్కన వ్రేలిడి
యక్కజపడు నిందుఁడైన నతిమోహితుఁడై 1709

క. ఏపురి సుందర నారీ
రూపంబు ధరించి లక్ష్మి రూఢి నెలసెనో
యాపురమది వర్ణింపఁగ
నాపలుకు వెలఁదియు శేషుఁడైన దలంకున్ 1710

-♦ జనకునిదూత యయోధ్యకేగి దశరథుని సందర్శించుట ♦-

ఉ. దూతయయోధ్యఁజేరి కడుఁదోఁపమునైన యనాభిరామమై
పూతమునైన తత్పుర విభూతిఁగనుంగొని హర్షమొందుచుం
భూతల నాథుమేల్నగరి ముందటిద్వారముచెంత కేగి భూ
నేతకు వార్తఁబంప ధరణీపతి లోనికి వానిరమ్మనెన్ 1711

ఆ. లోనికేగి దూత భూనాధునకుఁబ్రణ
మిల్లి లేఖనీయ మేదినీశుఁ
డందికొని పఠించి హర్షాంబు సంభరి
తాక్షుఁడగుచుఁ బులకితాంగుఁడగుచు 1712

క. ఉల్లముఁనిండఁగ నానృప
తల్లజుఁడగు దశథుండు తన హృదయమునం
దల్లరఘురామ లక్ష్మణ
పోల్లసితా కృతులఁజేత నుత్తమ లేఖన్ 1713

క. ధరియించి మంచి చెడ్డల
నొరులకుఁ దెలుపంగఁబోకయురుమానమునం
ధరణీశుఁడుండి కొండొక
తరుణమునకుఁ దెలిసి ధీరతంగని మరలన్ 1714

క. పత్రికఁబఠింప సభ్యులు
గాత్రంబులు పులకరింపఁగా శుభవార్తన్
శ్రోత్రానందంబుగవిని
నేత్రంబులహర్ష బాష్పనిచయంబురలన్ 1715

క. సంతోషించిరి భరతుం
డంతట నటనాడుచుండి యావృత్తాంతం
బంతయు వినివచ్చి మహీ
కాంతుంబ్రశ్నించెనిట్లు కడువినయమునన్ 1716

క. జనకా యీ పత్రిక వ
చ్చినదెచ్చటినుండి కృపవచింపుఁడు క్షేమం
బున మత్ప్రాణ ప్రియులగు
ననుజుఁడు నగ్రజుఁడు నుండిరా దేశంబున్ 1717

క. అనవుడు సస్నేహంబగు
తనయుని ప్రశ్నంబువించు దశరథుఁడాలే
ఖనుజదివె మరలనొకపరి
వినిరనుజుఁడు సతేఁడుఁ బ్రేమవిహ్వాలమతులై 1718

క. తనువులు పులకింపంగా
మనములనాపంగరాని మహితప్రేముం
బునుబొందు నన్నదమ్ములఁ
గని భరతుపవిత్రమైన కడుప్రేమకెడన్ 1719

క. సంతోషించుచు సభ్యుల
నంతసుఖంబనుభవించి రప్పుడుధరణీ
కాంతుండా దూతందన
చెంతంగూర్చుండఁజేసి చెలఁగమృదూక్తుల్ 1720

తే. సోదరా బిడ్డలిర్వురు సుఖముగాఁగ
నున్నవారలె కద నీవు కన్నదోయి
వారికుశలస్థితిం జూచి వచ్చినావె
యనుచుఁ బ్రశ్నించి మఱియు నిట్లనియె విభుఁడు 1721

ఉ. శ్యామలగౌరవర్ణులయి చాపకలంబకధారులై కిశో
రామలకోమలాంగులయి యా కుశికాన్వయజాతుఁడౌ ముని
గ్రామణితోడ నుండుటను గాంచితివే కనుఁగొంటివేని శ్రీ
రామ సుమిత్రపుత్రులపరంగు స్వభావములన్ వచింపుమా 1722

క. అని ప్రేమవివశుఁడగుచుం
బునఃపునఃప్రశ్న చేసి భూవరుఁడు మహా
ముని యేనాఁడు కుమారులఁ
గొనిచనె నేటికిని దెలిసెఁ గుశలంబనుచున్ 1723

క. తెలుపుము విదేహధరణీ
తలనాథుఁడు వారి నేవిధంబున నెఱిఁగెం
గలరూపసఁ బ్రియవచనం
బులవిని యెలనవ్వు దూతమోమునఁ దోఁపన్ 1724

చ. వినుము నృపాలమౌళిమణి విశ్వవిభూషణులై వెలుంగు స
త్తనయుల రామలక్ష్మణుల ధన్యతఁ గన్న భవత్సముల్ జగం
బునఁ గలరే తలంపఁ దవపుత్రులు పృచ్ఛ యొనర్ప యోగ్యులే
మనుజవరేణ్యసింహములు మన్మథకోటిసహస్రసుందరుల్ 1725

ఉ. భూరియశఃప్రతాపములముందు విధుండు కళావిహీనుఁడౌ
సారసమిత్రుఁ డెంతయును జల్లదనంబును బొందు మీ సుతుల్
వారిజసంభవాండములవారిగ వెల్గఁగఁజేయు నుజ్జ్వలా
కారులుగాని కేవలులుగారు తలంప నృపాలచంద్రమా 1726

తే. అట్టివారల గుర్తించి రెట్టులనుచు
నానతిచ్చుచునుంటివో యవనినాథ
కరమునందీపముంబట్టి కాంచవలెనె
పద్మినీబంధుదర్శింపఁ బార్థివేంద్ర 1727

క. సీతా స్వయంవరంబున
కేతెంచుచు నొకనిమించి యింకొకఁడువడిన్
భూతలనాథయు యోధులు
చేతోమోదంబుగదురఁ జేరిరిగుమిగన్ 1728

ఆ. శివశరాసనంబుఁ జేకొనియెవ్వండు
నెత్తఁజాలకుండె నెల్లవీర
భూరిబలులుఁగూడఁ బుయిలోడియోడిరి
త్రిభువనముల వెలయు నృపులలోన 1729

క. అభిమానవంతులై తగు
సుభటుల శక్తులహరించె శూలిధనువుదు
ర్లభమంచు మేరువైనఁ
రభసంబున నెత్తఁజాలు రాక్షసులుసురల్ 1730

క. కూడనోడి వెనుకకుంబోయిరలికాక్షు
పర్వతంబులీలఁ బైకినెత్తి
నట్టిరావణుండు నవమానపడిపోయె
నట్టిసభనువిను మహావనీంద్ర 1731

ఆ. రామచంద్రమూర్తి రఘువంశరత్నంబు
శ్రమయొకింతలేక సామజంబు
కమలనాళమెట్లు కరమునఁగొనితుంచు
నట్లులీల త్రుంచె నభవుధనువు

తే. అదివినుచు నాగ్రహోదగ్రుఁడగుచుఁ బరశు
రాముఁడే తెంచి బహుప్రకారములఁ దనదు
కోపముంజూపి శ్రీరాముగుణబలంబు
నరసినిజశరాసనమిచ్చి యభినుతించి 1733

క. వినయంబున నాజ్ఞంగొని
చనియెన్ వనమునకు రామచంద్రునివలెనే
ఘన బల్యుఁడుం దేజస్వియు
తనయనుజుఁడు లక్ష్మణుండు ధాత్రీనాథా 1734

ఆ. అతనిఁగాంచినంతహర్యక్షవరకిశో
రంబుఁ గన్న కుంజరంబుల గతిఁ
గంపమొందు నెల్లక్ష్మానాథ బృందంబు
లఘుఁడె శౌర్యగరిమలక్ష్మణుండు 1735

తే. తావక కుమారయుగళ సందర్శనంబు
చేసియున్నట్టి యస్మదక్షిద్వయమున
కితరమేమియు రుచియింప దిప్పుడుఁగూడ
దేవయా యిద్దరే యుండిరి దృక్పథమున 1736

తే. అనుడుఁ బ్రేమప్రతాప వీర్యరసభరిత
మైన యాదూత వచనచయంబు మదికిఁ
బ్రియమొనర్పంగ దశరథ నృపవరుండు
సభ్యయుతముగ ననురాగసౌఖ్యమొంది 1737

ఆ. పసదనంబులొసఁగ వసుమతీ నాయక
నీతి కాదటంచు దూత పలికి
శ్రవణయుగము మూయ సద్ధర్మమిది యని
యుత్సహించి రెల్లగుల్లములను 1738

ఉ. అంతట రాజు లేచి వినయమ్మెసఁ బత్రికనయ్యరుంధతీ
కాంతునికిచ్చి యచ్చటికి గారవమొప్పఁగ దూతఁబిల్చి వృ
త్తాంతను సాంతమా విబుధతల్లజుతోడ వచింపవించున
త్యంత సుఖంబునొంది గురుఁడా ధరణీవరుఁగాంచి యిట్లనెన్ 1739

అ. కంధికోరకున్న కల్లోలినీ జాల
మరిగియందుఁగలియునట్లు సుఖ స
మృద్ధిఁజెందెధరణి మిక్కిలి పుణ్యులౌ
పురుషవరుల కొఱకు ముదముమీఱ 1740

ఆ. అట్లె పిలువకున్న నైశ్వర్య సుఖములు
వచ్చిచేరు ధర్మపరుల కడకు
సహజముగనె నీవు బ్రహ్మసుర గురు ధేను
దేవ సేవనలుపు ధీరమతివి 1741

క. నీవలెనే కౌసల్యా
దేవియును బునీతచరిత త్రిభువనములలో
నీవంటి పుణ్యపురుషుఁడు
భావిని ప్రస్తుతము లేఁడు పావనశీలా 1742

తే. రామచంద్రునివంటి పుత్రకుని గనిన
వాఁడు నీకంటెఁబుణ్యుఁ డెవ్వాఁడుగలఁడు
వీరులు వినీతులును ధర్మవృత్తిధరులు
గుణసముద్రులు నీదు నల్గురు సుతులును 1743

తే. నీకుఁగల్యాణమగుఁజుమ్మెనిరతమును న
రేంద్రపెండ్లికి సన్నాహమిఁక నొనర్చు
మఖల శుభవాద్యచయము మ్రోయఁగఁజేయఁ
బనుపు మేగుము త్వరగనీవనఁగ నృపుఁడు 1744

క. వించుం గురుపలుకులఁ దల
వంచి నమస్కృతి యొనర్చి పరితోషము పెన్
మించుచు ముంచిడి స్వామీ
యంచుం దూత వసియింప నర్హ సపర్యల్ 1745

క. కావింపఁ జేసి యోగం
భూవిభుఁడుం దనదు భవనమును జేరంగం
దేవీత్రితయము వినంగం
గావించెం జనక పత్రికా పఠనంబున్ 1746

క. వినియుండఱు సంతోషం
బును బొందిరి రాజు సర్వమును వినిపించెం
దనయుల వృత్తాంతముఁ దా
మును దూత వచింప విన్న పోలిక నెలమిన్ 1747

క. జలదస్వనంబు వినిమది
నలరు మయూరికలనంగ నారాణులు ని
ర్మల రాగ ప్రఫుల్లితలై
చెలఁగిరి గురుసతులు ముదిత చిత్తంబులతోన్ 1748

క. ఆశీర్వాదము లొసఁగఁగ
నాశీతలవాణి వినుచు నానందపయో
రాశి నిమగ్నతఁ దల్లులు
నాశోభాకరము ప్రియమునగు శుభ లేఖన్ 1749

ఆ. ఒకరిచేతినుండి యొకరందికొని దాని
నెడఁదలందు నదిమి హృదయములను
జల్లచేసికొనిరి క్ష్మాపతి రామల
[illegible]లకీర్తిఁ బెక్కుపొగ్లుపొగడి 1750

తే. మునిప్రసాదంబు దీనికిమూలమనుచు
రాజరిగినంత రాణులు బ్రాహ్మణులను
బిలిచి దానంబులొసఁగిరి ప్రియముతోడ
విప్రులేగిరి దీవించి వేడ్కమీఱ 1751

ఆ. కోట్లకొలఁదివారు కోరినవస్తువుల్
యాచకులనుబిలిచి యతిముదమున
నొసఁగవారలంది యుర్వీశసుతచతు
ష్టయము బ్రదుకుఁగాక చల్లగాను 1752

క. అనిపలుకుచు నానావ
స్త్రనిచయముందాల్చి చనిరి సంతోషమునం
ఘనముగ వెలసెను వాద్య
స్వనములు నింటింట నుత్సవంబులు సెలఁగెన్ 1753

ఉ. శ్రీరఘురామచంద్రునకు సీతకుఁ బెండిలియంచు వేడ్క వి
స్తారముగాఁ జతుర్దశలసద్భువనంబులనిండ నెల్లరుం
దీరుగ వీధిమార్గములుదిద్ది గృహంబులలంకరించిర
వ్వారిగ నట్టిశోభనపువార్తనువించుఁ బ్రమోదచిత్తులై 1754

ఉ. ఉందునయోధ్య నిత్యనయనోత్సవదాయకమౌచు రామచం
ద్రుండువసించుప్రోలగుట రూఢిగ సంతతమంగళాకరా
ఖండపవిత్రమై యిపుడు కాంక్షనలంకృతిచేసిరెల్లరున్
మెండుగఁ గానఁదత్పురియమేయ శుభాకృతినెన్నశక్యమే 1755

తే. ధ్వజపతాకాభిరామమై వస్త్రరుచిర
చామరోపేతమై రమాసదనమగుచుఁ
బురము వెలుఁగొందు విపణులబ్బురముఁగొలుపఁ
జిత్రముగనొప్పె నప్పురిఁజెప్పఁదరమె 1756

ఆ. కనకకలశములును గమ్రతోరణములు
మణులజాలరులును మంచిపసపు
దర్భలరుసరులు దధియునక్షతలు న
మర్పఁబడియె మిగులనేర్పుమీఱ 1757

క. మంగళమయములుగాఁ దమ
ముంగిళ్లను గేహములను మోదమునజనుల్
సింగారించిరి చిలికిరి
ప్రాంగణముల వేదికలను బరిమళజలముల్ 1758

చ. శశివదనల్ విభీతమృగశాబకనేత్రలు విద్యుదుల్లస
త్కృశతనుమధ్యలుఁ రతిని గేరడమాడెడిసొంపువారు షో
డశవిధమైచెలంగెడి బెడంగగుచెల్వుధరించి గుంపులై
భృశముగ మంగళంబులను వేడుక నెల్లెడఁ బాడిరింపుగన్ 1759

క. సలలితకలస్వనంబులఁ
గలకంఠముగూడ లజ్జఁగనువినిధరణీ
తలపతి భవనము నెన్నఁగ
నలవియె తగువిశ్వమోహ్యమగుమండపముల్ 1760

[illegible]చటమనోహర నానా
చుర సుమంగళపదార్థరాజి చెలఁగు వా
ద్యచయంబు మ్రోసెఁ బెల్లుగ
వచియించిరి బిరుదములను వందిజనంబుల్ 1761

వేదధ్వనులొక్కయెడం
భూదివిజులొనర్చుచుండఁ బొలఁతులుఁగడు నా
హ్లాదమున మేదినీసుత
మీఁదఁ శ్రీరాముమీఁద మించినవేడ్కన్ 1762

ఆంధ్ర తులసీరామాయణము.

అమృతసాగరము

ఆపన్నివారకము.

అఖండ విజయప్రదము.

ఆయురారోగ్యదాయకము.

సత్ఫల సౌభాగ్యకరము.

సంపద్బల వర్ధకము,

సర్వసౌఖ్యసంధాయకము.

సకలార్థ సిద్ధిదము.

అజ్ఞానముతో పుట్టి

అజ్ఞానముతో పెరిగి

అజ్ఞానముతో చచ్చుట

ఉత్తమ మానవలక్షణముకాదు.

ఆ. పాలునవ్వుపడినును మ్పైఁబదంబులమోపు
కరణి ధరణిమీఁదఁగాళ్ళు మోపి
చనును వర్ణనంబు సలుపంగ శక్యమే
గాలిఁదెగడి మొగురఁగాఁదలంచు 1769

క. ఆయశ్వంబులమీఁదం
బ్రాియంబున భరతుఁబోలుప్రిన్న నిభరణీ
నాయకపుత్రకులతిరము
ణీయనిషంగ శరచాపనికరధరులునై 1770

క. ఆరూఢులైరి భూమణ
వారంబు ధరించియట్టి వారెల్ల మహా
వీరులుఁ దేజస్వులు నతి
భూరిపరాక్రిములు వారిఁబొగడందరమే 1771

తే. నవయువకులతి చతురులు మిపులలాఘ
వంబు గలవారిలోఁబ్రీతివాని వెంట
ఖడ్గ విద్యాప్రివీణులౌ కడిఁదియోధు
లిర్వురేసి చెలంగి రహీన బలులు 1772

తే. గాఢ సంగ్రామమునఁ బరాక్రమము నూప
బిరుదులు వహించి నగరంబు వెడలివచ్చి
నిలిచియుండిరి హయముఁబలువిధములఁ
నడప వాద్యధ్వనులవిని కడునలరుచు 1773

క. సారథులు రథంబుల శృం
గారించిరి ధ్వజపతాక ఘనమణి భూషా
వారంబునఁ జామరముల
నారూఢిగఁగింకిణీ రవాన్వితములుగన్ 1774

క. ఆరథములు నిజశోభా
స్ఫారంబున నపహసించు సవితృరథము వి
స్తారముగ శ్యామకర్ణ మ
హారథ్యములమరు నచట నగణితములుగన్ 1775

క. సారథులా హరులనలం
కారముగావించి తెచ్చి కడురమ్యములౌ
తేరులకుఁబూన్చిరెంతయుఁ
గోరిక మోహింతురె? మునులుగూడఁగనిన చోన్ 1776

అ. జలము మీఁదగూడ స్థలముమీఁదంబలె
నడువఁగలవు మిగుల వడిగఁబాఱు
కతనమునఁగఁ బోవు కాలిడెక్కలు తురం
గములు వేగమునను గాలిఁదెగడు 1777

ఆ. అస్త్రశస్త్ర సాధనావళినెల్ల నాయత్తపఱచి
రథికసత్త్వములను
సూతులెల్లఁబిలువ నేతెంచివారు ర
థాధిరూఢులైన యవసరమున 1778

తే. పెండ్లికేగెడివారలు బండ్లమీఁద
రథగజహయాది వాహనరాజిమీఁదఁ
బురము వెలువడియేతెంచి మూఁగిరప్పు
డెల్లరికి శుభశకునంబులెసఁగఁదోఁచె 1779

తే. కలితకరివరములమీఁదఁ గడుమనోజ్ఞ
మైన పల్యాణములమర్చి యందమలరఁ
గానలంకృతిచేసిరి వానిశోభ
వర్ణనముసేయ నెవరికి వశముగాదు 1780

క. మదగజయూథంబప్పుడు
కదలెం ఘంటలు ధ్వనింపఁగా శ్రావణనీ
రదసంఘంబో యనఁగా
మదికబ్బురముం ఘటింప మందగతిం దగన్ 1781

తే. బహువిధంబగు వాహనప్రతతిమీఁద
సుందరాందోళికలమీఁద సుఖముగాఁగఁ
గూరుచుండి చనుచునుండ్రి క్షోణిసురులు
దనువులొందినశ్రుతులు ఛందములువోలె 1782

తే. వందిమాగధసూతులు వారివారి
కర్హమగు వాహనములపై నరుగుచుండి
రొంటెలును వేసడంబులును సువృషభము
లరిగె నానాపదార్థచయము భరించి 1783

తే. వర్ణనము సేయఁగారాని వస్తువితతిఁ
గోట్లకొలఁదిగఁ గావళ్లఁ గూర్చిపూని
కాపులెల్లరుఁ జనిరి చక్కఁగఁ దమతమ
సంఘములఁగూడి సేవకసమితి యరిగె 1784

తే. రామలక్ష్మణకలిత వీరద్వయంబు
నెపుడు కన్నులనిండ దర్శింతుమనుచు
హర్షనిర్భరహృదయులై యంగములను
బులకలేపార నెల్లరుఁ బోవుచుండ్రి 1785

క. కరిఘీంకారధ్వనులును
నుతతరఘంటాస్వనములు నున్నతరథనే
మిరవంబులు నలుగడలం
హరిహేషాధ్వనులు వాద్యహర్షరవంబుల్ 1786

ఆ. చెలఁగెనొక్క మొగిని చెవులుసిందరఁజెంద
నవనినాథు ద్వారమందుఁబెద్ద
మూకయొప్పె పాదములఁద్రొక్కఁబడుచుఁ బా
షాణమైనరజము సలుపఁబడియె 1787

ఉ. మేడలమీఁదనుండి రహిమీఱఁగఁ బల్లెరముల్ కరంబులం
జేడియలెల్లఁబట్టి విలసింపఁగ హారతులిచ్చుచుంగడుం
వేడుకతోడఁజూచుచును బెక్కువిధంబుల రమ్యగీతముల్
వాడిరి వర్ణనంబుసలుపంగ నశక్యముహర్షమత్తతన్ 1788

తే. రెండురథములపుడు సుమంత్రుండుసిద్ధ
మొనరుపంజేసి పూన్పించెనుత్తమాశ్వ
ములనువానికి రవిరథ్యములును సాటి
కానఁగనొప్పు సౌందర్యగమనవిధుల 1789

క. ఆరథముల రెండింటిని
భూరమణుసమీపమునను బొలుపుగనిలిపెం
శారదయును వర్ణింపఁగ
నేరదు తద్రథయుగంపునిస్తులశోభం 1790

తే. అందొకరథంబు రాజసంహతులఁదనరు
రెండవదియుఁ దేజఃపుంజమ్ముదులభాస
మానమైయొప్పు రుచిరసంపదఁజెలంగు
దానినెక్కంగఁజేసె భూజానిగురుని 1791

తే. శాంకరీశంకరుల గణేశగురువరుల
స్వాంతమందునస్మరియించి సంతసించి
దశరథమహీధవుండు రథంబునెక్కి
గురునిసరసనె తానునుగూచుండె 1792

తే. అప్సరస్థసమేతుఁడై సహస్రపతి
సురగురుసమేతుఁడైన నిర్జరపతియున
శోభితుండౌచు రథమునఁజూడనొప్పి
వేదవిధిఁగులపద్ధతి వెలయనపుడు 1793

తే. సర్వసంపూర్ణసన్నాహ సంస్థితిఁగని
రాజచంద్రుండుమదిని శ్రీరాముఁదలఁచి
గురునియానతిఁగైకొని కుతుకమునను
గడఁగి శంఖంబుఁబూరించి కదలెనంత 1794

మ. సుమనోవ్రాతము పెండ్లికేగెడిజనస్తోమంబువీక్షించి పొం
దెమదిన్ హర్షము మంగళప్రదమహాదివ్యాగసంభూతమౌ
సుమనోవ్రాతమువృష్టిగాఁగురిసె సస్తోకంబుగాఁక్షింకృతుల్
సమదేభంబులొనర్చె నశ్వములు హేషల్ సల్పెనత్యంతమున్ 1795

ఆ. వ్యోమమందుమ్రోసె నాగవివాహోత్సవ
యానవాద్యవితతి యధికమగుచు
సురతరంబుగాఁగ నొప్పెఁగోలాహలం
బమరమనుజనాగ యక్షముఖులు 1796

క. మంగళతూర్యరవంబులు
సంగీతధ్వనులు మిగులసంతోషముతో
డంగావించిరి ఘంటా
భంగస్వనముల్ గణించి పలుకందరమే 1797

తే. కేతన పటంబులెగురఁగా గేలఁదాల్చు
సేవకావళి నడువ నంచిత మనోజ్ఞ
గానకుశలులఁబరిహాసక ప్రవీణు
లగు విదూషకులు వినోద మాచరింప 1798

తే. మర్దళధ్వని కనువుగా మనుజవరకు
మారులాడించి రక్ష సమాజమును గ
నంగఁ జాతుర్యథుర్యలౌ నటులుఁగూడఁ
జకితులై చూచుచుండ నాసమయమునను 1799

ఆ. ఆవివాహ యాన మభివర్ణనము సేయ
శక్యమగునె సకల శకునములును
శుభకరంబులగుచుఁజూపట్టె నీలకం
ఠంబు మేతఁగొనియె డాపలిదెస 1800

క. దక్షిణదిక్కునఁ గాకము
సుక్షేత్రంబునను దోఁచె సుభగనకులమున్
వీక్షించిరెల్ల వారలు
సక్షీణ సుగంధ శీతలానిల మొలసెన్ 1801

సీ. నిండుకడవల శిరములనిలిపికొనుచు
శిశువులం జంకనిడికొని చెలువలెదురు
పడిరి బహువారములు గానఁబడియె గుంట
నక్క పాల్గ్రావు లేగతో నొక్కసురభి 1802

క. ఎదురుగఁగనఁబడె నిబ్బుల
కదుపులు దక్షిణపుదిక్కుగాఁజనుచుండెన్
సదమల మంగళ గణసం
పద లెల్లను వేడ్కఁగానఁబఱచెనో యనఁగన్ 18

తే. కలితకల్యాణకరముగా గ్రద్ద కూసె
వామ పార్శ్వంబునందును వరముమీఁద
మంజులంబుగఁదోఁచె శ్యామా విహంగ
మొసఁగ దధికుంభ మీనంబు లెదురుపడియె

తే. భూసురోత్తము లిడ్వాను పుస్తకముల
హస్తములఁబూనియే తెంచి రభిముఖముగ
నభిమతార్థ ఫలప్రదంబగుచు సకల
మంగళాకర కల్యాణమయము లగుచు 1805

తే. సత్యమగుటకు నొక్కట సర్వశకున
ములును జూపట్టె నెవ్వని బుత్త్రుఁడయ్యె
సగుణుఁడౌ బ్రహ్మమతనికై సకల మంగ
ళప్రదంబగు శకునముల్ గలిగెనపుడు 1806

తే. పెండ్లి కొమరుండు రాముండు విశ్వజనని
సీత పెండిలికూతురు పూతచరితు
లైన దశరథజనక మహావనిపులు
వియ్యమందంగ శుభములు వెలితియగునె 1807

తే. అట్టి పెండిలి వినుచు నాట్యంబుసేసె
సకల శుభశకునంబులుత్సాహమొంది
సత్యముగ మమ్ముల విరించి సలిపెననుచుఁ
బలుకుచుం బెండ్లివారలీ పగిదినపుడు 1808

క. హయ గజవాద్యరవంబులు
వియత్తలము ముట్ట దిశలు వ్రీలఁగఁ జేయం
బయనంబున్ సాగించిరి
ప్రియమున శ్రీరాముఁజూడ వేడుక పడుచున్ 1809

తే. భానుకుల మణి దశరథ పార్థివేంద్రుఁ
డరుగుదెంచుటవిని జనకావనీశుఁ
డుకు నదులమీఁద సేతువు లొప్పఁగట్టఁ
జేసి మార్గమధ్యంబున సీమలందు 1810

తే. విశ్రమింపంగ రమణీయ విపుల సుపరి
దేశముల సురనగర విస్తృత విభవము
మీఱు సంపద తోడ నిర్మింపఁజేసె
నెవరి మనమున కెయ్యది యిష్టమగునొ 1811

తే. అవిధంబున శయ్యాసనాంబరాశ
నాది మహువిధ భోగంబు లనుభవించి
పెండ్లి వారలు మఱచిరి యిండ్లఁగూడ
నిత్య నూతన సౌఖ్యముల్ నిండియుంట 1812

-• జనకుని పరివారజనులు పెండ్లివారినెదుర్కొనుట •-

తే. వాద్యముల మ్రోతవిని పెండ్లివారు వచ్చు
చుండుట నెఱింగి రథగజ సుభట తురగ
యూథముల్ సిద్ధ మొనరించి యొక్క మొగిని
స్వాగతంబీయ నేగిరి జనకు జనులు 1813

తే. కనకకలశంబులను నతికమ్రమైన
పళ్లెరంబుల బహువిధపాత్రములను
నించిరి సుధాసమానమైమించునట్టి
వంటకంబులవర్ణింప వశమెవాని 1814

తే. పలురకంబులఫలములుఁ గలితవస్తు
తతియుభూషణరాజి వస్త్రములు మణులు
యానసాధనములును మృగాండజములు
హయగజములంగపె జనకుండుహర్ష మొంది 1815

తే. శుభశకునసూచకములయి సొంపుగులుకు
శారభద్రివ్యములఁబంపె జనకవిభుఁడు
దధియునటుకులు నుపహారతతియపార
ముగను గానఁగొంచుఁ గాపులునడచఁగ 1816

తే. ఈగతి సమస్తవస్తువు లెలమిఁగొనుచు
స్వాగతంబీయ నేగు జనులఁగాంచి
పృథుతరానంద మొందిరి పెండ్లివారు
గాత్రములుపులకింపఁ దత్క్షణము నందు 1817

తే. సర్వసన్నాహులగుచును స్వాగతంబొ
సంగనేతెంచియున్నట్టి జనులఁజూచి
సకలవాద్యరవంబులు సదలునిండ
సలిపిరా పెండ్లివారలు సంతసమున 1818

ఉ. అంతఁబగస్వరంబుఁగలియందగనిల్చిరి పంక్తిపంక్తులై
సంతసమొంది హర్షరససాగరయుగ్మము మీరమీఱుచున్
వింతగనొక్కచోఁ గలియ వేపఱతెంచినరీతిగా మఱి
కాంతలు పువ్వులంగురిసి గానముసేసిరి మోహనంబుగన్ 1819

క. దేవతలెలమిం దుందుభి
నానంబులు సలిపిరపుడు రాజునకెదుటన్
యానద్వస్తువులుంచుచుఁ
గావించిరిజనులు ప్రియముగా వినయంబున్ 1820

ఆ. ప్రేమపూర్వకముగ భూమీశుఁడవియంది
యాచకులకుమిగుల నాదరమున
బహుమతులనొసంగె బహుపూజనంబులు
మాన్యతలనుజరపి మహితవిధిని 1821

ఆ. జనకరాజజనులు సత్కారములొనర్చి
దశరథావనీందుద్రి దళము నెల్లఁ
గడుముదంబుతోడ విడిదిలోనికిఁ దోడు
కొనుచుఁజనిరి విభవమనుపమముగ 1822

ఆ. చిత్రవస్త్రములను జెలువొప్పఁ బాదముల్
వైచుకొఱకు నచటఁ బఱచియుండ్రి
విలువమీఱువానిఁ దిలకించినంత నే
ధనదుఁడైన ధనమదంబు విడుచు 1823

క. అందఱకు నన్నివిధముల
బొందగుసౌఖ్యములనిచ్చు పొలుపైనస్థలం
బందు జనవాసమొసఁగిరి
బృందారకభవనవిభవ విస్తృతిమీఱన్ 1824

చ. ధరణిజపెండ్లివారలు ముదంబునవచ్చుటెఱింగి స్వీయమహా
నురుమహిమంబు వెల్లడిగ నుల్లమునందు సమస్తసిద్ధులన్
స్మరణమొనర్చి పంక్తిరథపత్పృథివీశు సపర్యసేయఁగాఁ
బురికొలిపెందదాజ్ఞఁ దలఁబూనుచు వెంట నెసిద్ధులన్నియున్ 1825

ఆ. సకలసంపదలును సౌఖ్యముల్ నిర్జరా
వాసభోగవర విలాసములును
గాంచువేగఁజనియెఁ గుతుకంబుతో జనా
వాసమునకు వైభవంబుమీఱ 1826

ఆ. పెండ్లివారుమిగుల వేడుకఁదమతమ
వాసములను సురలవలె సమస్త
సుఖములమరియుంటఁజూచి రహస్యంబు
నెఱుఁగలేక జనకు నెన్నుచుండ్రి 1827

క. సీతామహిమను రఘుపతి
చేతంబున నెఱిఁగి సంతసించెం జనకుం
డాతత్రి వచ్చెననుచువిని
భ్రాతయుఁ దానును బ్రమోదభరితహృదయులై 1828

### — రామలక్ష్మణులు దశరథ వసిష్ఠాదుల సందర్శించుట —

క. పితృదర్శనలాలసులై
యతిసంకోచమున గురునినడుగకయున్నన్
మతిఁ దద్వినయమునారసి
యతిపతియా గాధిసూనుఁడానందమునన్ 1829

తే. కౌఁగిటంజేర్చి రామలక్ష్మణులఁబ్రీతిఁ
బులకితాంగుండు నశ్రుసంపూరితాక్షుఁ
డగుచు వారలఁదోడ్కొని యరిగె దశర
థుని కడకుఁ దృషితుఁడు మడుపును గనుగతి 1830

ఉ. నందనయుక్తుఁడౌచు మునినాథుఁడు వచ్చుటఁ గాంచుచున్ మహా
నందరసాబ్ధి వీచుల మనంబు ఘనంబుఁ దేలియాడఁగాఁ
బొందుగ సౌఖ్య వారినిధి మున్గుచు లేచి మహీతలేశ సం
క్రందనుఁడైన పంక్తిరథరాజు చనెం ద్వరగా నెదుర్కొనన్ 1831

తే. పూజ్యుఁడైన విశ్వామిత్రమునికి దండ
వత్ప్రణామంబు సేసి భూవరుఁడు సారె
సారె కాతని పాదరజంబు శిరము
నందు ధరియించుచుండు నానందమునను 1832

క. కౌశికుఁడు కౌఁగలించుచు
నాశీర్వాదంబు సేసి యాదశరథ భూ
మీశుం గుశలంబడుగఁగ
దాశరథులు హర్షమెసఁగఁ దండ్రికి వేగన్ 1833

ఆ. వసుధ సాగి దండవత్ప్రణామము సల్ప
నవనినాథుఁడప్పుడాత్మలోన
నాపరాని సుఖమునందుచుఁ దనయుల
ముదముమీఱ వక్షమునను వదిమి 1834

తే. వితత దుస్సహదుఃఖ సంవేగుఁడగుచు
మృతిని గని పడియున్నట్టి మేనియందుఁ
బ్రాణవాయువు సేరినపగిది దశర
థావనీశ్వరుఁడానంద మనుభవించె 1835

ఆ. అంత రామచంద్రుఁడనుజుండుఁదానును
నవ్వశిష్ఠముని పదాంబుజముల
కధిక భక్తి నుత్తమాంగముల్ సోకంగ
మ్రొక్కెఁబ్రేమమీఱ మునియు వారి 1836

క. సంతోషంబున నిజ దో
రంతగ్భాగమునఁ జేర్చె నాభ్రాతృయుగం
బంతట విప్రశ్రేణికి
నెంతయుఁబ్రణమిల్లి పొందిరిష్టాశీస్సుల్ 1837

తే. భరత శత్రుఘ్నులున్ రామభద్రుచరణ
వారిజములకు నెఱఁగిన వారినెత్తి
రామచంద్రుండు సత్యానురాగరసము
పొంగు వారంగఁ గౌఁగిటఁబొదివి యదిమె 1838

క. అరుసంబున లక్ష్మణుఁడుం
భరతుని శత్రుఘ్నుఁజూచి పరిపూర్ణప్రే
మరసంబు వెల్లివిరియుచు
శరీరమున నిండ వారి సంగతిఁజేసెన్ 1839

క. పురజనులం గులజనులం
బరిజనులన్ యాచకులను మంత్రులఁజెలులం
బరమకృపాళుండగుప్రభుఁ
డరసె యథావిధిని వినయమచ్చు పడంగన్ 1840

ఆ. రామచంద్రుఁ గాంచి రహిఁ బెండ్లి వారలుఁ
జల్లఁబడిరి యెన్న శక్యమగునె
వారిప్రీతి భూమి వరు చెంతఁ బురుషార్థ
ములో యనంగఁ జెలఁగి పుత్రులుండ్రి 1841

చ. తనయ సమేతుఁడౌ దశరథప్రభుఁ గాంచి పురీనరాళియున్
వనితలు హర్షమొందిరి సుపర్వులు సౌరభపుష్ప వృష్టి యిం
పునఁ గురియించి వాద్యములు మ్రోయఁగ జేయ మరున్నటీమణుల్
ఘనముగ నృత్యముల్ సలిపి గానము సేసిరి మోహనంబుగన్ 1842

సీ. ఎదురేగి స్వాగతంబిచ్చి తోడ్కొని వచ్చి
పెండ్లివారిని విడిదిండ్లఁ జేర్చి
నట్టిశతానందుఁడవనీ సురులు మంత్రి
గణమును సూతమాగధ విదూష
కులు వంది జనులును క్షోణీశ్వరుని చేతఁ
బెండ్లి వారల చేతఁ బెక్కువిధుల
పర్హసన్మానంబులంది యాజ్ఞం గొని
మరలిరి తమతమ మందిరముల

తే. కెలమిఁ బెండ్లిలగ్నమునకుఁ దొలుతఁ బెండ్లి
వారలే తెంచియుంట చేఁబట్టణమున
నధికమయ్యెఁ బ్రమోదమట్లఖిలజనులు
ననుపమగు బ్రహ్మానందమనుభవించి 1843

తే. మిగులదీర్ఘంబులుగ రాత్రిఁ బగలుఁ గూడ
సలుపుమని విధి వేఁడఁగా నాగినట్లు
డట్టి సంతోషసౌఖ్యంబు లనవరతము
నమరియుండఁగఁ దమమది నభిలషించి 1844

క. పురినెల్లెడలం బురుషులుఁ
దరుణులు గుంపులుగఁగూడి దశరథజనకుల్
గురుతర సుకృతంబునకుం
బరమావధులనుచు రామభద్రావనిజల్ 1845

శా. శోభాసీమలటంచు నెంచి జనకక్షోణీశుపుణ్యంబు సీ
తాభామామణిరూపముంగనె నయోధ్యానాథుపుణ్యంబు భ
క్తాభీష్టప్రదరామరూపమునఁ జెల్వొందెన్ శివానాథు ము
న్నే భూపాలురుఁబూజచేసి ఫలితంబీరీతిగాఁబొందిరే 1846

ఆ. ఈప్రపంచమందు నీయిద్దఱకుసాటి
మూఁడుకాలములను గూడలేరు
పుణ్యరాశులమయి పుట్టితిమీవిదే
హావనీశు నగరమందుమనము 1847

క, సీతారాముల సౌంద
ర్యాతిశయముఁగన్నులార నరసినపుణ్యుల్
మాతో సరియగు వారలు
భూతలమున నెవ్వరనుచుఁబొంగుచు మఱియున్ 1848

క. కనులు గలఫలమునొందెద
మినకులపతి రాముపెండ్లి నీక్షింతుము మా
కెనయింకెవ్వరనిరి పుర
వనితలుఁబురుషులును హర్ష వార్ధి మునుఁగుచున్ 1849

ఆ. ఓసునయన మనకు నొక లాభ మొదవు నీ
పెండ్లిఁ జూడ ననుచుఁబికరవమునఁ
బలుకు కలుకులెల్లఁ బులకితాంగంబులే
ర్పడఁబరస్పరంబుఁబలికికొనిరి

క. అది యేమన భాగ్యంబున
సదయుండై బ్రహ్మ రామచంద్రుఁడదనుజ్ఞ
ముదితా యతిథులఁజేసెం
గద మనకన్నులకునెంత ఘన పుణ్యులమో 1851

తే. ప్రేమమున సారె సారెకుఁ బిలుచుచుండు
జనకుఁడాత్మ జనా మెనఁగాని చనఁగఁ
గోటి మన్మథకమనీయ కోమలులగు
నన్నదమ్ములు మాటికినరుగుదెంత్రు 1852

తే. వివిధములుగాఁగ నాతిథ్య విధులు జరుపఁ
బడును వారికినిచ్చటఁబరమమైన
ప్రేమ జనియింపఁజేయరే హృదిని నిట్టి
యత్తవారెవ్వరికిని నియ్యవనియందు 1853

క. ఎప్పుడెప్పుడు రామలక్ష్మణు
లపరిమిత ప్రేమ నిచటికరుదెంచెదరో
యప్పుడప్పుడు వారిఁగాంచుచు
నపారమగు సుఖముఁబౌరులందుదురుగదా 1954

ఆ. సకియ రాజునొద్ద శ్యామల గౌరవ
ర్ణాతి చారుగాత్రులైన పుత్రు
లిరువురుండిరుండ దేమాత్ర భేదంబుఁ
దలఁప రామలక్ష్మణులె యనంగ 1855

తే. చూచివచ్చిన వారలా సుందరాంగ
శోభితులఁగూర్చి చెప్పిరో సుదతి యనుచు
నొక్క చెలిపల్క నొండొక యుత్పలాక్షి
నేఁడె తిలకించి వచ్చితి నేను వారి 1856

చ. భరతుఁడు రాముఁబోలు చెలువంబుగలాఁడతనిన్ హుటాహుటిం
దనుజులుఁ బూరుషుల్ గనిసఁదప్పక రామునిఁగాఁదలంతురా
సరసిజ సంభవుండతనిఁజక్కఁగ నాత్మ కరద్వయంబుచేఁ
గరమొనరించెనో యన జగత్ప్రియమోహనుఁడై విరాజిలున్ 1857

శా. శత్రుఘ్నుండును లక్ష్మణుండునొకటే చందంబువారౌటఁద
ద్గాత్రంబున్ నఖమాదిగా శిరముదాకంజూడఁగాఁదోఁచెడిం
జిత్రంబై మదికిం బ్రశంసలుపంజెప్పంగ శక్యంబె సౌ
మిత్రిద్వంద్వముఁ బోలువారలిక లేమియున్ మూఁడులోకంబులన్

మ. తులసీదాసు వచించెం బండితమహాత్ముల్ సత్కవుల్ వారితోఁ
దులయంచున్ వచియింప నెవ్వఁడును నెందున్ సర్వలోకంబులం
గలఁడేయందురటంచు శీలబలధీనమ్రప్రభా సాగరుల్
విలస చ్ఛోభనమూర్తులానలువురున్ వేదాంత సంచారకుల్ 1859

చ. పురతరళాక్షులెల్లముదముంగని యాత్మ పటాంచలంబులం
గరమును విప్పఁగాఁబఱచి కంజసముద్భవు వేడిరిట్టులీ
పురముననే నృపాలవరపుత్రచతుష్టయమున్ మహోన్నతిం
బరిణయమొంద శోభనపుఁబాటలఁబాడుదు మట్లొనర్పవే 1960

చ. అనుచుఁబరస్పరంబు వనజాక్షులు పల్కిరి మేనఁబుల్కలుం
గనులను హర్షబాష్పములు గ్రమ్మఁగనోసఖి చంద్రహాళియే
పొనరుచు సర్వమున్ మిగులఁబుణ్యపయోధులయోధ్యనాథుఁడుం
జనకుఁడుఁగాననింక మదిసందియమొందఁగనేలనే చెలీ 1861

క. అనితమ మనోరథంబుల
కనువుగఁబల్కుచును బొంగిరానంద రసం
బనివార్యంబుగ మనముల
ఘనమై నిండంగ మత్తకాశినులంతన్ 1862

క. సీతాస్వయంవరంబున
కేతెంచినవారు దశరథేశ్వరసుతులం
బ్రీతిఁగనుంగొని మనముల
నాతతసుఖమొంది రనుపమానందమునన్ 1863

క. రాముని యుజ్జ్వల యశముం
భూమీపతులెన్నికొనుచుఁ బోయి రెలమితో
ధామముల కరిగె దివసము
లీమాడ్కింగొన్ని పౌరులింతులుఁ బురుషుల్ 1864

-• సీతాకల్యాణమహోత్సవము •-

తే. పెండ్లివారలు నానంద వివశులగుచు
నుండ శుభలగ్నమేతెంచె నుహమనోజ్ఞ
మార్గశిరమాసమునను హేమంత ఋతువు
నందు తిథివారతారలు ననుపుపడఁగ 1865

తే. యోగకరణంబులును గడునొప్పియుండ
నమరు మంగళ లగ్నంబు నజుఁడు శోధ
నంబొనర్చి నాపత్రిక నారదుండు
తెచ్చెజనకుని గణకులు దీక్షతోడ 1866

తే. దానిగణియించి చూచిరి తత్క్షణంబ
యెల్లవారలు సర్వార్త నెలమి వినుచుఁ
బలికిరవనీసుతారామభద్ర పరిణ
యమునకు విధాత జోతిష్కుఁడయ్యెననుచు 1867

తే. పాఱులు విదేహరాజుతోఁబలికిరపుడు
శుభశకునముల గమనించి సురభి ధూళి
వేళ మంచిది సుమ్మెల్ల విధములను స
మస్త మంగళమూల మో మనుజనాథ 1868

క. అనుటయుఁబురోహితులఁగని
జనకుఁడు వచియించె నింక జాగొనరింపం
గను కారణమేమని యా
తని నుడివిని వెంటనే శతానందుండున్ 1869

తే. మంత్రులంబిల్చి చెప్ప సమస్త వస్తు
వితతియును శుభకరముగ వేగసిద్ధ
మొనరుపంజేసిరంతట నురుతరముగ
శంఖపణవాది వాద్య విసరము మొరసె 1870

క. మంగళ కలశంబులు శుభ
సంగత శకునములుఁ బొసఁగ సవరింపఁబడెన్
శృంగారవతులు నతిశుభ
గాంగ సుమంగళులు వాడిరానందమునన్ 1871

ఆ. అతిపునీతులైన యవనీ సురోత్తముల్
వేదరవముసేయ నాదరమున
దశరథావనీశు దర్శించి తోడ్తేరఁ
గదలి రెల్లవారుఁగడు ముదమున 1872

ఆ. అట్టు లరిగి జనకుఁడా జనావాసంబు
నందుఁ గాంచెఁ గోసలాధినాథు
సంఘమెల్ల నతఁడు స్వర్విభు వైభవం
బంతియనుచుఁదలఁచె నాత్మయందు 1873

తే. అయ్యె సమయంబు విచ్చేయుఁడనఁగ నొకట
మ్రోసె వాద్యంబు లన్నియుఁ గోసలేశుఁ
డడిగి గురువరు నైజకులార్హవిధుల
జరపి ముని సాధు జనసంఘ సహితుఁడగుచు 1874

అ. బయలు వెడలె నంత బహ్మాది సురలమో
ఖ్యాధినాథు భాగ్యమరసి వైభ
వంబుఁగాంచి జనులు వ్యర్థముల్ మనవని
వేయినోళ్ళఁబొగడి రాయిలేశు 7185

ఆ. మంగళావసర మెఱింగినిలింపులు
గుంపులగుచు వాద్యకోటి మ్రోయఁ
బూలవాన గురియ నీలకంధర సరో
జాసనాది విబుధులంబరమున 1876

క. నానాయూథంబులుగ వి
మానంబుల నధివసించి మనముల ఘనమా
నానందరసము నిండఁగ
మేనులు పులకింపఁ బ్రేమమీఱఁగనంతన్ 1877

క. రామ వివాహముఁగనఁజని
సోమర్క ధరాది సురలు సొగసులగని యా
నామిధీలేశ్వరు పోల్గని
ప్రేమించిరి యాత్మలోక విభవ మసదుగన్ 1878

అ. కనిరలౌకిక ప్రకారవినిర్మితా
నూన చిత్రితర వితానములను
వెలుఁగుపడుచు నెల్ల వేల్పులీ పట్టణ
మింత యొప్పునే సమృద్ధి ననుచు 1879

క. పురనారీ పురుషులు సురు
చిరరూప విలాస విభవ శీలగుణాఢ్యుల్
వరధర్మ పరులుఁ జతురులుఁ
బరమపునీతులును నగుటఁబరికించి కడున్ 1880

క. అమరులు నమరీ బృందము
హిమకరు కిరణాళిఁ దేజమెడలిన నక్ష
త్రములో యనఁగన్పట్టిరి
కమలజుఁడా నగరి విభవ గరిమంగనుచున్ 1881

ఆ. తనదు కొలఁది సృష్టి తత్పట్టణంబున
నీచటఁగానబడక హీనమైన
రమ్యచిత్ర రచన రాజిల్లుచుండుట
నరసియబ్బురంబు నందెమదిని 1882

ఉ. బాలశశాంక శేఖరుఁడు వల్కె సుధాశనులార విస్మయం
బేల శరీరముల్ మఱచి యింతగఁబొందఁగ ధైర్యమూనుచుం
జాల వివేకముంగనుఁడు జానకికిన్ రఘురామమూర్తికిఁ
బ్రోల వివాహమాఁగన్నఁగ రూఢిగవచ్చితిమంచెఱుంగుఁడీ 1883

తే. జగమునందేరి పేళ్ల నుచ్చరణ సేయ
మాయునఖిలంబులైన యమంగళములు
నాల్గు పురుషార్థములుఁ గరన్యస్తములగు
నట్టివారు సీతారాములనియె భవుఁడు 1884

తే. ఇట్లు విబుధులకెల్ల బోధించి శివుఁడు
ముందునడపించె బలవంతముగను వారి
సురలు సనుచున్న దశరథ క్షోణినాథుఁ
గాంచి మోదించి పులకిత గాత్రులైరి 1885

క. ధరణీ సురులున్ సాధులు
ధరణీశుని వెంట బహుళ తనుధారకమా
పరమ సుఖము సేవించుచు
నరుగుచునున్నటులదోఁచి రాదిత్యులకున్ 1836

క. అపవర్గ సుఖములన్నియు
వపుద్ధరణమాచరించి వచ్చెనో యనఁగా
నృపు వెంట సుతచతుష్టయ
మపరిమిత ద్యుతిఁ జెలంగ నమృతాంధసులుఁ 1887

క. మరకత సువర్ణ వర్ణతఁ
బరఁగెడియుగళములఁగాంచి పరమప్రీతిం
దిరుగ రఘురాముఁగని విరు
లురవడిఁ గురియించిరెన్ను చుర్వీధవునిన్ 1888

క. నఖశిఖ పర్యంతంబుగ
సుఖకర శ్రీరామచంద్ర సుందరమూర్తిన్
శిఖినయనుఁడు మయుఁగనుఁగొని
రఖండ సముదాశ్రు పులకితాంగము లెసఁగన్ 1889

చ. ఒడలు మయూరకంఠరుచి నొప్పఁదటిత్కమనీయ కాంతినల్
గడలన్స్రగమ్ము చేలమెసఁగంగ వివాహ విభూషణాళియుం
గడురమణీయ శోభన వికాసమునింప శరత్సుధాంశు మిం
చెడి ముఖమండలంబు విలసింప నవీన సరోరుహాంబులఁ 1890

ఆ. లజ్జనొందఁజేయు లలితాక్షియుగళంబు
శ్రీకరంబుఁగడు నలౌకికంబు
నైన రాముచెల్వ మాత్మగోచరమగు
నైన నోటఁబల్క నలవికాదు 1891

క. సుందర జనాశ్వములఁగడు
నందముగ నటింపఁజేయు చారఘువరు వెం
టందమ్ములరుగు చుండఁగ
వందిజనుల్ బిరుదములను వర్ణనసేయన్ 1892

ఆ. గమన వేగమరసి ఖగపతి లజ్జితుఁ
డగువిధమున నొప్పు హయమువిూఁద
రామచంద్ర విభుఁడు రాజిల్లె మన్మథుం
డాతురంగమయ్యె ననఁగఁ జెలఁగు 1893

చ. వయసు బలంబు రూపగుణవంతతయుంగ విశ్వమోహనం
బయి చెలువార జీనుజిగిన్మై వరమౌక్తిక రాజి శోభిలన్
హయమయి రామచంద్రునకునంగజుఁడొప్పెనొ నాసురల్ మునుల్
ప్రియమున మానవుల్ గనఁగఁ బెంపగుఁ గింకిణులున్ ఖలీనమున్ 1894

క. తారాగణ భూషితమై
వారిధరము మెఱపుఁగూడి వరమగు బర్హిం
దీరుగ నటింపఁ జేసెనొ
నా రాముని మనసుఁబట్టి నడచుహయంబున్ 1895

క. ఆరామ వాహనంబున్
వారిజభవు రాణియైన వర్ణించు నెడం
బారముఁ జేరఁగ లేదన
నేరికి వర్ణింపఁదరమె యీభువనములన్ 1896

ఆ. రామరూపమునకు రాగంబునొందెను
పార్వతీవిభుండు పంచదశ న
యనములుం బ్రియంబు నందంగ లక్ష్మి ము
కుందులరసి మోహమొందిరపుడు 1897

క. వనజజుఁడు రాముఁగని తన
మనమున నానందమొంది మఱిమఱి కనుచుం
దనివి సనక నానేత్రము
లెనిమిదియే చాలవనుచు నెంతయు నగచెన్ 1898

ఆ. బ్రహ్మనేత్రములకు పై సర్వభాగంబు
నయనలాభ మొందినాఁడ ననుచుఁ
గార్తికేయుఁడొందె ఘనతరోత్సాహంబు
రామచంద్రు రూపరాశిఁగాంచి 1899

క. గౌతమ కృతమగు శాపం
బాతత హిత మాచరించెననుచున్ లేఖా
నేశ రఘురామచంద్రుం
బ్రీతుండై కాంచుచుండెఁ బృథుల సుఖమునన్ 1900

తే. ఇంద్రు భాగ్యంబుఁగొనియాడిరెల్ల సురలు
నితనిఁబోలెడి వారిపుడెవ్వరనుచు
రామచంద్రునిఁగాంచిరి ప్రమదమునను
రెండు నృపసమాజములొందె మెండుముదము 1901

క. జయ జయ జయ రఘుకులమణి
జయ జయ యని పుష్పవృష్టి జల్లున దివిష
చ్చయము గురియించె నెలమిన్
రయమున భువివాద్య నికర రవములెసంగెన్ 1902

తే. ఉభయనృప సమాజములందు నుకు తరముగ
హర్షమేపార దుందుభులధికముగను
దశదిశల్ ముట్ట మ్రోసె నుద్దండముగను
నగరిలోపలి జనులెల్ల మిగుల వేడ్క 1903

తే. ఈవిధంబునఁ బెండ్లివారేగుదెంచు
చుండుట నెఱింగి వాద్యముల్ మెండుగాఁగ
మొరయఁజేసిరి రాణులు పుణ్యవనిత
లను ముదంబునఁబిలిపించి లలితగతిని 1904

తే. పెండ్లివారి నెదుర్కొన వివిధమైన
మంగళ ద్రవ్యములను నేమంబుతోడ
సిద్ధమొనరించిరుస్మత్త సింధురసమ
యానలగు మానినీమణుల్ హర్మ్యమునను 1905

క. బంగరు పళ్ళెరములతో
మంగళహారతులు రత్నమయపాత్రిలతో
డంగడు శుభకర వస్తువు
లంగొనుచుం బెండ్లివారలను నెదుర్కొనన్ 1906

ఉ. అందఱు నిందుబింబముఖు లందఱుసందముచే రతీపతిం
గ్రిందొనరింపఁజాలుదురు కేవల మందఱు మందయానలుం
జందనగంధులుఁ హరిణశాబక నేత్రిలు వర్ణ వర్ణ శో
భందనరారు వస్త్రముల భాసుర భూషలఁదాల్చి పొల్పుగన్ 1907

క. సకలసుమంగళ వేషము
లకలంక గతిన్ నిజావయవములఁ దనరన్
బికకంఠధ్వని నిరసిం
చు కలస్వన మొప్పఁబాడుచున్ సతులెల్లన్ 1908

ఉ. కంకణకింకిణీనిచయ కమ్రవిభూషణ నూపురాదిక
క్రేంకృతులొప్పఁగా గమన రేఖవిలోకనమాచరించి మీ
నాంకునిభంబు సిగ్గిలఁగ సంచితయానములొప్ప గుంపులై
పంకజపాణులేగిరి వివాహసమాజముఁజూడ వేడుకన్ 1909

క. ఆకాశంబున నగర న
నేకవిధ సువాద్యరవము లెసఁగెంగడు న
స్తోక శుభక్రియలలరెన్
నాకవిలాసినులు చతురనాళీకాక్షుల్ 1910

తే. శచియు శారదయును రమాసతియు హైమ
వతియుఁ దక్షిణనిర్జర వనిత లెల్లఁ
గపట నారీస్వరూప సంకలిత వేష
ములను ధరియించి శుద్ధాంతమునకు నరిగి 1911

క. అంతఃపుర కాంతలతో
సంతోషంబునను బాడసాగిరి వారిం
గాంత లెవ రెఱుఁగ కుండి ర
నంతంబుగ హర్ష వివశలైయుండుట చేన్ 1912

ఆ. బ్రహ్మరూపుఁడైన వరు నెదుర్కొనుటకై
హర్ష వివశలగుచు నరుగు వేళ
నెవరి నెవ రెఱుంగ నేరీతిననువగు
రాణివాసమందు ప్రమదలకును 1913

క. కలితకలస్వన మలరఁగ
నెలసెం గానములు వాద్యవిసరము మ్రోసెం
జెలఁ గెన్ శోభాకరమై
నిలింపతతి విరులవాన నెఱిఁగురియింపన్ 1914

క. ఆనందనూలుఁగొస
ల్యానందనుఁ బెండ్లికొడుకు నరశిరి కాంతల్
మేనులు పులకింపంగా
జానగు నేత్రముల హర్ష జలమురలంగన్ 1915

ఆ. పెండ్లికొమరుఁడైన విశ్వేశుఁగాంచిన
సీత జనని సుఖముఁ జెప్పఁదరమె
నూఱు కల్పములకు నుడుల పడఁతికైనఁ
జిలువ తేనికైన నలువకైన 1916

కం. మంగళ సమయమనుచు రా
జాంగనలు ముదంబుపేర్మి నక్షుల జలము
బ్బంగఁ గడు నాపికొనుచు శు
భాంగునకు నివాళులొసంగిరా సమయమునన్ 1917

ఆ. వేదవిహిత వంశవిధినెల్ల మంగళా
చరణములనొనర్చి చారుముఖులు
పంచశబ్దములను ప్రవిమల శుభగాన
మాచరించి బహువిధాంశుకముల 1918

తే. పఱచి యారతులొసఁగుచుఁ బద్మనయన
లర్ఘ్యమొసఁగంగ శ్రీరాముఁడాపటంబు
లందుఁబావనమైన నిజాంఘ్రియుగము
మోపి మండపముంజేరె ముదము మీఱ 1919

తే. దశరథుండు సమాజయుక్తముగ వెలసె
విభవమరసి లోకేశులుప్రిడఁజెంద
సమయ సమయంబునకుఁ బుష్పచయముఁగురిసి
రమరులు ధరామరులు శాంతికములఁజదువ 1920

కం. తనమాట పరుల మాటయు
వినుట కెవరి కైనసుంత వీల్గానిక్రియఁ
ఘన కోలాహలమయ్యెన్
విను రాముని మంటప ప్రవేశము వేళన్ 1921

ఆ. అర్ఘ్యమొసఁగి రామునాసనంబునను గూ
ర్చుండఁజేసి మోదముప్పతిల్ల
నారతుల నొసంగియా మంగళాకారు
సరసి సుఖమునొంది రందఱపుడు 1922

ఆ. మంగళములఁ బాడి మణి వస్త్రభూషణ
రాజినొసఁగిరెలమి రమణులెల్ల
వారిజాసనాది వరసురవ్రాతంబు
విప్రవేషములను వేడ్కఁ దాల్చి 1923

ఆ. ఆ వినోదమెల్ల నరయుచు రఘుకుల
కమల కమల మిత్రు కాంతిఁ గనుచు
జీవనముల ఫలము సెందెను మాకంచు
ననుపమాన హర్షమందె నపుడు 1924

చ. కవులును సేవకుల్ నటులు గాయకులుం రఘురామమూర్తిచే
నవిరళమైన కానికలనంది శిరంబులువంచి మ్రొక్కి గౌ
రవమున దీవనల్ సలిపి రంజిలు చిత్తములం బ్రహర్షముల్
దవులఁగ వానినాపుటకుఁ దాలిమి చాలకయుండిరందఱున్ 1925

తే. వేదలౌకిక విధుల నుర్వీరవరద్వ
యంబు జనక దశరథులు సర్వ గౌర
వంబునం గూడి యుండిరి వారి కుపమ
వెదకి వెదకి కవుల్ మది వ్రీడఁ గనిరి 1926

తే. ఎచటనుపమాన ముండమి హృదయములను
నోటమి వహించి వారికి నుద్దివారె
యనుచు నిశ్చయ పరచిరి యమరులరసి
యశముఁ బాడుచుఁ గురియించి రలరువాన 1927

తే. అజుఁడు భువనాళి సృజియించి నంతనుండి
యరసి వినియుంటి మెన్నియో పరిణయములఁ
గాని యన్నివిధముల నీడైన యిట్టి
బాంధవము నేడు కంటిమి భాగ్యవశత 1928

తే. అనుచు సత్యమనోజ్ఞ వాక్యముల సురలు
వలుక విన రెండు దెసలందుఁబ్రబలమై య
లౌకిక ప్రేమ వ్యాపించె లలిత వస్త్ర
చయముఁబఱపించి యర్ఘ్యమొసంగి ప్రీతి 1929

క. జనకుఁడు దశరథజనపతి
ననుపమమగు నాదరమున నతి సుందరమై
తనరెడి మండపమునకుం
గొని చనె నత్యంతమైన కుతుకముతోడన్ 1930

చ. ముని మనముల్ హరింపఁగల భూరివిచిత్ర వినిర్మితంబుగాఁ
దనరుఁ దదీయమంటపము దగ్గఱనుండు విదేహభూవిభుం
డనుపమమైన సింగపు మహాసనముల్ నిజపాణి పంకజం
బునఁగొని తెచ్చి యుంచెఁగడు మోదముతో నట నెల్లవారికిన్ 1931

క. కులదైవతంబుఁ బోలెడు
నలఘు వసిష్ఠముని భక్తి నర్చించి మనం
బలరఁగనాశీర్వాదం
బులఁబొందెం గాధిసుతునిఁ బూజించు నెడన్ 1932

ఆ. రాజుపొందినట్టి రాగంబువర్ణింప
శక్యమగునె యంత సంతసమున
వామదేవముఖ్యవాచంయముల భక్తిఁ
బూజచేసి పీఠముల నొసంగి 1933

క. ఆశీర్వాదంబుల భూ
మీశుఁడు వడసి దశరథ మహీశుని నాస
ర్వేశుకిరియంబూజించి కు
శేశయ శయయుగము మోడ్చి చెలఁగవినీతిన్ 1934

క. సౌభాగ్యమెన్నన సదే
వైభవమున మిమ్ముఁబోటి వసుధేశునితో
నో భూమీశ్వర వియ్యం
బీ భవమునఁ బొందఁగలిగె నెంత సుకృతినో 1935

తే. అనిపలికి పెండ్లివారి సమాదరమునఁ
బూజయొనరించి దశరథ భూపతికటు
లాసవంబుల నొసఁగె నాహార్షమెల్ల
నేక ముఖమున వర్ణింపనెట్లు నేర్తు 1936

తే. సర్వులగు పెండ్లివారికి జనక విభుఁడు
దాన గౌరవముఖ్య సత్కారములను
జేసి వినయ మృదూక్తులు పల్కఁబలికె
నెల్లరు విదేహపతి ప్రీతి నెలమిఁబొగడ 1937

క. శ్రీరాము పరిభావంబును
నీరజ సంభవుఁడు హరియు నీలగళుండున్
వారిజ బంధుఁడు దిక్పతు
లారాధిక నెఱిఁగియుంట నాసమయమునన్ 1933

చ. కపటబ్రాహ్మణవేషులై మఱి చమత్కారంబుగా హానులై
నృపసత్కారములొందిరాజనకుఁడున్ నేరంపు గుర్తింపఁగా
విపులంబైతగు భక్తి దేవతలుగా వీక్షించి పూజించుచుం
దపనీయాసనరాజిపర్వ విధినాధాత్రీధవుండీయఁగన్ 1939

క. ఎవరినెవరెఱుఁగఁ జాలుదు
రవిరళ సమ్మోదకందమగు రాము నెడం
దవిలిన చిత్తంబులతో
దివిజులు భువిజులును విస్మృతిం జెందుట చేన్ 1940

తే. అప్పుడానంద కందమౌనట్టి పెండ్లి
కొడుకుఁగనులారఁగనుటచే గురుతరముగ
నుభయ దిశలందు నానందముప్పతిల్లెఁ
జతురుఁడైయొప్పు శ్రీరామచంద్రమూర్తి 1941

తే. అమరుల నెఱింగి మానసికముగఁ బూజ
లాచరించి సమర్పించె నాసనముల
రాముని సుశీల సద్గుణస్తోమమరసి
యనుపమానందమొంది రయ్యమరవరులు 1942

ఆ. రామచంద్ర వదన రాకేందు సౌందర్య
రసముఁగ్రోలసాగి రసదృశాతి
హర్షరాగ వివశులై నిర్జరుల్ తమ
కన్నులను చకోరకములచేత 1943

తే. సమయమెఱిఁగి వసిష్ఠుండు సరగునంగు
మారిఁగొనిరాఁదగునటంచుఁజీరి తెలుప
నాజ్ఞ వించుశతానందుఁడతిముదమున
సరిగెనంతఃపురంబున కాక్షణంబె 1944

చ. అపుడు పురోహితోక్తి విని యంతిపురంబున రాణులెల్లరున్
విపులముదంబు నొంది పృథివీసురకాంతల వంశవృద్ధలన్
నిపుణతఁ బిల్వఁబంచి కమనీయసుగాన పురస్సరంబుగా
నపరిమితంబుగా జరిపిరాత్మకులోచితమైన కృత్యముల్ 1945

ఉ. అంతస్స్వభావసిద్ధమగునట్టి మనోహరరూప సంపదం
గాంతిలి షోడశాబ్దముల కన్నియలై యటనున్న దేవ సీ
మంతినులన్ నృపాలకులమానిను లారసి ప్రేమసౌఖ్య మ
త్యంతముఁబ్రాణితుల్యముగ నందిరి మర్మమెఱుంగకుండియుః

క. రాణియుఁదనమది నల శ
ర్వాణికి వాణికిని శౌరి రాణికి సమలీ
వేణీ రుచి జిత మధుప
శ్రేణులనుచు గారవంబు సేసె నెడ నెడన్ 1947

శా. సీతాదేవి నలంకరించి మిగులన్ శృంగారమేపారఁగా
భీతైనాత్మలమందహాసముననాబింబాధరింగొంచు సం
ఘాతంబై మదహస్తి యానములతోఁగల్యాణ శోభాపరి
స్ఫీతంబై తగు మండపంబు కడకుంజేరంగ నొక్కమ్మడిన్ 1948

శా. సీతందోడ్కొని నచ్చు నట్టి సఖులున్ సీమంతినీరత్నముల్
గీతవ్రాతముఁ బాడఁగా వినిన మూకీ భూతమౌఁబైకముం
జేతోజాతుఁడువీక్షఁ జెందుఁ గపుడా శీతాంశు బింబాననా
వ్రాతంబూనిన చారుషోడశ విభావంతంపుఁ గైసేతకున్ 1949

క. మంజులకంకణ నూపుర
మంజీరధ్వనులు తాళమానంబులుగాఁ
గుంజరయానలు వాడిరి
రంజిత మతి మునులు ధ్యానరహితులు గాఁగన్ 1950

తే. సహజ సౌందర్యవతియగు జనక కన్య
సుందరీ పరివృతయయి చూడనొప్పెఁ
జారులావణ్యవతులగు సతుల నడుమఁ
జెలువమెలనాగరూపమై నిలచెననఁగ 1951

తే. సీత సౌందర్యవర్ణన చేయఁదరమె
బుద్ధి యల్పంబునా సర్వభువనమాత
చక్కదనమెక్కడా రూప సారరాశి
పరమపావనియే తెంచు తరుణమునను 1952

తే. పెండ్లివారలుగాంచి యబ్బినసుబహోక్తి
కాత్మగతముగఁ బ్రణమిల్లి రందఱంత
రామచంద్రునిఁజూడఁబూర్ణంబులయ్యె
నందఱకు నాత్మలోఁగల యభిమతములు 1953

ఆ. దశరథేశ్వరుండు దనయసమేతుఁడై
యధికముదమునొందె నతని యెడఁద
నావహించియున్న యానందమెంతయో
పలుకఁదరముగాదు బ్రహ్మకైన 1954

క. సురలు ప్రణామము లొనరిఁచి
విరులంగురియించి రెలమి వేదోక్తముగన్
వరమున్నాశీర్వాదము
లురుమంగళమూలమైన యులివుననొప్పన్ 1955

క. గానములు వాద్యనికర
ధ్వానంబులు బహుళములుగ వఱలెననూనం
బైన సుఖమయ్యెఁ బురుషులు
మానినులుం బ్రేమహర్షమగ్నులుగాఁగన్ 1956

తే ఈవిధంబునఁ బ్రీతి సీతావధూటి
చెలువ మరమండపముఁ బ్రవేశించువేళ
శాంతి పఠనంబు సేసిరి సన్మునీంద్రు
లురుతరంబుగ సంతోషముప్పతిల్ల 1957

క. కులగురులిద్దఱు సత్తతి
వలసిన యాచారవిధుల వ్యవహారములన్
విలసితమతిఁగావించిరి
తొలిచదువులఁ దెలుపఁబడు స్మృతుల పద్ధతిగన్ 1958

మ. ధరణీ నిర్జరులుం గులోచిత సమస్తప్రక్రియారంభులై
గురునిన్ శైలకుమారికం ద్విరదవక్త్రుం బూజగావింపఁ జే
సిరి తోడ్తోడ నిజస్వరూపములతోఁ జేపట్టి తత్పూజలం
బరితోషించి సుఖించి దీవనలనొప్పం జేసి రద్దేవతల్ 1959

క. మధుపర్కాదికమగు బహు
విధ మంగళవరపదార్థ విలసితభర్మ
ప్రథితంబగు పాత్రలఁ గొని
బుధులగు మునులడుగ నిచ్చుబుద్ధిఁ బరిజనుల్ 1960

తే. నిలచియుండిరి సూర్యుండె నిజకులోచి
తంపుపద్ధతిఁ దెలుపంగఁ దత్ప్రకార
మాచరింపంగఁబడెఁ బూజలైన వెనుక
నవనిజ కొసంగఁబడియె సింహాసనంబు 1961

తే. ఉర్విజా రామచంద్రు లన్యోన్యులఁగను
నవసరంబునఁ దత్ప్రేమ మన్యులకు న
గోచరంబయ్యె వాఙ్మనో లోచనముల
బుద్ధి గ్రహియింపనేరని పోల్కినుంట 1962

ఆ. కాన దానినెట్లు కవి వర్ణనముసేసి
పలుకనేర్చు విశదపడువిధమున
హోమసమయమందు నొడలూని వహ్నియు
నాహుతుల గ్రహించె నతిసుఖమున 1963

ఆ. వేదచయము విప్రవేషంబులం దాల్చి
పరిణయంపు విధులఁ బలుకుచుండ
భూమిసురుల వేషములనున్న సురలెల్ల
హార్దమునను వాని ననుసరింప 1964

క. జనకుని పట్టపుదేవి భు
వనపావని లోకవిదిత వసుధాసుతకుం
జనని నెటు లెన్నఁదరమగు
వనజజుఁడు సుయశము సుఖము వరసుకృతంబున్ 1965

క. సౌందర్యంబును నొకచోఁ
బొందుపడఁగూర్చి మిగుల పొలుపలరఁగని
య్యిందుముఖిన్ రచియించె న
వందగి యలరారు లక్షణంబులప్రోవై 1966

ఆ. సమయ మెఱిఁగి యామె సన్మునుల్ పిలువంగఁ
బుణ్యసతులఁగూడి ముదముతోడ
వచ్చినిలచె జనకు వామదిశంజలి
గట్టుదండ మేనకయొ యనంగ 1967

తే. నిర్మల సుగంధ శుభవారినింపఁబడిన
శోణకలశంబు మణులచే సొంపుగులుకు
పళ్ళెరంబును నిజకరపంకజములఁ
బట్టి జనకుండు దేవియుఁ బ్రమదమెసఁగ 1968

ఆ. రామచంద్రు ముందరం దెచ్చియుంచిరి
మంగళస్వరమున మౌనివరులు
వేదములఁబఠింప వినువీధి సుమవృష్టి
సమయ మెఱిఁగి కురియసాగెనపుడు 1969

క. వరునిం గని సతియుం బతి
పరమప్రేమ రసమగ్న భావులగుచుఁ ద
త్పరిపూత చరణయుగ్మము
నమసంబునఁ గడుగఁదొడఁగి రాత్మకరములన్ 1970

తే. ప్రేమఁ బులకితగాత్రులై రామచరణ
కమలధావన మొనరించు కాలమందు
నగరనభమున వాద్యముల్ మిగుల మ్రోసె
గానరవమును జయజయధ్వానచయము 1971

తే. ఒక్కటైకూడి నాలుగు దిక్కులందు
నిండె నెవనివదముల హరుండు సతము
నిజమనస్సరోవరమున నెమ్మిఁదాల్చు
నట్టి శ్రీరామచంద్ర పాదాంబుజముల 1972

తే. స్పర్శమాత్రన గౌతమసతి యహల్య
పాతకము వాసి యవ్యయపదముఁగనదె
స్మరణచేసినమాత్రన మానసంబు
నిర్మలతఁజెందుఁ గలిదోష నివహమడఁగు 1973

తే. ఏపదాంభోజ నిష్యందహిమసమాన
శీతల మరంద మాదల శివుఁడు దాల్చు
నతిపవిత్రతకున్ సురల నధియనుచు
వర్ణనము సేయుచుందు రెవ్వానిపదముల 1974

తే. ఏచరణవారిరుహముల నెపుడు యోగి
జనులు మునులును మానసషట్పదముల
సేవగావించి వాంఛిత సిద్ధిఁగందు
రట్టి శ్రీరామచంద్ర పాదాంబుజముల 1975

తే. పట్టపుందేవి ముద మొంది భర్మకలశ
జల మొసఁగ భాగ్యశాలియా జనకవిభుఁడు
పాణి పంకేరుహంబులఁబట్టి కడిగె
జయజయధ్వను లవనిని జదలనిండ 1976

క. వరులగు కులగురులు వధూ
వరుల కరాంజలుల నొకటిపై నొకటిగ సుం
దరముగఁ జేర్చి ప్రవరో
చ్చారణంబును జేసి వర్గసరణిం జదువన్ 1977

తే. అజుఁడు సుర నర మునివరు లవనిజా ర
ఘూత్తముల కరగ్రహణ మహోత్సవంబు
సరసి యానంద మొందుచు సంగములను
మఱచు నంతటి ప్రేమ విమగ్నులైరి 1978

క. ఆనందకందమగు నా
జ్ఞానమయుం బెండ్లికొడుకు సతియుం దానుం
భూనాయకుండు గాంచఁగ
మేనులు పులకించెఁ బొంగె మిగులఁ హృదయముల్ 1979

క. మాన్య శ్రుతిలోకవిధి రా
జన్యాలంకారుఁడైన జనకుఁడు ప్రీతిం
గన్యాదాన మొనర్చె న
నన్యద్యుతి నలరు దశరథాగ్రసుతునకున్ 1980

మ. హిమవంతుండు సుధాంశుమండనున కెట్లిచ్చెం దనూజాత న
ట్లమృతాబ్ధీశ్వరుఁ డాదివిష్ణునకు నెట్లర్పించెనో యాత్మజన్
విమలాత్ముండగు నావిదేహవిభుఁ డర్పించెం ఖరారాతి క
ట్ల మహీజాత జగత్ప్రపూతగుణజాల స్ఫీతసీతన్ సుతన్ 1981

తే. అట్టి నూతనమాకీర్తి యఖిలభువన
ములను వ్యాపించె శ్యామలమూర్తి యావి
దేహభూపతిఁ జేసె విదేహునిగని
కెట్లు వినయంబునూపు నుర్వీశ్వరుండు 1982

ఆ. గ్రంథిబంధనములఁ గావించి విధిపూర్వ
కముగ వేల్వఁజేసి బ్రహ్మసురేంద్రు
లావధూవరుల నగ్నిప్రదక్షిణ
మాచరింపఁజేసి యందమలర 1983

తే. వందిమాగధ జయజయ ధ్వానములును
వేదనాదంబు మంగళ వివిధవాద్య
రవముగా సస్వనము విని ప్రమదమునను
సురలు సురతరుపుష్పముల్ గురిసిరపుడు 1984

ఆ. కనులుగలుగు ఫలముఁ గనిరెల్ల రావధూ
వరులు ప్రీతిహవ్యవాహనునకు
దీక్షమీఱఁగాఁ బ్రదక్షిణంబొనరించు
కాలమందు వారిఁ గాంచినంత 1985

తే. అతిమనోహర మాత్మదంపతుల వర్ణ
నంబొనర్పంగవశమె లోకంబులం ద
దెచటనో యొకయుపమాన మెన్నికొన్నఁ
జిన్నదౌఁగాని సరిపోవ దెన్నఁడైన 1986

తే. రతనకంబాల జానకీ రామచంద్ర
సుందరప్రతిబింబముల్ చూడనొప్పె
రతియు మరుఁడును ననుపమ రామపరిణ
యంబుఁగనుటకు బహురూపులందిరనఁగ 1987

తే. చాలగానుండె దర్శనలాలసతయుఁ
గాని సంకోచమును గొద్దిగాకయుండె
నందుచే మాటిమాటికి నగపడుచును
మఱుఁగుపడుచుండిరో యనుమాడ్కి నొప్పె 1988

తే. కనుచునుండిన జనులెల్ల జనకునట్ల
దేహముల్ విస్మరించి యాదివ్యమూర్తు
లైన దంపతులం బ్రీతినరయుచుండి
రనుపమానంద రసమగ్నులగుచు నపుడు 1989

తే. ఒప్పమీఱంగ మునివరుల్ హోమవిధులఁ
బూర్తియొనరించి కానుకల్ మొదలుగాఁగ
జరుపవలసిన యాచారసరణినెల్ల
సరిగఁదీర్చిరి సంతోషభరితులగుచు 1990

తే. రామచంద్రుండు సీతాశిరఃప్రదేశ
మందు సిందూరముంచె నయ్యనుపమాన
శోభఁబలుకందనె తమ్మిచూలికైన
నైన నీరీతిఁ గానంగనయ్యెనపుడు 1991

క. కెందమ్మి పరాగము మెయి
నందంబుగనిండియుండ నమృతాపేక్షం
బొందుగ భుజగేంద్రుం డా
యిందునిభూషణముగాఁగ నెసఁగెనఁదగన్ 1992

తే. అవ్వసిష్ఠుని యనుశాసనానుసార
మప్పుడా వధూవరులు నేకాసనముసఁ
గూరుచుండిరి దశరథుడవలయేశుఁ
డమితమగు హర్ష మొందుచు నరయుచుండ 1993

తే. అతని సుకృతస్వరూప కల్పావనీరు
హంబు నూతనఫలభరితంబుగాఁగఁ
గాసవచ్చినయట్లైనఁ గనులనిండ
మరలమరలఁ గనుఁగొని మనుజవిభుఁడు 1994

ఆ. పులకితాంగుఁడయ్యె భువనంబులెల్లను
తాస్నేహాభరితములుగఁ జాలనొప్పె
రామచంద్రు శుభకరంపు కల్యాణంబు
జరిగెననుచు సకలజనులువలుక 1995

క. అభివర్ణింపవశమె యీ
శుభమేకంబైన జిహ్వచొప్పడునే యీ
త్రిభువనముల నామంగళ
విభవమునకు సాటి యెట్టివేళలయందున్ 1996

:- జనకుం డూర్మిళా మాండవీ శ్రుతకీర్తుల భరత లక్ష్మణ
శత్రుఘ్నుల కిచ్చి వివాహములు సేయుట :-

మ. అంతవసిష్ఠు నానతిఁ బ్రియంబొదవంగ విదేహమేదినీ
కాంతుఁడు మాండవిన్ సుగుణకన్యల నాశ్రుతకీర్తి నూర్మిళన్
సంతసమొప్పఁ దెచ్చి దివిషచ్ఛయ మెంతయు మేలుమేలనన్
శాంతసుశీలలై తగుకుశధ్వజపుత్రికలందు నగ్రజన్ 1997

ఉ. మాండవిఁ జారురూపగుణమండన నండజయాన నాన్నృపా
ఖండలుఁడిచ్చెఁ బ్రీతిమెయిఁ గంధరసుందర దేహవర్ణుఁడై
కొండవరామచంద్రుఁడనఁ బ్రేక్షకులం దనియించునట్టి మా
ర్తాండసమాన తేజ భరతప్రథితాఖ్యున కర్హపద్ధతిన్ 1998

క. సీతా కనిష్ఠసోదరి
శాతోదరి నూర్మిళయను జలజాక్షిని సం
ప్రీతిన్ లక్ష్మణునకు నా
భూతలనాథుం డొసంగె ముదముదలిర్పన్ 1999

క. శ్రుతకీర్తిఁ శత్రుఘ్నున
కతిహర్షంబున నొసంగి యవనీశుఁడు స
మ్మతితోడఁ బెండ్లి చేసెన్
శతమన్యు సమానవిభవ సాంద్రుండగుచున్ 2000

క. అనుకూల వధూవరుల
త్యనురాగం బాత్మఁబొడమ హర్షోదధుల
య్యును సంకోచమునొందిరి
మనముల ఘనమైనసిగ్గు మల్లడిగొనఁగన్ 2001

క. అందఱును నా వధూవర
సౌందర్యాదులఁ బ్రశంస సలుపుచునుండన్
మందారకుసుమవృష్టి స
మందంబుగఁ గురిసిరపు డమర్త్యులు వేడ్కన్ 2002

తే. సుందరీసుందరులు నొక్కసొంపుగులుకు
మండపంబున వసియించియుండఁదోఁచె
సరిగ జీవుని చతురవస్థాలతొంగు
లొక్కమొగి భర్తలంగూడి యుండిరనఁగ 2003

తే. సకలపుత్త్రుల నవవధూసహితులఁ గని
పొందె మోదంబు దశరథ భూవిభుండు
తమిఁ గ్రియాన్వితఫలచతుష్కమును బడసి
తనివిఁగను మహీపాలరత్నంబువోలె 2004

క. శ్రీరామచంద్రు కళ్యా
ణారాధ మహోత్సవమెటు లభివర్ణితమై
శ్రీరంజిల్లఁగ జరిగె నా
యారీతినె జరిగెఁ బరిణయములు మువురకున్ 2005

తే. కన్యలకు రాజొసంగిన కనకరత్న
పరిమితి నెఱింగి యింతని పలుకవశమె
బహువిధ సువర్ణ నవరత్న భూసమాన
భూషణంబులు మండపంబుననునిండె 2006

తే. కంబళంబులు బహువర్ణ కలితదీప్త
చిత్ర బహుమూల్య నూత్న కౌశేయములును
దాసదాసీసహస్రముల్ వాసవగవిఁ
బోలు సాలంకృతంబులౌ నాలగములు 2007

క. కరి రథ హయ యూథంబులు
సరువగు బహువస్తుతతులు నవిగణియింపం
దరమగునె వానినన్నిటిఁ
బరికించుజనులకుఁ గాక పరులెవ్వరికిన్ 2008

తే. లోకపాలురు వాని నాలోకనంబు
చేసి సంతోషసంయుత చిత్తులైరి
యపుడు హర్షంబుతో నయోధ్యావిభుండు
వానినెల్ల గ్రహించెఁ దాత్పర్యమునను 2009

తే. అట్లు గ్రహియించి వానిలో యాచకులకు
నెవ్వరి కేయ్యదియిష్టమో యెఱిఁగియిచ్చె
నపుడు జనకుండు హస్తద్వయంబుమోడ్చి
పెండ్లివారలఁ గడుగౌరవించి పలికి 2010

ఆ. సకల పరిణయంపు జనుల సన్మానించి
దాన వినయముల మురంబుఁ గొలిపి
మునిసమూహమునకు మొ్రక్కుచుఁ బూజించి
దేవతలను భక్తిఁదెలిచి మఱియు 2011

క. ముకుళిత కరపంకజుఁడై
సకలజనంబులనుగాంచి సాధు త్రిదశ
పరికరముభావమెఱిఁగి ను
దకసహితాంజలి యొసఁగను దధితోషిలునే 2012

ఆ. అనుచుఁబలికి కోసలావనీనాథు స
బంధుఁగాంచి జనకవసుమతీశుఁ
డధిక వినయమెసఁగ హస్తయుగము మోడ్చి
పలికె సహజమధురభాషణముల 2013

మ. ధరణీనాథ శిరోవతంసమ భవత్సంబంధముం బొందుటం
బరమోత్కృష్టుఁడనైతి నీసకలసంపచ్ఛ్రేణియున్ రాజ్యమున్
బరివారంబును నేను భృత్యులముగా భావింపుఁడీమూల్య మొ
క్కరవంతేనియు నీయఁగానలదు వేడ్కన్ సేవలొందందగున్ 2014

క. పరిచారికలంగా మది
నరయుచు నీకన్యకలను ననవరతంబుం
బరిపాలింపం దగునో
యురుకరుణాభరణ దశరథోర్వీరమణా 2015

ఆ. సాహసించి మిమ్మిచటికి రప్పించితిఁ
దప్పుసైపవలయు దయననంగ
నర్కవంశమండనాయమానుండగు
దశరథుండు జనకుఁ దగినరీతి 2016

తే. సకలసన్మానములను బ్రసన్నచిత్తుఁ
డగుచుఁజేసెఁ బరస్పరమాత్మలందుఁ
బొడమి నిడుపొందు నాపరిపూర్ణమైన
ప్రేమవినతులఁ బలుకుట లేమియయ్యె 2017

తే. దశరథుఁడు విడిదలకేఁగుతరుణమందు
హర్షమునఁ బుష్పవర్షంబు నమరవరులు
గురియఁజేసిరి దుందుభుల్ మొరసె మింట
వసుధ వేదధ్వనుల్ జయస్వనములడరె 2018

తే. బహుళ కౌతూహలంబయ్యెఁ బట్టణమున
మునులయానతిఁ గైకొని ముదితలెల్ల
నూతనవధూవరులను సంప్రీతితోడఁ
దోడుకొని శుభగీతముల్ పాడుకొనుచు 2019

క. చని పెండ్లిమందిరంబున
ననుపమ కనకాసనముల నాసీనుఁ జే
సినపేత మాటి మాటికిఁ
గనుచుండెన్ రామచంద్రు ఘనమగుప్రీతిన్ 2020

క. రామునిపై నధికంబగు
ప్రేమపిపాసావశమునఁ బృథివీసుతకున్
శ్రీమీఱునక్షియుగ్మము
గోమగుపాదీనశోభఁగొని చెలువొందెన్ 2021

తే. కోటిమన్మథులన్ లజ్జఁగొనఁగఁజేయు
సహజసుందరశ్యామ భాస్వచ్ఛరీర
మలల వరమునిహృద్భ్రమరాశ్రితమగు
సుందరపదాబ్జయుగళంబు శోభమీఱ 2022

సీ. బాలసూర్యతటిత్ప్రభా భాసురమనోజ్ఞ
పీత పునీత విద్యోతపటము
కమనీయకింకిణీ కటిసూత్రసంశోభి
తాతిమనోహరమైన నడుము

లలితవిభూషణాలంకృత వేదండ
శుండాయతోరు దోర్దండయుగము
సౌవర్ణ వర్ణ భాస్వచ్చారు యజ్ఞోప
వీతసమేతమై వెలయునురము

తే. మానసంబునుహరియించు మంజురత్న
పుంజతపనీయనిర్మిత స్ఫురదమూల్య
ముద్రికాభూషితంబయి పొలుపుమీఱు
పరుణపంకేరుహోపమమైనకరము 2023

క. పరిణయ భూషణ భూషిత
శరీరమతిశోభఁదనర జన్నిదముక్రియం
బరఁగెడి చేలాంచలముల
వరమౌక్తికరత్నరాజి వఱలుచునుండన్ 2024

తే. అంబుజోపమమౌ విశాలాక్షియుగము
చారుకుండలమండిత శ్రవణయుగ్మ
మతుల సౌందర్యనిధియగునట్టి మేను
పొలుపులకు నిమ్మనందగు భ్రూయుగంబు 2025

తే. అతిమనోహరనాసిక యలఘుకాంతి
నిలయతిలకాంచితంబగు నెన్నుదురును
విమలముక్తామణిప్రభాన్వితలసత్కి
రీటభాసురకాంతి స్ఫురితశిరంబు 2026

తే. హరి సర్వాంగమంజులంబైన రామ
చంద్రురూపంబుఁ గనుఁగొని జనకపురవి
లాసినుల్ నిర్జరాంగనలీసురూప
మెందు లోకంబులం గలదే యటంచు 2027

ఆ. దృష్టితగులుననుచుఁ దృణలేశములఁద్రుంచి
పాఱవైచిరెల్ల పద్మముఖులు
మహితమాల్యవస్త్ర మణిభూషణాదికం
బులనొసంగి మోదమునను బొంగి 2028

క. శుభగానంబులు సేయుచు
విభయానలు ప్రీతిహార తిచ్చిరధిక సౌ
రభపుష్పవృష్టిదివిజుల్
రభసంబునఁ గురిసిరంత రామునిమీఁదన్ 2029

తే. సూతవందిమాగధ జనస్తుతులు సెలఁగ
సౌఖ్యమున వధూవర చతుష్టయముఁగొంచుఁ
బుణ్యసతులెల్ల లోనికిఁబోయి లౌక్య
విధులఁదీర్చిరి గానముల్ వెలయనపుడు 2030

తే. పార్వతీదేవి శ్రీరామభద్రునకును
బాయసంబును భుజియించు ఫక్కిఁ దెలిపె
శారదాదేవి యారీతి త్మ్రసుతామ
తల్లికింబోధయొనరించెఁ దరుణులలర 2031

ఉ. ఆతతిరాణివాసమున నందఱు హాసవిలాసమగ్నలై
ప్రీతినిబొంది యుబ్బి చెలరేగిరి జన్మలుసార్థమయ్యెనం
చాతతమైన సంతసమునందుచు శ్రీరఘురామమూర్తినిన్
సీతనుగాంచి యుల్లములఁ జెప్పఁగరాని సుఖంబునొందుచున్॥

ఉ. రూపనిధాన రామప్రతిరూపము నాత్మకరాంబుజస్థ సం
దీపిత భూషణాగ్రమణిఁ దేఱి కనుంగొనుచుండి సీత త
ద్రూపనిరీక్షణావిరహ దుస్సహభీతిఁ జలింపఁజేయఁగా
నోపదు బాహువల్లుల మహోత్సుకతం జెలికత్తె లారయన్ 2033

ఆ. అట్టిసమయమందు నానందమును వినో
దమును బ్రేమ నెన్నఁ దరముగాదు
చెలియ లా వధూవరుల సందడిం గొని
వేడ్క మీఱఁ జనిరి విడిదలకును 2034

శా. ఆశీర్వాదము లెల్లెడం జెలఁగఁగా నానందసంపూర్ణమై
యాశాంతంబులఁ బట్టణంబు నభమత్యంతంబు దీపించె వా
రాశుల్ పొంగెను దుందుభుల్ మొరసె శ్రీరామప్రభుం గాంచి లో
కేశుల్ సిద్ధులు యోగులున్ మునిసరుల్ బృందారకుల్ ప్రీతులై

తే. పుష్పవృష్టి నిగురియించి ముదముతోడ
నిరుపమాకారు శ్రీరాము నిర్వికారు
సంస్తుతించుచు జయజయ స్వనము లడరఁ
జేయు చాత్మీయలోకముల్ సేరి రపుడు 2036

ఉ. తోసమెలర్పఁగా నవవధూటులతోడఁ గుమారులందఱుం
గోసలరాజసన్నిధికిఁ గూరిమితోఁ జనుటొప్పినా జనా
వాసమునందు సోయగము వైభవమున్ శుభముం బ్రమోదమున్
వాసియునిండిపొంగి యిటు వచ్చెనో నాఁగను విందుసేయుచున్

క. వెండియు విందులు జరిగెం
బెండిలివారలను జనక పృథివీపతియున్
నిండుమతిం బిలిపించి య
ఖండంబుగ వస్త్రములఁ దగం బఱపించెన్ 2038

క. కొడుకులతో దశరథవిభుఁ
డడుగులఁ దత్పటములందు నల్లన నిడుచుం
గడు వేడుక విచ్చేసిన
నెడఁదన్ ముదమొందె జనకుఁ డెంతయుఁ బ్రీతిన్ 2040

తే. సవినయంబుగ నెల్లరి చరణకమల
ములఁగడిగి యర్ఘ్యమగు పీఠములనొసంగి
కూరుచుండంగ నొనరించెఁ గోసలేశు
నడుగుఁ దమ్ములఁ గడుగునయ్యవసరమున 2040

తే. అతని శీలంబు స్నేహంబు నభినుతింప
శక్యమే యంత జనకుండు సర్వహృదయ
పంకరుహగుప్త శ్రీరామపాదసరసి
జాతయుగళంబుఁగడిగెఁ సంప్రీతితోడ 2041

క. రామునితమ్ముల మువ్వుర
రామునితో సములఁగానరసి చిత్తమునం
గోమల తత్పదకమలము
లామోదముతోడఁగడిగె నాత్మకరములన్ 2042

తే. ఉచితపీఠంబులందు గూర్చుండఁజేసి
సూపకారులఁ బిలిపింప క్షోణినాథు
నాజ్ఞచొప్పున వారల కాదరమునఁ
బత్రములఁదెచ్చి వైచిరి పంక్తులమర 2043

తే. అట్టిపత్రంబులన్నియు నలఘురత్న
నిర్మితంబులు వరతపనీయరచిత
మైన కోళ్ళచే నొప్పారునట్టివగుచుఁ
గనుల మిఱుమిట్లుగొలిపెడి కరణిఁదనరె 2044

తే. చతురులౌ సూపకారులు క్షణములోనఁ
జారుసూపోదనంబు సుస్వాదుగంధ
పూతఘృతమును బహువిధాపూపములును
నవ్యభక్ష్యాన్నములు వడ్డనంబుసేయ 2045

తే. ముందు ప్రాణాహుతులఁ గొని భోజనంబు
పక్రమించిరి సేయంగ బహుళతరవి
నోదగానంబులన్ విని మేదురప్ర
మోదరసమగ్నులగుచు నవ్వుచును వారు 2046

ఆ. బహువిధంబులైన వ్యంజననామంబు
లెఱిఁగి పలుక నెవరికేనివశమె
నాల్గువిధములైన నవ్యభోజనపదా
ర్థములనొకటి నెన్నఁదరముగాదు 2047

తే. షడ్రసోపేతభోజ్యముల్ సంతసమున
నాహరించుచునుండెడి యవసరమున
స్త్రీపురుషనామముల నెత్తి చెలువుమీఱఁ
జెలులు గానమొనర్చిరి చిత్తమలర 2048

తే. నిజసమాజంబుతోఁ గూడ నృపకులావ
తంసమైయొప్పు దశరథ ధరణినాథుఁ
డీవిధంబున భోజనం బెలమిచేసి
యాచమనమాచరించె ననంతరంబ 2049

క. ససమాజంబుగ దశరథ
వసుధేశ్వరుఁ బూజచేసి వరతాంబూలం
బొసఁగెం జనకుఁడతండుం
బ్రసన్నమతి విడిదకరిగెఁ బరివారముతోన్. 2050

తే. నిత్యనూతన మంగళాన్విత పురమున
దినము రాత్రియు నిమిషమోయనఁగ గడుపఁ
బడియెఁ బ్రాహ్మంబునను లేచెఁ బంక్తిరథుఁడు
గుణసమూహంబు యాచకగణమువాడ 2051

చ. సుతుల సవధూసమేతముగఁజూచి మహీపతిగన్న యానుఁదో
ద్ధతిగణియింపశక్యమె యతండనురాగముతో సహర్షఖో
చితవిధులెల్లఁదీరిచి వసిష్ఠమహామునిపాలికేగి యా
శతధృతికల్పుఁడై తనరుసంయమికిం బ్రణమిల్లి భక్తితోన్ 2052

తే. పూజగావించి హస్తముల్ మొగిచి యమృత
రస సమంచితమైన వాగ్రచనమెఱయ
దేవ వినుఁడిపుడిదె భవదీయకరుణ
నఖిలకార్యంబులున్ సాంతమయ్యెఁజుండు 2053

తే. కానవిప్పుడు బ్రాహ్మణగణముఁ బిలిచి
యిందు నాలంకృతంబులై యొసఁగు ధేను
వులను వారికి ననఘుఁడలరి ఘనత
నెంచి రాజును మునుల రప్పించెనటకు 2054

తే. వామదేవుండు వల్మీకభవుఁడు నార
దుండు జాబాలి గాధిసుతుండు మొదలు
గాఁగ వరసంయమీంద్రనికరముకరము
మోదమొందుచు విచ్చేయఁ బుడమితేఁడు 2055

ఆ. దండప్రణామ తత్పరుండై పూజ
లాచరించి సముచితాసనముల
నొసఁగి నాల్గులక్ష లుత్తమలక్షణ
కామధేను సదృశఘనసురభుల 2056

క. పూనిసమలంకృతంబులు
గానొసరుపఁజేసి రాజు క్ష్మాదేవులకుం
దానముసేసి వినతుఁడై
నేకొందితి భువనమున జనించినఫలమున్ 2057

క. అని యాశీర్వాదంబులఁ
గొనె నారవికులవిభుండు క్షోణిసురులచే
మనమలర నయ్యెడకున
య్యనంతరము పిలిచి నృపతి యాచకసమితిన్ 2058

ఆ. అభిమతంబులెఱఁగి హయగజరథవస్త్ర
కనకరత్నచయముఁ గడుముదమున
వారికెల్లనొసఁగె వసుమతీనాథుండ
వారిగాఁగ నెల్లవారుఁ బొగడ 2059

క. జయజయజయ దినకరకుల
పయోజరవి యనుచువారు ప్రస్తుతులడరం
గయశోగుణగానములెం
తయుఁ జేయుచు నరిగి రాత్మధామంబులకున్ 2060

క. ఈవిధమున శ్రీరాముని
వైవాహిక శుభమహోత్సవంబయ్యెను త
చ్ఛ్రీ విభవము వర్ణింపఁగ
వేవదనములున్న యురగ విభునకు వశమే 2061

తే. సారె సారెకుఁ గౌశిక చరణములకు
నతశిరుండయి దశరథ క్షితిపుఁడనియె
నీసుఖంబెల్లఁ గంటి మునీంద్ర త్వత్కృ
పాకటాక్ష ప్రభావంబు వలనఁ గాదె, 2062

క. అని పలికి జనకు స్నేహము
ననుపమ శీలంబు సత్క్రియావ్రాతంబుం
ఘనమగు నైశ్వర్యంబును
గొని యాడెం దశరథుండు కుతుకంబలరన్ 2063

క. దినదినము లేచి దశరథ
జనపతి నిజనగరమునకుఁ జనుతలఁపొదవం
జనకుని సెలవడుగంగా
ననురాగాధికత నిలుపునాతండతనిన్ 2064

తే. నిత్యనూతనాదరములు నెగడుచుండు
వేవిధంబుల సత్కార విధులు జరుగు
నహరహముఁగ్రొత్తయానందమలరఁబురిని
నెవరు సైవరుదశరథుఁడేగుటకును 2065

తే. ప్రేమ పాశబంధితులయి పెండ్లివారు
నిలచిరో యన నీరీతిఁ బలుదినములు
గడచె నంత శతానందకౌశికులు వి
దేహ భూపాలు కడకేగి తెలిపిరిట్లు 2066

ఉ. కోసలదేశనాథు నెడఁగూరిమి బాయఁగఁజాలవైన నీ
వీసమయంబునందు సెలవిమ్మతనింబురి కేగ నానతం
డా సువిచారులంగని నయంబున మంచిది సామియంచు వి
శ్వాస వివేకయుక్త సచివప్రతతింబిలిపించె నత్తరిన్ 2067

ఉ. చెచ్చెరమంత్రులేగి జయజీవయటంచు నతోత్తమాంగులై
హెచ్చిన భక్తి నుండ మిథిలేశ్వరుఁడిట్లనెఁగోసలేశ్వరుం
డిచ్చస్వకీయరాజ్యమున కేగఁదలంచె నటంచు లోనికిం
జొచ్చియెఱుంగఁజేయుఁడని క్షోణిపుఁడానతియిచ్చె మాటకున్

తే. సచివులును బ్రాహ్మణులు సభాసదులె కాక
స్వయముగా రాజుఁబ్రేమరసప్రపూరి
తాంతరంగుఁడుగాఁబురినఖిల జనులుఁ
బెండ్లి వారలరుగు వార్త వినినయంత 2069

ఆ. వికల చిత్తులగుచు వేవేగ నొండొరు
లడిగి వార్త సత్యమనుచుఁ దెలిసి
సంజవేళ సరసిజంబులు ముకుళించు
పగిదిఁ జెన్నుదఱిగి వగచిరపుడు 2070

తే. ఎచ్చటెచ్చటఁ బెండ్లివారేగుదెంచి
విడిసియుండిరో యచటికి వివిధభోజ్య
ఫలచయంబులుఁ బక్వాన్నములును వచ్చె
వాని వర్ణింప నేరికి వశముగాదు 2071

ఆ. బహుపదార్థ వితతి బలిసిన యెడ్లపై
జనకుఁడంపె నెంటఁ జాలమంది
కాపుజనులు సూపకారులరుగు చుండ
లక్షహరులు నర్థలక్ష తేర్లు 2072

క. సాలంకృతములుగా భూ
పాలుండొనరింపఁ జేసిపంపె దిగిభముల్
చాలగసిగ్గిలఁదగు పది
వేలును దేభములఁగూడ విపులతరముగన్ 2073

శా. సింగారింపఁగ జేసి రాజు పనిచెంజేరల్ మణుల్ సొమ్ములుం
బంగారంబును నింపి పొంపిరిగొనం బండ్లున్ మనోజ్ఞంబులౌ
శృంగంబుల్ గొనబైన యంగములతోఁ జెన్నారుగోశ్రేణి మా
తంగస్ఫూర్తిఁ జెలంగు మేల్ మహిషి బృందంబుం బదార్థంబులున్

ఉ. అపరిమితమైన హరణంబులంపె జనకుఁ
డవిగణింపంగఁ బలుకంగ నలవియగునె
లోకపాలురసంపద లొచ్చువాఁగఁ
దోఁచు వానిని బరికించి చూచినంత 2075

తే. ఈవిధంబున జనకుఁడనేకమగు ప
దార్థ సందోహమును నయోధ్యకును బంప
రాణులెల్లరుఁ బెండ్లి వారలు స్వదేశ
మునుగువృత్తాంతమాలించి వ్యాకులమున 2076

క. జలహీనమైన మడువునఁ
గలవళ్ళదు మీనగణముగతినై సీతా
లలనను మాటికి మాటికిఁ
జెలువుగ నుత్సంగములను జేర్చికడంకన్ 2077

క. దీవించుచుఁదగుబోధలఁ
గావించుచుఁబతిని సతముఁగడు ప్రేమమునన్
సేవించుచు సౌభాగ్యవ
తి వెలయుమయిదియె మాదు దీవన యనుచున్ 2078

తే. అత్తమామల సేవింపు మనవరతము
గురులఁగడుభక్తి మీఱఁగఁగొలుచుచుండు
మధిపునానతి వర్తింపుమమ్మ యనుచుఁ
జతురులౌ చెలుల్ స్త్రీధర్మ సరణిఁదెలుప 2079

చ. తనయలనెల్లరంబహువిధంబుల బోధయొనర్చి తల్లులు
మ్ముననగదియంగఁజేర్చికడుఁగూరిమి మీఱఁగ మాటిమాటికిం
గనుఁగొనలందు బాష్పములు గ్రమ్మఁగధాత్ర సృజించెనేలకో
వనితలనంచుఁబల్కు చనివార్యమనోవ్యథనొందిరందఱున్ 2080

— రామ లక్ష్మణ భరతశత్రుఘ్నులత్తలసెలవొంద
జనకునంతః పురమున కేగుట —

ఉ. ఆసమయంబునందిన కరాన్వయ కేతుఁడు రామచంద్రుఁడా
దాసచకోరపూర్ణశశి సోమునిలో మిథిలావనీశు నా
వాసముఁజేరనేగెఁ జెలువంబుగ నాః టిఁబొందసల్వరుం
భాసురనైజసౌష్ఠవ విభాసిపూర్ణతనొప్పిరయ్యెడన్ 2081

ఉ. వారలఁ జూడనాపురనివాస వధూపురుషుల్ మహాముదం
బారఁగఁ బాఱిరందొక మృగాక్షి వచించెను నేఁడె సుందరా
కారులు వీరలేగుటకుఁ గాంక్షనిదే సెలవొంద వచ్చిరీ
భూరమణుండు వీరలను బుచ్చఁగ సిద్ధమొనర్చెనే చెలీ 2082

ఉ. ఎవ్వరెఱుంగఁజాలుదురదెవ్వరి పుణ్యము చేతవీరి ని
ట్లివ్విధి తోడి తెచ్చె మనయత్నుల విందులుగా నొనర్చెనో
క్రొవ్విరి బోణి యోచతుర కూర్మి మనఃప్రియమై చెలంగు నా
పువ్విలు కాని బోని నృపపుత్రిచతుష్కముఁజూడవే చెలీ 2083

క. మరణించు వారు సుధయుం
ధరజన్మంబాదిగా క్షుధావ్యథితులు ని
ర్జర భూజము నారకులా
హరిపదముంగన్నరీతి నతివరో మనమున్ 2084

క. నిరుపమ సుందరులగు నీ
నరనాథకుమారవరుల నలువురఁగనులం
బరమ ముదంబునఁ గంటిమి
సరసిజముఖి పుణ్యమెంత సలిపితిమొ కదా 2085

క. రాముని రూపము మానస
తామరసంబునను నిలిపి తన్మనమును పెన్
బాముసకొందల మణిగా
నో మానిని సలుపు మనుచు నొండొరులు కడున్ 2086

క. ప్రియముగఁ బలుకఁగ వారికి
నయనంబుల ఘనము లిడుచు నలుగురు కొమరుల్
వియదంకసాధికోన్నత
మయిన నృపాలయము చొచ్చిరా సమయమునన్ 2087

ఉ. రూపసముద్రులై తగు సరోరుహనేత్రుల రాజపుత్రులం
దీపితగాత్రులం గని విదేహ మహీరమణావరోధకాం
తా పరిచారికా జనకదంబము హర్షమునొంది లేచెనా
భూపసుతాళికిత్తెఱఁ బొంగుచు హారతులిచ్చి హెచ్చుగన్ 2088

ఉ. రామునననంతకాంతి నిధి రాగవశంబునఁ గాంచి తత్కృపా
ధాముని కోమలాంఘ్రులముదంబున మాటికి మాటికంటుచుం
బ్రేమ రసాతి విహ్వలతప్రీడను వీడిరి వారి స్నేహము
ద్దామ మసీమమై సహజతందగు దానినుతింపశక్యమే 2089

ఉ. తమ్ములతోడ రామ హిమధామునకున్ వనజాక్షులెల్లఁ జి
త్తమ్ములు పల్లవింపఁ జేయిదమ్ముల గమ్మను కమ్మవాసనల్
గ్రమ్మ నలుంగుఁ బెట్టి వరగంధ జలమ్ముల మజ్జనక్రియల్
సమ్మతి నాచరించి తగషడ్రసభోజ్యము వెట్టి రంతటన్ 2090

ఆ. సమయమెఱిఁగి రామచంద్రుండు సస్నేహ
శీలవచన రచనఁ జిత్తమలర
శ్వశ్రుజనులఁ గాంచి సంకోచమొందుచు
లలితగతిని యమృతమొలుకఁ బలికె 2091

ఆ రాజయోధ్యకేగఁ గాఁజిత్తమున నెంచి
పంచె నిటకు సెలవు వడయుకొఱకు
తల్లులార మమ్ముఁదనయులఁ గాఁగ భా
వించి యాజ్ఞనొసఁగ వేఁడుచుంటి 2092

క. మాపై ననవరతంబును
జూపందగుఁ బ్రేమమనుచు సురుచిర లీలం
భూపాల తనయుఁడనవిని
భూ[illegible]లుకులకెదఁగలంగిరవరోధసతుల్ 2093

ఆ. ప్రేమ వివశయగుచు నేమియుఁబలుకంగ
నలవికాక యత్తయాత్మ సుతల
నురమునందుఁగదియనొగిఁజేర్చి ముద్దాడి
పతులకొప్పగించి బహుతరముగ 2094

ఆ. వినయ మొప్ప రామవిభునకు సీతామ
తల్లి నొప్పగించి తండ్రి సీత
ప్రాణతుల్య సుమ్ము పట్టణ జనులకుఁ
బతికి మాకు సకల పరిజనులకు 2095

చ. తెలియనివాఁడవే చతుర ధీనిధి నీవు సమస్తమాస్థితుల్
తలపఁగ నీకుఁదెల్లమగు దాసిగనీ మెగ్రహించి ప్రేమ ని
స్తుల గుణశీల రాగములఁజూచిముదంబున నేలుమన్న నా
తులసి వచించె నాత్మఁబరితోషమునొందుచునావిధంబునన్ 2096

ఆ, అనుచు మరల మరల హస్తముల్ ముకుళించి
నీవు భక్తహృదయ నీరజములఁ
గలుగు భక్తినెఱుఁగగల పూర్ణకాముఁడ
వనఘ జ్ఞానిజన శిరోవతంస 2097

అ, రామ దోషదళన రవివంశదీపక
పరమసుఖనిధాన భద్రసదన
కలిత సుస్వరూప కరుణానికేతన
యఖిల మానసప్రియాభివేది 2098

ఆ. అనుచు రామచంద్రు నంఘ్రిద్వయముఁబట్టె
జనకుపట్టమహిషి తనదువాణి
పరమమైన ప్రేమ పంకంబునం జిక్కె
ననఁగ వినయ గరిమ మతిశయిల్ల 2099

క. పరమస్నేహా యుతములై
పరఁగెడి యానుడుల రామభద్రుఁడు వినుచుం
బరితోషంబున నత్తకు
సరభసమతిఁ జేసె మిగుల సన్మానంబుల్ 2100

ఆ. అనుజసహితుఁడగుచు నానంద మయమూర్తి
హస్తపంకజ ద్వయంబు మోడ్చి
పలుతడవల దండవత్ప్రణామం బాచ
రించి సెలవొసంగుఁడంచు వేఁడి 2101

ఆ. అత్తవలననప్పుడాశీర్వచనములు
పడసి మరల శిరమునంచి మ్రొక్కి
చారురూపరాశి సహజన్మయుక్తుఁడై
మరలె వెడలి రాజమందిరంబు 2102

తే. మధుర మంజుల మూర్తిని మనములందు
నిలిపి రాణులు ప్రేమవిహ్వలతనొంది
మరలధృతిఁబూని యాత్మకుమారికలను
గరుణ మెయిఁ జేరి పలుమార్లు కౌఁగిలించి 2103

క. మాతలు సుతలంబంపుచు
వేతిరుగఁ గలిసికొనుచు వెల్లి విరియుచుం
బ్రీతి పరస్పరమధికం
బై తనరఁగఁ బాయలేని యనురాగమునన్ 2104

తే. మగుడుఁగొని వేగ సరసకుఁ త్వరగఁ బాఱు
ధేనువో యనఁ జెలిమి కత్తియల విడిచి
మాటిమాటికి రాణులాత్మజల కడకు
నరిగి పరిరంభణము సేసి యనుపునప్పుడు 2105

ఆ. ప్రేమవివశులైరి వెలఁదులుఁబురుషులుఁ
బురజనులును నంతిపురి సతులును
గానసమ్యోనపుడు కరుణా విరహముల
కిక్కయనఁగ జనకనృపు పురంబు 2106

సీ. కనకపంజరములఁగడుప్రీతితో నుంచి
శారి కాకీరసంచయముఁ బెంచి
జనక కన్యక పండ్లుఁజక్కెరఁదినిపించి
సంతోషమే పారఁజదువుసెప్పి
ముద్దుచేయుటఁ జేసి మోహంపు పెంపున
సీతామహాదేవి చెలిమిఁ బాయఁ
జాలక మాటికి జానకి యేదని
వ్యాకులంబున నావిహంగపంక్తి

తే. కరుణముగఁ బల్క పల్కులు కర్ణరంధ్ర
ములఁబడిన నెల్ల ధైర్యంబునిలుచునెట్టి
కఠినులకునైన డెందంబు కరుగకున్నె
యట్టియెడ రాణులయవస్థయడుగనేల 2107

క. పశుపక్ష్యాదులు వ్యాకుల
దశనొందెననంగ మనుజ దశఁదెలుపంగా
వశమగునే జనకుండును
గుశధ్వజయుతముగ నాడకుంజనుదెంచెన్ 2108

తే. పొంగుప్రేమరసంబున భూవిభునకు

క. సీతాదేవిం బ్రియసుత
నాతఁడు కౌఁగిటను బొదివి యత్యంతము వి
ఖ్యాతమగు జ్ఞానసంబం
ధాతతమర్యాదఁబోవనడచె నడలుచున్ 2110

క. సచివులు దెలుపఁగ శోకం
బుచితముగాదను చెఱింగి యుర్వీశ్వరుఁడ
య్యచలా సుతఁగౌఁగిటనిడి
యచటికి రప్పించె సుందరాందోళికమున్ 2111

క. పరివారంబెల్ల మహా
త్తర ప్రేమ వివశముగాఁగ ధరణీశ్వరుఁడ
వ్వరలగ్నంబున గణపతి
స్మరించి సుతఁగూరుచుండ సలిపె శిబికపై 2112

క. జనకుఁడు బోధించెను నిజ
తనయకుఁ గులపద్ధతియును దరుణీ ధర్మం
బును దాసదాసికా జన
ము నొసంగెఁ సీతకూర్పు పూతాత్మకముగ 2113

ఆ. సీతయేగుచుండఁ జింతచేఁ బురమున
వికలచిత్తులైరి సకలజనులు
శుభశకునము లెదుటఁజూపట్టె సచివభూ
సుర యుతముగ నంపనరిగెరాజు 2114

ఆ. సమయమరసి మొరసె సకలవాద్యంబులు
పయనమునకు సిద్ధపఱుపఁబడియె
రథగజాశ్వవితతి బ్రాహ్మణులంబిల్చి
దానములనొసంగె దశరథుండు 2115

## దశరథుఁడు స్నుషాతనూజ సహితముగ సపరివారుండై యయోధ్యకేగుట

క. ధరణీసురపద ధూళిఁ
శిరమున ధరియించి వారిచే దీవనలం
బరితోషంబున నొందుచు
ధరణీపతి విష్ణుపతిని దలఁచుచుఁగదలెన్ 2116

క. శుభశకునంబులు దోఁచెఁ
నభమున దుందుభులుమ్రోసె నవ్యసుమంబుల్
రభసమున సురలుగురిసిరి
బుభుకాంతాగానమెసఁగె హృదయంగమమై 2117

తే. వాద్యవిసరంబుమ్రోయఁగా వైభవంబె
సంగ దశరథభూపతి సంతసమున
నరుగుకాలంబునందు మహాజనులను
వినతియొనరించి మరలించి వెండిప్రీతి 2118

తే. యాచకావళిఁ బిలిపించి యాదరించి
వస్త్రభూషణ మణిహయవారణములు
వాంఛితార్థంబులెల్ల నవ్వారిగాఁగ
నిచ్చి సంప్రీతిఁ దృప్తినొందించి నిలిపె 2119

క. బిరుదావళి వర్ణించుచు
నరుసంబున రామచంద్రు నాత్మనిలిపి యే
గిరి మరలి యాచకులు ఖర
కరకులపతి దశరథుండు కడుప్రేమమునన్ 2120

తే. మాటిమాటికి జనకుని మరలుఁడింక
చాలదూరంబు విచ్చేసి శ్రమపడంగ
నేల యనపుడు జనకుండు చాలప్రేమ
వశత విడువంగఁజాలఁ డవ్వసుమతీశు 2121

తే. మరల దశరథుఁ డనియె నో మనుజనాథ
చాలదవ్వేఁగుదెంచిరి చాలునింక
నిలువవేఁడెద నవనిత్ప్ర నృపతికనుల
వెంటఁ బ్రేమప్రవాహంబు వెల్లివిరియ 2122

ఆ. కరయుగంబు మోడ్చి ఘనత చేసిరి మహా
రాజ నన్ను మిమ్ముఁ బ్రణతి సేయు
నేవిధమున నేర్తు నేనని జనకుండు
ప్రేమసుధ స్రవింప బలుక్టయును 2123

ఆ. కోసలేశ్వరుండు కూర్మితో సజ్జనుం
డైన బాంధవుని సమాదరమున
గారవించె వినయగరిమ నన్యోన్యంబు
ప్రేమ పట్టరాక హృదులనిండె 2124

క. మునిమండలికిం జనకుం
డనఘమతిఁ మ్రొక్కి పొంది యాశీర్వాదం
బును రూప శీలసద్గుణ
వనధుల జామాతృవరుల వరుసం గనియెన్ 2125

ఉ. పంకజ సన్నిభంబయిన పాణియుగంబును మోడ్చి ప్రేమచే
నంకురితంబులైన వినయంబగు మాటలఁ బల్కె మౌని రా
ట్శంకర హృన్మనఃసరసి సంతతమున్ విహరించు హంసయో
పంకరుహాక్ష రామ నిను బ్రస్తుతి యెట్లొనరింతు నవ్యయా 2126

చ. మమతయు మోహమున్ మదము, మత్సరమున్ విడనాడి యోగు లే
విమలు నెఱుంగఁగోరుచుఁ బ్రవీణత యోగము నభ్యసింతురో
శమదమయుక్తులౌచు నిను శాశ్వతునిం గుణరాశి నిర్గుణుం
డను నినవేద్యు బ్రహ్మమును సత్సుఖచిన్మయు వ్యాపకుంబరున్

చ. మనమున భేదవాదమగు మాటలచేఁ దెలియంగనేర మె
వ్వని ననుమానియై చుచు ధ్రువంబుగఁదోచుఁ దెవండతర్క్యుఁడై
ఘనమహిమంబదెవ్వని దగణ్యము వేదము నేతి నేతి యం
చని ప్రతిపాదకంబు వెలయంగనొనర్చునొ యమ్మహాత్మునిన్ 2128

ఉ. ఎవ్వఁడు మూఁడుకాలముల నేకవిధంబున నొప్పుచుండునో
యవ్విభు సర్వసౌఖ్యనికరాకరు శ్రీకరుఁ గన్నదోయిచే
నివ్విధిఁజూడఁగల్గనిటు లేకద జీవుల కష్టసంతతుల్
దవ్వయి లాభమబ్బు భువి దైనము తాననుకూలమైనచోన్ 2129

ఉ. అన్నివిధంబులం ఘనతనందగఁజేసి త్వదీయభక్తుగా
మన్ననచేసినావు నను మామక భాగ్యవశంబునంగదా
పన్నగవంశనాథుఁడును భారతులుం బదవేలమంది ని
న్నెన్నగ గోటికల్పముల కేనియు శక్తులె యీశ్వరేశ్వరా 2130

ఉ. నీగుణగాథఁబల్కుచు గణింపఁగ నాదగు భాగధేయ మిం
కేగతినోపునైన నొకయించుకనాకు బలంబుగల్గె ధీ
సాగర కొంతస్నేహమున సమ్మతిఁగాంచుచు నుంటినందుచే
నేఁగడు సంతసించెదను నెమ్మది నమ్మికతో రఘుప్రభూ! 2131

చ. కరసరసీజముల్ మొగిచి క్రమ్మర వేడెద సారెసారెకో
పరమకృపాబ్ధి నీచరణ పంకజయుగ్మముఁ బాసిమన్మనం
బరుగఁగనీక కావవె యొకప్పుడు విస్మృతినైన నన్నత
త్పురుచిరమైన ప్రేమరసశోభితవాక్కులకుం బ్రమోదినై 2132

చ. శ్వశురుని సమ్రభావమున సన్మునిశేఖరుఁడై వెలుంగున
క్కుశిక కులావతంసుకిరియ గుర్వయియొప్ప వసిష్ఠుపోలికం
దశరథరాజు చందమునదద్దయు భక్తిఁబ్రపూర్ణ కాముఁడై
విశదయశుండు రాముఁడెదవీక్షణసేయుచు గౌరవింపగన్ 2133

చ. భరతునిఁ గాంచి యాజనక పార్థివశేఖరుఁ డెన్ని యేనియున్
సురుచిరభాషలన్ వినతి నూపుచు దీవెనలిచ్చి వెండియున్
నిరుపముఁ డవ్విదేహ ధరణీపతి ప్రీతి సుమిత్రపుత్రులం
గరమనురాగమొప్పఁగని కాంక్షను దీవనలిచ్చె నంతటన్ 2134

క. అందఱుఁ బరస్పరంబున
మందంబగు ప్రేమవశత మస్తకముల నిం
పొందఁగ వంచినమస్కృతు
లందంబుగ మరలమరల నర్పించిరొగిన్ 2135

క. వినయంబు మాటిమాటికి
జనకః నియెడ సలిపి రామచంద్రుఁడు సెలవుం
గొని చనె ననుజయుతంబుగ
జనకుఁడు సనికౌశికాంఘ్రి సరసీజములన్ 2136

క. హస్తములబట్టి తద్రిజంబ్వాదలను ధ
రించి కనుదమ్ములందాల్చి యింపుతో వ
చించెమునినాథ మిమ్ము దర్శించినంత
దుర్లభంబుండదని నమ్మెదను మనమున 2137

తే. ఏసుఖంబును యశమును నిచ్చఁగోరి
నోడుదురు లోకపాలురుఁగూడ నట్టి
సుఖమును యశమును నాకబ్బె సుండుమీదు
దర్శనంబునఁ జేసియో తాపసేంద్ర 2138

ఆ. అనుచు మరల మరల వినయంబునూపుచు
శిరమువంచి ప్రణతిచేసి మునికి
యతనిచేతఁ బడసి యాశీర్వచనముల
జనకవిభుఁడు మరలి చనియెఁ బురికి 2139

ఆ. వివిధవాద్యములను వేడ్కతో మ్రోయించి
పెండ్లివారు నడువ చిన్నపెద్ద
లందఱును బ్రమోదమందిరి గ్రామాళి
స్త్రీపురుషులు రాము చెలువమరసి 2140

క. కన్నులుగల ఫలమొందుచు
నెన్నంగారాని గతి సుఖించిరి నడుమం
జెన్నుగ విడియుచుఁబలు చో
ట్లన్నరులకు సుఖమునిడఁగడంగిరి వారల్ 2141

తే. ఒకపునీత దినంబున నుత్సవంబె
సఁగ నయోధ్యా సమీప దేశంబుఁ జేరి
రపుడు భేరీమృదంగ కాహళ సుశంఖ
పణవముఖ ఘోషము సెపుడు పడఁగ నడరె 2142

తే. హారి హేషారవములు మద
కరిఘీంకారములు సెలఁగఁగాఁ దూర్యంబుల్
మొరసెం బహురాగంబులు
నరుదెంచిరి పెండ్లివారలని మోదమునన్ 2143

క. పురజనులు సంభ్రమించుచు
శరీరములు పులకరింప సకలంబగు మం
దిరముల ద్వారపథాదుల
గరమొప్ప నలరింపఁ గడఁగిరి వరుసన్ 2144

క. పొలుపుగ వీధుల గమగమ
వలచెడి కలయంపి సల్లఁబడె నెల్లెడలం
జులువలరారఁగఁ జలికెల
నెలకొలిపిరి విపణులం గణింపఁగవశమే 2145

క. అతిరమణీయతనొప్పెడి
వితానములుఁ దోరణములు విన్నొరసెడి మం
జుతరంబగు కేతనములు
నతులధ్వజములును వెలసెనంతటను బురిన్ 2146

తే. కదళికాపూగ వకుళామ్ర కమ్రతరక
దంబనింబతమాల ముఖ్యంబులైన
సఫలశుభవృక్షములఁదెచ్చి క్ష్మాతలమున
నాటిరత్నాలవాలబృందము రచించి 2147

క. మంగళకలశంబుల గే
హాంగణముల నెల్లయెడలనమరించిరి బల్
సింగారంబుగ నజముఖు
లుంగని రాఘవు పురంబులోలతఁబొగడన్ 2148

క. ఆతఱి నృపభవనముఁగనఁ
జేతోజాతుని మనంబుఁజెందున్ మోహాం
బాతత మంగళశకునా
న్వీతంబై వృద్ధి సిద్ధి విపులసుఖంబుల్ 2149

క. సంపదయను నుత్సాహము
నింపగు సహజాంగములధరించి యెలమితో
గుంపుగఁజని దశరథు నిలు
సొంపొందఁగజేసెననఁగ శోభిల్లుఁగడుఁ 2150

ఆ. అఖిలసౌఖ్యములకు నాకరంబైనట్టి
రామచంద్రి జనకరాజసుతలఁ
గన్నులారఁగాంచుకాంత యెవ్వారిమదిఁ
బొడమకుండు సకలభువనములను 2151

తే. యూథయూథంబులుగఁ బుణ్యయువతులెల్లఁ
జారులావణ్యరూప విస్తారగరిమ
రతిని లజ్జితఁ గాఁ జేయు రాజముఖులు
గలిసిచని రక్షి పర్వంబుగాఁగ నపుడు 2152

క. సకల సుమంగళ వస్తు
ప్రికరము హారతులిడం గరంబులగొనియా
పికవాణులు వాడిరి వే
డుక భారతిరూపములు కడుం దాల్చెనన్ 2153

క. అతికోలాహలమయ్యెన్
క్షితిపతిమందిరమునందుఁ జెప్పఁ దరంబే
యతిశయమగు నప్పటిసుఖ
గతిఁ దనువులు మఱచి రెలమిఁ గౌసల్యాదుల్ 2154

దశరథుఁడు స్నుషాతనూజ పరివారయుతముగఁ బురప్రవేశమగుట

తే. పురవిరోధిని గణనాథుఁ బూజచేసి
విప్రవరులను బహుదానవిధులఁ దనిపి
రిక్తుఁడగుమానవుఁడు చతుర్విధపదార్థ
ములనుగని పొంగువిధమున మోదమొంది 2155

క. రాముని మాతలుహర్షము
చే మేనులు మఱచిరపుడు చేతనభావం
బేమియు లేమిం బదములు
భూమింగదలింప లేని పోలిక వెలయన్ 2156

ఉ. రాముని దర్శనార్థ మనురాగము మీఱ వధూసమేతులా
నామనుజేంద్రనందనుల నంచితరీతి నెదుర్కొనంగ ను
ద్దామముదంబుతో బహువిధంబగు మంగళవస్తుసంతతుల్
గోమలులెల్లఁ బ్రీతినొడఁగూరిచియుంచిరి సంభ్రమంబునన్ 2157

తే. వివిధవాద్యరవంబులు వెలయ మంగ
ళప్రదంబగువస్తువుల్ ప్రమదమున సు
మిత్ర సంసిద్ధమొనరించె మేదురముగఁ
బసపు దధి వక్కలాదులఁ బల్లవములు 2158

క. పూలుం దూర్వాంకురములు
మేలగు లాజాక్షతలును మించుతుల జా
జులును గోరోజనమును
మేలిమి పసిఁడికలశములు మిగులఁగ వెలుఁగన్ 2159

క. వెడవిల్తుఁడు నీషంబులఁ
గడుఁజిత్రంబుగ సృజించెఁ గావలెనన్‌దోఁ
చెడి నాకనక కలశములు
జడదారులుఁగనిన మోహజలనిధి మునుఁగన్ 2160

ఆ. భద్రశకునములును బహుసుగంధాన్విత
వస్తువితతి నెన్నవశముగాదు
కలితమంగళోపకరణంబులం గూర్చి
రాణులెల్ల రథికరాగమెసఁగ 2161

క. హారతు లొసంగుటకున్ శుభ
చారుపదార్థములనెల్ల సంసిద్ధముగా
నారీమణు లొనరించి య
వారితహర్షమునఁగల రవంబునఁ బాటల్ 2162

ఉ. పాడుచు హేమపాత్రల నపారశుభప్రదవస్తుసంతతుల్
వేడుకతోడ రాణులు నవీనసరోరుహపాణులం గడుం
బోడిమిఁబట్టి దేహములుపుల్కలఁ బల్లవితంబులై తగం
జూడఁగ నేగిరా మదనసుందరగాత్రుల నాత్మపుత్రులన్ 2163

ఉ. శ్రావణమాసవారిదముచాడ్పున మింటికిధూపధూమముల్
వోవఁగ మేచకావృతనభోవిధిఁదోఁచె బలాహకాళినా
భావములన్ హరింపఁగల భాసురకల్పకసూనమాలికల్
దేవతలెల్ల హర్షసముదీర్ణతతోఁ గురియించిరత్తఱిన్ 2164

తే. మంజుమణితోరణంబులు మఘవచాప
సదృశముగఁబొల్చె మేడలఁజంచలాక్షు
లంచితంబగు చంచలలనఁగఁదోఁచి
మెఱుఁగుపడుచుండి రట్టిసమయమునందు 2165

తే. దుందుభిధ్వని గర్జయైతోప నర్థి
చాతక మయూర భేకసంచయములలర
సురలు గంధాంబుపూరంబుఁగురియఁ బురిని
స్త్రీపురుష సస్యసంతతి క్షేమమొందె 2166

క. అనుకూలసమయమని గురుఁ
డనుమతినొసఁగంగ దినకరాన్వయమణి చే
సెను దగఁబురప్రవేశము
జనవిభుఁడు గణేశును మనుశంభుఁదలఁచుచున్ 2167

క. ససమాజుఁడగుచుఁ గౌతుక
రసమగ్నుండయ్యె శుభకరంపు శకునముల్
పొసఁగె సురదుందుభిధ్వను
లెసఁగఁగ సుమవృష్టికురిసె నెంతయు వేడ్కన్ 2168

క. కలితకలస్వనముల సుర
లలనలువాడుచు విచిత్రలాస్యములొప్పన్
సలిపిరి సంతోషంబున
నలరుచు శ్రీరామచంద్రునరయుచుఁ బ్రీతిన్ 2169

తే. వందిమాగధసూతులు వరనటులును
యశముఁ బాడిరి త్రిభువనవిశదమై చె
లంగుదాని జయధ్వని మంగళప్ర
దంబునౌ వేదరవ మొప్పె దశదిశలను 2170

తే. విపులముగ వాద్యముల్ మ్రోసెవింట నగర
సురలు నరులును ననురాగభరితులైరి
పట్టరానిసుఖానందభావమౌ ప
రిణయసంఘంపుచెలువు వర్ణింపఁదరమె 2171

క. పురజనులు దశరథేశ్వరు
దరిసెన మొనరించి మ్రొక్కి తదనంతరమౌ
పరిపూర్ణకాము రాముని
నరసి సుఖానందవివశులై రతిప్రీతిన్ 2172

క. తనువులు పులకింపంగాఁ
గనుఁగవ నానందబాష్పకణము లురలఁగా
ఘనతర రత్నాంబరముల
ననూనముగఁ గాన్కలొసగి రందఱు వేడ్కన్ 2173

క. హారతులొసఁగుచుఁ బట్టణ
నారులు రాజేంద్రసుతుల నలువురఁగని వి
స్తారంబగుహర్ష మహా
పారావారమునఁ దేలి పడపడియెలమిన్ 2174

ఆ. అందలంబు చెంతకరిగి కవాటముల్
తెఱచి పుణ్యాసతులు దృష్టితీఱఁ
బ్రియముతో నలువురుపెండ్లికూతులఁ గాంచి
యధికసుఖమునొంది రందఱపుడు 2175

తే. ఈవిధంబున నెల్లరికెలమినిడుచు
భూపవరమందిరద్వారమునకు రాఁగ
నవవధూయుక్తులౌ సుతుల్ నలువురను నె
దుర్కొనుచుఁ దల్లులమితసంతోషమునర. 2176

తే. హారతుల మాటిమాటికీయం దొడఁగిరి
వారి పేర్మిననువర్ణించి పారముఁగన
నశము గా దెవ్వరికి నవ్యవస్త్రభూష
ణముల వరరత్నములను గానుకలనొసగిరి 2177

క. నలు పురుషసుతుల వధూసహి
తులఁగని యానందవార్ధిఁ దోఁగిరి తల్లుల్
ఫలియించె జీవనములన్
తలఁచిరి జానకిని రాముఁ దనియక కనుమన్ 2178

క. సీతావదనాంభోజము
నాతజిసతులెల్లఁ గాంచి యాత్మసుకృతముల్
వే తెఱఁగుల వర్ణించుచు
గీతంబులఁ బాడి రెలమి గిల్కొనుమదులన్ 2179

క. దేవతలు క్షణక్షణముం
బూవులఁగురియించి నృత్యముం జేయుచొగిం
భావంబులలరఁ బాడుచు
సేవలఁబ్రకటించి రెలమిఁ జెందుచుఁ బ్రీతిన్ 2180

మ. ఉరుసౌందర్యనిరూఢతం దగు వధూయుక్తావనీనాథ సుం
దర సత్పుత్ర చతుష్కముం గనుచు మోదం బారవర్ణింపఁగా
సరియెందుం బరికించి కాసమినితత్సౌందర్యముం బ్రీతితో
నరయం భారతి జెప్ప వేయక తదేకాలోకనాసక్తయై 2181

తే. నిగమవిధిఁగులపద్ధతి మిగులఁబ్రీతి
నర్ఘ్యమిచ్చి వధూసమేతాత్మజులను
వస్త్రములమీఁద నడిపించి వైభవముగ
మందిరమునకుఁ గొనిచనిరిందుముఖులు 2182

తే. సహజసుందరములుగ నెసంగునట్టి
నాల్గుసింహాసనములపై నలువుమీఱఁ
బ్రీతి వెలయంగ నాకుమారీ కుమార
కులనుగూర్చుండఁజేసి రంఘ్రిలనుగడిగి 2183

తే. వేదవిధి ధూపదీప నైవేద్యవిధుల
మంగళనిధానులైన కుమారకులను
బెండ్లికూతులఁబూజించి వీచిరపుడు
వ్యజనములఁ జామరంబులు వేడ్కఁదాల్చి. 2184

తే. బహువిధపదార్థములొనంగఁ బడియె యోగి
పరమతత్త్వంబుఁగాంచిన భంగి సతత
రోగి యమృతంబుఁబొందినలాగునం
బ్రిమోదమొందిరి తల్లులప్పుడు మనముల 2185

ఆ. హర్షమొంద సాగి రాజన్మరిక్తుండు
పరుసవేఁగన్న పగిది నంధుఁ
డక్షిలాభమొందినట్టుల జయము శూ
రుఁడును మూగవాణిబడసినటుల 2186

చ. అనుజసమేతుఁడై రఘుకులాన్వయచంద్రుఁడు రామచంద్రుఁడి
ట్లనఁబరిణీతుఁడై భవనముంబరితోషముతోఁ బ్రవేశముం
బొనరుపఁ దల్లులందఱును బొందినమోదముకంటెనూఱుకో
ట్లనుపమమైన హర్షసుఖమందిరి దానినుతింపశక్యమే 2187

క. లౌకికవిధుల దల్లుల
నేకవిధంబులనొనర్ప నించుక లజ్జం
గైకొనిరి వధూవరులా
లోకేశుఁడు రాముఁడెలమిలోలోన న్వేఁ 2188

తే. కామితములెల్లఁ బూర్ణంబుగాఫలించె
ననుచు సురపితృపూజల నాచరించి
వరము వేఁడిరి రాముఁడవరజయుతము
గాఁగఁ గల్యాణమొందఁగాఁ గాంక్ష మొ్రక్కి 2189

క. సంతోషంబున నొసఁగిరి
యంతర్హితసురలు ప్రీతి నాశీర్వాదం
బెంతయు ముదమున నానృప
కాంతలుగొనిరది నిజాంశుకపుటాగ్రములన్ 2190

తే దశరథుఁడు పెండ్లివారినాదరముమీఱఁ
బిలిచి వారికిమిక్కిలిప్రియముతోడ
వస్త్రభూషణ మాణిక్యవాహనాదు
లొసఁగవారును శ్రీరామునుల్లములను 2191

క. నిలుపుకొని దశరథేశ్వరు
సెలవుంగొని కడుఁబ్రసన్న చిత్తంబులతోఁ
జెలఁగుచు వేడుకఁదమతమ
నిలయంబులకేగిరంత నృపతికడంకన్ 2192

క. పురనారీ పురుషులకుం
బరితోషతఁగట్టఁదొడుగ భాస్కరవంశా
భరణుండగు నతఁడిచ్చెఁ
మెరసెందూర్యాదికములు మొగినింటింటన్ 2193

ఆ. అర్థులేనిప్రీతినడిగిన వసుధేశుఁ
డవి యొసంగె వారి కాదరమున
వాద్యగాండ్రు మొదలు వరవుల్ల కమితంబు
గాఁగనిచ్చి తృప్తిఁగనఁగఁజేసె 2194

క. దీవనలొసఁగుచుఁ బ్రణతులఁ
గావించుచుగుణకథలను గడుమోదమునం
భావించి పాడిరెల్లరు
భూవిభుఁడిలు సేరె విప్రబుధగురుయుతుఁడై 2195

తే. అవ్వసిష్ఠాజ్ఞచొప్పున నాదరమున
వేదలౌకికవిధుల నుర్వీపుఁడుసలిపి
బ్రాహ్మణగణంబుఁ బొడఁగని రాణులెల్ల
రధికభాగ్యంబనుచు లేచిరా దృతిఁదగ 2196

ఉ. అజ్జననాథుఁడా ద్విజులయంఘ్రుల ధౌతమొనర్చియర్చనన్
మజ్జనభోజనాదులఁగ్రమంబునఁ దృప్తులఁగా నొనర్చి యో
షిజ్జనయుక్తుఁడై తనివిఁజెందగ దానములాచరింప వా
రజ్జలజాప్తవంశపతి కాదట దీవనలిచ్చి యేగినన్

క. బహువిధముల గాధిసుతున్
మహీవిభుఁడు పూజచేసి మామకసనుఁడి
మ్మహిధన్యుఁడొకఁడు గలఁడే
మహాత్మయని యతనిబొగడి మహిషీయుతుఁడై 2198

తే. భక్తినా సంయమీంద్రుని పాదరజము
మస్తకంబున ధరియించి మనుజవిభుఁడు
రాణివాసంబు మనములరంగఁ గొలువ
ననుపుపడులోని మందిరమతనికొసఁగి 2199

తే. గురుపదసరోరుహాంబుల శిరమునంట
మ్రొక్కి పూజలగావించి పూర్ణభక్తి
వినయముంజూపె నెంతయు మనమునందు
ప్రేమరసముప్పతిలి కడువృద్ధిఁజెంద 2200

తే. నూతనవధూసమేతులౌ భూతలేశు
సుతులు నల్వురురాజులు క్షోణివిభుఁడుఁ
బెక్కుసారులు గురుపాద బిసరుహముల
కెఱఁగినన్ మౌని దీవనలిచ్చుచుండె 2201

క. నందనులకు సంపద్వదన
ముందఱనిడికొనుచుఁ బ్రేమముప్పిరిగొన నా
నందమున వినతుఁడౌ నృపుఁ
బొందుగ దక్షిణనుగొనుచు మునిదీవించెన్ 2202

క. మనమున సీతారాముల
ననితరమగు భక్తినిలిపి హర్షమ్మున న
మ్మునిపతి తనగృహమునకుం
జనియెంద దనంతరంబు జనపతిప్రీతిన్ 2203

తే. బ్రాహ్మణవధూమణులఁ బిల్వఁబంచి భక్తి
వెలయ వస్త్రాభరణములౌ వెలఁదులకు నొ
సంగి ధరియింపఁగాఁజేసి సంతసమునఁ
బుణ్యసతులను బిలిపించి ముదముతోడ 2204

తే. అభిరుచులెఱింగి ధరియింప నధికవస్త్ర
భూషణమ్ములవారి కిమ్మలనొసంగి
దాసదాసీజనంబు నాదరతఁబిల్వ
నంపి వారికిఁగోరినట్లధిపుఁడిచ్చె 2205

తే. ప్రియులుఁ బూజ్యులునగు వారిన్నపుడెఱింగి
యన్నివిధముల సన్మానమాచరించ
రామచంద్రు వివాహమారసి ప్రసూన
వృష్టిఁగురియించిపొగడిరి విబుధులెలమి. 2206

తే. హృదయములఁబట్టరానట్టి ప్రేమ మెసఁగ
రామచంద్రుని యశముఁ బరస్పరంబుఁ
దెలిపికొనుచు సుఖించుచు దివిజులాత్మ
లోకములకును దుందుభుల్ మ్రోయఁజనిరి 2207

తే. అందఱను నన్నివిధముల నవనివిభుఁడు
సమముగా నాదర మొనర్చి సంతసించి
నిండుమతినంతిపురికేగి నిరుపమాన
సుందరవధూసమేతుల సుతులఁగనియె 2208

క. ఉత్సాహంబున వారల
నుత్సంగముఁజేర్చె నృపతి యొరులకుఁదరమే
తత్సౌఖ్యానుభవముఁ ద
ద్వాత్సల్యముఁ బ్రేమనెఱిఁగి వర్ణనసేయన్ 2209

తే. అధికమగు ప్రేమవశమున నవనినాథుఁ
డనుఁగు గోడండ్రనందఱ నంకమందుఁ
జేర్చి మాటికిమాటికిఁ జిత్తమలర
గారవించె నాసంఘంబుఁగాంచి మదుల 2210

క. సంతోష ముప్పతిల్లఁగ
నంతఃపురసతులు ప్రీతి నాపరిణయ వృ
త్తాంతము సాంతముగా భూ
కాంతుఁడు దెలుపంగవినిరి [illegible] 2211

క. జనకుని గుణశీలంబులు
ఘనతయుఁ బ్రీతియు మనోజ్ఞకర సంపదయుం
గొనియాడె బహువిధంబుల
వినుచుండిరి రాజులెల్ల విపులముదమునన్ 2212

ఆ. పుత్రసహితుడగుచు భూపతి స్నానంబొ
నర్చి విప్రగురుజనంబు జ్ఞాతి
జనులఁ బిలువఁజేసి సలిపె భోజనమైదు
ఘడియలుగను రాత్రిగడచె నపుడు 2213

ఆ. మంగళస్నానమున మగువలు వాడిరి
సుఖదమయ్యె రాత్రి సుందరమయి
యాచమన మొనర్చి యందఱుఁదాంబూల
చర్వణంబు చేయ సాగిరెలమి. 2214

ఆ. స్రక్సుగంధకలిత సంశోభితాంగులై
కాంతిమంతులగుచుఁ గడునెసఁగిరి
రాముఁబ్రీతిఁగాంచి ప్రణతోత్తమాంగులై
సెలవుపొంది యిండ్లుసేరజనిరి. 2215

క. ప్రేమానంద వినోదము
లా మహనీయతయు సమయమాసంఘము ను
ద్దామమగు నామనోజ్ఞతఁ
బాముదొరలుఁ బలుకుబోంట్లు బమ్మలు శివులున్ 2216

క. గణనాయకులును సూర్యురు
గణుతింపఁగఁ జాలరనిన్ గడుమందుఁడనా
కణుమాత్ర మలవియే భువి
ఫణిమాత్రము మోవగలదె వసుధాభరమున్ 2217

తే. అందరకు సన్నివిధముల నవనినాథుఁ
డంచితంబుగ సన్మాన మాచరించి
రాణులంబిల్చి మృదువచోరచన వెలయఁ
బలికెనిట్లు సుధారస మొలుకునట్లు 2218

క. కోదండుఁ జిఱుతబాలలు
వీడావతు లితరమైన వేశ్మంబునకున్
నేఁడరుదెంచిరి గావునఁ
జూడందగుఁ గంటిఱెప్ప సొంపున వారిన్ 2219

క. బాలురు శ్రాంతులు నిద్రకుఁ
జాలఁగవశులైరి గాన శయనింపంగా
మేలటు సేయుడనుచు భూ
పాలుఁడు రాముని పదముల భావమునందున్ 2220

తే. పూని విశ్రామమందిరంబునకు నేగి
సహజసుందర రాజ వచనముల విని
కనకమాణిక్య నిర్మిత కమ్రఖట్వ
ముల సురభిదుగ్ధ ఫేనంబుఁ బోలునట్టి 2221

తే. తల్పములను రచించిరి తల్లులందు
వెలయు నుపబర్హణంబుల నలవియగు న
వర్ణనముసేయ రత్నభవనము లలరుఁ
జారు సద్గంధ పవన సంచారములయి 2222

తే. సుందరంబగు మణిదీప శోభ నెన్నఁ
దరముగాదది చూచినాతనికె కాక
చారుతల్పంబుపై రామచంద్రమూర్తిఁ
బవ్వళింపంగఁజేసిరి భామలెలమి 2223

తే. మాటిమాటికి రాముండు మధురవాగ్జ్ఞి
యూఢిఁ దమ్ములనింకఁ బరుండుఁడనుచు
నాజ్ఞనొసఁగంగ వారును నరిగివారి
శయ్యలం బవ్వళింపగ సాగిరపుడు 2224

ఉ. శ్యామల కోమలాంగు ఖలశాసను రాముని మాతలాత్మలం
బ్రేమనుమీఱగాంచి యతిభీకర తాటక మార్గమధ్యమం
దేమెయి సంహరించితి వదెంతయుఁ జిత్రము పుత్రదానవుల్
భీమపరాక్రముల్ వికటవేషులనిం గణియింప రెవ్వరిక్ 2225

క. మారీచ సుబాహులఁ బరి
వారయుతంబుగను లీల వసుధంబడఁగా
నేరీతిఁ గొట్టినావే
మారయుదుము మదిని దైవమామునికరుణన్ 2226

తే. నిను ననేకాపదలనుండి యనుఁగుకుఱ్ఱ
తొలఁగగాఁ జేయుచు సురక్షితునిగఁ జేసె
ననుచు ముని యజ్ఞముంగాచి కనిరి తత్ప్ర
సాదమున విద్యలెల్ల లక్ష్మణుఁడు నీవు 2227

తే. పాదరజమున గౌతమపత్ని శాప
మోచనమునొందెఁ దత్కీర్తి భువనభరిత
మయ్యెఁ గమఠకర్పరకులిశాతి కఠిన
శివధనువు రాజసభ విఱచితివి నీవు 2228

ఆ. విశ్వవిజయకీర్తి విశ్వంభరా పుత్రిఁ
బత్నిగా వరించి భ్రాతృయుతము
గా వివాహములను గౌతూహలతనొంది
వచ్చితింటి కిపుడు వత్స నీవు. 2229

తే. ఈ యమానుషకృత్యంబు లెల్ల నీకుఁ
గేవలంబును గౌశికకృపను గాదె
శక్యమయ్యెను సంపూర్ణచంద్రబింబ
సదృశమగు నీముఖంబుఁ గాంచఁగఁగలిగె 2230

ఆ. మాకుఁగాననేడు మా జన్మములు భువి
సఫలమయ్యెనంచు సంతసింతు
మే దినములనిన్ను నీక్షింపకుంటిమో
దినములెల్ల లెక్కఁగొనడు విధియు 2231

తే. అనుచు రాముండు మాతలహారి వినయ
వచనముల హర్షమొందించి వామదేవ
గురుధరామర పదముల స్మరణచేసి
నేత్రములను నిమీలించి నిద్రఁజెందె 2232

ఆ నిద్రయందుఁగూడ నిండయి లావణ్య
సహితముఖముదోఁచెఁ సంజయందు
బోలుచు నరుణకమలమోయన నింటింట
జాగరణమొనర్చె జలజముఖులు. 2233

క. పరిహాస వచనరచనం
బరస్పరము నాడుకొనుచు బహుభంగులుగాఁ
గరమున్ వినోదమొందిరి
పురమున నెల్లెడల ముదముపూర్ణముగాఁగన్ 2234

క. పురశోభచేత రాతిరి
కరమున్ వెలుఁగొందె నేడుకనవే సఖియా
సిరియని రాణులు పలుకుచు
సరసతఁ గోడండ్రఁ బిలిచి శయనించిరొగిన్ 2235

క. శిరములపైఁగల మణులను
నురముల డాచికొనియొప్పు నురగినుల క్రియన్
బరిశోభిల్లిరి రాణులు
సరసవధూమణులు వండ శయనించునెడన్ 2236

ఆ. అతిపవిత్రమైన ప్రాహ్ణముఖంబునఁ
గుక్కుటవ్రజంబు గూయుచుండఁ
బ్రభువరుండు రామభద్రుండు మేల్కనె
వందిమాగధ స్తవములు వినుచు 2237

తే. పురజనంబులు ద్వారంబు పొంతనిలచి
యుండిరి ప్రణామముల్ సేయు నూహతోడ
ధారుణీ సురసురగురుతల్లజులకు
నతులొనర్చుచు జననీజనకుల కెఱఁగి 2238

క. నలువురు కొమరు లెలమి వా
రలచే దీవనలు వడసి రంజిల్లుచు మా
తలు మోములాదృతిం గనఁ
గలసిచనిరి ద్వారమునకు క్ష్మాపతితోడన్ 2239

తే. సహజశుచి నొప్పునత చతుష్కంబు శౌచ
విధులఁ దీర్చి సరయూ ప్రవిమల వారి
మజ్జనంబాడి ప్రాతస్సమయ నియమము
లాచరించి జనకుకడ కరిగిరప్పుడు 2240

ఉ. వారలఁజూచినంత జనవల్లభుడెంతయు రాగమేర్పడం
గారహిఁ గౌగలించె మహీకాంతుని యానతిఁగూరుచుండ నా
చారు కుమారులంగనిరి సభ్యుల యుల్లములెల్లఁజల్లఁగా
నా రఘురాముని౦గనుట నక్షుల లాభముఁగంటి మంచెదన్ 2241

ఉ. అంత వసిష్ఠకౌశికులు నయ్యెడకుంజను దేర మేదినీ
కాంతుఁడొసంగి పీఠముల గౌరవమొప్పఁగఁ దానుఁబుత్రులున్
సంతసమారఁ బూజలనుసల్పి పదంబులనంటి మ్రొక్కి ధీ
మంతులు గుర్వులిద్దఱు క్షమాసుతనాథునిఁగాంచి రాదటన్ 2242

తే. అపుడు ధర్మేతిహాసంబు లవ్వసిష్ఠ
మౌని వచియింపరాణులు మనుజవిభుఁడు
వినఁగ మునిమానసాగోచర నిరవధిక
కౌశికక్రియల్ వర్ణింపఁగడఁగె నతఁడు 2243

ఆ. వామదేవమౌని వచియించెనిది యదా
ర్థంబటంచు గాధితనయుకీర్తి
ముజ్జగములనిండె మోదించిరెల్లరు
రామలక్ష్మణులును రహినలరిరి 2244

తే. ఈవిధంబున నిత్యమహీనమంగ
ళమును హర్షంబునుత్సాహమమర దినము
లరుగుచుండె నయోధ్యలో నంతకంత
కధికమైపొంగి యానందమతిశయించె 2245

తే. శుభదినంబునఁ గంకణచ్యుతియు జరిగె
మంగళవినోదమోదముల్ మహితమయ్యె
నిత్యనవసుఖములఁగని నిర్జరులును
బ్రహ్మనడిగి రయోధ్యలో భవమిడుమని 2246

తే. ప్రతిదినముఁ దపోవనికేగఁ బయనమయ్యు
రాము స్నేహవినయములన్ రజ్జువులను
గట్టఁబడి నిల్చుచుండును గౌశికుండు
దినదినము రాజుసుగుణాళిఁగని నుతించు 2247

తే. ఎట్టకేలకుఁ గౌశికుండేఁగుటకును
సెలవడుగఁ బుత్రసహితుఁడై క్షితివరుండు
ముందటన్ నిల్చి నమ్రుఁడై మునివరేణ్య
స్త్రీలు సుతులును నేను మీసేవకులము 2248

క. ఈసంపదయును మీయది
యోసంయమినాథ కరుణయుంపుఁడు నాపై
నాసుతులమీఁద దర్శన
మాసనొసఁగుచుండుఁడనుచు నతివినయమునన్ 2249

తే. దారపుత్రసమేతుఁడై దశరథుండు
చరణములవ్రాలి సుఖవివశత్వమునను
బలుకలేకుండె నంతట బ్రాహ్మణుఁడగు
కౌశికుఁడు వారిదీవించి కదలెనలమి 2250

తే. వారిప్రేమవిధము నెన్నవశముగాదు
రాముఁ డనుజసమేతుఁడై ప్రేమమెసఁగ
వారి ననుపఁగఁజని యాజ్ఞఁబడసి తిరుగ
వచ్చె నాగాధిరాట్కులవారిజారి 2251

తే రామురూపంబు దశరథరాజు భక్తి
సుందర వివాహము త్సాహ శోభనములు
ననుపమానందమున దనయాత్మలోన
వర్ణనముసేసికొనుచుఁ బోవంగఁదొడఁగె 2252

తే. వామదేవుండు నారఘువంశగురుఁడు
మరల గాధేయుకథయును మహిమబాగడ
దశరథుఁడువిని యాత్మలోఁదలఁచె నెంత
పుణ్యుఁడనో వినఁగంటిని మునియశమని 2253

ఉ. అంత వసిష్ఠకౌశికులు నయోధ్యకుంజనుదేర మేదినీ
కాంతుఁడొసంగి పీఠముల గౌరవమొప్పఁగఁ దానుఁబుత్రులున్
సంతసమారఁ బూజలనుసల్పి పదంబులనంటి మ్రొక్క ధీ
మంతులు గుర్వులిద్దఱు క్షమాసుతనాథునిఁగాంచి రాదటన్ 2242

తే. అపుడు ధర్మేతిహాసంబు లవ్వసిష్ఠ
మౌని వచియింపరాణులు మనుజవిభుఁడు
వినఁగ మునిమానసాగోచర నిరవధిక
కౌశికక్రియల్ వర్ణింపఁగడఁగె నతఁడు 2243

ఆ. వామదేవమౌని వచియించెనిది యదా
ర్థంబటంచు గాధితనయుకీర్తి
ముజ్జగములనిండె మోదించిరెల్లరు
రామలక్ష్మణులును రహీనలరిరి 2244

తే. ఈవిధంబున నిత్యమహీనమంగ
ళమును హర్షంబునుత్సాహమమర దినము
లరుగుచుండె నయోధ్యలో నంతకంత
కధికమైపొంగి యానందమతిశయించె 2245

తే. శుభదినంబునఁ గంకణచ్యుతియు జరిగె
మంగళవినోదమోదముల్ మహితమయ్యె
నిత్యనవసుఖములఁగని నిర్జరులును
బ్రహ్మనడిగి రయోధ్యలో భవమిడుమని 2246

ప్రతిదినముఁ దపోవనికేగఁ బయనమయ్యు
రాము స్నేహవినయములన్ రజ్జువులను
గట్టఁబడి నిల్చుచుండును గౌశికుండు
దినదినము రాజుసుగుణాళిఁగని నుతించు 2247

తే. ఎట్టకేలకుఁ గౌశికుండేగుటకును
సెలవడుగఁ బుత్రిసహితుఁడై క్షితివరుండు
ముందటన్ నిల్చి నమ్రుఁడై మునివరేణ్య
స్త్రీలు సుతులును నేను మీసేవకులము 2248

క. ఈసంపదయును మీయది
యోసంయమినాథ కరుణయుంపుఁడు నాపై
నాసుతులమీఁద దర్శన
మోసనొసఁగుచుండుఁడనుచు నతివినయమునన్ 2249

తే. దార పుత్రిసమేతుఁడై దశరథుండు
చరణములవ్రాలి సుఖవివశత్వమునను
బలుకలేకుండె నంతట బ్రాహ్మణుఁడగు
కౌశికుఁడు వారిదీవించి కదలెనలమి 2250

తే. వారిప్రేమవిధము నెన్నవశముగాదు
రాముఁ డనుజసమేతుఁడై ప్రేమమెసఁగ
వారి ననుపంగఁజని యాజ్ఞఁబడసి తిరుగ
వచ్చె నాగాధిరాట్కుల వారిజారి 2251

తే రామురూపంబు దశరథరాజు భక్తి
సుందర వివాహము త్సాహ శోభనములు
ననుపమానందమున దనయాత్మలోన
వర్ణనముసేకొనుచుఁ బోవంగఁదొడఁగె 2252

తే. వామదేవుండు నారఘువంశగురుఁడు
మరల గాధేయుకథయును మహిమబాగడ
దశరథుఁడువిని యాత్మలోఁదలఁచె నెంత
పుణ్యుఁడనొ వినఁగంటిని మునియశమని 2253

తే. అంతఁ బ్రభునాజ్ఞఁ జనిరెల్లరాత్మగేహ
ములకు దశరథవిభుఁడును బుత్రసహితుఁ
డగుచు మందిరముంజేరె నన్నియెడల
రామకల్యాణగానంబు రహిఁజెలంగె 2254

ఆ. అతిపవిత్రమైన నాదిమధ్యాంత శ్రీ
రామచంద్రకీర్తి ప్రాకిపోయి
నిండి త్రిభువములఁ బండువెన్నెలలీల
సుఖమొసంగె నెల్లసుజనులకును 2255

క. శ్రీరాముండు వివాహం
బైరాఁగ నయోధ్యవెలసె ననవరతానం
దారూఢివాణిశేషుఁడు
నేరరువర్ణింపఁ బెండ్లి నిరతోత్సవముల్ 2256

చ. కవికులజీవనంబు నధికంబుగఁ బూతమొనర్చు జానకీ
ధవధవళోరుకీర్తియని దారుణమౌకలికల్మషాపహం
బవునని భద్రమూలమనియాత్మసుఖంబిడఁ గొంతవర్ణనం
దవిలియొనర్చినాఁడ విశదంబగు శ్రీరఘురామసత్కథన్ 2257

క. చేతోవీథిసుఖించితిఁ
బూతతను మదీయవాణి పొందెననుచు శ్రీ
సీతారామ చరిత్రము
పాతకగిరిభిదుర మఖిలభద్రదమగుటన్ 2258

తులసీదాసనుపేర నొప్పెడి మహాత్ముండాత్మవాణిన్ విని
ర్మలతంజేయఁగ రాము సదృశము నీమాడ్కిం బ్రవర్ణించెద
ద్వ్యలసత్పారవిహీనగాథయను వార్ధిందాటంగాశక్యమే
యిలనేసత్కవికైన నన్నెడనింకే నెంతవర్ణింపఁగన్ 2259

తే. రామునుపనీత పరిణయరమ్యతర మ
హోత్సవాఖ్యానమెవరైన నుత్సుకతను
గానమొనరింప వినఁగల్గు ఘనసుఖంబు
సర్వదా జానకీరామచంద్రుకరుణ 2260

తే. క్షితిజపతికీర్తి మంగళాయతనమగుట
జానకీరామపరిణయ చారుగాథఁ
బ్రీతిఁబఠియించువారును వినెడివారు
నిత్యకళ్యాణ విభవతన్ నెగడఁగలరు 2261

సుగంధి— హేమభూమిభృద్ధనుష్క-హృత్సరోజ బంధరా
భూమిజా మనోహరా పవిత్రనామ శ్రీకరా
రామరామరామ ఘోరరాక్షసాంతకాకృతీ
శ్యామలాంగ సాధుసంగశాశ్వతా జగత్పతీ. 2262

గద్య— ఇది శ్రీసీతారామచంద్రపరబ్రహ్మకరుణారసాసాదిత కవిత్వ
వైభవ కాశ్యపసగోత్రోద్భవ, రామాంబాసన్యాసేశ్వరాగ్ర
తనూభవ, అవ్యయానందానుభవ, సకలవిద్వజ్జనవిధేయ
జగన్నాథనామధేయ ప్రణీతంబైన సకలకలికలుష
విధ్వంసక విమలవిజ్ఞానసంపాదక శ్రీమదాంధ్ర
తులసీరామాయణమందు బాలకాండమను

ప్రథమసోపానము.

---

ఓంతత్సత్
శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.

కాకినాడ: పట్టమట్టు శేషగిరిరావుగారి జార్జిప్రెస్ యందు ముద్రితము - 1965.

ఆంధ్ర తులసీరామాయణము.

అమృతసాగరము

ఆపన్నివారకము.

అఖండ విజయప్రదము.

ఆయురారోగ్యదాయకము.

సర్వసౌభాగ్యకరము.

సంపద్భల వర్ధకము,

సర్వసౌఖ్యసంధాయకము.

సకలార్థ సిద్ధిదము.

అజ్ఞానముతో పుట్టి

అజ్ఞానముతో పెరిగి

అజ్ఞానముతో చచ్చుట

ఉత్తమ మానవలక్షణముకాదు.